॥ పూర్ణ పరమాత్మనే నమ: ॥



# జ్ఞాన గంగా



-: *ప్రచార పసార సమితి* :-

**సతలోక ఆశ్రమం, హిసార్-టోహానా రోడ్, బరవాలా**

**జిల్లా- హిసార్ (హరియాణా).**



తెలుగు

**జగత్‌గురు తత్వదర్శి సంత రామపాల జీ మహారాజ్‌గారి సత్సంగాల నుండి సంగ్రహించిన అమూల్యమైన పుస్తకం**

# జ్ఞాన గంగా

-: ప్రకాశకులు :-
-: *ప్రచార పసార సమితి* :-
**సతలోక ఆశ్రమం, హిసార్-టోహానా రోడ్, బరవాలా**
**జిల్లా- హిసార్ (హరియాణా).**

-: *అనువాదకులు* :-
**శ్రీకాంత్ దాస్** (B.Sc.)
**గ్రా. మొగిలిపాలెం, మం॥ తిమ్మాపూర్, జిల్లా॥ కరీంనగర్ 505474 (**Telangana**)**
For more details in Telugu Language Call :- **07893561369**

**ధర్మార్థ మూల్యం కేవలం - 15/-**

" భక్తి సౌదాగర్ కో సందేశ్" అను పుస్తకం కొనసాగింపు ఈ "జ్ఞాన గంగా"

సతలోక ఆశ్రమం

సతలోక ఆశ్రమం, హిసార్-టోహానా రోడ్, బరవాలా, జిల్లా-హిసార్

(హరియాణా)

**Contact: 9992600801, 9992600802, 9992600803, 9992600803, 9992600804, 9992600805, 9812166044, 9812151088, 9812026821,**

Visit us at: www.jagatgururampalji.org
e-mail:jagatgururampalji@yahoo.com

# విషయసూచిక

# భూమిక

అనాది కాలం నుండి మానవుడు పరమశాంతి, సుఖం మరియు అమృత్వం కోసం వెదుకుతునే ఉన్నాడు. అతడు తన సామర్థ్యం అనుసారంగా ప్రయత్నం చేస్తు వస్తున్నాడు. కానీ అతడి కోరిక ఎప్పటికి పూర్ణం అవడం లేదు. ఇలా ఎందువలన అంటే అతడికి కోరికను ప్రాప్తింపచేసుకును మార్గం యొక్క పూర్ణ జ్ఞానం లేదు. అన్ని ప్రాణులు కోరుకుంటాయి ఏ కార్యము కూడ చేయకూడదు, తినడానికి రుచికరమైన భోజనం దొరకాలి, వేసుకోవడానికి సుందరమైన వస్త్రాలు దొరకాలి, ఉండటానికి విశాలమైన భవనం ఉండాలి, విహరించడానికి సుందరమైన బృందావనం ఉండాలి, వినోదం కోసం మధురమైన సంగీతం ఉండాలి. ఆట–పాట, నృత్యం–మస్తీ ఉండాలి మరియు ఎప్పటికి అనారోగ్యంపాలు అవకూడదు, ఎప్పటికి ముసలివాళ్లం కాకుడదు మరియు ఎప్పటికి మృత్యువు రాకుడదు మొదలగునవి, కానీ ఏ సంసారంలో మనం ఉంటున్నామో ఇక్కడ అలా ఎక్కడ కనిపించదు. మరియు ఇది ఇక్కడ సంభవం కాదు. ఎందుకంటే ఈ లోకం నాశనం కలది, ఈ లోకం యొక్క ప్రతి వస్తువు కూడ నాశనం అయ్యేదే మరియు ఈ లోకం యొక్క రాజు బ్రహ్మ (కాల్)ఉన్నాడు, ఎవరైతే ఒక లక్ష మానవ సూక్ష్మ శరీరాలని తింటాడు. అతడు అన్ని ప్రాణులని కర్మ దండన మరియు పాప–పుణ్యం రూపి వలలో/ చెరలో ఇరికించి మూడు లోకాల (పృథ్వీలోకం, పాతాళ లోకం, స్వర్గలోకం) పంజరంలో బంధించి ఉంచినాడు. కబీర్ సాహెబ్ అంటారు:–

కబీర్, తిన్ లోక పింజరా భయా, పాప పుణ్య దో జాల్ ।
సభి జీవ భోజన భయే, ఎక ఖానే వాలా కాల్ ॥
గరీబ, ఎక పాపి ఎక పున్యి ఆయా, ఎక హై సుమ దలేల్ రే ।
బినా భజన్ కోయి కామ నహి ఆవై, సబ హై జమ కి జేల రే ॥

అతడు ఏ ప్రాణి కూడ ఈ పంజరం రూపి జైలు నుండి బయటకు వెళ్లిపోవడానికి ఇష్టపడడు. జీవాత్మకి తన నిజ ఇల్లు సతలోకం యొక్క చిరునామా (సమాచారం) లభించకూడదు అని తన త్రిగుణ మాయలో ప్రతి జీవిని భ్రమింపచేస్తునే ఉంటాడు. మరి మానవుడికి పైన తెలిపిన కోరిక ఎక్కడినుండి ఉత్పన్నం అయింది? ఇక్కడ అలాంటివి ఏమి లేవు. ఇక్కడ మనం అందరం చనిపోవలిసిందే. అందరు దు:ఖి మరియు అశాంతితో ఉన్నారు. ఏ స్థితిని మనం ఇక్కడ పోందాలని కోరుకుంటున్నామో అలాంటి స్థితిలో మనం మన నిజ ఇల్లయిన సతలోకంలో ఉండెవాళ్లము. కాల్ యొక్క ఈ లోకంలో స్వ ఇచ్ఛతో (ఇష్టంతో) వచ్చి ఇక్కడె ఇరుక్కుపోయాము మరియు మన వాస్తవ ఇంటిని మరిచిపోయాం. కబీర్ సాహెబ్ అంటారు :–

ఇఛ్ఛా రూపి ఖేలన్ ఆయా, తాతైం సుఖ సాగర్ నహి పాయా ।

ఈ కాల్ లోకంలో శాంతి మరియు సుఖం యొక్క ఊరు పేరు లేదు. త్రిగుణ మాయలో ఉత్పన్నమగు కామం, క్రోధం, లోభం, మద, మోహం, అహంకారం,

రాగం-ద్వేషం, హర్షం-శోకం, లాభం-హాని, మానం-కీర్తి రూపి అవగుణాలు ప్రతి జీవిని బాధిస్తున్నాయి. ఇక్కడ ఒక జీవి మరొక జీవిని చంపి తింటాడు, శోషణం చేస్తాడు, శీలంను అపహరిస్తాడు, ధనాన్ని దొంగలిస్తాడు, శాంతిని లాక్కుంటాడు. ఇక్కడ నాలుగు వైపుల అగ్గిరాజుకుని ఉంది. ఒకవేళ మీరు శాంతితో ఉండాలి అనుకున్న పక్క వాడు మిముల్ని శాంతితో ఉండనివ్వడు. మీరు అనుకోక ముందే దొంగ దొంగతనం చేసేస్తాడు, గుండా కన్నం వేసేస్తాడు. దుర్ఘటన జరిగిపోతుంది, రైతు యొక్క పంట నాశనం అవుతుంది, వ్యాపారి యొక్క వ్యాపారం దివాల తీస్తుంది, రాజు యొక్క రాజ్యం లాక్కోనబడుతుంది, ఆరోగ్యకర  శరీరానికి రోగం తగులుతుంది అనగా ఇక్కడ ఏ వస్తువు సురక్షితంగా లేదు. రాజుల రాజ్యం, శీలంగల వారి శీలం, ధనవంతుడి ధనం, బలవంతుడి బలం మరియు ఇంకా ఏమిటంటే మనందరి శరీరాలు కూడ అకస్మాత్తుగా లాక్కోనబడుతాయి. తల్లి తండ్రుల ఎదుట యుక్తవయస్కులైన పిల్లలు చనిపోతారు, పాలు తాగు పిల్లలని ఎడుస్తు బాదపద్తు విడిచి అమ్మనాన్నలు చనిపోతారు, యుక్త సోదరిమణులు విధవలౌతారు మరియు పర్వతంతో సమానమైన దు:ఖాలని అనుభవించడానికి వివశలౌతారు. విచారం చేయండి ఈ స్థానం మనం నివసించడానికి యోగ్యమైనదా? కాదా అని. కానీ మనం వివశులమై ఇక్కడ ఉంటున్నాము, ఎందుకంటే ఈ కాల్ యొక్క పంజరం నుండి బయట పడటానికి ఏ మార్గం కనిపించడం లేదు మరియు మనకి ఇతరులని దు:ఖింపచేసి మరియు దు:ఖం అనుభవించే అలవాటు అయి ఉంది. ఒకవేళ మీకు ఈ లోకంలోని దు:ఖాలనుండి రక్షణ కావాలంటే ఇక్కడ ప్రభువు కాల్ (బ్రహ్మ-జ్యోతినిరంజన్) కంటే పరమశక్తిమంతుడైన పరమేశ్వరుడి(పరమ అక్షర బ్రహ్మ) శరణులోకి వెళ్లాలి. ఆ ప్రభువుకి కాల్ కూడ భయపడుతాడు. ఆయన భయంతో ఈ తెలిపిన కష్టాలని ఆ జీవికి ఇవ్వలేడు, ఏ జీవి అయితే పూర్ణ పరమాత్మా అనగా పరమ అక్షర బ్రహ్మ (సత్యపురుషుడి) శరణుని పూర్ణ సంత్ ద్వారా చెప్పబడిన మార్గం నుండి గ్రహిస్తుందో, ఆ జీవి ఎప్పటివరకు అయితే సంసారంలో భక్తి చేస్తు ఉంటుందో, దానికి పైన తెలిపిన కష్టాలు జీవితాంతం కలుగవు. ఏ వ్యక్తి అయితే ఈ పుస్తకం 'జ్ఞాన గంగా' ని చదువుతాడో, అతడికి జ్ఞానం అవుతుంది, ఏమనంటే మనం మన నిజ ఇంటిని(సతలోకంను) మరిచిపోతిమి. ఆ పరమ శాంతి మరియు సుఖం ఇక్కడ ఉండకుండా నిజ ఇల్లు అయిన సతలోకంలో ఉంది. అక్కడ జన్మ ఉంది మృత్యువు లేదు. ముసలితనం లేదు, దు:ఖం లేదు, గొడవలు, కోట్లాటలు లేవు, రోగం లేదు, డబ్బుల మార్పిడి లేదు, వినోదం కలిగించు సాధనాలని కొనవలిసిన పని లేదు.అక్కడ అన్ని పరమాత్మా ద్వారా ఉచితంగా మరియు అఖండంగా కలవు. బందిఛోడ్ గరీబదాస్ మహారాజ్ గారి వాణిలో ప్రమాణం ఉంది :-

బిన్ హి ముఖ సారంగ రాగ్ సున్, బిన్ హి తంతి తార్। బీనా సుర అలగోజే బజై, నగర్ నాంచ్ ఘుమార్॥
ఘంటా బాజై తాల్ నగ, మంజిరే డఫ్ ఝూంఝ్। మురలి మధుర సుహావని, నిసబాసర్ ఔర్ సాంఝ్॥

బిన్ బిహంగమ్ బాజహి, తరక తంబురే తిర్। రాగ ఖండ నహి హోత్ హై, బంధ్యా రహత్ సమీర్॥
తరక నహి తోరా నహి, నాహి కశిస కబాబ్। అమృత ప్యాలే మధ పివై, జ్యో భాటి చవై శరాబ్॥
మతవాలే మస్తానపూర్, గలి గలి గులజార్। సంఖ శరాబి ఫిరత్ హై, చలో తాస బజార్॥
సంఖ సంఖ పత్ని నాచైం, గావైం శబ్ద సుభాన్। చంద్ర బదన్ సురజముఖి, నాహి మాన్ గుమాన్॥
సంఖ హిండోలే నుర్ నగ్, ఝులైం సంత్ హజుర్। తఖ్త ధని కే పాస్ కర్, ఐసా మూలక్ జహుర్॥
నది నావ నాలే బగ్రై, ఛుటైం ఫుహారే సున్న। భరే హోద్ సరవర్ సదా, నహి పాప నహి పుణ్య॥
నా కోయి భిక్షుక్ దాన్ దే, నా కోయి హార్ వ్యవహార్। నా కోయి జన్మే మరే, ఐసా దేశ హమార్॥

జహాం సంఖో లహర్ మేహర్ కి ఉపజైం, కహర్ జహాం నహి కోయి ।

దాసగరీబ అచల అవినాశి, సుఖ కా సాగర్ సోయి ॥

**సతలోకంలో కేవలం ఒక్క పరమశాంతి మరియు సుఖం కలదు. ఎప్పటివరకు మనం సతలోకానికి వెళ్లమో, అప్పటివరకు మనం పరమశాంతిని, సుఖం మరియు అమృతత్వంను పొందలేము. సతలోకానికి వెళ్లడం అప్పుడే సంభవం అవుతుంది, ఎప్పుడైతే మనం పూర్ణ సంత్ నుండి ఉపదేశాన్ని తీసుకుని పూర్ణ పరమాత్మా భక్తి జీవితాంతం చేస్తు ఉండాలి. ఈ పుస్తకం "జ్ఞాన గంగా " ద్వారా ఏ సందేశం మేము ఇవ్వాలి అనుకుంటున్నామో, అందులో ఏ దేవి-దేవత మరియు ధర్మం యొక్క అపహాస్యం చేయకుండ, అన్ని పవిత్ర ధర్మ గ్రంథాలలో దాగి ఉన్న నిగూడ రహస్యాలని వెలికి తీసి యథార్థమైన భక్తి మార్గాన్ని చెప్పాలి అనుకున్నాం, ఎవైతే వర్తమానంలోని సర్వసంత్‌లు, మఠాధిపతులు మరియు ఆచార్య గురు సాహెబ్‌లు శాస్త్రంలలో దాగిన నిగూడ రహస్యాలని తెలుసుకోలేక పోయారు. పరమేశ్వర్ కబీర్ సాహెబ్ తన వాణి యందు అంటారు :-**

వేద కతేబ ఝుఠే నా భాయి, ఝుఠే హై సో సమజే నాహి ॥

**ఈ కారణం వలనే భక్త సమాజానికి అపారమైన హాని కలుగుచున్నది. అందరు తమ సందేహాలతో మరియు బుటకపు గురువుల ద్వారా తెలుపబడిన శాస్త్ర విరుద్ధ సాధనా చేస్తున్నారు. దాని వలన మానసిక శాంతి లభించదు మరియు శారీరక సుఖం, ఇంటిలో, వ్యాపారంలో లాభం అవదు. పరమేశ్వరుడి సాక్షాత్కారము అవదు. మోక్షం కూడ ప్రాప్తించదు. ఈ అన్ని సుఖాలు ఎలా లభిస్తాయి మరియు ఇవి తెలుసుకోవటానికి – నేను ఎవరిని? ఎక్కడి నుండి వచ్చాను? ఎందుకు జన్మ ఎత్తుతాను, ఎందుకు చనిపోతాను మరియు ఎందుకు దు:ఖములను అనుభవిస్తాను? చివరికి ఇవన్ని ఎవరు చేస్తున్నారు? మరియు పరమేశ్వరుడు ఎవరు? ఎలా ఉంటారు? ఎక్కడ ఉంటాడు? మరియు ఎలా పొందవచ్చు? ఇంకా బ్రహ్మ, విష్ణువు, మరియు శివుడి అమ్మనాన్న ఎవరు? ఏవిధంగా ఈ కాల్ యొక్క చెర నుండి విడుదలని పొంది మన నిజ ఇంటికి (సతలోకం) తిరిగి పోగలము? ఈ అన్ని ప్రశ్నలకి / విషయాలన్నింటికి సమాధానం ఈ పుస్తకం ఇస్తుంది. దీనిని చదివి సామాన్య భక్తుడి కళ్యాణం అగుగాక!. ఈ పుస్తకం సతగురు రామపాల్‌జీ మహారాజ్‌గారి ప్రవచనాల సంగ్రహం, ఎదైతే సద్‌గ్రంథాలలోని ప్రమాణాలపై ఆధారితమై**

**ఉంది. మాకు పూర్తి విశ్వాసం ఉంది, పాఠకుడు రుచి మరియు నిష్పక్ష భావంతో చదివి అనుసరించితాడో, అతడి కళ్యాణం సంభవం అవుతుంది.**

ఆత్మ ప్రాణ్ ఉద్ధార్ హి, ఐసా ధర్మ నహి ఔర్ । కోటి అశ్వమేధ యజ్ఞ, సకల సమానా భౌర్ ॥
జీవ ఉద్ధార్ పరమ పుణ్య, ఐసా కర్మ నహి ఔర్। మరూస్థల్ కే మృగ జ్యోం, సబ మర గయే దౌర్ –దౌర్॥

**భావార్థం :– ఒకవేళ ఒక ఆత్మని సత్యభక్తి మార్గంపై నడిపించి అతడి ఆత్మకళ్యాణం చేయించినట్లయితే కోటి అశ్వమేధ యజ్ఞ ఫలం లభిస్తుంది. దానికి సమతుల్యమఅగు ధర్మము లేదు. జీవాత్మని ఉద్ధరించడానికి చేయబడు కార్యము అనగా సేవ కంటే శ్రేష్ఠమైన కార్యము ఇంకొకటి లేదు. తమ పొట్టని నింపుకోవటానికి పశు– పక్షాదులు దినమంత భ్రమిస్తుంటాయి. ఈ విధముగానే ఆ వ్యక్తి ఉన్నాడు, ఎవరైతే పరమార్థి కార్యము చేయడో. పరమార్థి కర్మ అనేది సర్వశ్రేష్టమైన సేవ, అది జీవుడి కళ్యాణం కోసం చేయబడు కర్మ. జీవ కళ్యాణం అను కార్యమును చేయక సర్వ మానవులు అడివిలోని జింకలాగా పరుగెత్తి పరుగెత్తి చనిపోతారు. జింకకి కొంత దూరంలో జలం కనిపిస్తుంది, అది పరుగెత్తి అక్కడికి వెళ్లగానే స్థలం కనిపిస్తుంది. తరువాత కొంత దూరంలో జలం కనిపిస్తుంది, చివరికి దాహంతోనే జింక యొక్క మృత్యువు అవుతుంది. ఈ విధంగానే ఏ ప్రాణులు అయితే ఈ కాల లోకంలో ఎక్కడైతే మనం ఉంటున్నాము. అవి కూడ ఆ జింకతో సమానమైన సుఖం కోసం ఆశ పడుతాయి. ఎలాఐతే సంతానం లేని వారు ఆలోచిస్తారు సంతానం కలిగితే సుఖి అవుతాము అని. సంతానం పొందినవాళ్లని అడగండి వారి సమస్యలు వినడానికి దొరుకుతాయి. నిర్ధనుడు ఆలోచిస్తాడు ధనం దొరికితే సుఖి అవుతాను అని. వేరే ధనవంతుడి సుఖం గురించి ప్రశ్నలని అడగండి చాలా ఆందోళనలు మీ ముందు ఉంచుతాడు. ఒకరు రాజ్యంను పొందితే సుఖం అనుకుంటారు. ఇది అతని పెద్ద తప్పు అవుతుంది. రాజుకి (మంత్రి, ముఖ్యమంత్రి, ప్రధానమంత్రి, రాష్ట్రపతి) కలలో కూడ సుఖం ఉండదు. ఒక నాలుగు ఐదు సభ్యులు కల కుటుంబంను పోషించడానికి ఇంటి యజమాని ఏంతో ఆందోళన పడుతాడు. రాజు అయితే ఒక క్షేత్రానికి పాలకుడిగా ఉంటాడు. అతడు పరిపాలనలోనే ఆందోళనగా ఉంటాడు, సుఖం కలలో కూడ ఉండదు. రాజులు మద్యంను సేవించి కొన్ని బాధలని మరిచిపోతారు. భాండాగారాన్ని నింపడానికి ప్రజలనుండి పన్నులు వసూలు చేస్తారు. తరువాత రాబోవు జన్మలలో ఏ రాజులు సత్యభక్తి చేయరో, వారు పశువుల యోనిలని పొంది ప్రతి ఒక్క వ్యక్తి నుండి వసూలు చేసిన పన్నుని, వారికి ఇంటి పశువులుగా మారి తిరిగి చెల్లిస్తారు. ఏ వ్యక్తి మనసుకి నచ్చిన మరియు బుటకపు గురువులనుండి దీక్షని తీసుకుని భక్తి మరియు ధర్మాన్ని ఆచరించుతారో వారు అనుకుంటారు భవిష్యత్తులో సుఖం లభిస్తుంది అని. కానీ దీనికి విరుద్ధంగా దు:ఖమే ప్రాప్తించబడుతుంది. కబీర్ సాహెబ్ అంటారు నా ఈ జ్ఞానం ఎలాంటిది అంటే ఒకవేళ జ్ఞాని పురుషుడైతే విని హృదయంలో**

నింపుకుంటాడు మరియు మూర్ఖుడైతే బయటికి వదిలివేస్తాడు.

"కబీర్, జ్ఞాని హోతో హృదయ లగాయి, మూర్ఖ హో తో గమ నా పాయి"

ఇంకా తెలుసుకోవడానికి కృపతో ఈ పుస్తకం " జ్ఞాన గంగా " లోకి ప్రవేశించండి. ఈ పుస్తకం చదివి సుప్రీమ్‌కోర్టు యొక్క అనుభవి న్యాయవాది శ్రీ సురేష్ చంద్ర ఈ పుస్తకం పేరు " జ్ఞాన సాగరం " పెట్టవలిసింది అని అనిరి.

## "కలియుగంలో సత్యయుగం"

*(సంత్ రామపాల్‌జీగారి సత్సంగ వచనాల ద్వారా గ్రహించిన)*

సత్యయుగం అని ఆ సమయాన్ని అంటారు ఏ యుగంలో అధర్మం ఉండదు. శాంతియే ఉంటుంది. తండ్రి కంటే ముందు కొడుకు మృత్యువు అవదు, స్త్రీ విధవ అవదు. రోగ రహిత శరీరం ఉంటుంది. అందరూ మనుషులు భక్తి చేస్తారు. పరమాత్ముడికి భయపడుతారు, ఎందుకంటే వారు ఆధ్మాత్మిక జ్ఞానం యొక్క అన్ని కర్మలతో పరిచయస్తులై ఉంటారు. మనసా-వాచా-కర్మనా ఎవరికి పీడని కలిగించరు మరియు దురాచారులుగా ఉండరు. జతి-సతి (అనగా ఒక్కరినే పెళ్లాడి జీవితాంతం కట్టుబడి ఉండటం) స్త్రీ - పురుషులుంటారు. వృక్షాలు అధికంగా ఉంటాయి. అందరు మనుషులు వేదాల ఆధారంగా భక్తి చేస్తారు. వర్తమానంలో కలియుగం ఉంది. ఇందులో అధర్మం ఎక్కువై ఉంది. కలియుగంలో మనిషికి భక్తి యెడల ఆసక్తి తగ్గిపోతుంది లేదా అసలు భక్తి చేయనే చేయరు. ఒకవేళ చేస్తే అది శాస్త్రవిధానమైనది కాకుండా మనసుకి నచ్చిన భక్తి చేస్తారు. ఏదైతే గీతా అధ్యాయం 16 శ్లోకం 23-24లో చేయకూడదు అని చెప్పబడినది. ఈ కారణంచేతనే పరమాత్మ ద్వారా ఏ లాభంను అయితే కోరుకుంటున్నామో అది ప్రాప్తించదు. ఇందువలనే మనుషులు అధికంగా నాస్తికులు అవుతారు. ధనవంతుడు అగుటకు లంచం, దొంగతనం, కన్నాలు వేయడం మొ॥గు మార్గాలు ఎంచుకుంటారు. కానీ ఈ విధానం ధనం లభించేదిగా కాకపోవడం వలన పరమాత్మ యొక్క దోషులు అవుతారు మరియు ప్రాకృతిక కష్టాలని అనుభవిస్తారు. పరమేశ్వరుడి విధానంను మనిషి మరిచిపోతాడు, అది ఏమిటంటే అదృష్టం కంటే అధికంగా లభించదు అని. అనగా ఎంత రాసి ఉంటే అంతే లభిస్తుంది. ఒకవేళ మిగతా మార్గాల ద్వారా ధనంను పొందినా అది ఉండదు. ఎలాఅంటే ఒక వ్యక్తి తన కొడుకు సుఖం కోసం ఇతర మార్గాల ద్వారా ధనాన్ని కూడబెట్టేవాడు. కొన్ని రోజులకి ఆ పుత్రుడి రెండు కిడ్నీలు చెడిపోతాయి. ఏదోఒకటి చేసి కిడ్నీలు మార్చుతారు, మూడు లక్షల రూపాయలు ఖర్చు అవుతాయి. ఏ ధనం చెడు విధానం వలన సంపాదించినారో అది అంతయు ఖర్చు అయింది. దానికి తోడు కొంత అప్పు కూడ అయింది. తరువాత కూమారుడికి వివాహం చేసిరి. ఆరు నెలల తరువాత బస్సు దుర్ఘటనలో ఒక్కగానోక్క కొడుకు చనిపోతాడు. ఇపుడు ఇక కొడుకు లేడు మరియు చెడు మార్గాల ద్వారా సంపాదించిన ధనం అయిపోయింది. శేషం ఏమి మిగిలింది?

చెడు మార్గాల ద్వారా ధనం సంపాదించుటలో చేసిన పాపం, అదే శేషం. దానిని (పాపంను) అనుభవించడానికి ఎవరెవరి నుండి ధనం పొందినాడో, వారికి పశువుగా (గాడిద, ఆవు, ఎద్దు) మారి ఋణం పూర్తి చేస్తాడు. కానీ పరమ అక్షర బ్రహ్మ యొక్క శాస్త్రానుకూలమైన సాధనా చేయు భక్తుల అదృష్టంను (రాతని) పరమేశ్వరుడు మార్చేస్తాడు. ఎందుకంటే పరమేశ్వరుడి గుణాలలో రాసి ఉంది పరమాత్మ నిర్ధనుడిని ధనవంతుడిగా చేస్తాడు అని.

సత్యయుగంలో ఏ ప్రాణి కూడ మాంసం, పొగాకు, మద్యం సేవించదు. ఎందుకంటే వారికి వీటి ద్వారా కలుగు పాపాల గురించి పూర్తిగా తెలిసి ఉంటుంది.

■ మాంసం తినుట పాపమైనది :-

ఒక సమయంలో ఒక సంత్ తన శిష్యుడితో ఎక్కడికో వెళ్లుచుండెను. అక్కడ ఒక చేపలు పట్టువాడు చెరువులో చేపలు పడుచుండెను. చేపలు నీటినుండి బయటకు రావడం వలన కొట్టుకుంటూ ప్రాణాన్ని త్యాగం చేస్తున్నవి. శిష్యుడు అడిగాడు హే గురుదేవ్! ఈ అపరాధి ప్రాణికి ఏమి దండన లభిస్తుంది? గురుజీ అన్నారు కుమారా! సమయం వచ్చినపుడు చెబుతాను. నాలుగు ఐదు సంవత్సరాల తరువాత ఇద్దరు గురుశిష్యులు ఎక్కడికో వెళ్లడానికి అడవిగుండా వెళ్లుచుండిరి. అక్కడ ఒక ఏనుగు యొక్క బిడ్డ అరుస్తు ఉండింది. ఆడుకుంటున్నపుడు ఏనుగు బిడ్డ రెండు దగ్గరాగాకల వృక్షాల మధ్య ఇరుక్కు పోయింది. అది బయటకు వచ్చింది కానీ బయటకు వచ్చు ప్రయత్నంలో దాని చర్మం చీట్లిపోయింది. శరీరానికి గాయాలు అయినాయి. దాని శరీరంపై పురుగులు నడుస్తుండెను. అవి దానిని(గాయంను) నొక్కుచుండెను. ఆ ఏనుగు బిడ్డ చాలా వేదనతో అరుస్తు ఉండింది. శిష్యుడు గురువుగారిని అడిగాడు హే గురుదేవ్ ! ఈ ప్రాణి ఏ పాపం యొక్క దండన అనుభవిస్తున్నది. గురుదేవులు అన్నారు కుమారా! ఇతడు ఆ చేపలు పట్టువాడు, ఎవరైతే ఆ నగరం బయటకల చెరువులో చేపలు పడుచుండెను.

■ మద్యం సేవించుట ఎంత పాపమైనది? :-

మద్యం సేవించువాడికి డెబ్బై జన్మలు కుక్కలాగా జీవించాల్సి ఉంటుంది. మలం-మూత్రం తింటూ తిరుగుతు ఉంటాడు. మిగత కష్టాలు కూడ చాలా అనుభవించాల్సి ఉంటుంది మరియు మద్యం కూడ శరీరానికి చాలా హాని చేస్తుంది. శరీరానికి నాలుగు ముఖ్యమైన అంగాలు ఉంటాయి. ఊపిరితిత్తులు, లివరు, కిడ్నీలు మరియు హృదయం. మద్యం ఈ నాలుగింటికి హాని కలిగిస్తుంది. మద్యం సేవించి మనిషి మనిషిలా ఉండక పశువులా ప్రవర్తిస్తాడు. ఉదహరణకి బురదలో పడిపోవడం, బట్టలలో మలమూత్రం పోవుట మరియు కక్కడం లాంటివి.

ధనహాని, మానహాని, ఇంటిలో అశాంతి మొ॥ మద్యం సేవించుట వలన కలుగుతాయి. సత్యయుగంలో మద్యంను ఏవరు సేవించరు. సత్యయుగంలో అందరూ

మనుషులు పరమాత్మ విధానంతో పరిచయస్తులై ఉంటారు. అందువలన సుఖమైన జీవనాన్ని గడుపుతారు.

గరీబ, మదిరా పివై కడవా పాని, సత్తర్ జన్మ స్వాన్ కే జాని ।

■ దురాచారములు చేయుట ఎంత పాపమైనది? :-

పరద్వారా స్త్రీ కా ఖోలై, సత్తర జన్మ అంధా హో డోలై ।

పూజ్య కబీర్ పరమేశ్వర్ గారు చెప్పినారు ఏమనంటే ఏ వ్యక్తి వేరొక స్త్రీతో చెడుకర్మ చేస్తాడో అతడు డెబ్బై జన్మలు గుడ్డివాడిగా జీవనం అనుభవిస్తాడు. బుద్ధిమంతుడైన వ్యక్తి ఇటువంటి ఆపద తనకు రానివ్వడు. మూర్ఖుడే ఇలాంటి పని చేస్తాడు. ఎలా అంటే, అగ్నిలో చేతులు వేయడం అనగా మృత్యువును ఆహ్వానించడమే. ఎలాఐతే ఒక వ్యక్తి వేరొకడి పొలంలో విత్తనాన్ని వేసినట్లయితే అతడు మహామూర్ఖుడు అవుతాడు. బుద్ధిమంతుడు ఎప్పటికి అలా చేయడు. వేశ్యాగృహానికి వెళ్లడం అనేది ఒక గోధుమ గింజల బస్తాని చెత్తకుప్పలో వేసి వచ్చినట్టు. ఈ పని బుద్ధికలవాడు చేయ్యడు. మూర్ఖుడు లేదా తాగుబోతు, సిగ్గులేని వ్యక్తియే చేయగలడు. విచారించతగిన విషయం ఏమిటంటే ఏ పదార్థం శరీరం నుండి నాశనం అవుతు కూడ ఆనందం యొక్క అనుభూతిని ఇస్తుంది. ఒకవేళ అది శరీరంలో సురక్షితంగా ఉంచితే ఎంత ఆనందాన్ని ఇస్తుంది. దీర్ఘాయుష్షు, స్వస్థ శరీరం, స్వస్థ మస్తిష్కం, శూరవిరత మరియు స్ఫూర్తిని ప్రసాదిస్తుంది. ఏ పదార్థంతో అమూల్యమైన బిడ్డని పొందవచ్చునో దానిని నాశనం చేయుట బిడ్డని హత్యచేయడంతో తుల్యమైనది. ఇందువలన దురాచారం మరియు అనవసరమైన భోగ విలాసం వర్జించాలి.

■ పొగాకు సేవనం ఎంత పాపకరమైనది? :-

బంది ఛోడ్ గరీబ్‌దాస్ మహారాజ్‌గారు ఈ అన్ని మత్తు కలిగించు వస్తువులను చాలా చెడ్డవిగా చెబుతూ తన వాణి యందు అంటారు :-

సురాపాన్ మద్య మాంసాహారి, గమన్ కరై భోగై( పర నారి ।

సతర జన్మ కటత్ హై శీశ్, సాక్షి సాహిబ్ హై జగదీశ్ ॥

పర ద్వారా స్త్రీ కా ఖోలై, సతర జన్మ అంధా హోవై డోలై।

సో నారి జారి కరై, సురా పాన్ సౌ బార్ । ఏక్ చిలమ్ హుక్కా భరై, డుబై కాలి ధార్ ॥

పై వాణి వివరణ ఏమిటంటే, ఒకసారి మద్యం సేవించువాడు డెబ్బై జన్మలు కుక్కలాగా జీవనం అనుభవించాలి. తరువాత మల మూత్రాదులు తింటు తిరుగుతాడు. పరాయి ఆడదానితో కులుకువాడు డెబ్బై జన్మలు గుడ్డివాడిగా జీవించుతాడు. మాంసం తినేవాడు కూడ మహాకష్టంలో భాగస్తుడౌతాడు. పై అన్ని పాపాలు వంద వంద సార్లు చేయడం వలన ఏ పాపం ఐతే కలుగుతుందో అది ఒకసారి హూక్కా తాగువారికి అనగా పొగాకు సేవించువారికి సహాయం చేయువారికి కలుగుతుంది. పొగాకు సేవించువారు హూక్కా, సిగరేట్, బీడి లేదా మిగతా విధాలుగా పొగాకుని సేవించువారికి ఎలాంటి పాపం

తగులుతుంది? ఘోరమైన పాపంలో భాగస్తుడౌతాడు. పొగాకు సేవించువ్యక్తి ఎపుడైతే హూక్కా, బీడి లేదా సిగరేట్ తాగి పొగని బయటకు విడుస్తాడు. ఆ పొగ అతడి చిన్న చిన్న పిల్లల శరీరాలలో ప్రవేశించి హాని చేస్తుంది. ఆ పిల్లలు త్వరగా చెడుని గ్రహిస్తారు మరియు వారి ఆరోగ్యం కూడ దెబ్బతింటుంది.

## "అవతారం యొక్క పరిభాషా"

'అవతారం' యొక్క అర్థం ఏమిటంటే (ఉన్నతమైన)పై స్థానం నుండి కింది స్థానంకు దిగుట. విశేషించి ఈ శుభపదము ఆ ఉత్తమ ఆత్మలకోసం ప్రయోగించబడుతుంది, ఏవైతే భూవిపై కొన్ని అద్భుత కార్యములని చేస్తాయి. వారిని పరమాత్ముడే పంపించినట్లుగా భావిస్తారు లేదా స్వయం పరమాత్మయే భూవిపైకి వచ్చినట్లుగా భావిస్తారు.

శ్రీమద్ భగవత్ గీతా అధ్యాయం **15** శ్లోకం **1** నుండి **4** మరియు **16-17** లో మూడు పురుషుల (ప్రభువు) జ్ఞానం ఉంది.

- ❑ **1.** క్షరపురుషుడు , ఈయనని కాల్, బ్రహ్మ అని కూడ అంటారు. వారి సాధన చేయవలిసిన నామం ఓం. దీని ప్రమాణం గీతా అధ్యాయం **8** శ్లోకం **13**లో ఉంది.
- ❑ **2.** అక్షర పురుషుడు, పరబ్రహ్మ అని కూడ అంటారు. ఈయన సాధనా మంత్రం తత్ అది సాంకేతికమైనది. ప్రమాణం కోసం గీతా అధ్యాయం **17** శ్లోకం **23** లో ఉంది.
- ❑ **3.** ఉత్తమ పురుష్ తూ: అన్య :- శ్రేష్ట పురుష పరమాత్మా పై ఇద్దరు పురుషులకంటే అన్యుడు. గీతా అధ్యాయం **8** శ్లోకం **1**కి సమాధానంగా అధ్యాయం **8** శ్లోకం **3** లో చెప్పబడినది ఆయనే పరమ అక్షర బ్రహ్మ అని. ఈయన జప శబ్దం సత్. అది సాంకేతికమైనది. ఈ పరమేశ్వరుడి ప్రాప్తితో సాధకుడు పరమశాంతిని మరియ సనాతన పరమధామాన్ని పొందుతాడు. ప్రమాణం కోసం గీతా అధ్యాయం **18** శ్లోకం **62**లో చూడండి . ఈ పరమేశ్వరుడు (పరమ అక్షర బ్రహ్మ) గీతా జ్ఞానదాతా కంటే భిన్నంగా ఉన్నాడు. అధిక జ్ఞాన ప్రాప్తికోసం కృపతో పుస్తకం 'ధరతి పర్ అవతార్ ' సతలోక ఆశ్రమం నుండి పొందండి. పైన చెప్పబడినట్లు అవతారాలు రెండు విధాలుగా ఉంటాయి. మూడు రూపాలతో ముగ్గురు పురుషులు (ప్రభువులు) ఉన్నట్లు మీకు ఇపుడు తెలిసింది. వారి పరిచయం పైన ఇవ్వబడినది. మన కోసం ముఖ్య రూపంలో ఇద్దరు ప్రభువుల భూమిక ఉంటుంది.

**1.** క్షర పురుషుడు (బ్రహ్మ) :- గీతా అధ్యాయం **11** శ్లోకం **32** లో తనని తాను కాల్ అని చెప్పుకుంటాడు.

**2.** పరమ అక్షర పురుష్ (పరమ అక్షర బ్రహ్మ) :- వీరి విషయంలో గీతా అధ్యాయం **8** శ్లోకం **3** మరియు **8,9, 10**లో మరియు గీతా అధ్యాయం **18** శ్లోకం **62** , అధ్యాయం **15** శ్లోకం **1** నుండి **4** మరియు **17** లో చెప్పబడినది.

## "బ్రహ్మ (కాల్) యొక్క అవతారాల పరిచయం"

గీతా అధ్యాయం 4 శ్లోకం 7

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యూత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ 7 ॥

యదా, యదా, హి, ధర్మస్య, గ్లాని:, భవతి, భారత,
అభ్యూత్థానమ్, అధర్మస్య, తదా, ఆత్మానమ్, సృజామి, అహమ్

అనువాదం :- (భారత) హే భారత్ ! (యదా, యదా) ఎప్పుడు-ఎప్పుడైతే (ధర్మస్య) ధర్మానికి (గ్లాని:) హాని మరియు (అధర్మస్య) అధర్మంది (అభ్యూత్థానమ్) వృద్ధి (భూతి) అవుతుందో (తదా) అప్పుడు - అప్పుడు (హి) యే (అహమ్) నేను (ఆత్మానమ్) నా అంశం అవతారాన్ని (సృజామి) రచిస్తాను అనగా ఉత్పన్నం చేస్తాను.

భావార్థం :- గీతా జ్ఞానదాతా చెబుతున్నారు ఎప్పుడైతే ధర్మం ఎడల ద్వేషం/అసహ్యం ఉత్పన్నం అవుతుంది. ధర్మానికి హాని కలుగుతుంది మరియు అధర్మం యొక్క వృద్ధి అవుతుందో అప్పుడు నేను (కాల్) నా అంశ అవతారాన్ని సృష్టిస్తాను అనగా ఉత్పన్నం చేస్తాను.

ఎలా అయితే శ్రీ రామచంద్రుడిని మరియు శ్రీ కృష్ణుడిని కాల్-బ్రహ్మయే పృథ్విపై జన్మింపచేసినారు. వారు స్వయం శ్రీ విష్ణువు భగవానులుగా భావింపబడుతారు.

ఇవి కాకుండా ఇంకా 8 అవతారాలు చెప్పబడినవి. శ్రీ విష్ణువుగారు స్వయంగా రాకుండ, తనలోకంలోని, తన కృపకు పాత్రులైన పవిత్ర ఆత్మలని పంపిస్తారు. వారు కూడ అవతారాలుగా భావింపబడుతారు. ఈ అన్ని అవతారాలు ఘోర సంహారం చేసియే అధర్మం యొక్క నాశనం చేస్తాయి. అధర్మాలను చంపి శాంతి స్థాపింపచేయు కార్యము చేస్తారు. కానీ శాంతికి బదులుగా అశాంతియే పెరుగుతుంది. శ్రీ రాముడు రావణుడిని చంపడానికి యుద్ధం చేసినారు. యుద్ధంలో కోట్లకొలది పురుషులు చనిపోయిరి. ధర్మం కలవారు మరియు అధర్ములు ఇద్దరును చనిపోయారు. తరువాత వారి భార్యలు మరియు చిన్న చిన్న పిల్లలు అనాథలైరి. మిగిలిన వారి జీవనం నరకంగా మారింది. విధవలని అన్య వ్యక్తులు తమ కోరికలని తీర్చుకోడానికి ఉపయోగించుకునిరి. జీవించడానికి సమస్యలు ఉత్పన్నం అయినాయి మొ॥ చాలా అశాంతికి కారణం అయి నిలబడ్డాయి. ఈ విధానమే శ్రీ కృష్ణుడు అనుసరించిరి, ఈ విధానమే పరుశురాముడు అనుసరించిరి. ఈ విధానమే పదవ అవతారం కాల్ ద్వారా ఉత్పన్నం చేయబడుతుంది. అది రాజా హరిశ్చంద్ర యొక్క ఆత్మ అవుతుంది. సంభల్ నగరంలో శ్రీ విష్ణుదత్తా శర్మ గారి ఇంటిలో జన్మిస్తాడు. ఆ సమయంలో అందరూ మానవులు హత్యాచారి, అన్యాయులు అవుతారు. వారందరిని చంపుతాడు. ఆ సమయంలో ఏ మనుషులకైతే పరమాత్మ యొక్క భయం ఉంటుందో మరియు సదాచారులుగా ఉంటారో వారిని విడిచిపెడతాడు, మిగతా వారందరిని చంపేస్తాడు. బ్రహ్మ యొక్క అవతారాల విధానం ఏమిటంటే అధర్మాన్ని నాశనం చేసి మరియు శాంతిని స్థాపింపచేయుట.

## "పరమ అక్షర బ్రహ్మ అనగా సత్యపురుషుడి అవతారాల గురించి"

**1.** పరమ అక్షర బ్రహ్మ స్వయంగా భూమిపై ప్రకటితమవుతారు. ఆయన సశరీరంగా వస్తారు. సశరీరంగా తిరిగి వెళ్లిపోతారు :- ఈ లీలా ఆ పరమేశ్వరుడు రెండు విధాలుగా చేస్తాడు.

అ). ప్రత్యేక యుగంలో శిశు రూపంలో ఎదో ఒక సరోవరంలోని కమలం పువ్వుపై వనంలో ప్రకటితమవుతాడు. తరువాత లీలా చేస్తు పెద్దగా అవుతారు మరియు ఆధ్యాత్మిక జ్ఞానంను ప్రచారం చేసి అధర్మాన్ని నశింపచేస్తారు. సరోవరంలోని జలంలోని కమలం పువ్వుపై అవతరించడానికి కారణం పరమేశ్వరుడు నారాయణ అని అనబడుతారు (నార= జలం, ఆయణ= వచ్చువాడు అనగా జలంపై నివాసం ఉండువారు నారాయణ అని అనబడుతారు).

ఆ). ఎపుడు అనుకుంటే అపుడు సాధువు , సంత్, జిందా రూపంలో తన సత్యలోకం నుండి భూమిపైకి వస్తారు మరియు మంచి ఆత్మలకి జ్ఞానం ఇస్తారు. తరువాత ఆ పుణ్యాత్మలు కూడ జ్ఞాన ప్రచారం చేసి అధర్మాన్ని నాశనం చేస్తారు. వారు కూడ పరమేశ్వరుడి ద్వారా పంపబడిన అవతారాలు అవుతాయి.

కలియుగంలో జేష్ఠ శుద్ద పూర్ణిమ, విక్రమి సంవత్ 1455 (క్రీ. శ. 1398) లో కబీర్ పరమేశ్వర్ సత్యలోకం నుండి నడిచి వచ్చిరి మరియు కాశీ నగరంలోని లహర్‌తారా నామంకల సరోవరంలో కమలం పువ్వుపై శిశురూపంలో విరాజమానులైరి. అక్కడి నుండి నీరు మరియు నీమా, వారు బట్టలు నేయు దంపతులు, వారిని ఎత్తుకుని తెచ్చుకునిరి. శిశు రూపధారి పరమేశ్వర్ కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) 25 రోజులు ఏమియు ఆహారం తీసుకొనలేదు. నీరు మరియు నీమా ఆ జన్మలోనే బ్రహ్మణులుగా ఉండిరి. శ్రీ శివుడి పూజరులుగా ఉండిరి. ముస్లింల ద్వారా బలవంతంగా ముస్లింలుగా మార్చివేయబడడం వలన బట్టలు నేయు పని చేస్తు జీవితాన్ని గడుపుచుండిరి. బాలుడి కోమలమైన పరిస్థిని చూసి నీమా తన ఇష్టదైవం శివుడిని ప్రార్థించింది. శివుడు సాధు వేషంలో అక్కడికి వచ్చిరి మరియు బాలుడి రూపంలో ఉన్న కబీర్ పరమేశ్వరులని చూసిరి. బాలక రూపంలో కల కబీర్ సాహెబ్ అనినారు శివజీ! వీరికి చెప్పండి ఒక బిడ్డకు జన్మ ఇవ్వని ఆవును తెమ్మనండి. అది మీ ఆశీర్వాదంతో పాలు ఇస్తుంది. అలానే చేసిరి. కబీర్ పరమేశ్వరుల ఆదేశానుసారం భగవాన్ శివుడు ఆ ఆవు యొక్క వీపుపై చేతితో నిమిరిరి, అదే సమయంలో స్థనముల నుండి పాలధార రావడం ప్రారంభించింది. ఒక ఖాళీ కుండ కింద పెట్టినారు. ఆ కుండ నిండగానే పాలు రావడం ఆగిపోయినవి. తరువాత ప్రతిరోజు కుండ స్తనముల కింద పెట్టగానే పాలతో ఆ ఆవు నింపెది. నిండగానే పాలు ఆగిపోయెవి. వాటిని కబీర్ పరమేశ్వరులు తాగేవారు. బట్టలు నేయు ఇంటిలో పెరగడం వలన పెద్ద అయ్యాక కబీర్ పరమేశ్వరు కూడ ఆ పనే చేయసాగిరి. తన మంచి ఆత్మలని కలిసిరి, వారికి తత్వజ్ఞానంను

వివరించిరి మరియు స్వయంగా తను తత్వజ్ఞానంను ప్రచారం చేసి అధర్మాన్ని నశింపజేసిరి. ఎవరేవరికైతే కబీర్ పరమేశ్వరులు జిందా మహాత్మా రూపంలో కలిసినా వారిని సతలోకం కు తీసుకొని పోయిరి మరియు తిరిగి పంపించిరి, వారికి ఆధ్యాత్మిక జ్ఞానంను ఇచ్చిరి మరియు తనతో పరిచయం చేయించిరి అనగా వారు ఆ పరమేశ్వరుడి(సత్యపురుషుడు) అవతారం అని. వారంతా కూడ పరమేశ్వరుడి నుండి పొందిన జ్ఞానం యొక్క ఆధారంతో అధర్మంను నశింపచేసిరి. ఆ అవతారాలు ఏవేవో చూద్దాం.

1. ఆదరణీయ ధర్మదాస్ గారు
2. ఆదరణీయ మలుక దాస్ గారు
3. ఆదరణీయ నానక దేవ సాహెబ్‌గారు
4. ఆదరణీయ దాదూ సాహెబ్ గారు
5. ఆదరణీయ గరీబ దాస్ గారు (ఊరు ఛూడానీ, జి. ఇజ్జర్ ,హరియాణ)
6. ఆదరణీయ ఘీసా దాస్ సాహెబ్ గారు (ఊరు ఖేఖడా, జి. మేరఠ్ ,యూ.పి.)

పైన తెలిపిన అవతారములు అన్ని పరమ అక్షర బ్రహ్మవి. తన కార్యమును చేసి వెళ్లిపోయిరి. అధర్మాన్ని నశింపచేసిరి. ఈ కారణం చేతనే ప్రజలలో చాలా సమయం వరకు చెడు దరిచేరలేక పోయింది. వర్తమానంలో సంత్‌లు తక్కువగా లేరు, కానీ శాంతి అను మాట లేదు. కారణం ఏమిటంటే ఈ సంత్‌ల సాధన శాస్త్ర విరుద్ధమై ఉంది. అందువలనే సమాజంలో అధర్మం పెరుగుతునే ఉంది. ఈ పంథ్‌లు మరియు సంత్‌లు జ్ఞాన ప్రచారం చేస్తు వేల సంవత్సరాలు అయిపోయాయి కానీ అధర్మం మాత్రము పెరుగుతునే ఉంది.

## "సత్యపురుషుడి వర్తమానంలోని అవతారం"

ఏ సత్యసాధనా మరియు తత్వజ్ఞానం యొక్క ప్రచారం పరమేశ్వరుడి చేసిన విధంగాననే తరువాత వచ్చిన పరమేశ్వరుడి సంత్‌లు చేసేవారు. దానివలన తోటివారి మధ్యన ప్రేమ ఉండింది, ఒకరి దు:ఖంలో దు:ఖితులయ్యేవారు, అసహాయుడికి సహాయం చేసేవారు, ఆ శాస్త్రవిధి అనుసార సాధనా మరియు ఆధ్యాత్మిక యథార్థ జ్ఞానం సంత్ రామపాల్ దాస్‌జీ మహారాజ్ గారికి పరమేశ్వర్ కబీర్ సాహెబ్‌గారు ప్రసాదించిరి. మార్చి **1997** సంవత్సరం, ఫాల్గుణి మాసం శుక్ల ప్రథమ రోజున ఉదయం పది గంటలకి జిందా మహాత్మా రూపంలో సత్యలోకం నుండి వచ్చి సంత్ రామపాల్ దాస్‌జీ మహారాజ్ గారికి సతనామం మరియు సారనామం దానం ఇచ్చు ఆదేశాన్ని ఇచ్చి అంతర్ధ్యానం అయిరి.

సంత్ రామపాల్ దాస్‌జీ మహారాజ్ కూడ పరమేశ్వరుడి(పరమ అక్షర బ్రహ్మ) ఆ అవతారాలలో ఒకరు ఎవరైతే ఆధ్యాత్మిక జ్ఞానం ద్వారా అధర్మంను నాశనం చేస్తారు. ఇపుడు విశ్వంలో శాంతి వస్తుంది. అన్ని ధర్మాల మరియు పంథ్ యొక్క వ్యక్తులు ఒకటి

అయి పరస్పరం ప్రేమతో ఉంటారు. రాజకీయ నేత కూడ అభిమానం లేనివాడై, న్యాయస్థుడై మరియు పరమాత్మతో భయపడి పనులు చేసేవారవుతారు. ప్రజలకి సేవకులై నిష్పక్షపాతంగా పనులు చేస్తారు. భూవిపై మరల సత్యయుగం లాంటి స్థితి వస్తుంది. వర్తమానంలో భూమిపై ఆ అవతార పురుషులు సంత్ రామపాల్‌దాస్ గారే. ఇక ఇంటి ఇంటిలో పరమేశ్వరుడి జ్ఞానచర్చా అవుతుంది. ఎక్కడైతే ఊరిలో, నగరంలో మరియు పార్కులలో కూర్చుండి పేక ఆడుతారో, కొందరు రాజకీయ విషయాలు మాట్లాడుతారు, కొందరు తమ కొడుకు కోడళ్ల గురించి మంచి చెడు చర్చా చేస్తారో, అక్కడ అలాంటి ప్రదేశాలలో కేవలం పరమేశ్వరుడి మహిమ యొక్క చర్చయే జరుగుతుంది. పుస్తకం " జ్ఞాన గంగా " లో రాయబడిన జ్ఞానం పైననే విచారాలు వ్యక్తం చేస్తారు. పరమాత్మా యొక్క మహిమని గానం చేయడం వలననే జీవుడు పుణ్యంలో భాగస్తుడౌతాడు. తరువాత శాస్త్రవిధి అనుసారంగా సాధన చేసి జీవితాన్ని సుఖంగా చేసుకుంటారు మరియు ఆత్మ కళ్యాణం చేసుకుంటారు. భూవిపై కలియుగంలో సత్యయుగం లాంటి సమయం వస్తుంది. సంత్ రామపాల్ దాస్‌జీ మహారాజ్ గారే వర్తమానంలో వాస్తవంలో భూమిపై అవతార పురుషుడు. అధికమైన జ్ఞానంకోసం కృపతో చదవండి ఈ పుస్తకమును.

## "అమెరికా దేశ మహిళ భవిష్యవక్తా ఫ్లోరెంస్‌గారి మహత్వపూర్ణ భవిష్యవాణి"

అమెరికా దేశ విశ్వ విఖ్యాత భవిష్యవక్తా ఫ్లోరెంస్‌గారు తన భవిష్యవాణి యందు చాలా సార్లు భారతదేశం గురించి ప్రస్తావించారు. " ద పాల్ ఆఫ్ సెన్సేశనల్ కల్చర్ " అను పేరుకల పుస్తకంలో రాసినారు. క్రీ. శ. 2000 రాగానే ప్రాకృతిక సంతులన భయానక రూపంలో చెడిపోతుంది. జనులలో ఆక్రోషం యొక్క బలమైన భావన ఉంటుంది. దురాచారం అతిగా ఉంటుంది. పశ్చిమంగా కల దేశాలలో విలాసవంతమైన జీవనం జీవించు వారి యందు నిరాశ, తోటివాళ్ల యందు ద్వేషం పెరుగుతుంది. నాలుగు వైపుల హింసా మరియు శిథిలమగు వాతావరణం ఉంటుంది. అంటే నాలుగు వైపుల హాహాకారం అవుతుంది. కానీ భారతదేశం నుండి పైకి లేచి వచ్చు ఒక కొత్త విచారధారా (ఆలోచనా ప్రవాహం/ సరళి) ఈ ఘోరవాతావరణంను సమాప్తం చేసేస్తుంది. ఆ విచారధారా వైజ్ఞానిక దృష్టితో సామరస్య మరియు సౌభాభృత్వం యొక్క ప్రాముఖ్యతిని తెలుపుతుంది. ధర్మం మరియు విజ్ఞానంకు మధ్య ఎలాంటి విరోధం/వైరుధ్యం లేదని తెలుపుతుంది. ఆధ్యాత్మికత యొక్క గొప్పతనం మరియు భౌతికత యొక్క చిక్కుముడిని అందరి ముందు విప్పదీస్తుంది. మధ్యస్థాయి వర్గం ఆ విచారధారా వలన చాలా ప్రభావితం అవుతుంది. ఈ వర్గం సమాజం యొక్క అన్ని వర్గములని మంచి సమాజ నిర్మాణం కోసం ప్రేరితులని చేస్తుంది. ఈ విచారధారా పూర్తి విశ్వంలో చమత్కారమైన పరివర్తనని తెస్తుంది.

నాకు నా ఆరవ ఇంద్రియ శక్తితో ఇది విశ్వాసం అవుతుంది. ఈ విచారధారని

జన్మింపచేయు ఆ మహాన్ సంత్ భారతదేశంలోనే జన్మించి ఉన్నాడు. ఆ సంత్ యొక్క ఓజస్వీ వ్యక్తిత్వం యొక్క ప్రభావం అందరిని ఆశ్చర్యపరుస్తుంది. ఆయన విచారధారా తగ్గుముఖం పడుచున్న ఆధ్యాత్మిక ప్రభావంకు తిరిగి స్ఫూర్తిని ఇస్తుంది. నాలుగు వైపుల ఆధ్యాత్మిక వాతావరణం ఉంటుంది.

సంత్ యొక్క విచారధారా వలన ప్రభావితం అయిన జనులు విశ్వ కళ్యాణం కోసం పశ్చిమం వైపు నడుస్తారు. మెల్ల మెల్లగా ఆసియా, యూరోపు, మరియు అమెరికాపై పూర్తిగా పట్టుసాదిస్తారు. సంత్ యొక్క విచారధారా వలన పూర్తి విశ్వం ప్రభావితం అవుతుంది మరియు ఆయన చరణ చిహ్నాలపై నడుస్తుంది. పశ్చిమ దేశంలోని జనులు ఆయనని ఇసా, ముస్లింలు ఆయనని సత్యమైన రహనుమా మరియు ఆసియా యొక్క ప్రజలు భగవంతుడి అవతారంగా భావిస్తారు.

ఆ మహాన్ సంత్ యొక్క విచారధారతో బౌద్ధిక క్రాంతి వస్తుంది. బుద్ధిజీవుల ఆచరణలు మారుతాయి. వారి యందు ఈశ్వరుడి యొడల శ్రద్ధ మరియు విశ్వాసం జాగృతం అవుతుంది.

ఫ్లోరెంస్‌గారి అనుసారంగా ఆ సంత్ భారతదేశంలో జన్మించి ఉన్నారు. ఆమె ఈ సంత్ ద్వారా చాలా ప్రభావితమై ఉండింది. తన మరో పుస్తకం “ గోల్డెన్ లైట్ ఆఫ్ న్యూ ఎరా ” లోకూడ వారు రాసినారు. ‘ఎప్పుడైతే నేను ధ్యానం చేస్తానో, నేను ప్రతిసారి ఒక సంతని చూస్తాను. తెల్లని రంగు కలవాడు. తెల్లని వెంట్రుకలు ఉన్నాయి. ఆయన ముఖంపై గడ్డం ఉండదు, మీసం ఉండదు. ఆ సంత్ యొక్క నుదురుపై అద్భుతమైన తేజస్సు ఉంటుంది. ఆయన నుదురుపై ఆకాశం నుండి ఒక నక్షత్రం యొక్క ప్రకాశిత కిరణములు నిరంతరం కురుస్తు ఉంటాయి. నేను చూస్తాను. ఆ సంత్ తన కళ్యాణకారి విచారధారా మరియు తన సత్ చరిత్ర ప్రభల అనుసరించువారి శక్తితో సంపూర్ణ విశ్వంలో కొత్త జ్ఞాన ప్రకాశంను వ్యాపింపచేస్తున్నారు.

ఆ సంత్ తన శక్తిని నిరంతరం పెంచుకుంటున్నారు. వారిలో ఎంత శక్తి ఉందంటే వారు ప్రాకృతిక పరివర్తన కూడ చేయగలరు. వారు తన పనిని వైజ్ఞానిక విధానంతో చేస్తారు. ఆయన కృప మరియు ప్రయత్నాల వలన మానవుల సభ్యతలో కొత్త జాగృతి వస్తుంది. విశ్వంలోని సమస్త జనసముహంలో కొత్త ఆలోచన యొక్క ప్రసారం అవుతుంది. లోకశక్తి యొక్క ఒక కొత్త రూపం ఉప్పొంగి ఎదుటకు వస్తుంది. అది అధికారంలోని వారు చేసే మనసుకు నచ్చిన స్వార్థ పనులపై అంకుశాన్ని మోపుతుంది.

మనోచికిత్సకులు మరియు సమ్మోహన కళ యొక్క ప్రసిద్ధజ్ఞాతా డా. మోరె బర్సటిన్ గారికి ఫ్లోరెన్స్‌తో మంచి స్నేహం ఉండింది. ఒకసారి ఫ్లోరెన్స్ ఆయనతో కూడ చెప్పింది “ డాక్టర్‌గారు! ఆ సమయం చాలా వేగంగా దగ్గరకి వస్తున్నది, ఎపుడైతే అధికారంను దుర్వినియోగ పరుచు రాజకీయ నేతలని ఉపేక్షించి మీ వంటి సమాజసేవకుల మాటలని సమాజం అధిక ధ్యానంతో వింటుంది. 21 శతాబ్దపు వచ్చిరాగానే ఒక కొత్త విచారధారా

పూర్తి విశ్వంను ప్రభావితం చేస్తుంది. ప్రతి రాష్ట్రంలో సచ్చరిత్రపు ధార్మిక మనుషుల సమూహము ప్రజల మెదడులో కూర్చున్న తప్పుడు ఆచరణలని/విధానాలని మార్చేస్తుంది. ఈ విచారధారా భారతదేశం నుండి ప్రస్ఫుటితమవుతుంది (వెలువడును). అక్కడి నుండియే పూర్తి విశ్వంలోకి వ్యాపిస్తుంది. నేను ఆ స్థానంలో ఒక ప్రచండ తపస్విని చూస్తున్నాను. వారి తేజం చాలా వేగంగా వ్యాపిస్తున్నది. మనుషులలో దైవత్వం మేల్కోల్పడానికి మరియు భూమిని స్వర్గంలా తయారు చేయుటకు ఆ సంత్ పగలు రాత్రి ప్రయత్నం చేస్తున్నారు.

ఒక పత్రిక విలేఖరి **1964** లో ఫ్లోరెన్స్‌ని అడిగారు 'మీరు ప్రపంచం యొక్క భవిష్యత్తుని చెప్పగలరా?' అని. ఫ్లోరెన్స్‌గారు సమాధానం ఇస్తు అన్నది **1970** యొక్క ప్రారంభం వ్యాపక తలకిందులుగా వ్యాపించిన స్థితి అవుతుంది. **1979-80** తరువాత ఎలాంటి భూకంపాలు వస్తాయి అంటే న్యూజేర్సీ యొక్క కొంత భాగం మరియు యూరోపు మరియు ఆసియా యొక్క చాలా దేశాల స్థానంలు భూకంపతో భూస్థాపితం అవుతాయి. కొన్ని జలంలో మునిగిపోతాయి. మూడవ ప్రపంచ యుద్ధం ఆలోచన అందరి మెదలల్లో కూర్చుంటుంది మరియు వారు ఈ యుద్ధం యొక్క తయారి చేసుకుంటారు, కానీ భారతీయ రాజకీయ నేతల ప్రభావం మరియు బుద్ధితో మూడవ ప్రపంచ యుద్ధంను ఆపుటలో సఫలం అవుతారు. మూడవ విశ్వ యుద్ధం యొక్క ప్రారంభం అవడం కంటే ముందుగా భారతదేశంలో శాసనం యొక్క పట్టు ఆధ్యాత్మిక ప్రవృత్తి కల ప్రజల చేతులలో ఉంటుంది, ఇందువలన వారి ప్రభావంతో విశ్వయుద్ధం తొలిగిపోతుంది. ఆ శాసకులు ఒక మహాన్ సంత్ ద్వారా ఓజస్వీ మరియు క్రాంతికారి విచారధారాతో ప్రభావితులు అవుతారు. వారు ఆ సంత్ యెడల ఆ విధంగానే సమర్పితులు అవుతారు. ఎలాఐతే వాషింగ్‌టన్ స్వాతంత్ర్యం మరియు మానవత ఎడల సమర్పితులుగా ఉండినారు '.

అమెరికాలోని న్యూజేర్సి నగరంలో ఉండు ఫ్లోరెన్స్ నిజముగానే ఒక విలక్షణ మహిళ. ఒకసారి నెబెల్ పేరుకల వ్యక్తి టి.వి. కార్యక్రమం ద్వారా ఆమెని అడిగినాడు ' మీరు భారతదేశంలో జన్మించిన సంత్ గురించె ప్రతిసారి చెబుతునే ఉంటారు. నేను నా గురించి కొంచెం తెలుసుకోవాలి అనుకుంటున్నాను. చెప్పండి'.

ఫ్లోరెన్స్ అతడి కుడి చేతిని పట్టుకుని అంది " మీరు చాలా త్వరగా వేరే రాజ్యాలకి ప్రయాణం అవుతారు". నెబెల్ ఒక ప్రసారణ సేవ (న్యూస్) యొక్క కర్మచారులుగా (ఉద్యోగులుగా) ఉండిరి. ఫ్లోరెన్స్ యొక్క ఈ మాటపై వారు నవ్వసాగిరి. కొన్ని క్షణాల తరువాత అన్నాడు " మీరు నాతో చాలా మంచి జోక్ చేశారు. ఒకవేళ మా కంపెనీ యొక్క అధికారులు ఈ కార్యక్రమమును చూస్తున్నట్లయితే నేను వేరే రాజ్యానికి వెళ్తానో లేదో తెలియదు కానీ మా కంపెనీ నుండి బయటకు పంపించబడుతాను".

కొన్ని గంటలలోనే టి.వి. కంట్రోల్ రూంలోని ఫోన్ శబ్దం అయింది. ఫోన్ నెబెల్ కోసం ఉండింది. వారి కంపెనీ జనరల్ మేనజర్ వారితో మాట్లాడటానికి ఫోన్ చేసిరి. నెబెల్ ఫోన్‌ని ఎత్తినాడు అప్పుడు ఆయన అన్నారు మేము న్యూయార్క నుండి ప్రసారాలని

ప్రారంభించాలి అని నిర్ణయం తీసుకుంటిమి. అక్కడికి మిమ్ముల్ని పంపిస్తున్నాము. ఇప్పుడు ఈ విషయం రహస్యంగా ఉంచండి. రేపు ఈ విషయం అందరికి తెలియచేస్తాము. నేను టి.వి. లో ఫ్లోరెన్స్‌తో పాటు మీ చర్చని చూస్తు ఉంటిని. ఫ్లోరెన్స్ మీ విషయంలో చెప్పింది పూర్తిగా సత్యమే. ఆశ్చర్యం ఏమిటంటే ఈ విషయం ఆమెకి ఎలా తెలిసింది? అని ". నెబెల్ ఫ్లోరెన్స్‌గారి ముఖం చూస్తు ఉండినారు.

కొంత మంది ప్రతికా విలేఖరులు ఒకసారి అడిగినారు ' మీరు భవిష్యత్తును ఎలా చూడగలుగుతారు మరియు అదృశ్య వ్యక్తి లేదా వస్తువులని ఎలా గుర్తించగలుగుతారు'. అపుడు ఫ్లోరెన్స్‌గారు చెబుతారు ' నాకు స్వయంగా తెలియదు ఇది ఎలా సంభవం అవుతుంది అని. నేను భవిష్యత్తు విషయంలో ఒక చాలా ప్రాముఖ్యతకల విషయం చెబుతున్నాను. 20 వ శతాబ్దం యొక్క అంతంలో భారతదేశంలో ఒక ప్రకాశం వెలువడుతుంది. ఈ ప్రకాశం పూర్తి ప్రపంచానికి ఆ దైవిక శక్తుల సమాచారంను ఇస్తుంది, ఎవైతే ఇప్పటివరకు మనకు రహస్యంగా ఉండినవి. (దేవి శక్తు సమాచారం ఎదైతే సంత్ రామపాల్‌దాస్‌జీ మహారాజ్ ద్వారా చెప్పబడినది. కృపతో చదవండి ఈ పుస్తకంలోని 'సృష్టి రచనా' అధ్యాయంలో). ఒక దివ్య మహాపురుషుడి ద్వారా ఈ ప్రకాశము ప్రపంచం మొత్తంలో వ్యాపిస్తుంది. ఆయన అందరికి సతమార్గముపై నడుచు ప్రేరణని ఇస్తారు. సమస్త ప్రపంచంలో ఒక కొత్త ఆలోచన యొక్క జ్యోతి వ్యాపిస్తుంది. ఎపుడైతే నేను ధ్యానస్థితిలో ఉంటానో తరచూ ఈ దివ్య మహాపురుషుడు నాకు కనిపిస్తు ఉంటారు".

ఫ్లోరెన్స్‌గారు పదే పదే ఈ సంత్ లేదా దివ్య మహాపురుషుడి గురించి ప్రస్తావించిరి. దానితో పాటు ఇది కూడ చెప్పిరి– భారతదేశంలోని ఉత్తరం వైపున ఒక స్థానంలో ఆయన ప్రత్యక్షమై ఉన్నారు.

సజ్జనులారా పై భవిష్యవాణి మరియు వర్తమాన వాణి ఉందో అది సంత్ రామపాల్‌జీ మహారాజ్‌గారి విషయంలో సరిగ్గా సరిపోతుంది. ఈ సమర్థననే మిగత భవిష్యవాణిలు కూడ చేస్తాయి. అవి వచ్చు అధ్యాయాలలో కలవు.

## "భాయి బాలే అను జన్మ సాఖిలో ప్రమాణం"

" ఒక మహాపురుషుడి విషయంలో భాయి బాలే అను జన్మసాఖిలో ప్రహ్లాదుడు అను భక్తుడి భవిష్యవాణి "

భాయి బాలే అను జన్మ సాఖిలో రాయబడిన వివరణ వలన స్పష్టం అవుతుంది ఏమిటంటే సంత్ రామపాల్‌దాస్‌జీ మహారాజ్ గారు ఆ అవతార పురుషులే ఎవరినైతే కబీర్ పరమేశ్వర్‌గారు మరియు సంత్ నానక్ జీ గారి తరువాత పంజాబ్ యొక్క ధరతిపై అవతరించి ఉండవలిసింది. సంత రామపాల్ దాస్‌జీ మహారాజ్ 8 సెప్టెంబర్ 1951 లో ఊరు ధనానా, జిల్లా సోనిపత్, హరియాణ ప్రాంతం (ఆ సమయంలో పంజాబ్ ప్రాంతం) భారతదేశం యొక్క పవిత్ర భూమిపై శ్రీ నంద రామ్ జాట్ గారి ఇంటిలో జాట్ వర్ణంలో

శ్రీమతి ఇంద్రా దేవిగారి గర్భంలో జన్మించిరి.

ఈ విషయంలో “ జన్మసాఖి భాయి బాలే వారి” హిందీ పుస్తకంలో దాని ప్రకాశకులు భాయి జవాహర్ సింహ కృపాల్ సింహ అండ్ కంపెనీ పుస్తకముల వారు, బాజార్ మాయి సేవా, అమృతసర్ (పంజాబ్) మరియు పంజాబి భాషలోని పుస్తక ప్రకాశకులు భాయి జవాహర్ సింహ కృపాల్ సింహ పుస్తకంల వీధి –8 బాగ్ రామానంద అమృతసర్ (పంజాబ్).

ఇందులో రాసిన అమర లేఖ ఈ ప్రకారంగా ఉంది :– ఒక సమయంలో భాయి భాలా మరియు మరదానా ని తోడుగా తీసుకుని సతగురు నానక్‌దేవజీ గారు భక్త ప్రహ్లాదుడి లోకంలోకి వెళ్లారు. ఎదైతే పృథ్వి నుండి కొన్ని లక్షల మైలు దూరంలో అంతరిక్షంలో ఉంది. ప్రహ్లాదుడు అంటాడు నానక్ గారు! మీకు పరమాత్ముడు దివ్య దృష్టిని ఇచ్చినారు మరియు కలియుగంలో పెద్ద భక్తుడిగా చేసుకున్నారు. మీ యొక్క ప్రతాపం కలియుగంలో చాలా ఉంటుంది. ఇక్కడికి (ప్రహ్లాదుడి లోకంలో) ముందుగా కబీర్ వచ్చియుండిరి అటు తరువాత మీరే వచ్చినారు ఇంకోకరు కూడ వస్తారు మీ ఇద్దరిలాగే ఆయన మహాపురుషుడు అవుతాడు. ఈ ముగ్గురు కాకుండా ఇక్కడికి ఎవరు రాలేరు. భక్తులు చాలా సంఖ్యలో ఉండవచ్చు, ఇంకా పెరుగుతారు కావచ్చు కానీ ఇక్కడికి అతడె రాగలడు, ఎవరైతే వీరి లాగే మహిమని కలిగిఉంటారు మరియు వేరేవ్వరు కారు. ఇందువలన ఈ ముగ్గురు కాకుండా వేరేవ్వరు ఇక్కడికి రాలేరు. మరదాను అడుగుతాడు హే ప్రహ్లాదుగారు! కబీర్‌గారు బట్టలు నేయువారిగా ఉండిరి, నానక్ గారు ఖత్రిలు, ఆ మూడవవారు ఏ వర్ణం(జాతి)తో మరియు ఏ భూవి పై ఎక్కడ అవతరించుతారు.

ప్రహ్లాదుడు అన్నారు:– నానక్ గారు సత్యలోకానికి పోయిన వేల సంవత్సరాల తరువాత పంజాబ్ యొక్క భూవిపై జాట్ వర్ణంలో జన్మించుతాడు మరియు అతడి ప్రచార క్షేత్ర నగరం బరవాలా అవుతుంది. (లేఖ సమాప్తం)

విచారం చేద్దాం: సంత్ రామపాల్‌దాస్‌జీ మహారాజ్ ఆ అవతార పురుషులే ఎవరైతే అన్య ప్రమాణాలతో పాటుగా జన్మ సాఖిలో రాయబడిన లేఖకు సమానంగా సరిపోతారు. జన్మసాఖిలో “వంద సంవత్సరాల తరువాత” అని రాసి ఉంది. ఇక్కడ వేల సంవత్సరాల తరువాత అని చెప్పబడినది దానిని పంజాబి భాషలో రాస్తున్న సమయంలో వంద సంవత్సరాలు అని రాసినారు. ఎందుకంటే మర్దానా అడిగి ఉండెను అతను ఏ యుగం దగ్గరగా వస్తాడు? అని. అపుడు ప్రహ్లాదుడు అనినారు శ్రీ నానక్‌జీగారి తరువాత వేల సంవత్సరాలకి కలియుగంలోనే ఆ సంత్ జాట్ వర్ణంలో జన్మించుతాడు అని. ఇందువలన ఇక్కడ వంద సం॥లకి బదులుగా వేల సం॥లు న్యాయమైనది మరియు ప్రచార క్షేత్రం బరవాలా అని కాకుండ బటాలా అని రాయబడినది. దీనికి రెండు కారణాలు అవగలవు “బరవాలా నగరం, జిల్లా హిసార్, హరియాణ (ఆ సమయంలో పంజాబ్) ప్రాంతంలో సుప్రసిద్దంగా లేకుండెను మరియు బటాలా నగరం పంజాబ్‌లో ప్రసిద్దమై ఉండింది.

రచయితలు ఈ కారణంచేతనే బరవాలా కి బదులుగా బటాలా అని రాసినారు. రెండవది ప్రింటు చేయు సమయంలో దొర్లిన పొరపాటు అవ్వచ్చు. ఇంకొక విశేష విచారణీయ వార్తా ఏమిటంటే పంజాబ్ లోని బటాలా నగరంలో జాట్ వర్ణంలో సంత్ వెలువడలేదు. ఎవరైతే ఈ మహాపురుషులు (కబీర్ సాహెబ్ మరియు శ్రీ నానకగారు) తో సమానంగా మహనీయుడు మరియు వీరితో సమాన జ్ఞానవంతుడు. ఈ ఆధారంతో మరియు అన్య ప్రమాణాల నుండి మరియు ఈ జన్మ సాఖి యొక్క ఆధారంతో స్పష్టం అవుతుంది ఆ మూడవ మహాపురుషుడు సంత్ రామపాల్‌దాస్‌జీ మహారాజుగారే అని మరియు వీరి ఆధ్యాత్మిక జ్ఞానం కూడ ఈ ఇద్దరు మహాపురుషులతో కలుస్తుంది. మీరు చూసినట్లయితే ఫోటో కాపి జన్మ సాఖి భాయి వారి ఎదైతే ఒకటి పంజాబీ భాషలో మరియు హిందీలో ఉంది అది పంజాబీ భాషనుండి అనువాదించబడినది. ఇందులో కొన్ని ప్రకరణలు సరిగా లేవు. పంజాబీ భాషలో రాసి ఉంది “జో ఇస జిహా కోయి హొూవేగా తాం ఏథే పహూంచేగా హొూర్ దా ఎథే పహుచణ్ దా కమ నహి” కానీ హిందీ అనువాదంలో ఈ మహత్వపూర్వకమైన వివరణే లేదు. దీని వలన తెలుస్తున్నది, ఏమిటంటే రాస్తున్న సమయంలో కొంత భాగం మారిపోతాయి అని. అయినకూడ చాలా ప్రమాణాలు ఈ పుస్తకంలో ,ఏవైతే మిగతా మహాపురుషుల ద్వారా సంత రామపాల్‌జీ విషయంలో చెప్పబడినవో, అవి కూడ దీనినే ప్రమాణికరిస్తాయి.

విశేషం :- ఒకవేళ ఏవరైన అంటారు జన్మసాఖి లో రాసిన వ్యాఖ్యాలు సంత్ గరీబదాస్‌గారు ఊరు ఛూడానిగారి గురించి ఉన్నవి, ఎందుకంటే వారు కూడ జాట్ వర్ణస్తులే. మరియు ఛుడాని గ్రామం మొదట పంజాబ్ ప్రాంతంకిందికి వచ్చెది. ఇది కూడ సరియైనదిగా అనిపించదు ఎందుకంటే సంత గరీబదాస్ గారు తన అమృతవాణి “అసూర నికందన రమైణి”లో అంటారు “ సతగురు దిల్లి మండల ఆయసి, సుతి ధరని సుమ జగాయసి” భావార్థం ఏమిటంటే సంత్ గరీబదాస్ గారి సతగురు పూజ్య కబీర్ సాహెబ్‌గారు ఉండిరి. పాత రోహతక్(సొనిపత్, రోహతక్ మరియు ఇజ్జర్ కలిపి ఒక జిల్లా రోహతక్‌గా ఉండెది) దిల్లీ మండలలోకి వచ్చెది. ఇది ఏ రాజు యొక్క ఆధీనంలో లేకుండెను.ఆంగ్లేయుల పరిపాలనలో దిల్లీ ఆధీనంలో ఉండెను. సంత గరీబదాస్‌గారు స్పష్టం చేసినారు సతగురు (కబీర్ సాహెబ్‌గారు) దిల్లీ మండలంలోకి వస్తారు అని భక్తిహీన ప్రాణులని మేల్కొలుపుతారు మరియు సత్యభక్తి చేయించుతారు. (గుర్తుంచుకోండి కబీర్ సాగర్‌లో, కాల దూతలు కల్తీచేయడం చేసి సత్యంను తేలుసుకొనక తమ అతి తెలివితో అసత్య ప్రమాణంలు ఇచ్చినారు. దానిని నాశనం చేయుటకు పరమేశ్వర్ కబీర్ గారు తన అంశ అవతారం సంత గరీబదాస్‌గారి ద్వారా యథార్థ జ్ఞాన ప్రచారం చేయించిరి. ఎదైతే సంత్ గరీబదాస్‌గారి అమృతవాణి రూపంలో ఉంది. ఈ విషయం “ కబీర్ సాగర్ యొక్క సంపాదకులు కబీర్ పంథి శ్రీ యూగలానంద బిహారి గారి ఆ వాఖ్యా బలపరుస్తుంది ఏదైతే వారు అనురాగ సాగర్ మరియు జ్ఞాన సాగర్ యొక్క భూమిక లో చెప్పియున్నారు

ఏమనంటే కబీర్ పంథిలు కబీర్ పంథ యొక్క గ్రంథాలని నాశనం చేసి యున్నారు. తమ తమ మతానుసారం విషయాల్ని మార్చి తమ అభిమతాలని జోడించినారు. నా వద్ద అనురాగ సాగర్ మరియు జ్ఞాన సాగర్ యొక్క చాలా చాలా ప్రతములు కలవు. అవి ఒకదానికొకటి కలవడం లేదు).

**సంత రామపాల్‌దాస్‌జీ మహారాజ్ గారి జన్మ శ్రీ నంద రామ్ జాట్ గారి ఇంటిలో 8 సెప్టెంబరు 1951 నాడు గ్రామం-ధనానా, జిల్లా-సోనిపత్ (ఆ సమయంలో రోహతక్)లో అయింది. ఏదైతే వర్తమానంలో హరియాణా మరియు పంజాబ్ ప్రాంతంలు కలిపి, ఆ పాతకాలంలో ఒకటే పంజాబ్ ప్రాంతం ఉండెది. పరమేశ్వర్ కబీర్ గారు కూడ అనినారు ఏ సమయంలో కలియుగం 5500 సంవత్సరాలు గడిచి పోయి ఉంటాయో నేను గరీబదాస్‌గారి పన్నెండు పంథ్‌లలో ముందుగా స్వయంగా వస్తాను. సంత్ గరీబదాస్‌గారి ద్వారా నా(కబీర్ పరమేశ్వర్) మహిమ యొక్క వాణి ప్రకటితమవుతుంది మరియు గరీబదాస్‌వి అగు పన్నెండు పంథ్‌ల వరకు సాధకులు నన్ను ఆధారంగా చేసుకుని వాణిని అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేస్తారు కానీ వాణిని అర్థం చేసుకోనక సతనామం మరియు సారనామం నుండి వంచితులై ఉండటం వలన అసంఖ్య జన్మల వరకి సత్యలోక ప్రాప్తిని పొందలేరు. ఆ పన్నెండవ పంథ్‌లో నేనే స్వయంగా నడిచి వస్తాను. అపుడు సంత గరీబదాసగారి ద్వారా ప్రకటితమగు వాణిని నేను (కబీర్ పరమేశ్వర్) ప్రకటితమై తెలియజేస్తాను. దీనివలన సిద్ధించింది ఏమిటంటే జన్మ సాఖిలో ఇ జాట్‌జాతి సంత్ విషయంలో చెప్పబడిందో వివాదంలేకుండా ఆయన సంత్ రామపాల్‌దాస్‌జీ మహారాజ్‌గారుయే. మేము గరీబదాస్‌గారి విశేష ఆదరణ చేస్తాము. ఎందుకంటే ఆయననే కబీర్ పరమేశ్వరుడి అమర సందేశాన్ని వినిపించిరి.**

**ఒకవేళ ఎవరైన భ్రమని ఉత్పన్నం చెసితే ఏమనంటే పది గురు సాహిబానులలో నుండి వేరేవారి వైపు కూడ సంకేతం అవగలదు. ఇందువలన గుర్తుంచుకోవలసింది ఏమిటంటే పది సిక్ సాహిబానులలో ఏ ఒక్కరు జాట్ కులస్థులు కాకుండిరి. రెండవ సిక్కు గురు శ్రీ అంగద్ దేవగారు ఖత్రిలుగా ఉండిరి. మూడవ గురువులు శ్రీ అమర్ దాస్‌గారు కూడ ఖత్రిలు. నాలుగవ గురువులు శ్రీ రామదాస్‌గారు ఖత్రిలులే మరియు ఐదవ గురువులు శ్రీ అర్జున్‌దేవగారు నుండి తీసుకుని పదవ మరియు చివరి గురువు శ్రీ గురు గోబిన్ద సింహగారి వరకు శ్రీ గురు రామదాసగారి సంతానం అనగా ఖత్రి కులస్థులుగా ఉండిరి. అయన కూడ మేము అంతా సిక్కు గురు సాహిబానుల విశేష ఆదరణ చేస్తాము.**

సంత రామపాల్ దాస్‌జీ మహారాజ్‌గారు అంటారు:-

జీవ హమారి జాతి హై, మానవ ధర్మ హమారా ।
హిందు, మూలలిమ్, సిఖ, ఇసాయి, ధర్మ కోయి న్యారా ॥

**పరమేశ్వర్ కబీర్‌గారు అంటారు :-**

జాతి నా పుఛో సంత్ కి, పుఛ లిజిఏ జ్ఞాన్। మోల్ కరో తలవార్ కా, పడి రహన్ దో మ్యాన్ ॥

**కృపతో ప్రమాణం కోసం చూడండి జిరాక్స్ కాపి జన్మ సాఖి పంజాబి గురుముఖి(పంజాబీలో) మరియు హిందీ భాషలోనిది. రెండింటిని మీరు సహజంగా తెలుసుకోగలరు వాస్తవికత ఏమిటి అని. జన్మ సాఖిల యొక్క ప్రకాశకులు:- భాయి జవాహర్ సింహ్ కృపాల్ సింహ్ అమృతసర్ (పంజాబ్). కృపతో చూడండి జిరాక్స్ కాపి జన్మ సాఖి భాయి పంజాబి గురుముఖి(పంజాబీలో) పేజి 272 లోనిది.**

(੨੭੨) ਸਾਖੀ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਨਾਲ ਹੋਈ

ਕਾਜ ਸਵਾਰਿਆ ॥੪॥ ਤਾਂ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਕਹਿਆ ਨਾਨਕ ਤਪਾ ਜੀ ਤੈਨੂੰ ਕਲਜੁਗ ਵਿਚ ਰਾਮ ਜੀ ਨੇ ਵਡਾ ਭਗਤ ਕੀਤਾ ਹੈ ਔਰ ਆਪਕੇ ਸੰਜੋਗ ਬਹੁਤਿਆਂ ਕਾ ਉਧਾਰ ਹੋਵੇਗਾ ਤੇਰੀ ਸ੍ਰੀ ਰਾਮ ਨੇ ਵਡੀ ਨਦਰ ਖੋਲੀ ਹੈ ਤੇਰਾ ਵਡਾ ਪ੍ਰਤਾਪ ਹੋਵੇਗਾ ਇਸ ਕਲਜੁਗ ਵਿਚ ਅਗੇ ਕਬੀਰ ਭਗਤ ਏਥੇ ਆਯਾ ਹੈ ਅਤੇ ਜਾਂ ਆਪਕੋ ਕਰਤਾ ਨੇ ਆਂਦਾ ਹੈ ਤਾਂ ਮਰਦਾਨੇ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਨੂੰ ਪੁਛਿਆ ਹੇ ਭਗਤ ਜੀ ਤੁਸੀਂ ਭੀ ਵਡੇ ਭਗਤ ਹੋ ਅਤੇ ਤੁਸਾਡੇ ਪਿਛੇ ਰਾਮ ਜੀ ਵਡਾ ਚਲਤ ਦਿਖਾਇਆ ਹੈ ਤੇਰੀ ਰਾਮ ਜੀ ਨੇ ਵਡੀ ਨਦਰ ਖੋਲ੍ਹੀ ਹੈ ਭਗਤ ਜੀ ਏਥੇ ਹੋਰ ਕੋਈ ਵੀ ਪਹੁੰਚਿਆ ਹੈ ਕਿ ਕਬੀਰ ਅਤੇ ਨਾਨਕ ਤਪਾ ਹੀ ਪਹੁੰਚਿਆ ਹੈ ਤਾਂ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਬੋਲਿਆ ਭਾਈ ਨਾਨਕ ਤਪੇ ਪਾਸੋਂ ਪੁਛ ਲੈ ਹੋਰ ਭੀ ਆਵਸੀ ਕਿ ਨਾ ਆਵਸੀ ਕੋਈ ਤਾਂ ਮਰਦਾਨੇ ਕਹਿਆ ਜੀ ਤੁਸੀਂ ਵਡੇ ਭਗਤ ਹੋ ਅਗਲੀ ਤੇ ਪਿਛਲੀ ਸਭ ਆਪ ਨੂੰ ਸਤਿ ਜੁਗ ਥੀਂ ਆਦਿ ਲੈਕੇ ਮਾਲੂਮ ਹੈ ਤਾਂ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਨੇ ਕਹਿਆ ਸੁਣ ਭਾਈ ਇਸ ਜਿਹਾ ਕੋਈ ਹੋਵੇਗਾ ਤਾਂ ਏਥੇ ਪਹੁੰਚੇਗਾ ਹੋਰਸ ਦਾ ਏਥੇ ਪਹੁੰਚਣਾ ਕੰਮ ਨਾਹੀਂ ਹੋਰ ਅਗੇ ਵਡੇ ਵਡੇ ਭਗਤ ਹੋਏ ਹੈਨ ਅਤੇ ਹੋਵਨਗੇ ਪਰ ਪਹੁੰਚਿਆ ਕੋਈ ਨਾਹੀਂ ਤਾਂ ਫੇਰ ਮਰਦਾਨੇ ਪੁਛਿਆ ਜੀ ਓਹ ਕਦ ਹੋਸੀ ਕਿਤੇ ਨੇੜੇ ਜੁਗ ਵਿਚ ਹੋਸੀ ਤਾਂ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਕਹਿਆ ਸੁਣ ਭਾਈ ਕਲਜੁਗ ਵਿਚ ਹੋਵੇਗਾ ਜਟ ਨਾਨਕ ਤਪਾ ਸਚਖੰਡ ਜਾਵੇਗਾ ਤਾਂ ਇਸ ਤੋਂ ਪਿਛੇ ਸਉ ਵਰ੍ਹੇ ਹੋਸੀ ਅਤੇ ਏਹਨਾਂ ਤੇਹਾਂ ਤੋਂ ਬਗੈਰ ਹੋਰ ਕੋਈ ਨਾ ਆਵਸੀ ਤਾਂ ਮਰਦਾਨੇ ਪੁਛਿਆ ਜੀ ਤਿੰਨ ਕੇਹੜੇ ਹੈਨ ਤਾਂ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਕਹਿਆ ਭਾਈ ਅਗੇ ਕਬੀਰ ਹੋਇਆ ਹੈ ਤੇ ਹੁਣ

**కృపతో చూడండి జిరాక్స్ కాపి జన్మ సాఖి భాయి పంజాబి గురుముఖి(పంజాబీలో) పేజి 273 లోనిది.**

ਸਾਖੀ ਇਕ ਪਹਾੜ ਦੀ ਚਲੀ (੨੭੩)

ਨਾਨਕ ਤਪਾ ਹੂਆ ਹੈ ਅਤੇ ਫੇਰ ਉਹ ਹੋਸੀ ਤਾਂ ਮਰਦਾਨੇ ਪੁਛਿਆ ਜੀ ਕਬੀਰ ਜੁਲਾਹਾ ਹੋਯਾ ਤੇ ਨਾਨਕ ਖਤਰੀ ਹੋਏ ਅਤੇ ਜੀ ਉਹ ਕਿਸ ਵਰਨ ਹੋਵੇਗਾ ਜੀ ਤੇ ਕਿਸ ਧਰਤੀ ਤੇ ਹੋਸੀ ਕੇਹੜੇ ਸ਼ਹਿਰ ਤਾਂ ਪ੍ਰਹਿਲਾਦ ਭਗਤ ਕਿਹਾ ਭਾਈ ਪੰਜਾਬ ਧਰਤੀ ਤੇ ਵਰਨ ਜਟ ਤੇ ਸ਼ਹਿਰ ਵਟਾਲੇ ਵਿਚ ਹੋਸੀ। ਤਾਂ ਮਰਦਾਨਾ ਸ੍ਰੀ ਗੁਰੂ ਜੀ ਦੇ ਚਰਨਾਂ ਤੇ ਢਹਿ ਪਿਆ ਗੁਰੂ

కృపతో చూడండి జిరాక్స్ కాపి జన్మ సాఖి భాయి బాలే హింది భాషలో పేజి **305** లోనిది.

जन्म साखी (३०५) भाई बाले वाली

तब भक्त प्रहलाद ने कहा–हे नानक देव। आप को इस कलियुग में बड़ा भक्त बनाया है। आप की ही संगति से अनेकों प्राणियों का भला होगा। और आप का अनंत प्रताप होगा। तब मरदाने ने कहा–हे प्रहलाद जी। आप भी तो परम भक्त हैं तथा भगवान ने आप के लिये ही अवतार धारन किया था। प्रहलाद जी ने कहा–हे भाई मरदाना। इस स्थान पर या तो कबीर पहुंचा है, और या यह गुरु नानक आया है। यहां आना कोई सुगम कार्य नहीं है। एक और महापुरुष होगा जो पहुंच सकेगा। मरदाने ने कहा–हे भक्त वर। वह पुरुष कौन और कब होगा। प्रहलाद ने उत्तर दिया, कि जब गुरु नानक देव यहां आयेंगे तो इन के सौ वर्ष पश्चात आयेगा। अर्थात यहां केवल तीन आदमी ही आने हैं। एक तो भक्त कबीर और दूसरे श्री गुरु नानक देव जी इन के पश्चात वह तीसरा आयेगा। तब मर्दाने ने कहा हे प्रहलाद जी। कबीर तो जुलाहा था, और नानक देव–खत्री हैं। परंतु वह तीसरा किस जाती का होगा, उत्तर में प्रहलाद जी ने कहा–हे मर्दाना। पंजाब की धरती और वहां उस का जाट होगा। तथा नगर बरवाला में होगा। उस समय मर्दाना गुरु जी के चरणों

ప్రశ్న:- ఒక సంస్కృత విద్వాన్ శాస్త్రి అనినారు మీ గురు సంత్ రామపాల్ దాస్ మహారాజ్‌గారు సంస్కృతం చదవలేదు. మీరు అంటారు వారు శ్రీ మద్ భగవత్ గీత యొక్క యథార్థ అనువాదం చేసి భక్తులకి చెబుతారు అని. ఇది ఏన్నటికి జరగదు అని.

సమాధానము :- సంత్ రామపాల్ దాస్ మహారాజ్‌గారి భక్తులు ఉత్తరం ఇచ్చిరి శాస్త్రిగారు దానినే పరమేశ్వరుని అవతారం అంటారు. ఎవరైతే భాషా యొక్క జ్ఞానం లేకపోయిన యథార్థ అనువాదం చేయగలుగుతారు. ఎందుకంటే పరమేశ్వరులు సర్వజ్ఞులు. ఆ గుణాలతో యుక్తమై ఆయన ద్వారా పంపింపబడిన అవతారం అవుతారు. ఆ అవతారం సంత్ రామపాల్ దాస్ మహారాజ్‌గారు అవుతారు . మీరు అయితే కేవలం వేదాలు మరియు గీతా యొక్క అనువాదంతోనే ఆశ్చర్యచకితులుగా ఉన్నారు. సంత్ రామపాల్ దాస్ మహారాజ్‌గారు ఇంకా ఖురాన్ మరియు బైబిల్ యొక్క జ్ఞానంను యథార్థ రూపంలో చెబుతారు. ఎదైతే ఇసాయి ధర్మం యొక్క వర్తమానంలోని ఫాదర్ మరియు ఫాదరిలు మరియు ముస్లిమ ధర్మం యొక్క మూల్లా మరియు కాజీ కూడ అర్థం చేసుకోలేకపోయిరి.



# భక్తి మర్యాద

జీవమే మన జాతి, మనది మానవ ధర్మం.

హిందూ, ముస్లిమ్, సిక్కు, ఇసాయి, లేదు మరొక ధర్మం.

ప్రియ భక్త జనులారా!

నేటి నుండి సుమారు ఐదు వేల సంవత్సరాల పూర్వము ఏ ధర్మం లేదు. మిగతా సంప్రదాయాలు లేవు. హిందూవులు లేరు, ముస్లింలు లేరు, సిక్కులు మరియు క్రిస్టియన్స్ లేరు. కేవలం మానవ ధర్మమే ఉండింది. అందరిది ఒకే మానవ ధర్మం ఉండింది మరియు ఉంది. కానీ ఏలా ఏలా కలియుగం యొక్క ప్రభావం పెరుగుతు పోయిందో అలా అలా మనలో మత భేదం జరుగుతూ వచ్చింది. కారణం కేవలం ఏమిటంటే ధార్మిక కుల గురువుల ద్వారా శాస్త్రాలలో రాయబడిన నిజంను పూడ్చి వేయడం జరిగింది. స్వార్థం లేదా పైకి చూపించడానికో, ఆడంబరానికో కారణం ఏదైన దాని పరిణామం నేడు ఒక మానవ ధర్మమానికి బదులు నాలుగు ధర్మాలు మరియు అన్య చాలా సంప్రదాయాలు తయారైనవి. దానివలన అందరి మధ్య మతభేదం ఏర్పడం సహజమైనది. అందరి ప్రభువు/ భగవాన్/ రాం/ అల్లాహ్/ రబ్/ గాడ్/ ఖుదా/ పరమేశ్వరుడు ఒక్కరే. ఇవన్ని భాషలలోని భిన్నమైన పర్యాయపదాలు. అందరు భావిస్తారు అందరి దైవం ఒక్కటే అని, కానీ అయిన కూడ ఇన్ని వేరు వేరు ధర్మ సంప్రదాయాలు ఎందుకు?

ఈ మాట సరిగ్గా సరియైనదే అందరి మాలిక్/ రబ్/ ఖుదా/ అల్లాహ్/ గాడ్/ రామ్/ పరమేశ్వర్ ఒక్కరే. వారి వాస్తవిక నామం కబీర్. ఆయన తన సతలోకం/ సతధామం/ సచ్ఖండంలో మానవ సదృశ స్వరూపంలో, ఆకారంలో వచ్చి ఉంటాడు. కానీ నేడు హిందూవులు అంటారు మా రాముడు గొప్ప అని, ముస్లింలు అంటారు మా అల్లాహ్ గొప్ప అని, క్రిస్టియన్స్ అంటారు మా ఏసు గొప్ప అని, మరియు సిక్కులు అంటారు మా గురునానక్జీ గొప్పవారని. ఏలా అంటారంటే ఎలాగైతే నలుగురు అమాయకపు పిల్లలు అంటారు ఈయన నా తండ్రిఅని, రెండవ వాడు అంటారు ఈయన నా తండ్రి నీ తండ్రి కాదు, మూడవ వాడు అంటారు ఈయన నా తండ్రిగారు వీరు అందరికంటే పెద్దవారు మరియు నాలుగవ వాడు అంటాడు అరె అమాయకులారా! ఈయనా నా డైడి, మీ డైడి కాదు, వాస్తవానికి ఆ నలుగురి తండ్రి ఒక్కడే. ఈ అమాయకపు పిల్లల మాదిరిగానే నేడు మన సమాజం కోట్లాడుకొనుచున్నది.

"కోయి కహే హమారా రామ్ బడా హై, కోయి కహే ఖుదాయి రే ।
కోయి కహే హమారా ఈసామసిహ్ బడా, యే బాటా రహే లగాయి రే ॥"

వాస్తవానికి మన అన్ని ధార్మిక గ్రంథాలు మరియు శాస్త్రాలు ఆ ఒక్క ప్రభువు/ మాలిక్/ రబ్/ ఖుదా/ అల్లాహ్/ రాముడు/ సాహెబ్/ గాడ్/ పరమేశ్వర్ యొక్క ప్రత్యక్ష నామాన్ని రాసి, మహిమని గానం చేసినవి, ఏమనంటే, ఆ ఒక్క మాలిక్/ ప్రభువు కబీర్ సాహెబ్గారే అని మరియు ఆయన సతలోకంలో మానవ సదృశ స్వరూపంలో ఆకారంలో

ఉంటారు.

వేదాలు, గీతా, ఖురాన్ మరియు గురు గ్రంథ్ సాహెబ్ ఇవన్ని ఒకదానికొకటి సమానత్వంను కలిగి ఉంటాయి. యజుర్వేదం అ. 5 శ్లోకం 32లో, సామవేదం సంఖ్య నం. 1400, 822లో, అధర్వణ వేదం కాండ నం. 4 యొక్క అనువాకం 1, శ్లోకం 7, ఋగ్వేదం మ. 1 అధ్యాయం. 1 యొక్క సూక్తం 11 యొక్క శ్లోకం 4లో కబీర్ నామంను రాసి చెప్పినారు, ఏమనంటే, పూర్ణ బ్రహ్మ కబీర్‌గారే, ఆయన సతలోకంలో ఆకారంలో ఉంటారు. గీతా నాలుగు వేదాల సంక్షిప్త సారం. గీతా కూడా ఆ సతపురుష పూర్ణ బ్రహ్మ కబీర్ వైపు సంకేతం చేస్తుంది. గీతా అధ్యాయం. 15 శ్లోకం 16-17, అధ్యాయం. 18 శ్లోకం 46, 62, అధ్యాయం. 8 శ్లోకం 8 నుండి 10 మరియు 22లో, అధ్యాయం. 15 శ్లోకం 1,2,4 లోను ఆ పూర్ణ పరమాత్మ యొక్క భక్తిచేయు సంకేతం ఇచ్చియున్నారు. శ్రీ గురుగ్రంథ్ సాహెబ్ పేజి నం. 24 పై మరియు పేజి నం. 721పై నామాన్ని రాసి కబీర్ సాహెబ్‌గారి మహిమని చెప్పినారు. ఈ విధంగా ఖురాన్ మరియు బైబిల్ ఒక్క శాస్త్రాంగానే భావించండి. రెండు కూడా సుమారు ఒకె సందేశాన్ని ఇస్తాయి, ఏమనంటే, ఆ కబీర్ అల్లాహ్ మహిమని నమ్మండి. ఆయన శక్తితోనే ఈ అంత సృష్టి నడుస్తున్నది. ఖురాన్ శరీఫ్‌లో సూరత్ ఫూర్కనీ సంఖ్య 25 యొక్క ఆయత్ సం. 52 నుండి 59 వరకులో కబీరన్, ఖబీరా, కబీరు మొదలగు శబ్దాలని రాసి ఆ ఒక్క కబీర్ అల్లాహ్ యొక్క మహిమని నిర్వచించడం జరిగింది. హే పైగంబర్ (మూహమ్మద్) ! ఆ కబీర్ అల్లాహ్ యొక్క మహిమని చెప్పండి ఏవరైతే ఆరు రోజులలో తన శక్తితో సృష్టిని రచించి ఏడవ రోజున తన సింహాసనంపై విరాజితులైనారు, అనగా సతలోకానికి వెళ్ళి విశ్రాంతి తీసుకున్నాడు. ఆ అల్లాహ్ (ప్రభు) కబీర్ సాహెబుయే. ఈ ప్రమాణమే బైబిల్‌లో ఉత్పత్తి గ్రంథంలో సృష్టి క్రమంలో బైబిల్ యొక్క ప్రారంభంలోనే ఏడు రోజుల రచనయందు 1:20-2:5లో ఉంది.

అన్ని సంత్‌ల మరియు గ్రంథాల సారం ఇదియే, ఏమిటంటే, పూర్ణ గురువు-ఎవరి వద్దనైతే మూడు నామాలు ఉంటాయో మరియు నామదానం ఇచ్చు అధికారం ఉంటుందో, వారి నుండి నామంను తీసుకుని జీవుడు జన్మ-మృత్యువు రూపి రోగం నుండి విముక్తిని పొందాలి. ఎందుకంటే మా ఉద్దేశ్యం మిముల్ని కాల్ యొక్క చెరసాల నుండి విడిపించి మన మూల ప్రభువు కబీర్‌దేవ్ (కబీర్ సాహెబ్) గారి సతలోకాన్ని ప్రాప్తింపజేయడం. కవీర్దేవ్ తన వాణిలో చెబుతారు ఏమనంటే ఒక జీవుడిని కాల్ సాధన నుండి తప్పించి పూర్ణ గురుదేవుల వద్దకి తీసుకువచ్చి సత ఉపదేశాన్ని ఇప్పించడం పుణ్యమైనది. ఎంత అంటే కోట్లకొలది ఆవులని, మేకలని కసాయివాడి చెర నుండి విడిపించడంతో సమానమైనది. ఎందుకంటే ఈ బుద్ధిహీన మానవధారి ప్రాణి తప్పుడు గురువుల ద్వారా చెప్పబడిన శాస్త్ర విరుద్ధ సాధన వలన కాల్ యొక్క వలలో బంధించి ఉండి ఎనభైనాలుగు లక్షల యోనిల యందు ఎన్ని కష్టాలని, దు:ఖాలను అనుభవిస్తాడో ఎవరికి తెలియదు. ఎప్పుడైతే ఈ జీవాత్మ కవిర్దేవ్ (కబీర్ సాహెబ్) గారి శరణులోకి పూర్తి/ పూర్ణ గురువు ద్వారా వస్తుందో, నామంతో కలిసి పోతుందో, ఇక దానికి జన్మ మరియు మృత్యువు అను కష్టం ఎల్లప్పటికి

సమాప్తం అయి పోతుంది మరియు సతలోకంలో వాస్తవిక పరమ శాంతిని పొందుతుంది.

ఇక్కడ ఒక ప్రశ్న ఉత్పన్నం అవుతుంది నేడు గురువులు ఎక్కువలో ఎక్కువ శిష్యులని తయారుచేసుకుని తమ యోగ్యత పత్రాన్ని చూపిస్తారు అనగా ప్రతి ఒక్కరు నాలుగు కథలని నేర్చుకుంటారు మరియు అంటారు మేము కూడా నామంను ఇస్తాను అని మరియు అమాయకపు ఆత్మలని కాల్ చెరసాలలో పడవేస్తాడు. ఎందుకంటే పవిత్ర శాస్త్రంలకి విరుద్దంగా నామ ఉపదేశం ఇచ్చువారు మరియు జపించువారు అంతయు నిశ్చితంగా నరకంలో అధకారులౌతారు. కాళ్లు పైకి తల క్రిందుగా ఉండేట్లు వ్రేలాడదీయబడుతారు. ఇవన్ని ప్రవచనాలు శాస్త్రాలే (గీతా, వేదాలు, మరయు సర్వగ్రంథాలు) చెబుతాయి. ఈ ప్రవచనాలు సిద్ధికరించడానికి ఒక సంక్షిప్త కథ చెబుతాను.

ఒక సమయం అప్పటి విషయం, అందరికి తెలిసిపోయింది ఏమిటంటే రాజా పరిక్షిత్తును ఏడవ రోజున పాము కాటువేస్తుంది మరియు ఆయన మృత్యువు అవుతుందని. ఈ మాట తెలియగానే అందరూ ఆలోచించారు ఈ ఏడు రోజులు రాజా పరిక్షిత్‌కి భాగవతం యొక్క కథలు వినిపించాలి అని దానివలన రాజుగారికి ఇక్కడి మోహం తొలిగిపోతుంది మరియు ప్రభువు చింతనలో మునిగిపోతారు. ఎందుకంటే చనిపోవు సమయంలో ఎవరి భావన ఎలా ఉంటుందో వారు వారినే పొందుతారు. అందరు అన్నారు అతి ఉత్తమైన ఆలోచన అని. కానీ ఇప్పుడు కథ ఎవరు చెప్పాలి? ఈ ప్రశ్నపైనే ప్రశ్నవాచక చిహ్నం పడింది. ఈ సమయంలో అక్కడ ఉపస్థితులైన అందరూ మహర్షులు, ఇంకా శ్రీమద్ భాగవత్ సుధాసాగర్‌గారి రచయిత మహర్షి వేదవ్యాసుడు కూడా తనని తాను కథని వినిపించు యోగ్యుడిగా భావించలేదు. ఎందుకంటే వారికి తెలుసు వారియందు ఆ సమర్థత లేదు అని. ఒక జీవుడి జీవనాన్ని నష్టపరిచి పాపంలో ఎందుకు భాగస్తుడు అవ్వాలి? మళ్లీ ఏడవ రోజున ఖచ్చితంగా పరిణామం కనిపించాలి. ఇందువలన ఏడు రోజులు కథని వినిపించుటకు ఎవరికి ధైర్యం చాలలేదు మరియు అందరికి వారి వారి క్షమత గురించి తెలుసు. స్వర్గం నుండి సుఖదేవ్‌గారిని భాగవత కథ వినిపించడానికి పిలిపించిరి మరియు అప్పుడు రాజా పరిక్షిత్‌గారి మోహం ఇక్కడి నుండి తొలిగిపోయింది మరియు స్వర్గం ప్రాప్తించబడింది. స్వర్గంలో సుఖాన్ని అనుభవించిన తరువాత తిరిగి నరకంలోకి మరియు మరల ఎనభైనాలుగు లక్షల జీవుల యోని చక్రంలోకి వస్తారు. ఇది ఇక్కడి హార్డ్ అండ్ ఫాస్ట్ నియమం అనగా శాశ్వత నియమం. ఈ ఉపలబ్ధి (లాభం) కూడా మూడు లోకాల పూర్ణ గురువు లేకుండా ప్రాప్తించబడదు.

సరిగ్గా ఈ విధంగానే ఏదైన ప్రదేశానికి ప్రధానమంత్రి వస్తున్నారంటే వారు రావడానికి ముందు ఇద్దరు ముగ్గురు చాలా మంచి వక్తలు/ గాయకుడు మరియు తబలా బైండు వాయించు వారు ఉంటారు. వారు చాలా సంగీతభరితమైన మరయు ఆకర్షక ధ్వనితో దర్శకులని ప్రభావితం చేస్తారు. కానీ వారు ఏ విషయం/ మాటలు చెప్పుచున్నారో అందులోంచి ఒక మాట కూడా నేరవేరడం జరుగదు. కానీ ఎప్పుడైతే ప్రధానమంత్రి వస్తారో వారు తక్కువలో తక్కువగా రెండు మాటలు చెబుతారు,ఏమనంటే ఆగ్రాలో ఇంటర్‌నేషనల్ కాలేజి

కట్టండి, చండిఘడ్‌లో ఇంటర్‌నేషనల్ యూనివర్శిటి కట్టించండి..మొదలగునవి. కేవలం ఇంతయు చెప్పి పి.యమ్. సాహెబ్ వెళ్ళిపోతారు.వారు చెప్పగానే రెండవ రోజునుండె ఆ కార్యం ప్రారంభమవుతుంది.ఎందుకంటే వారి వచనంలో శక్తి ఉంది మరియు ఒకవేళ ఇదే మాట మీరు లేదా నాలాంటి సామాన్య వ్యక్తి చెబుతే మనది పెద్ద మూర్ఖత్వం అవుతుంది. ఎందుకంటే మన వచనంలో అంత శక్తి లేదు. కానీ ప్రధానమంత్రిగారికి ఇదంతయు సాధారణ విషయం.

ఈ నిజాలని ప్రమాణితం చేయడానికి కొన్ని కింద రాయబడిన వాణిలను తప్పక చదవండి మరియు లోతుగా ఆలోచించండి. అతి శీఘ్రంగా గురు మంత్రాన్ని పొందండి.

కబీర్, పండిత్ ఔర్ మశాలచి, దోనో సుఝై నాహి। ఔరో నే కరై చాందనా, ఆప్ అంధేరే మాహి ॥

కబీర్, కరణి తజ్ కథని కథై, అజ్ఞాని దిన్ రాత్ । కుకర్ జ్యోం భౌంకత్ ఫిరై, సుని సునాయి బాత్ ॥

గరీబ్, బిజక్ కి బాతా కహై, బిజక్ నాహి హాథ్ । పృథ్వి డోబన్ ఉతరే, కహై-కహై మిఠి బాత్ ॥

గరీబ్, బిజక్ కి బాతా కహై, బిజక్ నాహి పాస్ । ఔరో కో ప్రమోద్ హి, ఆపన్ చలే నిరాశ్ ॥

గరీబ్, కథని కే శురే ఘనే, కథై అటమ్బర్ జ్ఞాన్ । బాహర్ జ్వాబ్ ఆవై నహి, లిద్ కరై మైదాన్ ॥

కథ చెప్పుట మరియు నామ ఉపదేశం ఇచ్చుట పిల్లల ఆటలు కాదు. ఒక పుస్తకం సంచిలో వేసుకుని నేను కూడా కథ చెబుతాను, నడవండి నేను కూడా రామాయణం మార్గంను చెబుతాను, గీతా జ్ఞాన మార్గంను బోదిస్తాను, గ్రంథ సాహెబ్ మార్గాన్ని చెబుతాను అనగా సత్సంగం చేస్తాను. మరియు నామం కూడా ఇస్తాను మొదలగునవి. పూర్ణ సంత్‌కే కథ చెప్పు మరియు నామ ఉపదేశం ఇచ్చు అధికారం ఉంటుంది. ఆ కథ యొక్క ముగింపు ఆయనే ఇవ్వగలడు. ఎందుకంటే పూర్ణ సంత్ యొక్క శబ్దాలలో ఆ శక్తి ఉంటుంది. ఎలాఐతే సుఖదేవ్‌గారి శబ్దాలకు ఉండింది. ఉదహరణకి ఒకరు సత్సంగం చేసినారు అనుకుందాం అందులో ఒక మామిడికాయ మహిమని చెప్పినారు. మామిడికాయ చాలా తియ్యగా ఉంటుంది, ఫలాలకి రాజు, అది పసుపు రంగులో ఉంటుంది ...మొదలగునవి అని మరియు ఒకవేళ ఒకరు వచ్చి అడిగారు ఒక మామిడికాయ ఇవ్వండి అని. అప్పుడు సత్సంగం చేయు వ్యక్తి తన వద్ద మామిడికాయ లేదు అంటాడు. తరువాత అతడు అడుగుతాడు అది ఎక్కడ లభిస్తుంది అని? దానికి ప్రతిగా సమాధానం తెలియదు అని అంటునే, మామిడికాయ నిరాకారం కలది, అది కనిపించదు అని అంటాడు. తరువాత అడిగిన వ్యక్తి అనసాగాడు అరే మూర్ఖులారా! మీకు మామిడికాయ గురించి తెలియదు మరియు అది ఎక్కడ దొరుకుతుందో తెలియదు, ఇంకా అంటున్నారు అది నిరాకారమైనది అని, అలాంటప్పుడు ఈ వ్యర్థమైన ఉపన్యాసాలు ఇస్తూ తిరుగుతున్నారు ఎందుకు? చెప్పుట యందు భావం ఏమిటంటే తత్వజ్ఞాన రహిత మరియు అధికారం లేకుండా కథ చెప్పువారు మరియు వారి ముఖంనుండి వినువారంతా నరకం యొక్క అధికారులౌతారు.

ఒకవేళ ఎవరైన వ్యక్తి తనకు తానుగా గురువుగా మారి శిష్యులని తయారుచేసుకుంటే అర్థం చేసుకోండి అతడు తన శిరస్సుపై భారాన్ని పెంచుకుంటున్నాడు అని. ఎందుకంటే

పరమేశ్వరుడి నియమం ఉంది ఎప్పటివరకు శిష్యుడు దాటలేడో అప్పటివరకు గురువుకి పదే పదే జన్మలు ఎత్తాల్సి ఉంటుంది. పూర్ణ గురువు అసంపూర్ణ శిష్యుల నుండి విడుదలని పొందుటకు ఇలాంటి లీల చేస్తూ ఉంటారు. దీనివలన అజ్ఞాని శిష్యులకి గురువుల యెడల ద్వేషం కలుగుతుంది. కబీర్ సాహెబ్ ఎప్పుడైతే కాశీలో ప్రకటితులై ఉండినారో, ఆ సమయంలో కబీర్ సాహెచ్‌గారికి అరవైనాలుగు లక్షల శిష్యులు తయారైరి. వారిని పరీక్షించడం కోసం కబీర్ సాహెబ్ కాశీ నగరంలోని ఒక ప్రఖ్యాత వేశ్యకి సత్సంగ జ్ఞానం తెలియజేయుటకు ఆమె ఇంటికి వెళ్ళడం ప్రారంభించిరి. ఇదంత చూసి మరియు విని శిష్యుల హృదయాలలో గురువు యెడల అసహ్యం పుట్టింది. అందరికి తన గురువు యెడల విశ్వాసం విరిగిపోయింది. కేవలం ఇద్దరిని విడిచిపెట్టి తక్కినవారంతా గురు విహీనులైరి.

సతగురు గరీబ్‌దాస్‌జీ మహరాజ్ గారి వాణి యందు గల ప్రమాణం:-

గరీబ్, చండాలి కే చౌక్ మే, సతగురు బైఠే జాయ్। చౌసఠ్ లాఖ్ గారత్ గయే, దో రహే సతగురు పాయ్॥
భడవా భడవా సబ్ కహై, జానత్ నాహి ఖోజ్। దాస్ గరీబ్ కబీర్ కరమ్ సే, బాంటత్ సిర్ కా బోఝ్॥

మేము మీతో ఇదే ప్రార్థన చేస్తున్నాము. ఆలోచించి నిర్ణయం తీసుకోండి.

సామవేదం శ్లోకం 822లో చెప్పబడినది జీవుడి ముక్తి మూడు నామాలతో అవుతుంది. మొదటిది ఓం, రెండవది సతనామం (తత్) మరియు మూడవది సారనామం (సత్). గీతా కూడా ఇదే ప్రమాణంను ఇస్తుంది. ఓం-తత్-సత్ అని. శ్రీ గురుగ్రంథ సాహెబ్ కూడ ఈ సతనామంను జపించు సంకేతం ఇస్తున్నది. సతనామ్-సతనామ్ ఇది జపించు నామం కాదు. ఇది ఆ నామం వైపు సంకేతం ఇస్తుంది ఏదైతే ఒక సత్యమైన నామంను సూచిస్తుంది. ఈ విధంగానే సారనామం కూడా. కేవలం ఓం మంత్రం వలన ఏమియు లాభం ఉండదు. ఈ మూడు నామాలు మరియు నామం ఇచ్చు ఆజ్ఞ నాకు (సంత రామపాల్‌జీ) మా గురుదేవులు స్వామి రామదేవానందజీ మహరాజ్ ద్వారా ఇవ్వబడినది. ఏదైతే కబీర్ సాహెబ్ ద్వారా తరతరాలనుండి నడుస్తూ వస్తున్నది. మొదట మీరు సత్సంగాన్ని వినండి, సేవ చేయండి దానివలన మీ భక్తిరూపి పొలం చదునుచేయబడుతుంది.

కబీర్, మనుష్ జన్మ పాయ్ కర్, నహి రటైం హరి నామ్। జైసే కుంఆ జల్ బీనా, ఖుదవాయ కిస్ కామ్॥
కబీర్, ఎక్ హరి కే నామ్ బీనా, యే రాజా ఋషభ్ హెూ। మాటి ఢోవై కుమ్హార్ కి, ఘాస్ న డాలేకో॥

దీని తరువాత చదునుచేయబడిన పొలంలో విత్తన్నాని విత్తాలి. శాస్త్రాల (కబీర్ సాహెబ్‌గారి వాణి, వేదాలు, గీతా,పురాణం, ఖురణ్, ధర్మదాస్ సాహెబ్ మొదలగు సంత్‌ల వాణి) అధ్యయనంతో ముక్తి అవదు. ఈ అన్ని శాస్త్రాల సారం ఒక్కటే. పూర్ణ ముక్తి కోసం పూర్ణ పరమాత్మ కబీర్ సాహెబ్‌గారి ప్రతినిధి సంత్ (ఎవరికైతే వారి గురువుద్వారా నామదానం చేయు ఆజ్ఞ కూడ ఉంటుంది) ద్వారా నామ ఉపదేశాన్ని తీసుకుని ఆత్మ కళ్యాణం చేయించుకోవాలి. ఒకవేళ నామంను తీసుకోనలేదో-

నామ్ బీనా సునా నగర్, పడయా సకల్ మే శార్ ।
లుట్ న లుటి బందగి, హెూ గయా హంసా భోర్ ॥
అదలి ఆరతి అదల్ అజుని, నామ్ బీనా హై కాయా సుని ।

ఝురి కాయా ఖాల్ లుహారా, ఇంగలా పింగలా సుషమన్ ద్వారా ॥
కృతఘ్ను భులే నర లోయి, జా ఘుట్ నిశ్చయ్ నామ న హెూఈ ।
సో నర కిట పతంగ భూజంగా, చౌరాసి మేం ధర్ హై అంగా ॥

**ఒకవేళ విత్తనాన్ని (నామంను) నాటలేదు, అలంటప్పుడు ఆత్మ రూపి పొలం మీరు దుక్కి దున్ని తయారుచేసినది వ్యర్థం అవుతుంది. చెప్పుటయందు తాత్పర్యం ఏమిటంటే గ్రంథాల ద్వారా మీరు జ్ఞానాన్ని పొందడం అనేది ఆవశ్యకమైనదే. కానీ పూర్ణ గురు ద్వారా నామ ఉపదేశం తీసుకోవడం అనగా విత్తనాన్ని నాటడం కూడ అత్యంత ఆవశ్యకమైనది. నామం కూడ అదే జపించాలి, ఏదైతే గురు నానక్ సాహెబ్‌గారు జపించినారో, గరీబ్‌దాస్ సాహెబ్‌గారు జపించినారో, ధర్మదాస్ సాహెబ్...మొదలగు సంత్‌లు జపించినది. ఇది కాకుండా మిగత నామంలతో జీవుడి ముక్తి జరుగదు.**

**ఇందువలన మీరు అందరు నామ ఉపదేశాన్ని తీసుకుని మీ భక్తి రూపి సంపాదనని పొదుపు చేయడం ప్రారంభించాలి. మిగిలిన వారందరికి కూడ చెప్పాలి. ఎంత తొందరగా వీలైతే అంత తొందరగా. ఎందుకంటే ఏవరికి తెలుసు ఏప్పుడు ఎవరికి ఈ శరీరాన్ని విడిచి వెళ్ళు సమయం వస్తుంది అని. గురు నానక్ దేవ్‌జీ కూడా అంటారు:-**

నా జానే యే కాల్ కి కర్ డార్రై, కిస్ విధి డల్ జా పాసా వే ।
జిన్హాదే సిర్ తే మౌత్ ఖుడగది, ఉన్హాను కేడా హాంసా వే ॥

**కబీర్ సాహెబ్ అంటారు :-**

కబీర్, శ్వాంస్-శ్వాంస్ మే నామ జపో, వ్యర్థా శ్వాంస మత్ ఖోయ్ ।
న జానే ఇస్ శ్వాంస్ కా, ఆవన్ హెూ కే నా హెూయ్ ॥
సతగురు సోఈ జో సారనామ దృడావై, ఔర్ గురు కోయి కామ న ఆవై ।
“ సారనామ బీన్ పురుష్ (భగవాన్) ద్రోహి”

**అర్థం ఏమిటంటే ఏ గురువైతే సారనామం మరియు సారశబ్దం ఇవ్వడు లేదా అతడికి తన గురువు ద్వారా నామదానం ఇచ్చు అధికారం (ఆజ్ఞ) ఉండదో,అనగా శాస్త్రాల అధ్యయనంతో ఒకవేళ ఎవరైన తనకు నచ్చినట్లు గురువు ఈ నామాలని కనుక ఇచ్చినట్లయితే ఆ గురువు తనతోపాటు అతడి శిష్యులని కూడ నరకంలో పడేస్తాడు. ఆ గురువు భగవంతుడికి శత్రువు అవుతాడు. విద్రోహి అవుతాడు. అతడు భగవంతుడి న్యాయాలయంలో తలక్రిందులుగా వ్రేలాడదీయబడుతాడు.**

**ఇప్పుడు భక్త సమాజంలో నకలి గురువుల (సంత్) ద్వారా ఒక తప్పుడు ధారణ వ్యాపించి ఉంది. ఏమిటంటే ఒకసారి గురువు ధారణ చేసుకున్న తరువాత రెండవ గురువుకి మారకూడదు. కొంచం ఆలోచించి చూడండి. గురువు మన జన్మ-మృత్యువు రూపి రోగాన్ని మటుమాయం చేసే వైద్యుడు. ఒకవేళ ఒక వైద్యుడితో మన రోగం బాగుకాకపోతే మనం వేరొక మంచి వైద్యుడి వద్దకి వెళ్ళుతాము. దానివలన మన ప్రాణాంతకమైన రోగం బాగు అవుతుందని. ఎలా అంటే ధర్మదాస్ సాహెబ్‌గారి మొదటి గురువు శ్రీ రూప్‌దాస్‌జీగారు. కానీ ఎప్పుడైతే**

ధర్మదాస్‌గారికి తెలిసిందో ఈ గురువు పూర్ణ ముక్తి ధాతా కాదు అని ఆయన తక్షణమే త్యాగం చేసి పూర్ణ బ్రహ్మ పరమేశ్వర్ సతపురుష్ కబీర్ సాహెబ్‌ని తన గురువుగా చేసుకునిరి మరియు పూర్ణ మోక్షంను సతలోకంను పొందిరి. సరిగ్గా ఈ విధంగానే అసంపూర్ణ గురువులని తక్షణమే విడిచి పెట్టాలి.

"ఝుఠే గురు కే పక్ష్ కో, తజత్ న కిజై వారి"

**(గురు మరియు నామ మహిమా యొక్క వాణి)**

గరీబ్,బిన్ ఉపదేశ్ అచంభ్ హై, క్యో జీవత్ హై ప్రాణ్। బీన్ భక్తి కహాం ఠౌర్ హై, నర్ నాహి పాషాణ్ ॥1॥
గరీబ్, ఎక్ హరి కే నామ బీనా, నారి కుతియా హెూ। గలి గలి భౌంకత్ ఫిరై, టుక్ నా డాలై కో॥2॥
గరీబ్, బిబి పడదే రహై థి, డయోఢి లగతి బార్। గాత్ ఉఘాడే ఫిరతి హై, బన్ కుతియా బాజార్॥3॥
గరీబ్, నకబేసర్ నక సే బని, పహరత్ హార్ హమేల్। సుందరి సే సునహి (కుతియా) బని, సుని సాహిబ్ కే ఖేల్॥4॥
కబీర్, హరి కే నామ బీనా, రాజా ఋష్భ్ హెూయ్। మాటి లదై కుమ్హార్ కై, ఘాస్ నా డాలే కోయ్॥5॥
కబీర్, రామ్ కృష్ణ సే కౌన్ బడా, ఉన్హో భి గురు కిన్హ। తిన్ లోక్ కే వే ధని, గురు ఆగే ఆధిన్॥6॥
కబీర్, గర్భ యోగేశ్వర్ గురు బీనా, లాగా హరి కి సేవ। కహై కబీర్ స్వర్గ్ సే, ఫేర్ దియా సుఖదేవ్॥7॥
కబీర్, రాజా జనక్ సే నామ లే, కిన్హి హరి కి సేవ (పూజా)। కహై కబీర్ వైకుంఠ మే, ఉల్ట మిలే సుఖదేవ॥8॥
కబీర్, సతగురు కే ఉపదేశ్ కా, లాయా ఎక్ విచార్। జై సతగురు మిలతే నహి, జాతా నరక ద్వార్॥9॥
కబీర్, నరక ద్వార్ మే దూత సబ్, కరతే ఖైంచా తాన్। ఉనతేంకబహు నా ఛుటతా, ఫిర్ ఫిరతా చారో ఖాన్॥10॥
కబీర్, చార్ ఖాని మే భ్రమతా, కబహు నా లగతా పార్। సో ఫేరా సబ్ మిట్ గయా, సతగురు కే ఉపకార్॥11॥
కబీర్, సాత సముద్ర మసి కరు, లేఖని కరుం బనరాయ్। ధరతి కా కాగద్ కరు, గురు గుణ లిఖా న జాయ్॥12॥
కబీర్, గురు బడే గోవింద సే, మన మే దేఖ్ విచార్। హరి సుమరే సో రహ్ గయే, గురు భజే హుయే పార్॥13॥
కబీర్, గురు గోవింద్ దోఊ ఖడే, కాకే లాగు పాయ్। బలిహారి గురు ఆపనే, జిన్ గోవింద దియా మిలాయ్॥14॥
కబీర్, హరి కే రుఠతా, గురుకి శరణ మే జాయ్। కబీర్ గురు జై రుఠజాం, హరి నహి హెూత్ సహాయ్॥15॥

## నామం ఏ రాముడిది జపించాలి ?

**గీతా అధ్యాయం 15 శ్లోకం 16**

**ద్వౌ, ఇమౌ, పురుషౌ, లోకే, క్షర:, చ, అక్షర:, ఎవ్, చ, క్షర:, సర్వాణి, భూతాని, కూటస్థ:, అక్షర:, ఉచ్యతే ॥**

**అనువాదం:- ఈ సంసారంలో రెండు విధాలైన భగవంతులు ఉన్నారు. నాశనం కలవారు మరియు అవినాశి. ఈ సంపూర్ణ భూత ప్రాణుల శరీరాలైతే నాశనం కలవి మరియు జీవాత్మని అవినాశి అని అంటారు. (అనగా శరీరం నాశనం కలది కానీ ఆత్మ నాశనం కాదు.)**

**గీతా అధ్యాయం 15 శ్లోకం 17**

**ఉతమ:, పురుష:, తూ, అన్య:, పరమాత్మా, ఇతి, ఉదాహృత:, య:, లోకత్రయమ్ ఆవిశ్య, బిభర్తి, అవ్యయ:, ఈశ్వర: ॥**

**అనువాదం:- ఉత్తమ భగవానుడు వేరొకరు ఉన్నారు. వారు మూడు లోకాలలో ప్రవేశించి అందరి ధారణ-పోషణ చేస్తాడు. కేవలం ఈ భగవంతుడిని అవినాశి**

**పరమేశ్వర్ పరమాత్మ అని సంబోధిస్తారు.**

కబీర్, అక్షర్ పురుష్ ఎక్ పేడ్ హై, నిరంజన్ వాకి డార్ ।
త్రిదేవా (బ్రహ్మ, విష్ణు, శివ) శాఖా భయే, పాత్ భయా సంసార్॥
కబీర్, తిన్ దేవకో సబ్ కోయి ధ్యావై, చౌథా దేవకా మరమ్ న పావై ।
చౌథా ఛాడి పంచమ్ ధ్యావై, కహై కబీర్ సో హమరే ఆవై ॥
కబీర్, తిన్ గుణన్ కి భక్తి మే, భులి పరయె సంసార్ ।
కహై కబీర్ నిజ నామ బీన్, కైసే ఉతరై పార్ ॥
కబీర్, ఓంకార నామ బ్రహ్మ (కాల్) కా, యహ్ కర్తా మతి జాని ।
సాంచా శబ్ద కబీర్ కా, పరదా మాహి పహిచాని ॥
కబీర్, తిన్ లోక్ సబ్ రామ జపత్ హై, జాన్ ముక్తి కో ధామ్ ।
రామచంద్ర వశిష్ఠ గురు కియా, తిన్ కహి సునాయో నామ్ ॥
కబీర్, రామ కృష్ణ అవతార్ హై, ఇనకా నాహిం సంసార్ ।
జిన్ సాహబ్ సంసార్ కియా, సో కినహు న జనమ్యాం నారి ॥
కబీర్, చార్ భుజాకే భజనమే, భులి పరే సబ్ సంత్ ।
కబీరా సుమిరై తాసు కో, జాకే భుజా అనంత్ ॥
కబీర్, వాశిష్ట ముని సే తత్వేతా జ్ఞాని, శోధ కర్ లగ్న ధరై ।
సీతా హరణ్ మరణ్ దశరథ్ కో, బన్ బన్ రామ్ ఫిరై ॥
కబీర్, సముద్ర పాటి లంకా గయే, సీతా కో భరతార్ ।
తాహి అగస్త ముని పియ్ గయో, ఇనమే కో కరతార్ ॥
కబీర్, గోవర్ధన్ కృష్ణ జీ ఉఠాయా, ద్రోణగిరి హనుమంత్ ।
శేష్ నాగ్ సబ్ సృష్టి ఉఠాఈ, ఇనమే కో భగవంత్ ॥
కబీర్, దుర్వాసా కోపే తహాం, సమఝ్ న ఆయి నిచ్ ।
ఛప్పన్ కోటి యాదవ్ కటే, మచి రుధిర్ కి కిచ్ ॥
కబీర్, కాటే బంధన్ విపతి మే, కఠిన్ కియా సంగ్రామ్ ।
చిన్హోం రే నర్ ప్రాణియాం, గరుడ్ బడో కి రామ్ ॥
కబీర్, కహ్ కబీర్ చిత్ చెతహు, శబ్ద కరౌ నిరూవార్ ।
శ్రీ రామచంద్ర కో కర్తా కహత్ హై, భులి పరయో సంసార్ ॥
కబీర్, జిన్ రామ కృష్ణ నిరంజన్ కియా, సో తో కరతా న్యార్ ।
అంధా జ్ఞాన్ న బుఝయి, కహై కబీర్ బిచార్ ॥
కబీర్, తిన్ గుణన్ (బ్రహ్మ, విష్ణు, శివ్) కి భక్తి మే, భుల్ పడయో సంసార్ ।
కహై కబీర్ నిజ నామ బీనా, కైసే ఉతరో పార్ ॥

**॥ శబ్ద ॥ (సంత్ రామపాల్ దాస్ జీ మహారాజ్ ద్వారా రచించిన)**

యుద్ధ జిత్ కర పాండవ, ఖుశి హుయే అపార్ । ఇంద్రప్రస్థ కి గద్ది పర్, యుధిష్టర్ కి సరకార్ ॥1॥
ఏక్ దిన్ అర్జున్ పుఛతా, సున్ కృష్ణ భగవాన్ । ఎక్ బార్ ఫిర్ సునా దియో, వో నిర్మల్ గీతా జ్ఞాన్ ॥2॥

ఘమాశాన్ యుద్ధ కే కారణ్, భూల్ పడి హై మోహ్। జోకా త్యో కహనా భగవన్, తనిక్ న అన్తర్ హోయ్॥3॥
ఋషి ముని ఔర్ దేవతా, సబకో రహే తుమ్ ఖాయ్। ఇనకో భి నహి ఛోడా ఆపనే, రహే తుమ్హారా హి గుణ్ గాయ్॥4॥
కృష్ణ బోలే అర్జున్ సే, యహ్ గలతి క్యోం కిన్హ। ఐసే నిర్మల్ జ్ఞాన్ కో భూల్ గయా బుద్ధిహీన్ ॥5॥
అబ్ ముఝే భి కుఛ్ యాద్ నహి, భూల్ పడి నిదాన్। జ్యో కా త్యో ఉస్ గీతా కా మై నహి కర్ సకతా గుణగాన్॥6॥
స్వయం శ్రీ కృష్ణ కో యాద్ నహి ఔర్ అర్జున్ కో ధమకావే బుద్ధి కాల్ కే హాథ్ హై, చాహే త్రిలోకి నాథ్ కహలావే ॥7॥
జ్ఞాన హీన్ ప్రచారకా, జ్ఞాన కథేం దిన్ రాత్ । జో సర్వ కో ఖానేవాలా, కహేం ఉసి కి బాత్ ॥8॥
సబ్ కహే భగవాన్ కృపాలు హై, కృపా కరేం దయాల్ । జిసకి సబ్ పూజా కరేం వహ్ స్వయం కహై మై కాల్ ॥9॥
మారై ఖావై సబ్ కో, వహ్ కైసా కృపాల్ । కుత్తే గధే సుఅర్ బనావై హై, ఫిర్ భి దిన్ దయాల్ ॥10॥
బాయిబల్ వేద కురన్ హై, జైసే చాంద్ ప్రకాష్ । సురజ్ జ్ఞాన కబీర్ కా, కరై తిమర్ కా నాశ్ ॥11॥
రామపాల్ సాచి కహై, కరో వివేక్ విచార్ । సతనామ్ వ సారనామ్, యహి మంత్ర హై సార్ ॥12 ॥
కబీర్ హమారా రామ హై, వో హై దిన్ దయాల్। సంకట మోచన కష్ట హరణ్, గుణ్ గావై రామపాల్ ॥13॥

**॥ శబ్ద ॥ (సంత్ రామపాల్ దాస్ జీ మహారాజ్ ద్వారా రచించిన)**

బ్రహ్మ విష్ణు శివ, హై తిన్ లోక్ ప్రధాన్ । అష్టంగి ఇనకి మాతా హై, ఔర్ పితా కాల్ భగవాన్ ॥1॥
ఏక్ లాఖ్ కో కాల్, నిత్ ఖావై సినా తాణ్ । బ్రహ్మ బనావై విష్ణు పాలై, శివ కర దే కళ్యాణ్ ॥2॥
అర్జున్ దర్ కే పుఛతా హై, యహ్ కౌన్ రూప భగవాన్। కహై నిరంజన్ మై కాల్ హు సబకో ఆయా ఖాన్ ॥3 ॥
బ్రహ్మ నామ ఇసి కా హై, వేద కరేం గుణగాన్ । జన్మ మరణ్ చౌరాసి, యహ్ ఇసకా సంవిదాన్ ॥4॥
చార్ రామ కి భక్తి మే, లగ్ రహా సంసార్। పాంచవే రామ కా జ్ఞాన్ నహి, జో పార్ ఉతారనహార్ ॥5॥
బ్రహ్మ విష్ణు శివ తినో గుణ హై, దుసరా ప్రకృతి కా జాల్। లాఖ్ జీవ్ నిత్ భక్షణ్ కరే రామ తిసరా కాల్ ॥6॥
అక్షర్ పురుష్ హై రామ చౌథా, జైసే చంద్రమా జాన్। పాంచవా రామ కబీర్ హై, జైసే ఉదయ్ హుఆ భాన్ ॥7॥
రామదేవానన్ద గురు జీ, కర్ గయే నజర్ నిహాల్। సతనామ కా దియా ఖజానా, బరతై రామపాల్ ॥8॥

## నామం(దీక్షా)తీసుకును వ్యక్తులు తెలుసుకోవల్సిన ఆవశ్యక విషయాలు

**1. పూర్ణ గురువు యొక్క గుర్తింపు :- నేడు కలియుగంలో భక్త సమాజం ఎదుట పూర్ణ గురువుని గుర్తుపట్టుట అనునది మిక్కిలి చిక్కుముడిగల ప్రశ్నగా తయారై ఉంది. కానీ దీనికి చాలా చిన్న మరియు సాధారణమైన జవాబు ఉంది. ఏమిటంటే ఏ గురువు శాస్త్రాల ఆధారంగా భక్తి చేస్తారు మరియు తన అనుచరులు అనగా శిష్యుల ద్వారా చేయిస్తారో ఆయనే పూర్ణ సంత్ అవుతాడు. ఎందుకంటే మన ధార్మిక గ్రంథాలు- కబీర్ సాహెబ్ వాణి, నానక్ సాహెబ్ వాణి, సంత్ గరీబ్‌దాస్‌జీ మహరాజ్ గారి వాణి, సంత్ ధర్మదాస్‌జీ సాహెబ్‌గారి వాణి, వేదాలు, గీతా, పురాణాలు, ఖురాన్, పవిత్ర బైబిల్ మొదలగునవి. భక్తి మార్గం యొక్క సంవిధానమును బోదిస్తాయి. ఏ సంత్ కూడా శాస్త్రాల అనుసారంగా భక్తి సాధనని చెప్పి, భక్త సమాజానికి మార్గ నిర్దేశం చేస్తారో ఆయనే పూర్ణ సంత్ అవుతాడు. లేదంటే అతడు భక్త సమాజం యొక్క చెడ్డ శత్రువు (దుర్మార్గుడు) అవుతాడు. అతడు శాస్త్రాలకి విరుద్ధమైన సాధన చేయిస్తాడు. ఈ అమూల్యమైన మానవ జన్మతో ఆటలు ఆడుచున్నాడు. ఇలాంటి గురువు లేదా సంత్‌ని భగవంతుడి న్యాయాలయంలో, ఘోర నరకంలో తలకిందులుగా (వ్యతిరేకంగా) వ్రేలాడదీయబడుతాడు.**

ఉదహరణకి ఎవరైన ఉపాధ్యాయుడు విషయసూచి (సెలబస్) కి అనుగుణంగా కాకుండా వేరే శిక్షణని ఇస్తే అతడు ఆ విద్యార్థులకి శత్రువు అవుతాడు.

**గీతా అధ్యాయం 7 శ్లోకం 15**

న, మామ్, దుష్కృతిన్:, మూఢా:, ప్రపద్యన్తే, నరాధమా:,
మాయయా, అపహృతజ్ఞానా:, ఆసురమ్, భావమ్, ఆశ్రితా:॥

**అనువాదం:-** మాయ ద్వారా ఎవరి జ్ఞానం హరింపబడి ఉందో అలాంటి అసూర స్వభావాన్ని ధారణ చేసియున్న మనుషులలో నీచమైన దూషిత కర్మచేయు మూర్ఖులు నన్ను భజించరు.అనగా వారు మూడు గుణాల (రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు, తమోగుణ-శివుడు) సాధనయే చేస్తారు.

**యజుర్వేద అధ్యాయం 40 శ్లోకం 10 (సంత రామపాల్‌దాస్‌జీ ద్వారా భాషా-భావం)**

అన్యదేవాహు: సమ్భవాదన్యదాహూర సంభవాత్,
ఇతి శుశ్రుమ్ ధీరాణాం యే నస్తద్విచ చక్షిరే ॥10॥

**అనువాదం:-** పరమాత్మా విషయంలో సామాన్యంగా నిరాకారుడు అనగా ఎప్పటికిని జన్మించనివాడుగా అంటారు. రెండవది ఆకారంలో అనగా జన్మించి అవతార రూపంలో వచ్చువాడు అని అంటారు. ఎవరైతే దృడమైన (టికాఊ) అనగా పూర్ణజ్ఞాని సరియైన విధంగా విపిపిస్తారు దానికి ఈ విధంగా సరిగ్గా ఆయనే సంపూర్ణంగా అనగా యధార్థ రూపంలో వేరు వేరు రూపాలలో ప్రత్యక్ష జ్ఞానాన్ని కలిగిస్తారు.

**గీతా అ. 4 శ్లోకం 34**

తత్, విద్ధి, ప్రణిపాతేన, పరిప్రశ్నేన, సేవయా,
ఉపదేక్ష్యన్తి, తే, జ్ఞానమ్, జ్ఞానిన:, తత్వదర్శిన: ॥

**అనువాదం:-** ఆయన్ని తెలుసుకో ఆ పూర్ణ పరమాత్మ యొక్క జ్ఞానం మరియు సమాధానం తెలిసిన సంత్‌లకి తెలిసి తెలియక దండవత్ (సాష్టాంగ ప్రణామం) చేయడం వలన,వారి సేవ చేయడం వలన మరియు కపటాన్ని విడిచిపెట్టి సరళంగా ప్రశ్నలు వేయడం వలన, వారు పరమాత్మ తత్వమును చాలా మంచిగా తెలిసిన జ్ఞాని మహాత్మ నీకు ఆ తత్వజ్ఞానం యొక్క ఉపదేశం ఇస్తారు.

**2. మత్తు పదార్థాల సేవనం నిషేధించడం :-** హుక్కా, మద్యం, బీరు, పొగాకు, బీడి, సిగరేట్, నశం పీల్చుట, గుట్కా, చిలుము, సుట్ట, అఫీమ్, గంజాయి మరియు మిగత మత్తు పదార్థాల సేవన నుండి దూరంగా ఉండాలి. మత్తు కలిగించు వస్తువులని ఎవరికి ఇవ్వకూడదు. బంది ఛోడ్ గరీబ్‌దాస్ మహారాజ్‌గారు ఈ అన్ని మత్తు కలిగించు వస్తువులను చాలా చెడ్డవిగా చెబుతూ తన వాణి యందు అంటారు:-

సురాపాన్ మద్య మాంసాహారి, గమన్ కరై భోగైం పర నారి । సతర జన్మ కటత్ హై శీశ్, సాక్షి సాహిబ్ హై జగదీశ్॥
పర ద్వారా స్త్రీ కా ఖోలై, సతర జన్మ అంధా హెూవై డోలై। మదిరా పివై కడవా పాని, సతర జన్మ శ్వాన్ కే జాని॥
గరీబ్, హుక్కా హరదమ్ పివతే, లాల్ మిలావై ధుర్। ఇసమైం సంశయ్ హై నహి, జన్మ పిఛలే సుర్ ॥1॥

గరీబ్, సో నారి జారి క్రై, సురా పాన్ సౌ బార్ । ఏక్ చిలమ్ హుక్కా భరై, డుబై కాలి ధార్ ॥2॥
గరీబ్, సుర్ గఊ కుం ఖాత్ హై, భక్తి బిహునేం రాడ్ । భాంగ్ తంబాఖు ఖా గయే, సో చాబత్ హై హాడ్ ॥3॥
గరీబ్, భాంగ్ తంబాఖు పివ్ హిం, సురా పాన్ సైం హెత్। గౌస్త మట్టి ఖాయ్ కర్, జంగలి బనేం ప్రేత్ ॥4॥
గరీబ్, పాన్ తంబాఖు చాబ్ హి, నాస్ నాక్ మే దేత్। సో తో ఇర్హానై గయే, జ్యుం భడభుజే కా రేత్ ॥5॥
గరీబ్, భాంగ్ తంబఖు పివ్ హి, గోస్త గలా కబాబ్। మోర్ మృగ్ కుం భఖత్ హై, దేంగే కహాం జవాబ్ ॥6॥

**3. తీర్థ స్థానాలపై వెళ్ళుట నిషేదం :-** ఎలాంటి వ్రతంను పాటించరాదు. ఏ తీర్థ యాత్ర చేయకూడదు. ఏ గంగా స్నానం..మొదలగునవి చేయరాదు. ఏలాంటి మిగత ధార్మిక స్థలాలపై స్నానం చేయడానికి మరియు దర్శనార్థం పోకుడదు. ఏ మందిరానికి మరియు ఇష్టమైన ధామానికి, ఈ మందిరంలో భగవంతుడున్నాడని, పూజా మరియు భక్తి భవంతో వెళ్లకూడదు. భగవానుడు పశువు కాదు కదా పూజారి మందిరంలో బందించి ఉంచడానికి. భగవానుడైతే కణ కణంలో వ్యాపించి ఉన్నాడు. ఈ అన్ని సాధనలు శాస్త్రాలకి విరుద్ధంగా ఉన్నవి.

కొంచెం ఆలోచన చేసి చూడండి ఈ అన్ని తీర్థ స్థలాలు, (జగన్నాథ మందిరం, బదిరినాథ్, హరిద్వార్, మక్కా-మదిన, అమర్‌నాథ్, వైష్ణోదేవి, బృందవన్, మథురా, బరసానా, అయోధ్యరామ్ మందిర్, కాశీ ధామం, ఛూడాని ధామం మొదలగు) మందిరాలు, మసీదులు, గురుద్వారం, చర్చి మరియు ఇష్టధామం మొదలగునవి ఏలాంటి స్థలాలు అంటే అక్కడ ఎవరో సంత్‌లు ఉండేవారు. వారు అక్కడ తన భక్తి సాధన చేసి తమ భక్తి రూపి ధనాన్ని (సంపాదనని) పొదుపు చేసి శరీరాన్ని విడిచిపెట్టి తమ ఇష్టదైవం యొక్క లోకానికి వెళ్ళిపోయిరి. దాని తరువాత ఆయన జ్ఞాపకార్థం, ప్రమాణం కోసం అక్కడ ఎవరో ఒకరు మందిరాన్ని, ఒకరు మసీదుని, ఒకరు గురుద్వారంను, ఒకరు చర్చిని లేదా ఒకరు ధర్మశాలని మొదలగునవి తయారుచేసిరి. ఎందుకంటే వారి జ్ఞాపకం ఉండిపోవాలని మరియు మనలాంటి తుచ్ఛ ప్రాణులకి ప్రమాణం లభించాలి ఏమనంటే మనం కూడ ఇలాంటి కర్మలే చేయాలి అని, ఏలాఐతే ఈ మహాన్ ఆత్మలు చేసినారు. ఈ అన్ని ధార్మిక స్థలాలు మనందరికి కూడ ఈ ప్రఖ్యాత సంత్‌లు ఎలాఐతే భక్తి సాధన చేసినారో అలానే మనం కూడ చేయాలి అను సందేశాన్ని ఇస్తాయి. దీనికోసం మీరు కూడ ఈ విధంగానే సాధన చేయు మరియు చెప్పు సంత్ గురించి వెదకండి మరియు తరువాత వారు ఎలా చెబుతారో అలా చేయండి. కానీ తరువాత ఈ స్థానాలలో పూజ ప్రారంభమయింది. అది మిక్కిలి వ్యర్థమైనది మరియు శాస్త్రాలకి విరుద్దమైనది.

ఈ అన్ని స్థానాలు ఎలా అనుకోవచ్చు అంటే ఉదహరణకి ఒక స్థానంలో ఒక మిఠాయి తయారుచేయువాడు ఒక భట్టిపెట్టి, జిలేబీ, లడ్డు, మొదలగునవి తయారుచేసి స్వయంగా తిని మరియు తన తోటి స్నేహితులకి తినిపించి వెళ్ళిపోయాడు. దాని తరువాత ఆ స్థానంపై మిఠాయి తయారుదారు లేడు మరియు మిఠాయి లేదు. అక్కడ కేవలం భట్టియే ఉంది. అది మనకి మిఠాయి తయారుచేయుట నేర్పించలేదు.మన పొట్టని నింపలేదు. ఇక ఎవరో ఒకరు వచ్చి రండి తమ్ములార్లా! మీకు ఆ భట్టిని చూపిస్తాను ఎక్కడైతే మిఠాయి

తయారుదారు మిఠాయి తయారుచేసినాడు. రండి నడుద్దాం. అక్కడికి వెళ్ళి ఆ భట్టిని చూసిరి మరియు ఏడు చుట్లు కూడ తిరిగిరి. వాళ్లకి మిఠాయి దొరికినదా? వాళ్లకి మిఠాయి తయారుచేయు విధనం చెప్పు మిఠాయి తయారుదారుడు లభించినాడా? లభించలేదు. ఇందుకోసం మనకి అలాంటి మిఠాయి తయారుదారుని కోసం వెదకాలి, ఏవరైతే అందరి కంటే ముందు మీకు మిఠాయి తినిపించగలడు మరియు తయారుచేయు విధానంను చెప్పగలడు. తరువాత కేవలం వారు చెప్పిందే చేయాలి,వేరేది కాదు.

సరిగ్గా ఈ విధంగా తీర్థ స్థానాల పూజా చేయకుండ అలాంటి సంత్‌లని గురించి వెదకండి, ఎవరైతే శాస్త్రానుసారంగా పూర్ణ పరమాత్మ కబీర్ సాహెబ్ గారి భక్తి చేస్తారు మరియు చెబుతారు. తరువాత వారు ఎలా చెబుతారో కేవలం అలానే చెయ్యండి, మన మనస్సుకి నచ్చినట్లు చేయవద్దు.

సామవేదం సంఖ్య 1400 ఉతార్చిక అ. 12 ఖండ 3 శ్లోకం 5 (సంత్ రామపాల్‌దాస్‌జీ ద్వారా భాషా-భావం)

భద్రా వస్త్రా సమన్యా2వసానో మహాన్ కవిర్నివచనాని శంసన్ ।
ఆ వచ్యస్వ చమ్వో: పుయ్‌మానో విచక్షణో జాగృవిర్దేవవితౌ ॥5॥

అర్థం :- తెలివిగల వ్యక్తులు తన వచనాల ద్వారా పూర్ణ పరమాత్మ (పూర్ణ బ్రహ్మ) యొక్క పూజా యొక్క సత్యమార్గ దర్శనం చేయక అమృతానికి బదులుగా మిగతా ఉ పాసనా (భూత పూజా, పితర్ పూజా, శ్రాద్ధం తీయుట, మూడు గుణాల పూజా (రజోగుణం-బ్రహ్మ, సతగుణం-విష్ణు, తమోగుణం-శివుడు) బ్రహ్మ-కాల్ యొక్క పూజా, మందిర్-మసీదు-గురుద్వారాలు-చర్చి మరియు తీర్థాలు- ఉపవాసం వరకు గల ఉపాసనా) రూపి పుండు లేదా గాయం నుండి వచ్చు చీముని ఆదరణతో పాటు ఆచరింప చేయిస్తుంటారు. అతడికి పరమసుఖదాయక పూర్ణ బ్రహ్మ కబీర్ శశరీరంగా సాధారణ వేషంలో (వస్త్రం యొక్క అర్థం వేషభూషా-సంత్ భాషలో దీనిని చోలా అని కూడ అంటారు. ఎవరైన సంత్ శరీరాన్ని త్యాగం చేసినట్లయితే అంటారు మహాత్మ 'చోలా'ని విడిచి వెళ్లారని) సత్యలోకంలోని శరీరానికి సమానంగా రెండవ తేజపుంజ శరీరాన్ని ధరించి సామాన్య వ్యక్తిలాగా జీవనాన్ని జీవించి, కొన్ని రోజులు సంసారంలో ఉండి తన శబ్ద-సాఖీల (దోహాలు, కవితలు, జానపదులు వంటివి) ద్వారా సత్యజ్ఞానంను వర్ణించి పూర్ణ పరమాత్మ యొక్క దాగి ఉన్న వాస్తవిక సత్యజ్ఞానంను మరియు భక్తిని జాగృతం చేస్తారు.

గీతా అధ్యాయం 16 శ్లోకం 23

యః, శాస్త్రవిధిమ్, ఉత్సృజ్య, వర్తతే, కామకారతః, న, సః
సిద్ధిమ్, అవాప్నోతి, న, సుఖమ్, న, పరామ్, గతిమ్ ॥

అనువాదం:- ఏ పురుషుడైతే శాస్త్రవిధిని త్యాగం చేసి తన ఇచ్చానుసారం మనసుకు వచ్చిన ఆచరణ చేస్తాడో అతడు సిద్ధిని పొందలేడు, పరమగతిని మరియు ఏలాంటి సుఖాన్ని పొందలేడు.

**గీతా అధ్యాయం 6 శ్లోకం 16**

న, అతి, అశ్రనత్:, తూ, యోగ:, అస్తి, న, చ, ఎకాన్తమ్,

అనశ్రనత:, న, చ, అతి, స్వప్నశిలస్య, జాగ్రత:, న, ఎవ, చ, అర్జున్ ॥

**అనువాదం:- హే అర్జున్! ఈ యోగం అనగా భక్తి ఎక్కువ తినువారికి మరియు ఎమియు తిననివారికి, ఎకాన్త స్థానంపై ఆసనాన్ని వేసి సాధన చేయువారికి మరియు ఎప్పుడు పడుకును స్వభావం కలవారికి మరియు సదా మేల్కొని ఉండువారికి సిద్ధించబడదు.**

పూజై దెయి ధామ్ కో, శిశ్ హలావై జో। గరీబ్‌దాస్ సాచి కహై, హద్ కాఫిర్ హై సో॥

కబీర్, గంగా కాఠై ఘర్ కరై, పివై నిర్మల్ నిర్। ముక్తి నహి హరి నామ బిన్, సతగురు కహై కబీర్॥

కబీర్, తీర్థ కర-కర జగ్ మువా, ఉడై పాని న్హాయ్। రామ్ హి నామ నా జపా, కాల్ ఘసిటే జాయ్॥

గరీబ్, పితల్ హి కా థాల్ హై, పితల్ కా లోటా। జడ్ మురత్ కో పూజతేం,ఆవైగా టోటా॥

గరీబ్, పితల్ చమచ్చా పూజియే, జో థాల్ పరోసై। జడ్ మురత్ కిస్ కామ కి, మతి రహెూ భరోసై॥

కబీర్, పర్వత్ పర్వత్ మై ఫిరయా, కారణ్ అపనే రామ్। రామ సరిఖే జన్ మిలే, జిన్ సారే సబ్ కామ్॥

**4. పితరుల పూజా నిషేదం:- ఏ విధమైన పితరుల పూజా, శ్రాద్దం తీయుట మొదలగునవి ఏమియు చేయకూడదు.భగవాన్ శ్రీ కృష్ణుడు కూడ ఈ పితరుల మరియు భూతంల పూజ చేయవద్దని చెప్పినారు.**

**గీతా అ. 9 శ్లోకం 25లో చెప్పబడినది-**

యాన్తి, దేవవ్రతా:, దేవాన్, పితృఋున్, యాన్తి, పితృవ్రతా:।

భూతాని, యాన్తి, భుతేజ్యా, మధ్యాజిన్:, అపి, మామ్ ॥

**అనువాదం:- దేవతలని పూజించువారు దేవతలకి ప్రాప్తించబడుతారు, పితరులని పూజించువారు పితరులకి ప్రాప్తించబడతారు, భూతాలని పూజించువారు భూతాలకి ప్రాప్తించబడతారు మరియు మతానుసారంగా పూజ చేయు భక్తులు నావలనే లాభాన్వితులౌతారు.**

**బందిఛోడ్ గరీబ్‌దాస్‌జీ మహారాజ్ మరియు కబీర్ సాహిబ్ జీ మహారాజ్ కూడ అంటారు-**

గరీబ్, భూత రమై సో భూత్ హై, దేవ రమై సో దేవ్। రామ రమై సో రామ హై, సునో సకల్ సుర్ భేవ్।

**ఇందువలన ఆ (పూర్ణ పరమాత్మ) పరమేశ్వరుడి భక్తి చెయ్యండి, దేనివలనైతే పూర్ణ ముక్తి అవుతుంది. ఆ పరమాత్మా పూర్ణ బ్రహ్మ సతపురుషుడే (సత్ కబీర్). ఈ ప్రమాణమే గీతా అధ్యాయం 18 శ్లోకం 46లో ఉంది.**

యత: ప్రవృత్తిర్భుతానాం యేన్ సర్వమిదం తతమ్ ।

స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవ: ॥46॥

**అనువాదం:- ఏ పరమేశ్వరుడి వలన సంపూర్ణ ప్రాణుల ఉత్పత్తి అయిఉంది మరియు ఎవరి వలన ఈ సమస్త జగత్తు వ్యాప్తమై ఉందో, ఆ పరమేశ్వరున్ని తన స్వాభావిక కర్మలద్వారా పూజా చేసి మనిషి పరమసిద్దిని పొందగలడు.**

**గీతా అ. 18. శ్లోకం 62 :-**

తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత్ ।

తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

**అనువాదం:- హే భరత వంశోద్భవ అర్జున్! నీవు సర్వభావంతో ఆ ఈశ్వరుడి శరణులోకి వెళ్ళు. అతడి కృపతో నీవు పరమ శాంతిని మరియు అవినాశి పరమపదంను పొందగలవు.**

**సర్వభావం యొక్క తాత్పర్యం ఏమిటంటే వేరే పూజ చేయకుండ మన-వచన-కర్మతో ఒకే పరమేశ్వరుడిలో శ్రద్దని ఉంచడం.**

**గీతా అ. 8 శ్లోకం 22 :-**

పురుష: స పర: పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా ।

యస్యాన్త: స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ ॥

**అనువాదం:- హే పృథానన్దన అర్జున్! సంపూర్ణ ప్రాణులు ఎవరి అంతర్భాగంలో ఉన్నాయో మరియు ఎవరివలన ఈ సంసారం విస్తరించబడినదో, ఆ పరమ పురుష పరమాత్మా అనన్యభక్తితో పొందుటకు యోగ్యుడై ఉన్నాడు.**

**అనన్య భక్తి యొక్క తాత్పర్యం ఏమిటంటే ఒకే ఒక్క పరమేశ్వరుడి (పూర్ణ బ్రహ్మ) భక్తి చేయుట, వేరే దేవిదేవతలు అనగా మూడు గుణాల (రజోగుణం-బ్రహ్మా, సతగుణం-విష్ణు, తమోగుణం-శివుడు) పూజా చేయకూడదు.**

**గీతా అ. 15 శ్లోకం 1.**

ఊర్ధ్వమూలమ్, అధ:శాఖమ్, అశ్వత్థమ్, ప్రాహు:, అవ్యయమ్,

ఛన్దాంసి, యస్య, పర్ణాని, య:, తమ్, వేద, స:, వేదవిత్ ॥ 1 ॥

**అనువాదం:- పైకి వేర్లు గల , కిందికి శాఖలుగల అవినాశి, సంసారరూపి రావి వృక్షం ఉంది. గుర్రంలాగా బలంగా ఉంది. దాని చిన్న చిన్న భాగాలు లేదా రెమ్మలు,పత్రములు కలవు అని చెప్పినారు. ఆ సంసార రూపి వృక్షంను ఏవరైతే ఈ విధంగా భావిస్తారో (తెలుసుకుంటాడో) అతడు పూర్ణ జ్ఞాని అవుతాడు అనగా తత్వదర్శి అవుతాడు.**

**గీతా అ. 15 శ్లోకం 2 :-**

అధ:, చ, ఊర్ధ్వమ్, ప్రసృతా:, తస్య, శాఖా:, గుణప్రవృద్ధా:, విషయప్రవాలా:

అధ:, చ, మూలాని, అనుసన్తతాని, కర్మానుబన్ధిని, మనుష్యలోకే ॥ 2 ॥

**అనువాదం:- ఆ వృక్షం యొక్క కింద మరియు మీద మూడు గుణాల రజోగుణం-బ్రహ్మా, సతగుణం-విష్ణు, తమోగుణం-శివుడు రూపంలో వ్యాపించిన వికారాలు కామం, క్రోధం, మోహం, లోభం, అహంకారం రూపి చిగురించిన కొమ్మలు కలవు. బ్రహ్మా, విష్ణు, శివలే జీవులని కర్మలయందు బందించు మూలాలు అనగా మూల కారణం. మరియు మనుష్యలోకం, స్వర్గం, నరకలోకం, పృథ్విలోకంలో కింద (84 లక్షల యోనిల యందు) పైన వ్యవస్థిమై ఉన్నాయి.**

**గీతా అ. 15 శ్లోకం 3**

న, రూపమ్, అస్య, ఇహ్, తథా, ఉపలభ్యతే, న, అన్త:, న, చ, ఆది:, న, చ,
సమ్ప్రతిష్ఠా, అశ్వత్థమ్, ఎనమ్, సువిరుఢములమ్, అసఙగశస్త్రేణ, దృఢేన, ఛిత్వా ॥3॥

**అనువాదం:- ఈ రచనా యొక్క ప్రారంభం మరియు అంతము లేదు.అలాంటి స్వరూపం పొందలేము మరియు ఇక్కడ విచార కాలమందు అనగా నా ద్వారా ఇవ్వబడుచున్న గీతా జ్ఞానంలో పూర్ణ సమాచారం నా వద్ద కూడ లేదు. ఎందుకంటే అన్ని బ్రహ్మాండాల రచన యొక్క సరియైన స్థితి జ్ఞానం నాకు కూడ లేదు. ఈ మంచిగా స్థాయి స్థితిగల, బలమైన స్వరూపంగల, నిర్లేప తత్వజ్ఞాన రూపి దృఢమైన అస్త్రంతో అనగా నిర్మల తత్వజ్ఞానం ద్వారా తొలిగించి (కోసి) అనగా నిరంజన్ యొక్క భక్తిని క్షణికంగా భావించి (తెలుసుకుని)(3)**

**గీతా అ. 15 శ్లోకం 4.**

తత: పదం తత్పరిమార్గితవ్యం యస్మిన్గతా న నివర్తన్తి భూయ: ।
తమేవ చాధ్యం పురుషం ప్రపద్యే యత: ప్రవృత్తి ప్రసృతా పూరాణీ ॥4॥

**అనువాదం:- దాని తరువాత ఆ పరమపద పరమాత్మని వెదకాలి. ఆయనని పొందిన మనుషులు తిరిగి సంసారంలోకి రారు మరియు ఎవరిద్వారా అనాదికాలం నుండి నడుస్తు వస్తున్న ఈ సృష్టి విస్తరించబడి ఉందో, ఆ ఆదిపురుష పరమాత్ముడి శరణులోనే నేను ఉన్నాను.**

**ఈ విధంగా స్వయం భగవాన్ శ్రీ కృష్ణుడు ఇంద్రుడి-ఎవరైతే దేవి-దేవతలకి రాజు, పూజని కూడ చేయవద్దని చెప్పి ఆ పరమాత్మ భక్తి చేయడం కోసం ప్రేరణ ఇచ్చి ఉండిరి. ఈ కారణంగానే వారు గోవర్ధన పర్వతాన్ని చిటికన వేలుపై ఎత్తి ఇంద్రుడి కోపం నుండి బ్రజ వాసిలను రక్షించిరి.**

గరీబ్, ఇంద్ర చఢా బ్రిజ్ డుబోవన్, భీగా న లేవ్ ।
ఇంద్ర కఢాయి హెూత్ జగత్ మే, పూజా ఖా గయే దేవ్ ॥
కబీర్, ఇస్ సంసార్ కో, సమఝాఊ కై బార్ ।
పూంఛ్ జో పకడై భేధ్ కీ, ఉతరా చాహై పార్ ॥

**5. గురు ఆజ్ఞ యొక్క పాలన :- గురుదేవుల ఆజ్ఞ లేకుండా ఇంటిలో ఏ విధమైన ధార్మిక అనుష్టాంను చేయించరాదు. బందిఛోడ్ తన వాణి యందు అంటారు:-**

"గురు బిన్ యజ్ఞ హరన్ జో కరహిం, మిథ్యా జావే కబహు నహి ఫలహి ।"
కబీర్, గురు బీన్ మాలా ఫేరతే, గురు బీన్ దేతే దాన్ ।
గురు బీన్ దోనోం నిష్ఫల్ హై, పూఛో వేద పురాణ్ ॥

**6. మాతా పోషమ్మ(గ్రామ దేవతల)పూజా నిషేదం :- తమ పొలంలోగల మండి (జ్ఞాపక చిహ్నం) లేదా ఏదైన ఖేడా** (a site where a village/city has been destroyed) **లేదా వేరే ఏ దేవత యొక్క సమాధిని పూజించకూడదు. సమాధి ఎవరిదైన కూడ అస్సలు పూజచేయకూడదు. మిగత ఏ ఉపాసనా కూడ చేయకూడదు. ఇంకా మూడు గుణాల (బ్రహ్మ, విష్ణు, శివుడు) పూజా కూడ చేయకుడదు. కేవలం గురువుగారు చెప్పిన విధంగానే**

చేయాలి.

**గీతా అ. 7 శ్లోకం 15**

న, మామ్, దూష్కృతిన:, ముఢా:, ప్రపధ్యన్తే, నరాధమా:,

మాయయా, అపహృతజ్ఞానా:, ఆసూరమ్, భావమ్, ఆశ్రితా: ॥

**అనువాదం:- మాయ ద్వారా ఎవరి జ్ఞానం హరింపబడి ఉంటుందో, అలాంటి అసూర స్వభావాన్ని ధరించిన మనుష్యులు నీచమైన దూషిత కర్మ చేయువారైన మూర్ఖులు నన్ను పూజించరు అనగా మూడు గుణాల (రజోగుణం-బ్రహ్మ, సతగుణం-విష్ణు, తమోగుణం-శివుడు) సాధనయే చేస్తుంటారు.**

కబీర్, మాయి మసాని శేఢ్ శితలా, మైరవ భూత హనుమంత్। పరమాత్మా ఉనసే దూర హై, జో ఇనకో పూజంత్॥

కబీర్, సౌ వర్ష తో గురు కి సేవా, ఎక దీన్ ఆన్ ఉపాసి । వో అపరాధి ఆత్మా, పరై కాల్ కి ఫాంసి॥

గురు కో తజై భజై జో ఆనా । తా పసూవా కో ఫోకట్ జ్ఞానా ॥

**7. సంకట మోచనుడు కబీర్ సాహెబుయే :- కర్మ కష్టం (సంకటం) కలిగినపుడు వేరే ఏ ఇష్టదేవత లేదా మాతా పోషమ్మ మొదలగు దేవతల పూజ ఎప్పటికి చేయకూడదు. జాతకంను చూపించాల్సిన పని లేదు. కేవలం బందిఛోడ్ కబీర్‌సాహెబ్ గారిని పూజించాలి. వారే అన్ని దు:ఖములను హరించివేయు సంకట మోచనలు.**

**సామవేదం సంఖ్య 822 ఉతార్చిక అధ్యాయం 3 ఖండం 5 శ్లోకం 8 (సంత్ రామపాల్‌దాస్ ద్వారా భాషా-భావం)**

మనీషిభి: పవతే పూర్వ్య: కవిర్నృభిర్యత: పరి కోశాం అసిష్యదత్ ।

త్రితస్య నామ జనయన్మధూ క్షరన్నిన్ద్రస్య వాయుం సఖ్యాయ వర్ధయన్ ॥ 8 ॥

**అనువాదం :- సనాతన అనగా అవినాశి కబీర్ పరమేశ్వర్ హృదయంతో కోరుకును శ్రద్దతో భక్తిచేయు భక్తాత్మలకి మూడు మంత్రాల ఉపదేశమును ఇచ్చి పవిత్రులుగా చేసి జన్మ మృత్యువు రహితులుగా చేస్తారు మరయు భక్తుడి ప్రాణం అనగా జీవన-శ్వాసలు ఎవైతే సంస్కార వశంగా తన మిత్రుడు అనగా భక్తుడి లెక్కలో జమ చేసి ఉంటాయో వాటిని తన భాండాగారనుండి పూర్ణరూపంగా ఎక్కువ చేస్తాడు.అనగా ఆయువుని పెంచుతాడు. ఆ కారణంచే పరమేశ్వరుడి వాస్తవిక ఆనందాన్ని తన ఆశీర్వాద ప్రసాదంతో ప్రాప్తింపజేస్తాడు.**

కబీర్, దేవి దేవ ఠాడే భయే, హమకో ఠౌర్ బతావో। జో మూర్ఖు (కబీర్) కో పూజైం నహిం, ఉనకో లుటో ఖావో॥

కబీర్, కాల్ జో పీసై పిసనా, జోరా హై పనిహార్ । యే దో అసన్ మజుర్ హై, సతగురు కే దరబార్ ॥

**8. అనవసరమైన దానం నిషేదం :- ఎక్కడకూడ మరియు ఎవరికిని దాన రూపంలో ఏమియు ఇవ్వకూడదు.డబ్బు, కుట్టబడని బట్టలు మొదలగు ఏమియు ఇవ్వకూడదు. ఒకవేళ ఎవరైన దాన రూపంలో అడగడానికి వస్తే వారికి అన్నం తినిపించండి, టీ, పాలు, లస్సీ, నీళ్లు తాగించండి. కానీ ఏమి ఇవ్వకండి. ఎందుకంటే మనం ఇచ్చే డబ్బులతో అతడు ఎలాంటి దురపయోగమైన పనిచేస్తాడో మనకు తెలియదు. ఉదహారణకి ఒక భిచ్చగాడు ఒక వ్యక్తితో ఇలా అంటాడు అయ్యా! నా కొడుకు వైద్యం లేక బాదపడుచున్నాడు. దయఉ**

ంచి కొన్ని డబ్బులు సహాయం చేయండి. ఆ వ్యక్తి ఇది విని చలించి వంద రూపాయలు ఇస్తాడు. ఆ భిచ్ఛగాడు రోజు పావు మద్యం తాగెవాడు కానీ ఆ రోజు సగం బాటిల్ మద్యం తాగుతాడు మరియు భార్యని కొడుతాడు. అతడి భార్య పిల్లలతో పాటుగా ఆత్మహత్య చేసుకుంటుంది. ఇక్కడ అర్థం చేసుకోవల్సిందేమిటంటే మీ ద్వారా చేయబడిన దానం ఆ కుటుంబాన్ని నాశనం అగుటకు కారణమైనది. ఒకవేళ మీరు అలాంటి వ్యక్తులకి సహాయం చేయదల్చుకుంటే ఆ పిల్లవాడిని మంచి వైద్యుడి వద్దకి తీసుకెళ్లి మందులు ఇప్పించండి.అంతేకానీ పైసలు ఇవ్వకండి.

కబీర్, గురు బీన్ మాలా ఫేరతే, గురు బీన్ దేతే దాన్। గురు బీన్ దోనో నిష్ఫల్ హై, పుఛో వేద పురాణ్ ॥

**9.** అబద్ధపు తిండి నిషేదం :- ఇలాంటి వ్యక్తి యొక్క అబద్ధపు తిండి తినకూడదు, ఏవరైతే మందు, మాంసం, పొగాకు, కోడిగుడ్డు, బీరు, అఫీమ్, గంజాయి..మొదలగునవి సేవిస్తాడు.

**10.** సత్యలోక గమనం(దేహాంతం)తరువాతి క్రియా-కర్మలు నిషేదం :- ఒకవేళ కుటుంబంలో ఎవరైన చనిపోతే శవానికి అగ్నిని ఎవరైన ఇవ్వవచ్చు. ఇంటివారు లేదా వేరేవారైన అగ్నిని అంటించు సమయంలో మంగళాచరణం అనాలి. శవంపైగల పూలు మొదలగునవి ఏమియు ఎత్తకూడదు. ఒకవేళ ఆ స్థానంను శుభ్రం చేయుట అనివార్యం అయితే ఆ అస్థికలని తీసుకుని స్వయంగా వేరొక స్థానంపై పారుతున్న నీటిలో వేయండి. ఆ సమయంలో మంగళాచరణంను ఉచ్ఛరించండి. పిండాలు పెట్టుట, పదకొండు రోజులు,నెల రోజులు, ఆరునెలలు, సంవత్సరీకం మొదలగు పనులు చేయకూడదు. శ్రాద్ధం పెట్టుట మొదలగునవి చేయకూడదు. వేరే ఏ వ్యక్తితో కూద హవనం చేయించరాదు. సంబధీకులు మరియు బంధువులు శోకంను వ్యక్తపరుచుటకు వచ్చిన వారి కోసం ఏదైన ఒక రోజు నియమించుకోండి. ఆ రోజు ప్రతిరోజు చేసే నిత్యనియమం చేయండి, జ్యోతిని జాగృతం చేయండి, తరువాత అందరికి అన్నం తినిపించండి. ఒకవేళ మీకు చనిపోయినవారి పేరు మీద ఏదైన ధర్మం చేయాలి అనుకుంటే గురుదేవుల ఆజ్ఞను తీసుకుని బందిఛోడ్ గరీబ్‌దాస్‌జీ మహారాజ్‌గారి అమృతమయి వాణి యొక్క అఖండ పాఠ్‌ను చేయించండి. ఒకవేళ పాఠ్ చేయించుటకు ఆజ్ఞ లభించనట్లయితే కుటుంబంలోని ఉపదేశి భక్తులు నాలుగు రోజులు లేదా ఏడు రోజులు ఇంటిలో ఒక అఖండ జ్యోతిని దేశి నెయ్యితో వెలిగించండి మరియు బ్రహ్మ గాయత్రి మంత్రంను ప్రతిదినం నాలుగు సార్లు చేయండి మరియు మూడు లేదా ఒకసారి చేసిన మంత్ర దాన సంకల్పాన్ని సతలోకవాసి కోసం చేయండి. మీకు ఎదైతే సరిగ్గా అనిపిస్తే, ఒకటి, రెండు, మూడు వరకు మంత్ర జప ఫలాన్ని అతడికి దానం ఇవ్వండి. ప్రతిరోజులాగా జ్యోతి మరియు ఆరతి, నామస్మరణ చేస్తుండాలి. ఇది గుర్తుంచుకొని :-

కబీర్, సాథి హమారే చలే గయే, హమ్ భి చాలన్ హార్। కోయ్ కాగజ్ మే బాకి రహా రహి, తాతే లాగ్ రహి వార్॥

కబీర్, దేహ్ పడి తో క్యా హుఆ, ఝూఠా సభి పటిట్। పక్షి ఉడయా ఆకాశ్ కుం, చలతా కర్ గయా బీట్ ॥

## "కర్మకాండ విషయంలో సత్యకథ"

నా (సంత్‌రామపాల్‌దాస్‌గారి) పూజ్య గురుదేవులు స్వామిరామదేవానందజీ మహారాజ్‌గారికి పదహారవ ఏట ఒక మహాత్మగారి సత్సంగం వినడంవలన వైరాగ్యం కలిగింది. ఒక రోజు వారు పొలంకు పోయి ఉండిరి దగ్గరలోనే అడవి ఉండింది.వారు అడవిలోకి వెళ్ళి ఒక చనిపోయిన జంతువు/పశువు యొక్క ఎముకల దగ్గర తన బట్టలని చింపి పడేస్తారు మరియు స్వయంగా మహాత్మాతో పాటు వెళ్ళిపోతారు.

వారి గురించి వెదికినపుడు ఆయన కుటుంబీకులకు ఆ పశువు కలేబరం వద్ద చిరిగిన బట్టలు కనిపించాయి. ఏదో అడవి జంతువు ఆయన్ని తినేసినట్లు ఉందని భావించిరి. ఆ బట్టలని మరియు ఎముకలని ఎత్తుకుని ఇంటికి తీసుకువస్తారు మరియు అంతిమ సంస్కారం చేయిస్తారు. దాని తరువాత పదకొండు రోజులు మరియు ఆరునెలలు చేస్తారు. తరువాత శ్రాద్ధం తీయుట ప్రారంభమవుతుంది.

ఏపుడైతే నా పూజ్య గురుదేవులు చాలా వృద్ధులైనారో అప్పుడు వారు ఒకసారి ఇంటికి వెళ్ళిరి. అప్పుడు కుటుంబికులందరికి తెలిసింది వీరు జీవించెయున్నారని మరియు ఇల్లు విడిచి వెళ్లినారని. కుటుంబికులు ఇలా చెప్పిరి ఏమనంటే ఎప్పుడైతే వారు ఇల్లు విడిచి వెళ్ళినారో అప్పుడు వీరికోసం వెదికిరి. వనంలో వీరి బట్టలు దొరికినాయి. వాటి వద్ద కొన్ని ఎముకలు పడి ఉండెను. మేము వాటిని మీవిగానే భావించితిమి. ఏదైన అడవి మృగం మిమిల్ని తిని మీ బట్టలు మరియు ఎముకల్ని ఇక్కడ పడేసింది కావచ్చు అని. వాటిని తీసుకువచ్చి అంతిమ సంస్కారం చేయించాము.

పిదప నేను (సంత్ రామపాల్‌దాస్‌గారు) నా పూజ్య గురుదేవుల చిన్న తమ్ముడి భార్యని అడిగాను ఎప్పుడైతే మా పూజ్య గురుదేవులు ఇల్లు విడిచి వెళ్ళినారో అప్పుడు మీరు ఏమి చేశారు? ఆమె చెప్పింది ఎప్పుడైతే నేను పెళ్ళి చేసుకుని వచ్చితినో ఆ సమయంలో నాకు వీరి శ్రాద్ధం పెట్టుట తెలుసు. నేను నా చేతులతో వీరి సుమారు **70** శ్రాద్ధంలు పెట్టితిని. ఆమె ఇంకా చెప్పింది ఎప్పుడైతే ఇంటిలో ఎదైన ఆటంకం ఏర్పడితే– బర్రె పాలు ఇవ్వకపోవడం, స్థనాలలో ఇబ్బందులు రావడం, ఇంకా వేరే నష్టములు జరిగినపుడు మేము దేవుళ్లు చెప్పువాళ్ల వద్దకి దేవున్ని అడగడానికి పోయేవాళ్లం అప్పుడు వాళ్లు మీ ఇంటిలో ఒక పెళ్లికానీ వాడు చనిపోయినాడు. మిముల్ని అతడే దు:ఖింపజేస్తున్నాడు. తరువాత మేము అతడికి బట్టలు మొదలగునవి ఇచ్చేవాళ్లము.

అప్పుడు నేను అన్నాను వీరైతే ప్రపంచాన్ని ఉద్దరిస్తున్నారు. వీరు ఎవరికి దు:ఖాన్ని ఇస్తారు. వీరైతే ఇప్పుడు సుఖ దాత. తరువాత నేను (సంత్‌రామపాల్‌దాస్‌గారు) ఆ వృద్ధురాలిని అడిగాను ఇప్పుడు వీరు మీ ఎదుట ఉన్నారు. ఇప్పటికైన ఈ వ్యర్థమైన సాధనలు శ్రాద్ధం తీయుటను ఆపివేయండి. అప్పుడు ఆమె అంది ఇది మన పాత ఆచారం, దీనిని ఏలా వదిలివేయను? అనగా మనం మన పాత ఆచారాలలో ఎంత లీనమైనామంటే ప్రత్యక్ష ప్రమాణం లభించిన కూడ ఆ తప్పు చేస్తునే ఉన్నాం, విడిచిపెట్టలేం. దీని వలన ప్రమాణితం అవుతుంది శ్రాద్ధం పెట్టుట, పితరుల పూజ చేయుట మొదలగునవి వ్యర్థమైనవి అని.

**11. పిల్లలు పుట్టినపుడు చేసే శ్రాస్త్ర విరుద్ధ పూజా నిషేదం :- పిల్లవాడు పుట్టిన తరువాత 21రోజుల వంటివి చేయకూడదు. సుతకపు ముట్టుడు వలన ప్రతిరోజు చేయు పూజా, భక్తి, ఆరతి, జ్యోతి వెలిగించుట మొదలగునవి ఆపకూడదు.**

**ఈ సందర్భంలో ఒక సంక్షిప్త కథ చెబుతాను. ఒక వ్యక్తికి పెళ్లి అయిన పది సంవత్సరాల తరువాత కొడుకు పుట్టినాడు. కొడుకు కలిగిన ఆనందంలో అతడు చాలా ఆనందమైనవి చేశాడు. ఇరవై-ముప్పై ఊళ్లని భోజనం కోసం ఆహ్వానించాడు. విందు వినోదం (పాటలు-వాయిద్యాలు) ఏర్పాటు చేశాడు. చాలానే డబ్బు ఖర్చు పెట్టాడు. తరువాత ఒక సంవత్సరం అయినాకా ఆ పుత్రుడి దేహాంతం అవుతుంది. ఆ కుటుంబమే తలని పట్టుకుని ఎడుస్తుంది మరియు తమ దుర్భాగ్యంపై కసురుకుంటారు. ఇందువలనే కబీర్ సాహెబ్ మనకి చెబుతారు :-**

కబీర్, బేటా జాయా ఖుషి హుయి, బహుత్ బజాయే థాల్। ఆనా జానా లగ్ రహా, జ్యోం కిడి కా నాల్॥
కబీర్, పతఝుడ్ ఆవత్ దేఖ్ కర్, బన్ రోవై మన్ మాహి। ఊంచి డాలి పాత్ థే, అబ్ పీలే హెూ హెూ జాహి॥
కబీర్, పాత్ ఝుడంతా యుం కహై, సున్ భయి తరువర్ రాయ్। అబ్ కే బిఛ్డే నహి మిలా, న జానే కహా గిరేంగే జాయ్॥
కబీర్, తరువర్ కహతా పాత్ సే, సునో పాత్ ఏక్ బాత్। యహాం కి యాహె రితి హై, ఏక్ ఆవత్ ఏక్ జాత్॥

**12. దేవుడి గుళ్లలో వెంట్రుకలు ఇవ్వడం నిషేదం :- పిల్లల వెంట్రుకలని ఇవ్వడానికి ఎలాంటి ధామాలకి (పుణ్య క్షేత్రాలకి) వెళ్ళకూడదు. వెంట్రుకలు పెరిగితే క్షౌరం చేయించి పారేయండి. ఒక మందిరంలో చూసితిమి ఒక శ్రద్ధాలు భక్తుడు తన కొడుకు లేదా కూతురి వెంట్రుకలు తీయించడానికి వచ్చియుండెను. అక్కడగల మంగళి (నాయి) బయట తీసుకును ధర కంటే మూడు రెట్లు ఎక్కువగా డబ్బులు తీసుకున్నాడు. ఒక కత్తెరకి వచ్చిన వెంట్రుకలని కోసి తల్లి-తండ్రి చేతులలో పెడతాడు. వారు శ్రద్ధతో వాటిని మందిరంలో అప్పజేప్పుతారు. పూజారీ ఒక సంచిలో వేసుకుంటాడు. రాత్రి ఆ సంచిని ఎత్తుకుని ఏకాంత స్థానంలో పడేస్తాడు. ఇదంతా కేవలం నాటకమే. మనం మునపటిలాగే స్వాభావికంగా వెంట్రుకలని క్షౌరం చేయించుకుందాం మరియు బయట పడేద్దాం. పరమాత్మ నామంతో ప్రసన్నుడౌతాడు పాఖండతో (కల్పిత పూజతో) కాదు.**

**13. నామ జపంతో సుఖం :- నామంను (ఉపదేశాన్ని) కేవలం దు:ఖ నివారణ దృష్టికోణంలోనే తీసుకోకూడదు. కానీ ఆత్మ కళ్యాణం కోసం తీసుకోవాలి. తరువాత నామజపంతోనే అన్ని సుఖములు తనకు తానుగా వచ్చేస్తాయి.**

"కబీర్, సుమిరణ్ సే సుఖ హెూత్ హై, సుమిరణ్ సే దు:ఖ జాయ్ ।
కహై కబీర్ సుమిరణ్ కియే, సాంయి మాహిం సమాయ్ ॥"

**14. వ్యభిచారం నిషేదం :- పరాయి స్త్రీలని తల్లి-కూతురు-సోదరి అను దృష్టితో చూడాలి. వ్యభిచారం మహాపాపమైనది. ఎలాఅంటే:-**

గరీబ్, పర్ ద్వారా స్త్రీ కా ఖోలై । సత్తర్ జన్మ అంధా హెూ డోలై। సురాపాన్ మద్య మాంసాహారి। 
గవన్ కరేం భోగై పర్ నారి। సత్తర్ జన్మ కటత్ హై శిశం। సాక్షి సాహిబ్ హై జగదిశం॥
పర నారి నా పరసియో, సునో శబ్ద సలతంత్। ధర్మరాయ్ కే ఖంభ్ సే, అర్ధముఖి లటకంత ॥

**15.** **నిందని వినడం మరియు చేయడం నిషేదం :-** మన గురుని నిందించడం మర్చిపోయి కూడ చేయకండి మరియు వినకండి. వినడం అనగా ఒకవేళ ఏవరైన మీ గురువుగారి విషయంలో అబద్దపు మాటలు మాట్లాడుకుంటున్నపుడు మీరు కోట్లాడకూడదు. కానీ అర్థం చేయించాలి వారు మాట్లాడుతున్నది తప్పు అని మరియు అది ఏ విధంగా సరియైనది అని.

గురు కి నిందా సునై జో కానా । తాకో నిశ్చయ్ నరక నిదానా ।
అపనే ముఖ నిందా జో కరహి । శుకర్ శ్వాన్ గర్భ మే పరహిం ॥

నిందా అయితే ఎవరిది చేయకూడదు మరియు వినకూడదు. కావాలంటే అతడు సామాన్య వ్యక్తి అయిన కూడ. కబీర్ సాహెబ్ అంటారు :-

తినకా కబహు న నిన్దియే, జో పాంవ్ తలే హెూ। కబహు ఉర్ ఆఖిన్ పడే, పిర్ ఘనేరి హెూ॥

**16.** **గురు దర్శనం యొక్క మహిమ :-** సమయం లభించగానే సత్సంగంలోకి రావడానికి ప్రయత్నం చేయండి మరియు సత్సంగంలో నఖరాలు (గొప్పలు చెప్పుకోడానికి) చేయడానికి రాకండి. మీముల్ని మీరు రోగస్తులుగా అనుకుని రండి. ఒక రోగి అతడు ధనవంతుడైన, చాలా పెద్ద పదవిగల వాడైన, ఎప్పుడైతే వైద్యశాలకి వస్తాడో అప్పుడు అతడి ఉద్దేశ్యం కేవలం రోగం నుండి ముక్తిని పొందడం మాత్రమే అవుతుంది. వైద్యుడు పడుకోమంటే పడుకుంటాడు, కూర్చొమంటే కూర్చుంటాడు, బయటికి వెళ్లమంటే బయటికి వెళ్లిపోతాడు.తరువాత లోపలికి రావాలి అను మాట వినగానే నిశబ్దంగా లోపలికి వచ్చేస్తాడు. సరిగ్గా ఈ విధంగానే ఒకవేళ మీరు సత్సంగంలోకి వచ్చినట్లయితే మీకు సత్సంగం యొక్క లాభం లభిస్తుంది. లేదంటే మీ రాక నిష్ఫలమైనది. సత్సంగంలో ఎక్కడ కూర్చొడానికి దొరికితే అక్కడే కూర్చొండి, ఎది తినడానికి దొరికితే దానిని పరమాత్మా కబీర్ సాహెబ్‌గారి దయాప్రసాదంగా భావించి తిని ప్రసన్న చిత్తుడిగా ఉండండి.

కబీర్, సంత్ మిలన్ కుం చాలియే, తజ్ మాయా అభిమాన్। జో-జో కదమ్ ఆగే రఖే, వో హి యజ్ఞ సమాన్॥
కబీర్, సంత్ మిలన్ కుం జాయియే, దిన్ మే కయి-కయి బార్। ఆసోజ్ కే మేహ్ జ్యోం, ఘనా కరే ఉపకార్ ॥
కబీర్, దర్శన్ సాధు కా, పరమాత్మా ఆవై యాద్। లేఖే మే వోహే ఘడి, బాకి కే దిన్ బాద్ ॥
కబీర్, దర్శన్ సాధు కా, ముఖ పర బసై సుహాగ్। దర్శ ఉన్హి కో హెూత్ హై, జినకే పూర్ణ భాగ్ ॥

**17.గురు మహిమ :-** ఒకవేళ ఎక్కడైన పాఠ్ లేదా సత్సంగం నడుస్తున్నపుడు కానీ లేదా గురువుగారి దర్శనార్థం వెళ్ళినపుడు మొట్టమొదటగా గురువుగారికి సాష్టాంగ నమస్కారము చేయాలి. తరువాత సత్‌గ్రంథ సాహిబ్ మరియు పటాలకి- సాహిబ్ కబీర్‌గారు, గరీబ్‌దాస్‌గారు, స్వామి రామదేవానందజీగారు మరియు గురువుగారి చిత్ర పటాలకు ప్రణామం చేయాలి. దానివలన కేవలం భావన ఉంటుంది. మూర్తి పూజా చేయకూడదు.కేవలం ప్రణామం చేయడం పూజలోకి రాదు. ఇది భక్తుడి శ్రద్దని నిలుపటంలో సహాయం చేస్తుంది. పూజా గురువుగారిది మరియు నామంది (మంత్రం) చేయాలి, ఏదైతే భవసాగరంను దాటిస్తుంది.

కబీర్, గురు గోవింద్ దోఊ ఖడే, కాకే లాగుం పాయ్ ।

బలిహారి గురు ఆపనే, జిన్ గోవిన్ద దియో మిలాయ్ ॥

కబీర్, గురు బడే గోవిన్ద సే, మన్ మే దేఖ్ విచార్। హరి సుమరే సో రహ్ గయే, గురు భజే హెూయ్ పార్॥

కబీర్, హరి కే రుఠతాం, గురు కి శరణ్ మే జాయ్। కబీర్ గురు జై రుఠజాం, హరి నహి హెూత్ సహాయ్॥

కబీర్, సాత్ సముద్ర కి మసి కరుం, లేఖని కరు బనిరాయ్ ।

ధరతి కా కాగజ్ కరుం, తో గురు గున్ లిఖా న జాయ్ ॥

**18. మాంసం తినుట నిషేదం :- గుడ్డు మరియు మాంసం తినడం మరియు జీవ హింసా చేయకూడదు. ఇది మహాపాపమైనది. సాహెబ్ కబీర్‌జీ మహరాజ్ మరియు గరీబ్‌దాస్ జీ మహారాజ్ గారు చెప్పినారు :-**

కబీర్, జీవ హనే హింసా కరే, ప్రకట పాప్ సిర్ హెూయ్। నిగమ్ పూని ఐసే పాప్ తే, భిస్త గయా నహి కోయ్॥1॥

కబీర్, తిలభర్ మఛలి ఖాయకే, కోటి గవు దే దాన్। కాశీ కరౌంత్ లే మరే, తో భి నరక నిదాన్ ॥2॥

కబీర్, బకరి పాతి ఖాత్ హై, తాకి కాఢి ఖాల్ । జో బకరికో ఖాత్ హై, తినకా కౌన్ హవాల్ ॥3॥

కబీర్, గలా కాటి కలమా భరే, కియా కహై హలాల్ । సాహబ్ లేఖా మాంగసి, తబ్ హెూసి కౌన్ హవాల్॥4॥

కబీర్, దినకో రోజా రహత్ హై, రాత్ హనత్ హై గాయ్। యహ్ ఖున్ వహ్ వందగి, కహు క్యోం ఖుషి ఖుదాయ్ ॥5॥

కబీర్, కబీరా తేయి పిర్ హై, జో జానై పర్ పిర్ । జో పర్ పిర్ న జాని హై, సో కాఫిర్ బేపిర్ ॥6॥

కబీర్, ఖుబ్ ఖానా హై ఖిచడి, మాహి పరి టుక్ లౌన్। మాంస పరాయా ఖాయ్‌కై, గలా కటావై కౌన్॥7॥

కబీర్, ముసలమాన్ మారైం కరదసో, హిందూ మారై తరవార్ । కహై కబీర్ దోను మిలి, జైహైం యమకే ద్వార్ ॥8॥

కబీర్, మాంస అహారి మానవ, ప్రత్యక్ష రాక్షస జాని । తాకి సంగతి మతి కరై, హెూఈ భక్తి మే హాని ॥9॥

కబీర్, మాంస్ ఖాంయ్ తే ఢేడ్ సబ్, మద్ పివై సో నీచ్। కూలకి దూరమతి పర హరై, రామ కహై సో ఊంచ్ ॥10॥

కబీర్, మాంస మఛలియా ఖాత్ హై, సురాపాన్ సే హేత్ । తే నర నరకై జాహింగె, మాతా పితా సమేత్ ॥11॥

గరీబ్, జీవ హింసా జో కరతే హై, యా ఆగే క్యా పాప్ । కంటక్ జుని జిహాన్ మే, సింహ్ భేడియా ఔర్ సాంప్।

ఝోటే బకరే మురగే తాఈ। లేఖా సబ్ హి లేత్ గుసాయి। మృగ్ మోర్ మారే మహమంతా। అచరా చర్ హై జీవ అనంతా॥

జిహ్వా స్వాద్ హితే ప్రానా । నీమా నాశ్ గయా హమ్ జానా ॥

తితర్ లవా బూటేరి చిడియా । ఖుని మారే బడే అగడియా ॥

అదలే బదలే లేఖే లేఖా । సమఝ్ దేఖ్ సున్ జ్ఞాన్ వివేకా ॥

గరీబ్, శబ్ద హమారా మానియో, ఔర్ సునతే హెూ నర్ నారి ॥

జీవ దయా బీన్ కుఫర్ హై, చలే జమానా హారి ॥

**తెలియక జరిగిన హింసలో పాపం తగులదు. బంది ఛోడ్ కబీర్ సాహిబ్ అంటారు :-**

"ఇఛ్ఛా కర్ మారై నహి, బీన్ ఇఛ్ఛా మర్ జాయ్ । కహై కబీర్ తాస్ కా, పాప్ నహి లగాయ్ ॥"

**19. గురు ద్రోహితో సంప్రదింపులు నిషేదం :- ఒకవేళ ఎవరైన భక్తుడు గురువుగారితో ద్రోహం (గురువుగారితో విముఖుడౌతాడో) చేస్తాడో అతడు మహాపాపంలో భాగస్తుడౌతాడు. ఒకవేళ ఎవరికైన మార్గం మంచిగా అనిపించకపోతే తన గురువుని మార్చుకోవచ్చు. ఒకవేళ అతడు తన పూర్వపు గురువుతో పాటు విరోధం మరియు నిందించడం చేస్తే అతడు గురు ద్రోహి అనబడుతాడు. అలాంటి వ్యక్తితో భక్తి చర్చా చేయడంలో ఉపదేశికి దోషం తగులుతుంది. అతడి భక్తి సమాప్తం అవుతుంది.**

గరీబ్, గురు ద్రోహి కి సైడ్ పర్, జె పగ్ ఆవై బీర్। చౌరాసి నిశ్చయ్ పడై, సతగురు కహై కబీర్ ॥
కబీర్, జాన్ బూఝ్ సాచి తజై, కరై ఝుఠే సే నేహ్। జాకి సంగత్ హే ప్రభు, స్వపన్ మే భి నా దేహ్ ॥

**అనగా గురుద్రోహి వద్దకు వెళ్ళువాడు భక్తి రహితుడై నరకం మరియు 84 లక్షల జీవుల యోనిలయందు వెళ్లిపోతాడు.**

**20. జూవా(గ్యాంబ్లింగ్)నిషేదం :- జూవా- పేక ఎప్పటికిని ఆడకూడదు.**

కబీర్, మాంస్ భఖై ఔర్ మద్ పియే, ధన్ వేశ్యా సోం ఖాయ్। జుఆ ఖేలి చోరి కరై, అంత సములా జాయ్॥

**21. నృత్యం(డాన్స)- పాటలు నిషేదం :- ఎదైన సంతోషకర సందర్భాల (పార్టీలు, పండుగలు) పై నృత్యం చేయడం, అశ్లీల పాటలు పాడడం భక్తిభావంకు విరుద్ధమైనవి. ఒక సమయంలో ఒక విధవ సోదరి తన బంధువుల ఇంటికి పండుగ సందర్భంగా వెళ్లింది. అందరూ సంతోషంగా ఆడుతూ-పాడుతూ ఉండిరి. కానీ ఆ సోదరి ఒక వైపు కూర్చొనిప్రభువు చింతనలో పడిపోయింది.తరువాత ఆమె బంధువులు ఆమెను అడిగిరి మీరు నిరాశగా ఎందుకు కూర్చున్నారు? మీరు కూడ మాలాగే ఆడుతూ పాడుతూ ఆనందంగా ఉండండి అని. ఇది విని ఆ సోదరి అన్నది ఏ విషయం గురించి ఆనందించను? ఈ విధవ సోదరికి ఒక కొడుకు ఉండెవాడు అతడు కూడా భగవంతుడికి ప్రియుడై పోయాడు. ఇక ఏమి ఆనందం ఉంది నా కోసం? సరిగ్గా ఈ విధంగానే ఈ కాల్ లోకంలో ప్రతి ఒక్క వ్యక్తి స్థితి ఉంది. ఇక్కడ గురు నానక్‌దేవజీగారి వాణి ఉంది ఏమిటంటే :-**

నా జానే కాల్ కి కర్ డారై, కిస్ విధి ఢల్ పాసా వే।
జిన్హాదే సిర్ తే మౌత్ ఖుాడగది, ఉన్హానుం కేడా హాంసా వే ॥
సాధ్ మిలేం సాడి శాది (ఖుషి) హెూంది, బిఛడ్ దాం దిల్ గిరి (దు:ఖ్) వే।
అఖదే నానక్ సునో జిహానా, ముశ్కిల్ హాల్ ఫకిరి వే ॥

**కబీర్ సాహెబ్ జీ మహారాజ్ కూడ అంటారు :-**

కబీర్, ఝుఠే సుఖ్ కో సుఖ్ కహై, మాన్ రహా మన్ మోద్।
సకల్ చబినా కాల్ కా, కుఛ్ ముఖ్ మే కుఛ్ గోద్ ॥
కబీర్, బేటా జాయా ఖుాషి హయి, బహుత్ బజాయే థాల్।
ఆవణ్ జాణా లగ్ రహా, జ్యోం కిడి కా నాల్ ॥

**విశేషం :- స్త్రీ మరియు పురుషులిద్దరును పరమాత్మని పొందుటకు అధికారం కలవారు. స్త్రీలకి మాసిక ధర్మం (నెలసరి) రోజులలో కూడ తను ప్రతిరోజు చేసే పూజ, జ్యోతి వెలిగించుట మొదలగునవి ఆపకూడదు. ఎవరైన చనిపోయిన లేదా జన్మించిన కూడ దినసరి పూజలు ఆపకూడదు.**

**గమనిక:- ఏ భక్తజనులు ఈ ఇరవైఒక్క సూత్రాల ఆదేశాన్ని పాలించరో వారి నామం సమాప్తం అవుతుంది. ఒకవేళ తెలియని తనంతో ఎదైన తప్పు జరిగితే అది క్షమించబడుతుంది మరియు ఒకవేళ తెలిసి ఎదైన తప్పు చేస్తే భక్తుడు నామ రహితుడౌతాడు. దీనికి సమాధానం ఇదియే గురుదేవులతో క్షమని యాచించి రెండవసారి నామ ఉపదేశం తీసుకోవాలి.**

# పరమేశ్వర్ కబీర్ సాహెబ్ గారి అసంఖ్య బ్రహ్మాండాలలఘు చిత్రం

అనామి లోకం: ఈ లోకంలో ఆత్మ మరియు పరమాత్మా ఒక రూపమై,కబీర్ సాహెబ్‌యే అనామి పురుషుడు. ఎలాఐతే మట్టి ముద్దవి చిన్న చిన్న ముక్కలు అవుతాయి. వాన పడిన తరువాత భూమి అయిపోతుంది, వేరే అస్థిత్వం ఉండదు.

అగమ లోకం :- ఈ లోకంలో కూడ కబీర్ పరమ్వేరుడు అగమ పురుషుడి రూపంలో ఉంటారు.

## అలఖ లోకం :- ఈ లోకంలో కూడ కబీర్ సాహెబ్ అలఖ పురుషుడి రూపంలో ఉంటారు.



# సృష్టి రచన

(సూక్ష్మవేదం నుండి సంగ్రహించబడిన నిజ సృష్టి రచన)

భగవత్ ప్రియ ఆత్మల్లారా! మొదటిసాఃరి ఈ సృష్టి రచనని చదివినపుడు మీకు ఇదంతా కల్పిత కథగా అనిపించవచ్చును, కానీ అన్ని పవిత్ర సద్గంథాలలో గల ప్రమాణాలను చదివి అర్థం చేసుకున్న పిదప అసలు ఈ నిజమైన అమృత జ్ఞానం ఎక్కడ దాగి ఉండెనో? అని మాత్రమే అనిపిస్తుంది.పవిత్ర హృదయంతో, ధైర్యంతో చదువుతు ఉండండి మరియు ఈ అమృత జ్ఞానాన్ని సురక్షితంగా ఉంచండి. ఇది మీ నూట ఒక్కతరాల వరకి పనికి వస్తుంది. పవిత్ర ఆత్మల్లారా! దయతో సత్యనారాయణ (అవినాశి ప్రభు/ సతపురుష్) ద్వారా రచించిన సృష్టి రచన యొక్క వాస్తవిక జ్ఞానాన్ని చదవండి.

**1.** పూర్ణ బ్రహ్మ :- వీరు కింద తెలుపుతున్న నాలుగు లోకాలకి ప్రభువు. వాస్తవంగా వీరే అవినాశి ప్రభువు. వివిధ రూపాలని ధరించి తన నాలుగు లోకాలలో ఉంటారు. వీరి యందె అనంతమైన బ్రహ్మాండాలు కలవు.

**1.** సతపురుష్ – సతలోకం

**2.** అలఖ్ పురుష్ – అలఖ్‌లోకం

**3.** అగమ్ పురుష్ – అగమ్‌లోకం మరియు

**4.** అనామి పురుష్ – అనామిలోకం

**2.** పరబ్రహ్మ :- వీరు కేవలం ఏడు సంఖ్ బ్రహ్మాండాలకి ప్రభువు. వీరికి ఇంకో పేరు అక్షర పురుషుడు. కానీ వాస్తవికంగా వీరు మరియు వీరి బ్రహ్మాండాలు కూడ అవినాశి కావు. అనగా నాశనం కలవి.

**3.** బ్రహ్మ :- వీరు కేవలం ఇరవైఒక్క బ్రహ్మాండాలకి ప్రభువు. వీరికి క్షర పురుషుడు, జ్యోతినిరంజన్, కాల్ అను పేర్లు కలవు. వీరు మరియు వీరి బ్రహ్మాండాలు అన్నియు నాశనం కలవి.

(పై ముగ్గురు ప్రభువుల యొక్క ప్రమాణం పవిత్ర శ్రీమద్ భగవత్ గీత యందు అధ్యాయం **15** శ్లోకం **16 – 17**లో కూడ ఉంది)

**4.** బ్రహ్మ :- వీరు బ్రహ్మ యొక్క జేష్ఠ్య పుత్రులు, విష్ణువు మధ్య పుత్రుడు మరియు శివుడు కనిష్ఠ పుత్రుడు. ఈ ముగ్గురు పుత్రులు కూడా ఒక బ్రహ్మాండంలోని ఒక్కో విభాగం (గుణం) యొక్క ప్రభువులు మరియు నాశనం కలవారు.

విస్తృతమైన వివరణ కోసం కృపతో కింద రాయబడిన సృష్టి రచనని చదవండి.

(కవీర్‌దేవ్ (కబీర్ పరమేశ్వర్) సూక్ష్మవేదం అనగా కబీర్‌వాణిలో తన ద్వారా రచింపబడిన సృష్టి జ్ఞానాన్ని స్వయంగా చెప్పియున్నారు)

మొట్టమొదట 'అనామి' (పేరులేని లేదా అనామయ) లోకం ఉండింది. దీనిని అకహ లోకం అని కూడ అంటారు. పూర్ణ పరమాత్మ ఈ అనామి లోకంలో ఒకరే ఉండెవారు. పూర్ణ పరమాత్మ యొక్క వాస్తవిక నామం కవిర్‌దేవ్ అనగా కబీర్ పరమేశ్వర్.

అన్ని ఆత్మలు వీరి శరీరం యందె ఉండెవి. ఈ కబీర్‌దేవ్ యొక్క ఉపమాత్మక (పదవి) నామం అనామి పురుషుడు. (పురుషుడు అనగా ప్రభువు అని అర్థం. ఎందుకంటే ప్రభువు మనిషికి తన స్వరూపాన్నే ఇచ్చియున్నారు. అందుకె మనిషిని పురుషుడు అని కూడ పిలుస్తారు). అనామి పురుషుడి ఒక రోమకూపం యొక్క ప్రకాశం సంఖ (ఒక వంద క్వాడ్రిలియన్ = $10^{17}$) సూర్యుల కంటే అధికంగా ఉంటుంది.

విశేషం :- ఒక దేశం యొక్క ప్రధానమంత్రి శరీరంకు పేరు ఉంటుంది మరియు ఆయన పదవి యొక్క పేరు ప్రధానమంత్రి ఉంటుంది. కొన్నిసార్లు ప్రధానమంత్రిగారు తన వద్ద కొన్ని శాఖలని ఉంచుకుంటారు. ఏప్పుడైతే ఏ విభాగం యొక్క దస్తావేజులపై సంతకం పెడతారో అప్పుడు ఆ శాఖ పదవి గుర్చి కూడ రాస్తారు. ఉదహరణకి గృహ మంత్రాలయ శాఖ యొక్క దస్తావేజులపై సంతకం చేస్తే తనని తాను గృహమంత్రిగా రాస్తారు. అక్కడ ఆ వ్యక్తి యొక్క సంతకం యొక్క శక్తి తగ్గుతుంది (పి.యమ్.సంతకంతో పోల్చితే). ఈ విధంగానే కబీర్ పరమేశ్వర్ (కవిర్దేవ్) గారి ప్రకాశంలో అంతరం వేరు వేరు లోకాలలో అవుతు ఉంటుంది.

సరిగ్గా ఈ విధంగానే పూర్ణ పరమాత్మ కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) కిందగల మిగత మూడు లోకాల (అగమలోకం, అలఖలోకం, సతలోకం) రచనని తన శబ్ద (వచన) ంతో చేసిరి. పూర్ణ బ్రహ్మ పరమాత్మా కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) యే అగమలోకంలో ప్రకటితులైరి మరియు కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) గారు అగమ లోకం యొక్క స్వామి కూడ. అక్కడ వీరి ఉపమాత్మక (పదవి) నామం అగమ పురుష్ అనగా అగమ ప్రభువు. ఈ అగమ ప్రభు యొక్క మానవ సదృశ శరీరం చాలా తేజోమయమై ఉంది.దాని ఒక రోమ కూపం యొక్క ప్రకాశం ఖరబ్ (ఒక వంద బిలియన్ = $10^{11}$) సూర్యులకంటే అధికంగా ఉంటుంది.

ఈ పూర్ణ పరమాత్మా కవిర్దేవ్ (కబిర్ దేవ్ = కబీర్ పరమేశ్వర్) అలఖ లోకంలో ప్రకటితులైరి మరియు స్వయంగా అలఖ్ లోకం యొక్క స్వామి కూడ. ఉపమాత్మక (పదవి) నామం అలఖ్ పురుష్ కూడ ఈ పరమేశ్వరులదే. ఈ పూర్ణ ప్రభు యొక్క మానవ సదృశ శరీరం తేజోమయ (స్వజ్యోతి) స్వయం ప్రకాశితమై ఉంది. ఒక రోమకుపం ప్రకాశం అరబ్ (ఒక బిలియన్ = $10^{9}$) సూర్యుల వెలుగుకంటే ఎక్కువగా ఉంటుంది.

ఈ పూర్ణ ప్రభు సతలోకంలో ప్రకటితిలైరి మరియు సతలోకం యొక్క అధిపతి కూడ వీరే. ఇందువలనే వీరి ఉపమాత్మక (పదవి) నామం సతపురుష్ (అవినాశి ప్రభు). వీరికి అకాలమూర్తి - శబ్ద స్వరూపి రామ్ - పూర్ణ బ్రహ్మ-పరమ అక్షర బ్రహ్మ మొదలగు నామంలు కలవు. ఈ సతపురుష్ కవిర్దేవ్ (కబీర్ ప్రభు) యొక్క మానవ సదృశ శరీరం తేజోమయమై ఉంది.ఒక రోమకుపం యొక్క ప్రకాశం కోట్లకొలది సూర్యులు మరియు అంతయు చంద్రుల ప్రకాశంకంటే కూడ అధికంగా ఉంది.

ఈ కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) సతపురుష్ రూపంలో ప్రకటితులై, సతలోకంలో విరాజితులై, ప్రథమంగా సతలోకంలో మిగత రచన చేసిరి.

ఒక శబ్దం (వచనం) ద్వారా పదహారు ద్వీపాలని రచించిరి. పిదప పదహారు శబ్దాలతో పదహారు పుత్రులని ఉత్పత్తి చేసిరి. ఒక మానసరోవరాన్ని రచించి అందులో అమృత జలం

నింపిరి. పదహారు కుమారుల నామంలు:- 1. "కుర్మ", 2. "జ్ఞాని", 3. "వివేక", 4. "తేజం", 5. "సహజ్ ", 6. "సన్తోష్", 7. "సూరతి", 8. "ఆనన్ద", 9. "క్షమ", 10. "నిష్కామ్", 11. "జలరంగి", 12. "అచిన్త", 13. "ప్రేమ", 14. "దయాలు", 15. "ధైర్య", 16. "యోగ సంతాయన్" అనగా "యోగజీత్". (పటం చూడండి)

సతపురుషుడు కబీర్ ప్రభువు పుత్రుడైన అచింతుడికి సత్యలోకం యందు మిగతా సృష్టిని రచించాల్సిన బాధ్యతను మరియు శక్తిని ప్రధానం చేసిరి. అచిన్తుడు శబ్దంతో అక్షర పురుషుడు (పరబ్రహ్మ) ని ఉత్పత్తి చేసి తనకు సహాయం చేయమని అంటాడు. అక్షర పురుషుడు స్నానం చేయడానికి మానసరోవరానికి వెళ్తాడు, అక్కడ ఆనందం వేసింది మరియు పడుకుంటాడు. చాలా సమయం వరకి బయటకు రాలేదు. అప్పుడు అచింతుడి ప్రార్థన మేరకు అక్షర పురుషుడిని నిద్ర నుండి మేల్కొపడానికి కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) అదే మానసరోవరం నుండి కొంత అమృత జలాన్ని తీసుకుని , ఒక గుడ్డుగా తయారుచేసి, అందులో ఒక ఆత్మని ప్రవేశింపజేసి, ఆ గుడ్డుని మానసరోవరంలోని నీటిలోకి వదులుతారు. ఆ గుడ్డు చేసే గడగడ శబ్దానికి అక్షర పురుషుడికి నిద్రా భంగం అవుతుంది. అతడు గుడ్డును క్రోధంతో చూడగానే అది రెండు ముక్కలై అందులోంచి జ్యోతినిరంజన్ (క్షర పురుషుడు) బయట పడతాడు. ఇతడె మునుముందు 'కాల్' అని పిల్వబడ్డాడు. ఇతని వాస్తవిక నామం " కైల్ ". అప్పుడు సతపురుషుడు (కబీర్దేవ్) ఆకాశవాణి చేసి ఇద్దరిని నీటినుండి బయటకు వచ్చి అచింతుడి ద్వీపంలో ఉండమంటారు. ఆజ్ఞను శిరసావహించి అక్షర పురుషుడు మరియు క్షర పురుషులిద్దరు అచింత ద్వీపమందు ఉండసాగిరి. (పిల్లల తప్పులు వారికే కనిపించాయి,ఎమనంటే పిల్లలకి తరువాత ప్రభు అవ్వాలి అను తపన కలుగకూడదు, ఎందుకంటే సమర్థుడు లేకుండా కార్యం సఫలం అవదు) తరువాత పూర్ణ ధని కవిర్దేవ్గారే రచన అంతయు స్వయంగా చేసిరి. తన శబ్ద శక్తితో ఒక రాజేశ్వరి (రాష్ట్రి) శక్తిని ఉత్పత్తి చేసి, దానిద్వారా అన్ని బ్రహ్మాండాలని స్థాపించారు. ఈ శక్తినే పరాశక్తి పరానందని అని కూడ అంటారు. పూర్ణ బ్రహ్మ అన్ని ఆత్మలని తన లోపలి నుండి, తన వచన శక్తితో, తనలాంటి మానవ శరీర సదృశంగా ఉత్పత్తి చేసిరి. ప్రత్యేక్ హంస ఆత్మా యొక్క శరీరాన్ని పరమాత్ముడిలాగే రచించారు దాని తేజం 16 (పదహారు) సూర్యులలాగా మానవ సదృష్యమై ఉంది. కానీ పరమేశ్వరుడి శరీరం యొక్క ఒక రోమకూపం యొక్క ప్రకాశం కోట్లకొలది సూర్యులకంటే అధికంగా ఉంటుంది. చాలా కాలం తరువాత క్షర పురుషుడికి ఆలోచన వచ్చింది మేము ముగ్గురం (అచింత్ - అక్షర పురుష్- క్షర పురుష్) ఒకే ద్వీపంలో ఉంటున్నాం. మిగిలిన వారంతా ఒక్కొక్కొ ద్వీపంలో ఒక్కొక్కొరిగా ఉంటున్నారు. నేను కూడ సాధన చేసి వేరొక ద్వీపాన్ని పొందుతాను. ఇలా ఆలోచించి ఒక కాలిపై నిలబడి 70 యుగాల వరకి తపస్సు చేస్తాడు.

## ఆత్మలు కాల్ వలలోకి ఏలా చిక్కాయి ?

విశేషం:- ఎప్పుడైతే బ్రహ్మ (జ్యోతి నిరంజన్) తపస్సు చేస్తుండినాడో అప్పుడు మనం

**అన్ని ఆత్మలము, ఎవైతే నేడు జ్యోతి నిరంజన్ యొక్క ఇరవైఒక్క బ్రహ్మాండాలలో ఉంటున్నాయో, అవన్ని అతని సాధనపై ఆసక్తులైనాయి మరియు అంతరాత్మాతో అతడిని కోరుకొన సాగినవి. తమ సుఖదాయి ప్రభు సత్యపురుషుడికి విముఖులైరి. అందువలన పవిత్రతా అను పదవి నుండి పడిపోయిరి. పూర్ణ ప్రభు పదే పదే హెచ్చరిస్తున్నా కూడ మన ఆసక్తి క్షర పురుషుడి నుండి మరల లేదు.** (ఈ ప్రభావమే నేటికి కాల్ లోకంలో విరాజిల్లుతున్నది. యువకులు హీరో, హీరోయిన్స్ అందంపై మరియు వారు డబ్బుల కోసం చేసే నటనపై ఆసక్తి పెంచుకుంటారు. వద్దన్నా వినరు. ఒకవేళ హీరో కానీ హీరోయిన కానీ దగ్గరి నగరంలోకి వస్తున్నారంటే వాళ్లని చూడటానికి ఆ యువకులు వరుస కడుతారు. ' తీసుకోవడం ఒకటి ఐతే, ఇవ్వడం రెండు' అన్నట్లు తమ కడుపుకోసం హీరో సంపాదించకుంటే, యువకులు మోసగింపబడుతున్నారు. తల్లి తండ్రులు ఏమియు, ఎంతయు చెప్పిన పిల్లలు వినరు. ఎదో ఒక సమయంలో దొంగతనంగానైన సినిమాకి పోతునే ఉంటారు).

**పూర్ణ బ్రహ్మ కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) క్షరపురుడితో ఏమి కావాలో కోరుకోమని అంటారు. అతను అంటాడు, తండ్రి ఈ ద్వీపం నాకు చాలా చిన్నదిగా ఉంది, నాకు వేరొక ద్వీపాన్ని ప్రసాదించు కృప చేయండి. హక్కా కబీర్ (సత కబీర్) అతడికి 21 బ్రహ్మాండాలని ప్రసాదిస్తారు. కొంత సమయం పిదప జ్యోతినిరంజన్‌కి ఆలోచన వచ్చింది వీటిలోను కొంత రచన చేయాలి అని. వట్టి బ్రహ్మాండాలు (ప్లాట్) ఎమి పనికి? ఇలా ఆలోచించి 70 యుగాలు తపస్సు చేసి పరమాత్మా కవిర్దేవ (కబీర్ ప్రభు) నుండి రచనా సామగ్రిని యాచించిరి. సతపురుష్ అతడికి మూడు గుణాలు మరియు ఐదు తత్వంలు ప్రసాదించిరి, వాటితో బ్రహ్మ (జ్యోతినిరంజన్) తన బ్రహాండాలలో కొంత రచన చేసిరి. మరల ఆలోచన చేసిరి ఏమనంటే వీటిలో జీవులు కూడ ఉండాలి, ఒంటరిగా ఉండాలనిపించడం లేదు. ఈ ఆలోచన చేసి 64 యుగాల వరకి మరల తపస్సు చేసిరి. కబీర్ పరమాత్మా అడగగా నాకు కొన్ని ఆత్మలు కావాలి, ఒంటరిగా నేను ఉండలేకపోతున్నాను అని అంటాడు. అప్పుడు సతపురుష్ కవిరగ్ని (కబీర్ పరమేశ్వర్) అన్నారు బ్రహ్మ నీ తపస్సుకి ప్రతిఫలంగా నీకు ఇంకొన్ని బ్రహాండాలని ఇవ్వగలను, కానీ నా ఆత్మలని ఏలాంటి జప-తప సాధనలకి ఫల రూపంగా ఇవ్వలేను. అవును, ఒకవేళ ఏవరైన స్వేచ్ఛతో నీతో పాటు వస్తానంటే ఆ ఆత్మలు వెళ్లొచ్చు. యువ కబీర్ (సమర్థ కబీర్) వచనములు విని జ్యోతినిరంజన్ మన దగ్గరికి పస్తాడు. మనమంత హంస ఆత్మలము మొదటినుండి అతడిపై ఆసక్తులై ఉంటిమి. మనం అతడికి నాలుగు వైపుల చేరి నిలబడితిమి. జ్యోతినిరంజన్ అంటాడు- నేను త్రండి నుండి వేరే 21 బ్రహ్మాండాలని పొందితిని. అక్కడ వివిధ రకాలైన రమణీయ, మనోహరమైన స్థలాలు తయారు చేసితిని. మీరు నాతో పాటు వస్తారా? మనం అన్ని ఆత్మలము ఏవైతే నేడు 21 బ్రహాండాలలో పీడింపబడుతున్నవి, అనినాము మేము సిద్ధంగా ఉన్నాము ఒకవేళ త్రండిగారు ఆజ్ఞని ఇస్తే. అప్పుడు క్షర పురుషుడు పూర్ణ బ్రహ్మ మహాన్ కవిర్ (సమర్థ కబీర్ ప్రభు) దగ్గరికి వెళ్తాడు మరియు జరిగింది చెబుతాడు. అప్పుడు కవిరగ్ని (కబీర్ పరమేశ్వర్) అంటారు నా ఎదుట స్వీకృతి ఇచ్చువాళ్లకి ఆజ్ఞని**

# ఒక బ్రహ్మాండం యొక్క లఘు చిత్రం



ఇస్తాను. క్షర పురుష్ మరియు పరమ అక్షర పురుష్ (కవిరమితౌజా) ఇద్దరును హంస ఆత్మలమైన మన దగ్గరికి వచ్చిరి. సత్ కవిర్దేవ్ అన్నారు ఏ హంస ఆత్మ బ్రహ్మతో పాటు వెళ్లాలి అనుకుంటుందో చేయ్యి పైకి లేపి తన స్వీకృతిని ఇవ్వోచ్చు అని. తమ తండ్రి ఎదుట ఎవరికి ధైర్యం చాలలేదు. ఎవరు కూడా స్వీకృతిని ఇవ్వలేదు. చాలా సమయం వరకు నిశబ్దం ఆవహించింది. అటు తరువాత ఒక హంస ఆత్మ సాహసం చేసింది మరియు అంది తండ్రి నేను వెళ్లాలి అనుకుంటున్నాను అని. ఇక ఆ ఆత్మను చూసి (ఎవైతే నేడు 21బ్రహాండాలలో చిక్కి ఉన్నాయి) హంసాత్మలన్నియు స్వీకృతిని ఇచ్చినవి. పరమేశ్వర్ కబీరజీ జ్యోతినిరంజన్‌తో అనినారు నీవు నీ స్థానానికి వెళ్లిపో. ఎవరైతే నీతో పాటు రావడానికి స్వీకృతిని ఇచ్చినాయో నేను ఆ సర్వ హంస ఆత్మలని నీ దగ్గరికి పంపిస్తాను. జ్యోతినిరంజన్ తన 21 బ్రహ్మాండాలలోకి వెళ్లిపోతాడు. ఆ సమయం వరకు ఈ 21 బ్రహ్మాండాలు సతలోకంలోనే ఉండినవి.

అటు తరువాత పూర్ణబ్రహ్మ సర్వ ప్రథమంగా స్వీకృతినిచ్చు హంసకి బాలిక రూపం ఇచ్చిరి కానీ స్త్రీ ఇంద్రి (యోని) రచించలేదు మరియు అన్ని ఆత్మలని (ఏవైతే సమ్మతినిచ్చాయో) ఆ అమ్మాయి శరీరంలో ప్రవేశింపజేసిరి. ఆమె పేరు అష్టా (ఆది మాయ/ ప్రకృతి దేవి/ దుర్గా) అయింది. సత్యపురుష్ ఆమెతో అంటారు కుమారి! నేను నీకు శబ్ద శక్తిని ప్రసాదించాను. ఎన్ని జీవులని బ్రహ్మ ఉత్పత్తి చేయమంటే అన్ని నీవు ఉత్పత్తి చేయ్. పూర్ణ బ్రహ్మ కవిర్దేవ్ (కబీర్ సాహెబ్) తన పుత్రుడు సహజదాస్ ద్వారా ప్రకృతిని క్షర పురుషుడి వద్దకి పంపిచిరి. సహజదాస్‌జీ జ్యోతినిరంజన్‌తో అంటారు తండ్రిగారు ఈ సోదరి శరీరంలోకి ఆ అన్ని ఆత్మలని (ఎవైతే సహమతిని ఇచ్చినాయో) ప్రవేశింపచేసినారు మరియు ఈమెకి వచన శక్తిని ప్రసాదించినారు, మీరు ఎన్ని జీవులని కోరుకుంటే ప్రకృతి తన శబ్దంతో ఉత్పత్తి చేయగలదు. ఇది చెప్పి సహజదాస్ తిరిగి తన ద్వీపానికి వచ్చేస్తాడు.

యువ అగుట వలన అమ్మాయి రంగు రూపు నిగనిగలాడుతుండింది. బ్రహ్మ లోపల విషయ-వాసనలు ఉత్పన్నం అయినాయి మరియు ప్రకృతి దేవితో అమర్యాదగా ప్రవర్తించడం ప్రారంభిస్తాడు. అప్పుడు దుర్గ అంటుంది జ్యోతినిరంజన్ నా వద్ద తండ్రిగారి ద్వారా ప్రసాదిత శబ్ద శక్తి ఉంది. మీరు ఎన్ని జీవులు అంటే అన్నింటిని నేను వచనంతో ఉత్పత్తి చేయగలను. మీరు మైథున పరంపరని ప్రాదంభించకండి. మీరు కూడ ఆ తండ్రి యొక్క శబ్దంతో గుడ్డునుండి ఉత్పన్నం అయినారు మరియు నేను కూడ ఆ పరమపితా యొక్క వచనంతో పిదప ఉత్పన్నం అయితిని. అనగా మీరు నా పెద్ద అన్నయ్య అవుతారు, అన్నా-చెల్లెలి ఈ కలయిక మహాపాపంకు కారణం అవుతుంది. కానీ జ్యోతినిరంజన్ ప్రకృతిదేవి యొక్క ఒక ప్రార్థన కూడ వినలేదు మరియు తన శబ్ద శక్తి ద్వారా గోళ్లతో స్త్రీ ఇంద్రి (యోని) ని ప్రకృతికి తగిలిస్తాడు మరియు అత్యాచారం చేయడానికి చూస్తాడు. ఆ సమయంలోనే దుర్గా తన పరువుని రక్షించుకోవడానికి వేరే మార్గం లేక సూక్ష్మ రూపం ధరించి జ్యోతినిరంజన్ యొక్క తెరిచిన ముఖం ద్వారా కడుపులోకి ప్రవేశించి పూర్ణబ్రహ్మ కవిర్‌దేవ్‌తో తన రక్షణకోసం యాచిస్తూంది. ఆ సమయంలోనే కవిర్దేవ్ (కవిర్ దేవ్) తన పుత్రుడు యోగ సంతాయన్

అనగా యోగజీత్ యొక్క రూపాన్ని ధరించి అక్కడ ప్రకటితులైరి. కన్యని బ్రహ్మ ఉదరం నుండి బయటకు తీసిరి మరియు అనిరి జ్యోతినిరంజన్! నేటి నుండి నీ పేరు 'కాల్' అవుతుంది. నీ జన్మ-మృత్యువు అవుతుంటాయి. ఇందువలనే నీ నామం క్షర పురుషుడౌతుంది మరియు ఒక లక్ష మానవ శరీర ధారి ప్రాణులని ప్రతిదినం తినాలి మరియు లక్ష పావు ఉత్పత్తి చేస్తూ ఉండాలి. మీ ఇద్దరిని 21 బ్రహ్మాండాల సహితంగా బహిష్కరిస్తున్నాను. ఇలా అనగానే ఇరవైఒక్క బ్రహ్మాండాలు విమానంలాగా కదిలిపోయాయి. సహజదాస్ ద్వీపానికి దగ్గరగా వెళ్ళి సతలోకంనుండి పదహారు సంఖ కోస్ (ఒక కోస్ అంటే సుమారు 3 కి.మీ.) ల దూరంలో వచ్చి ఆగిపోయాయి.

విశేష్ వివరణ- ఇప్పటి వరకి ముగ్గురు శక్తుల వివరణ వచ్చింది.

1. పూర్ణ బ్రహ్మ. వీరికి గల మిగతా నామములు సతపురుషుడు, అకాల పురుషుడు, శబ్దస్వరూపి రాముడు, పరమ అక్షర బ్రహ్మ/పురుషుడు. ఈ పూర్ణబ్రహ్మ అసంఖ్య/ అనంత బ్రహ్మాండాలకి ప్రభువు మరియు వాస్తవంలో నాశనం లేనివారు అనగా అవినాశి.

2. పరబ్రహ్మ. వీరిని అక్షర పురుషుడు అని కూడ అంటారు. వాస్తవంగా వీరు అవినాశి కాదు అనగా నాశనం కలవారు. ఈయన ఏడు సంఖ బ్రహ్మాండాలకి స్వామి.

3. బ్రహ్మ. వీరికి జ్యోతినిరంజన్, కాల్, కైల్, క్షర పురుషుడు మరియు ధర్మరాయ్ వంటి పేర్లు కలవు. ఈయన 21 బ్రహ్మాండాలకి స్వామి. మందుగా ఈ బ్రహ్మ యొక్క ఒక బ్రహ్మాండం యొక్క సృష్టి ఎలా ఉంటుందో తెలుసుకుందాం. మనకి మరో మూడు పేర్లు పరిచయం అవుతాయి - బ్రహ్మా, విష్ణు మరియు శివుడు.

**బ్రహ్మ మరియు బ్రహ్మా మధ్య భేదం:-** ఒక బ్రహ్మాండంలోని అన్నింటికంటే పైన గల స్థానంలో బ్రహ్మ (క్షర పురుషుడు) స్వయంగా మూడు రహస్య స్థానాలని రచించి బ్రహ్మా, విష్ణు మరియు శివ రూపంలో ఉంటాడు మరియు తన భార్య ప్రకృతి (దుర్గా) యొక్క సహయోగంతో ముగ్గురు పుత్రులని ఉత్పత్తి చేస్తాడు. వారి పేర్లు కూడ బ్రహ్మా, విష్ణు మరియు శివ అనే పెడతాడు. బ్రహ్మ యొక్క కుమారుడైన బ్రహ్మా ఒక బ్రహ్మాండంలోని కేవలం మూడు లోకాలలోని (పృథ్విలోకం, స్వర్గలోకం మరియు పాతాలలోకం) ఒక్క రజోగుణ విభాగం యొక్క మంత్రి (స్వామి). ఈయన్ని త్రిలోకియ బ్రహ్మా అని అంటారు మరియు బ్రహ్మ ఎవరైతే బ్రహ్మలోకంలో బ్రహ్మా రూపంలో ఉంటారో ఆయన్ని మహాబ్రహ్మా మరియు బ్రహ్మలోకియ బ్రహ్మా అని అంటారు. ఈ బ్రహ్మ (కాల్) ని సదాశివ్, మహాశివ్, మహావిష్ణు అని కూడ అంటారు.

శ్రీ విష్ణు పురాణంలో ప్రమాణము :- చతుర్థ అంశ అధ్యాయం 1 పేజి 230-231లో శ్రీ బ్రహ్మాగారు అనినారు:- ఏ అజన్మ, సర్వమయ విధాతా పరమేశ్వరుడి యొక్క ఆది, మధ్యమం, అంతం, స్వరూపం, స్వభావం, మరియు సారం మేము తెలుసుకొనలేము. (శ్లోకం 83)

ఏవరైతే నా రూపాన్ని ధరించి సంసారంని రచిస్తాడు, స్థితి సమయంలో ఏ పురుష్ రూపం ఉందో మరియు ఏవరైతే రుద్ర రూపంలో విశ్వంను గ్రహించి వేస్తాడు, అనంత రూపంతో సంపూర్ణ జగత్తుని ధారణ (పాలన) చేస్తాడు. (శ్లోకం 86).

## "శ్రీ బ్రహ్మా, విష్ణు మరియు శివుల జననం"

21 బ్రహ్మాండాలు సతలోకంనుండి దూరం అయినాకా, కాల్ ప్రకృతితో అంటాడు ఇక నన్ను ఎవరు ఎమి చేయగలరు? నాకు ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తాను. ప్రకృతి మరల ప్రార్థిస్తుంది కొంచం సిగ్గు పడండి అని. మొదట మీరు నాకు అన్నయ్య అవుతారు, ఎందుకంటే ఆ పూర్ణ పరమాత్మ (కవిర్దేవ్) వచన శక్తితో మీది (బ్రహ్మ) ఉత్పత్తి గుడ్డు నుండి జరిగింది మరియు తరువాత నా ఉత్పత్తి ఆ పరమేశ్వరుడి వచనంతోనే అయింది. రెండవది నేను మీ కడుపు నుండి బయటకు వచ్చితిని, అనగా నేను మీకు కుతూరుని అయ్యాను మరియు మీరు నాకు తండ్రి అయ్యారు. ఈ పవిత్ర సంబంధాలని తెంచడం అనేది మహాపాపం అవుతుంది. నా వద్ద తండ్రి ద్వారా ప్రసాదిత శబ్ద శక్తి ఉంది. ఎన్ని ప్రాణులు మీరు అంటారో అన్నింటని ఉత్పత్తి చేస్తాను. జ్యోతినిరంజన్ దుర్గాదేవి యొక్క ఒక్క మాటని కూడ వినలేదు మరియు అనినాడు నాకు ఏ శిక్ష పడాలో పడింది, నన్ను సతలోకంనుండి బహిష్కరించారు. ఇక మనస్సుకి నచ్చినట్లు చేస్తాను. ఇది చెప్పి కాల్ పురుష్ (క్షర పురుష్) ప్రకృతితో పాటు బలవంతంగా వివాహం చేసుకుంటాడు మరియు ముగ్గురు కుమారుల (రజోగుణ యుక్త-బ్రహ్మాజీ, సతగుణ యుక్త- విష్ణుజీ మరియు తమోగుణ యుక్త- శివ శంకరజీ) ఉత్పత్తి చేసినాడు. యుక్త వయస్సు వచ్చేంతవరకు ముగ్గురిని దుర్గాదేవి ద్వారా అచేతనంగా ఉంచుతాడు, తరువాత యువకులు అయినాకా శ్రీ బ్రహ్మాగారిని కమలం పువ్వుపై, శ్రీ విష్ణువుని ఆదిశేషుడిపై మరియు శ్రీ శివుడిని కైలాస పర్వతంపై సచేతనంగా చేసి, ఒకరినొకరు కలిసేలా చేస్తాడు. అటు తరువాత ప్రకృతి ద్వారా ఈ ముగ్గురి వివాహములు చేయిస్తాడు మరియు ఒక బ్రహ్మాండంలోని మూడు లోకాలలోని (స్వర్గలోకం, పృథ్వీలోకం మరియు పాతాళలోకం) ఒక్కొక్క విభాగం యొక్క మంత్రిగా (ప్రభు) నియమిస్తాడు. ఎలాఅంటే, శ్రీ బ్రహ్మాగారికి రజోగుణ విభాగం, శ్రీ విష్ణుగారిని సతగుణ విభాగం మరియు శ్రీ శివశంకరగారికి తమోగుణ విభాగం మరియు స్వయం రహస్య (మహాబ్రహ్మా -మహావిష్ణు -మహాశివ) రూపంలో ముఖ్యమంత్రి పదవిని నిర్వర్తిస్తాడు. ఒక బ్రహ్మాండంలో ఒక బ్రహ్మలోకాన్ని రచించిరి. అందులోనే మూడు రహస్య స్థానంలు ఏర్పర్చిరి. ఒకటి రజోగుణ ప్రధాన స్థానం ఉంది అక్కడ ఈ బ్రహ్మ (కాల్) స్వయంగా మహాబ్రహ్మా (ముఖ్యమంత్రి) రూపంలో ఉంటాడు మరియు తన భార్య దుర్గని మహాసావిత్రి రూపంలో ఉంచుతాడు. ఈ ఇద్దరి సంయోగంతో ఏ పుత్రుడైతే ఈ స్థానంపై ఉత్పత్తి అవుతాడో అతడు స్వత: రజోగుణి అవుతాడు. రెండవ స్థానం సతగుణ ప్రధానమైనది. అక్కడ ఈ క్షర పురుషుడు స్వయం మహావిష్ణు రూపంను ధరించి ఉంటాడు మరియు తన భార్య దుర్గను మహాలక్ష్మి రూపంలో ఉంచి ఏ పుత్రుడినైతే ఉత్పన్న చేస్తాడో అతడి పేరు విష్ణు పెడతాడు, ఆ బాలుడు సతగుణ యుక్తుడుగా ఉంటాడు. మూడవది ఈ కాల్ అక్కడనే ఒక తమోగుణ ప్రధాన క్షేత్రంను తయారుచేసినాడు. అందులో స్వయంగా సదాశివ రూపాన్ని ధరించి. తన భార్య దుర్గాదేవిని మహాపార్వతి రూపంలో ఉంచుతాడు. వీరిద్దరి భార్య-భర్తల వ్యవహారంతో కలిగే పుత్రుడికి

శివ అని పేరు పెడతారు మరియు అతడిని తమోగుణ యుక్తుడిగా చేసేస్తారు. (ప్రమాణం కోసం చూడండి పవిత్ర శ్రీ శివ మహాపురాణం, విధ్యవేశ్వర్ సంహిత పేజి 24-26 పై బ్రహ్మ, విష్ణు, రుద్ర మరియు మహేశ్వర్ కంటే అన్య సదాశివుడు ఉన్నారు మరియు రుద్ర సంహిత అధ్యాయ 6 మరియు 7,9 పేజి నం. 100నుండి, 105 మరయు 110 పై అనువాద కర్త శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్, గీతాప్రెస్ గోరఖపూర్ నుండి ప్రచురిత మరియు పవిత్ర శ్రీమద్ దేవిమహాపురాణం మూడవ స్కందం పేజి నం. 114 నుండి 123 వరకు,గీతాప్రెస్ గోరఖపూర్ నుండి ప్రచురిత, అనువాద కర్త శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ చిమన్ లాల్ గోస్వామి). తరువాత వీరినే మోసంలో ఉంచి తన ఆహారం కోసం జీవుల ఉత్పత్తి శ్రీ బ్రహ్మగారి ద్వారా మరియు స్థితి (ఒకరి యెడల ఒకరికి మోహ మమతలో ఉంచి కాల్ వలలో ఉంచడం) శ్రీ విష్ణుగారి ద్వారా మరియు సంహారం (ఎందుకంటే కాల్ పురుషుడికి శాపం వలన ఒక లక్ష మానవ శరీర ధారి ప్రాణుల సూక్ష్మ శరీరాలనుండి మురికిని తీసుకుని తినాల్సి ఉంటుంది. దానికోసం 21 బ్రహ్మాండంలో ఒక తప్తశిలా ఉంది అది స్వత: వేడిగా ఉంటుంది, దానిపై సూక్ష్మ శరీరాన్ని వేడి చేసి మురికిని పిండుకుని తింటాడు. జీవులు చనిపోవు కానీ కష్టం సహించరాని విధంగా ఉంటుంది.తరువాత ప్రాణులకి కర్మ ఆధారంపై మిగతా శరీరాలని ప్రసాదిస్తాడు) శ్రీ శివుడు ద్వారా చేయిస్తాడు. ఏలాఅంటే ఒక భవనంలో మూడు గదులు కలవు అనుకుందాం. ఒక గదిలో అశ్లీల చిత్రములు కలవు. ఆ గదిలోకి వెళ్లగానే మనసులో అలాంటి మలిన ఆలోచనలు ఉత్పన్నం అవుతాయి.రెండవ గదిలో సాధు-సంత్‌ల, భక్తుల చిత్రములు తగిలించి ఉంటే మనసులోను మంచి విచారంలు, ప్రభు చింతన ఉంటుంది. మూడవ గదిలో దేశ భక్తుల మరియు అమరుల చిత్రములు ఉంటే మనసులో అలాంటి ఉద్వేదిత విచారములు ఉత్పన్నం అవుతాయి. సరిగ్గా ఈ విధంగానే బ్రహ్మ (కాల్) తన అవసరత-ఆవశ్యకతతో పైన తెల్పిన మూడు గుణ ప్రధాన స్థానముల రచనా చేసియున్నారు.

## "మూడు గుణాలు ఏమిటి? ప్రమాణ సహితంగా"

"మూడు గుణాలలో రజగుణం బ్రహ్మజీ, సతగుణం విష్ణుజీ, తమగుణం శివుడు. ముగ్గురును బ్రహ్మ (కాల్) మరియు ప్రకృతి (దుర్గా) ద్వారా ఉత్పన్నులైరి మరియు ముగ్గురును నాశనం కలవారు".

ప్రమాణం:- గీతా ప్రెస్ గోరఖ్‌పూర్ నుండి ప్రచురిత శ్రీ శివమహాపురాణం ,సంపాదకులు శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ పేజి సం.24 నుండి 26, విధ్యవేశ్వర్ సంహిత మరియు పేజి 110 అధ్యాయం 9, రుద్ర సంహిత" ఈ విధంగా బ్రహ్మ-విష్ణు మరియు శివ ముగ్గురు దేవతలలో గుణంలు కలవు, కానీ శివ (బ్రహ్మ-కాల్) ని గుణాతీతుడు అని అనినారు.

రెండవ ప్రమాణం:- గీతా ప్రెస్ గోరఖ్‌పూర్ నుండి ప్రచురిత శ్రీమద్ దేవిభాగవత్ పురాణం , శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ చిమన్ లాల్ గోస్వామి, మూడవ స్కందం, అధ్యాయం5 పేజి 123:- భగవాన్ విష్ణు దుర్గాదేవిని స్తూతిస్తారు ఇలా:- నేను (విష్ణు) , బ్రహ్మ మరియు

శంకర్ మీ కృపతోనే విధ్యామానులై ఉంటిమి. మా ఆవిర్భావం (జన్మ) మరియు తీరొభావం (మృత్యువు) అవుతుంది. మేము నిత్యులము (అవినాశి) కాము. నీవే నిత్యం, జగత్‌జననివి, ప్రకృతి మరియు సనాతన దేవివి.

భగవాన్ శంకర్ అంటారు:-భగవాన్ బ్రహ్మ మరియు భగవాన్ విష్ణు మీ నుండి ఉత్పన్నం అయినపుడు వాళ్ల పిదప ఉత్పన్నమగు నేను తమగుణ లీలా చేయు శంకరుడను నీ సంతానం కానా? అనగా నన్ను కూడ ఉత్పన్నం చేయువారు మీరే. ఈ సంసారం యొక్క సృష్టి-స్థితి-సంహారంలో నీ గుణములు ఎల్లవేళ ఉంటాయి. ఈ మూడు గుణాలతో జన్మించిన మేము, బ్రహ్మ-విష్ణు-శంకరుడు నియమానుసారంగా కార్యముచేయుట యందు తత్పరులై ఉంటాము.

పై వివరణ కేవలం హిందిలోకి అనువదించబడిన శ్రీదేవి మహాపురణంలోనిది, అందులో కొన్ని విషయాలు దాచడం జరిగింది. ఇందువలన ఈ ప్రమాణమే చూడండి శ్రీ మద్‌దేవిభాగవత్ మహాపురాణం సభాషటికం సమహాత్యం, ఖేమరాజ్ శ్రీ కృష్ణదాస్ ప్రకాశన్ ముంబయి, ఇందులో సంస్కృత సహితంగా హిందిలో అనువాదం చేయబడింది. మూడవ స్కందం అ. 4. పేజి 10, శ్లోకం 42 :-

బ్రహ్మ-అహమ్ ఈశ్వర: పిలతే ప్రభావాత్సర్వే వయం జని యూతా న యదా తు నిత్యా:, కే అన్యే సురా: శతమఖ్ ప్రమూఖా: చ నిత్యా నిత్యా త్వమేవ జనని ప్రకృతి: పురాణా ।

అనువాదం:- హే మాతా! బ్రహ్మ, నేను మరియు శివ నీ ప్రభావంచే జన్మితులము, నిత్యులముకాము అనగా మేము అవినాశులము, ఇక మిగతా ఇంద్రాది దేవతలు ఎటుల నిత్యులు అవగలరు. నీవే అవినాశివి, ప్రకృతి మరియు సనాతన దేవివి. (42)

పేజి 11-12, అధ్యాయం 5, శ్లోకం 8 :-

యది దయార్ధమనా న సదాం2బికే కథమహం విహిత: చ తమోగుణ: కమలజశ్చ రజోగుణసంభవ: సూవిహిత: కిమూ సత్యగుణో హరి:।

అనువాదం:- భగవాన్ శంకర్ ఇలా అంటారు:- హే మాతా! మాపై నీవు దయాయుక్తురాలువైతే నన్ను తమోగుణుడిగా ఎందుకు చేశావు? కమలం నుండి ఉత్పన్నమైన బ్రహ్మని రజోగుణుడిగా ఎందుకు చేశావు?మరియు విష్ణువుని సతగుణుడిగా ఎందుకు చేశావు? అనగా జీవుల జన్మ-మృత్యువు రూపి చెడు కార్యములయందు మముల్ని ఎందుకు నియమించావు?

శ్లోకం 12 :-

రమయసే స్వపతిం పురుషం సదా తవ గతిం న హి విహ విద్మ శివే (12)

అనువాదం:- తన పతి అనగా కాల్ భగవానుడితో ఎల్లపుడు భోగ విలాసం చేస్తూంటావు. మీ గతి ఎవరికి తెలియదు.

ఫలితం:- పై వచనంల నుండి ప్రమాణికరించబడింది ఏమిటంటే రజోగుణం-బ్రహ్మ, సతగుణం-విష్ణు మరియు తమోగుణం-శివుడు అని. ఈ ముగ్గురు నాశనం కలవారు. దుర్గా యొక్క భర్త బ్రహ్మ (కాల్). ఇతడు ఆమెతో భోగ విలాసం చేస్తాడు.

## "బ్రహ్మ(కాల్)అవ్యక్తంగా ఉండు ప్రతిజ్ఞ"

(సూక్ష్మవేదం నుండి శేష సృష్టి రచనా........)

ముగ్గురు కుమారుల జననం తరువాత బ్రహ్మ తన పత్నియగు దూర్గా (పకృతి) తో అంటాడు నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను. నేను భవిష్యత్తులో ఎవరికి తన వాస్తవిక రూపంలో దర్శనం ఇవ్వను. అందువలన నేను అవ్యక్తుడిగా అనగా వ్యక్తంకానివాడుగా భావింపబడుతాను. నీవు నా భేదాన్ని ఎవరికి ఇవ్వద్దు. నేను రహస్యంగా ఉంటాను. దుర్గాదేవి అడుగుతుంది మీరు మీ యొక్క పుత్రులకి కూడ దర్శనం ఇవ్వరా? బ్రహ్మ అంటాడు నేను నా పుత్రులకి మరియు అన్యులకి ఏలాంటి సాధన వలన దర్శనం ఇవ్వను, ఇది నా శాశ్వత నియమం. దుర్గా అంటుంది ఇదైతే అంత ఉత్తమ నియమం కాదు మీరు మీ సంతానం నుండి కూడ దాగి ఉంటారా? అప్పుడు కాల్ అంటాడు దుర్గా ఇది నా వివశతా (విధి=బలహీనత). నాకు ఒక లక్ష మానవ శరీర ధారి ప్రాణులను తిను శాపం ఉంది. ఒకవేళ నా కుమారులకి (బ్రహ్మ, విష్ణు, మహేష్) ఈ విషయం తెలిస్తే ఉత్పత్తి, స్థితి మరియు సంహారం అను కార్యములు చేయరు. ఇందువలన ఈ నా అనుత్తమ నియమం ఎల్లప్పటికి ఉంటుంది. ఎప్పుడైతే వీళ్లు కొంత పెద్ద అవుతారో వీరిని అచేతులుగా చేయ్. నా విషయంలో ఏమియు చెప్పవద్దు, లేదంటే నేను నీకు కూడ దండన విధిస్తాను, దుర్గా ఈ భయంతో వాస్తవికతని చెప్పదు. ఇందువలననే గీతా అధ్యాయ 7 శ్లోకం 24లో చెప్పబడినది ఈ బుద్ధిహీన జన సముదాయం నా అనుత్తమ నియమంతో అపరిచితులై ఉన్నారు,ఏమనంటే నేను ఎప్పటికిని ఎవరి ఎదుట ప్రకటితము కాను. నా యోగమాయ ద్వారా దాగి ఉంటాను. ఇందువలనే నన్ను అవ్యక్తుడుకానీ మనుష్య రూపంలో వచ్చిన అనగా కృష్ణుడిగా భావిస్తారు.

(అబుద్ధయ:) బుద్ధిహీన (మమ్) నా యొక్క (అనుత్తమమ్) అనుత్తమ అనగా వ్యర్థమైన (అవ్యయమ్) అవినాశి (పరమ్ భావమ్) విశేష భావంను (అజానన్త:) తెలియనివారై (మామ్ అవ్యక్తమ్) అవ్యక్తం కానీ నన్ను (వ్యక్తిమ్) మనుష్య రూపంలో (ఆపన్నమ) వచ్చినట్లు (మన్యన్తే) భావిస్తారు అనగా నేను కృష్ణుడను కాను. (గీతా అధ్యాయం 7 శ్లోకం 24).

గీతా అ. 11 శ్లోకం 47 మరియు 48లో చెప్పబడినది ఇది నా వాస్తవిక కాల్ రూపము. దీని దర్శనం అనగా బ్రహ్మ ప్రాప్తి వేదాలలో వర్ణిత విధానాల వలన, జపంతో, తపంతో మరియు ఎటువంటి కార్యములతో కాజాలదు.

ముగ్గురు పిల్లలు యువకులు అవగానే మాతా భవాని (ప్రకృతి, అష్టంగి) అంటుంది మీరు సాగర మథనం చేయండి. మొదటిసారి సాగర మన్తన్ చేస్తే (జ్యోతినిరంజన్ తన శ్వాస ద్వారా నాలుగు వేదాలని ఉత్పన్న చేసిరి.వాటిని రహస్య వాణి ద్వారా ఆజ్ఞపించిరి సాగరంలో నివసించమని) నాలుగు వేదాలు బయటకు వస్తాయి.వాటిని బ్రహ్మ తీసుకుంటాడు. వస్తువులని తీసుకుని ముగ్గురు బాలురు తల్లి వద్దకి వస్తారు మాతా అంటుంది నాలుగు వేదాలని బ్రహ్మ తీసుకుని చదవాలి అని.

గమనిక:- వాస్తవంలో పూర్ణబ్రహ్మ (కబీర్ పరమేశ్వర్) బ్రహ్మకి ఐదు వేదాలని ప్రసాదిస్తాడు. కానీ బ్రహ్మ నాలుగు వేదాలని మాత్రమే ప్రకటిస్తాడు. ఐదవ వేదాన్ని దాచిపెడుతాడు. ఆ వేదాన్ని పూర్ణ పరమాత్మా స్వయంగా ప్రకటితులై కవిర్గిర్భి: అనగా కబీర్‌వాణి ద్వారా లోకోక్తులు మరియు దోహాల మాధ్యమంతో తెలియజేశారు.

రెండవసారి సాగర మథనం చేస్తే ముగ్గురు కన్యలు వస్తారు. ముగ్గురుని ముగ్గురికి పంచుతుంది. ప్రకృతి (దుర్గా) తన యొక్క అన్య మూడు రూపాలని (సావిత్రి, లక్ష్మి మరియు పార్వతి) ధరిస్తుంది మరియు సముద్రంలో దాచి పెడుతుంది. సాగర మథన సమయంలో బయటకు వస్తాయి. ఆ ప్రకృతే మూడు రూపాలై మరియు భగవాన్ బ్రహ్మకి సావిత్రి, భగవాన్ విష్ణువుకి లక్ష్మీ మరియు భగవాన్ శంకర్‌కి పార్వతిని భార్యలుగా ఇచ్చేస్తుంది. ముగ్గురు భార్య భర్తలు భోగవిలాసం చేసిరి, సూర మరియు అసూరులు పుడుతారు.

(మూడవ సారి సాగర మథనం చేస్తే పదునాలుగు రత్నాలని బ్రహ్మకి, అమృతాన్ని విష్ణువుకి మరియు దేవతలకి, మద్యం (కల్లు) అసూరులకి మరియు విషాన్ని శివుడు కంఠంలో నిలుపుకుంటాడు.ఇదంతా చాలా కాలం తరువాతి విషయం.)

ఎపుడైతే బ్రహ్మ వేదాలని చదవుతున్నాడో అప్పుడు అతడికి తెలిసింది ఈ సర్వ బ్రహ్మండాలని రచనా చేయు సముదాయం యొక్క యజమాని పురుషుడు వేరే ఉన్నారని. అప్పుడు ఇదే విషయాన్ని విష్ణువుకి మరియు శంకరుడి చెబుతాడు ఎమనంటే వేదాలలో వర్ణన ఉంది ఈ సృష్టిని సృష్టించిన మరొక ప్రభు ఉన్నారు కానీ వేదాలు కూడా ఆ అంతరాన్ని తెల్పలేక పోతున్నాయి, దానికోసం సంకేతం ఉంది,ఏమనంటే ఎవరైన తత్వదర్శి సంత్‌ని అడగండి అని. బ్రహ్మ తల్లి వద్దకు వస్తాడు మరియు వృత్తాంత అంతయు చెబుతు మాతా నీవు అంటు ఉండేదానివి నాకు మించి వేర్వేరు లేరని.నేనే కర్తనని.నేనే సర్వ శక్తిమంతురాలినని. కానీ బ్రహ్మ అంటాడు వేదాలు ఈశ్వరుడిచే రచింపబడినవి, ఇవి అసత్యం కాజాలవు. దుర్గా అంటుంది నీ తండ్రి నీకు దర్శనం ఇవ్వడు, ఆయన ప్రతిజ్ఞ చేసి ఉన్నారు. అప్పుడు బ్రహ్మ అంటాడు మాత నీ మాటలపై ఇక అవిశ్వాసం అయింది. నేను ఆ పురుషుడి (ప్రభు) ని తెలుసుకునే తీరుతును. దుర్గా అంటుంది ఒకవేళ ఆయన నీకు దర్శనం ఇవ్వకుంటే ఏమి చేస్తావు? బ్రహ్మ అంటాడు నేను మీకు నా ముఖాన్ని చూపించను. రెండవ వైపు జ్యోతినిరంజన్ ప్రతిజ్ఞ చేసినాడు తను అవ్యక్తుడిగానే ఉంటాను మరియు ఎవరికి దర్శనం ఇవ్వను అని అనగా **21** బ్రహ్మండాలలో ఎప్పటికిని తన వాస్తవిక కాల్ రూపంలో ఆకారంలోకి రాను అని.

గీతా అధ్యాయం 7 శ్లోకం 24

అవ్యక్తమ్, వ్యక్తిమ్, ఆపన్నమ్, మన్యన్తే, మామ్, అబుద్దయ:।
పరమ్, భావమ్, అజానన్త:, మమ, అవ్యయమ్, అనుత్తమమ్ ॥24॥

అనువాదం:- (అబుద్దయ:) బుద్ధిహీనులైన జనులు (మమ) నా (అనుత్తమమ్) అ శ్రేష్టమైన (అవ్యయమ్) శాశ్వత (పరమ్) పరమ (భావమ్) భావాన్ని (అజానన్త:) తెలియనివారై (అవ్యక్తమ్) అదృష్యమానమైన (మామ్) కాల్ అయిన నన్ను (వ్యక్తమ్) ఆకారంలో కృష్ణ

అవతారం (ఆపన్నమ్) ప్రాప్తించబడిన వాడిగా (మాన్యన్తే) భావిస్తారు.
గీతా అధ్యాయం 7 శ్లోకం 25

న, అహమ్, ప్రకాష:, సర్వస్య, యోగమాయసమావృత: ।
ముఢ:, అయమ్, న, అభిజానాతి, లోక:, మామ్, అజమ్, అవ్యయమ్ ॥25॥

అనువాదం:- (అహమ్) నేను (యోగమాయాసమావృత:) యోగమాయద్వారా దాగబడిన (సర్వస్య) అందరి (ప్రకాష:) ప్రత్యక్షం (న) కాను అనగా అవ్యక్తంగా ఉంటాను ఇందువలన (అజమ్) జన్మ తీసుకొని (అవ్యయమ్) అవినాశి శాశ్వత భావాన్ని (అయమ్) ఈ (ముఢ:) అజ్ఞాని (లోక:) జనసముదాయ సంసారం (మామ్) నన్ను (న) (అభిజానాతి) తెలుసుకోనలేదు అనగా నన్ను అవతార రూపంలో వచ్చినట్లు భావిస్తారు. ఎందుకంటే బ్రహ్మ తన శబ్ద శక్తితో వివిధ రూపాలని తయారు చేసుకుంటాడు, ఇతడు దుర్గా యొక్క భర్త ఇందువలననే ఈ మంత్రంలో అంటున్నాడు నేను శ్రీ కృష్ణ మొదలుగు వారిలా దుర్గా నుండి జన్మించను.

## “తన తండ్రి(కాల్/బ్రహ్మ)ని పొందుటకు బ్రహ్మే చేయు ప్రయత్నం”

**బ్రహ్మే తల్లిని ఆ విధంగా అడగగానే దుర్గా బ్రహ్మేతో అంటుంది అలఖ్ నిరంజన్ మీ తండ్రి.కానీ ఆయన నీకు దర్శనం ఇవ్వడు. బ్రహ్మే అంటాడు నేను దర్శించాకే వస్తాను అని.ఒకవేళ తండ్రి దర్శనం కాకుంటే ఏమి చేస్తావు? అని తల్లి అడగగా బ్రహ్మే ప్రతిజ్ఞ చేస్తాడు నాకు తండ్రి దర్శనం కానట్లయితే నేను మీ సమక్షానికి రాను. ఇలా అంటు బ్రహ్మే వ్యాకులతతో ఉత్తరదిశ వైపు వెళ్లిపోతారు అక్కడ చీకటే చీకటి ఉంటుంది. అక్కడ బ్రహ్మే నాలుగు యుగాల వరకి ధ్యానం చేస్తాడు కానీ ఏమియు ప్రాప్తించదు. కాల్ ఆకాశవాణి చేస్తాడు దుర్గా సృష్టి రచన ఎందుకు చేయలేదని? భవాని అంటుంది మీ పెద్ద కొడుకు బ్రహ్మే మొండిపట్టు పట్టి మీ దర్శనార్థం వెళ్లాడు. బ్రహ్మ (కాల్) అంటాడు అతడిని వెనకకి పిలిపించుకో అని. నేను అతడికి దర్శనం ఇవ్వను. బ్రహ్మే లేకుండా జీవుల ఉత్పత్తి కార్యము అసంభం. అప్పుడు దుర్గా (ప్రకృతి) తన శబ్ద శక్తితో గాయత్రి నామంగల బాలికని ఉత్పత్తి చేస్తుంది మరియు బ్రహ్మేని వెనక్కి తెమ్మని చెబుతుంది. గాయత్రి బ్రహ్మే దగ్గరికి వెళ్తుంది కానీ బ్రహ్మే సమాధి స్థితిలో ఉంటారు. వారికి తన దగ్గరికి ఒకరు వచ్చారు అన్న సంగతి కూడ తెలియని స్థితిలో ఉంటారు. అప్పుడు ఆదికుమారి (ప్రకృతి) గాయత్రికి ధ్యానం ద్వారా అతడి చరణాలని స్పృశించమని చెబుతుంది. గాయత్రి అలానే చేస్తుంది. బ్రహ్మేగారి ధ్యానం భంగం అయింది. క్రోధంతో ఏ పాపి నా ధ్యానంను భంగం చేసింది. నేను నిన్ను శపిస్తాను అని అనిరి. గాయత్రి అనసాగింది ఇందులో నా దోషం ఏమియు లేదు ముందుగా నా మాట వినండి తరువాత శాపం ఇవ్వండి. నన్ను తల్లి మిముల్ని వెనక్కి తీసుకురమ్మన్ని చెప్పింది, ఎందుకంటే మీరు లేకుండా జీవుల ఉత్పత్తి కాజాలదు. బ్రహ్మే అంటాడు నేను ఏలా రాను? తండ్రి దర్శనం కాలేదు. ఇలా వెళ్తె నాకు అవమానం కదా. ఒకవేళ మీరు నా తల్లితో బ్రహ్మేగారికి వారి తండ్రి దర్శనం అయింది, నేను నా కళ్లతో చూశాను అని చెబితే నీ వెంట వస్తాను. అప్పుడు గాయత్రి అంటుంది మీరు నాతో సంభోగం (సెక్స్) చేస్తే నేను మీకు అబద్ధపు సాక్షంను భరిస్తాను. బ్రహ్మేకి వేరే దారి కనపడలేదు. తల్లి ముందుకు**

వెళ్లడానికి సిగ్గు అనిపించింది, తరువాత గాయత్రితో రతిక్రియ (సంభోగం) చేస్తాడు.

అప్పుడు గాయత్రి అంటుంది మనం ఇంకో సాక్షిని ఎందుకు తయారు చేసుకొకూడదు? బ్రహ్మ అంటాడు చాలా మంచిది. అప్పుడు గాయత్రి శబ్ద శక్తితో ఒక బాలిక (పుహపవతి పేరు గల) ని పుట్టిస్తుంది మరియు తనతో ఇద్దరును అంటారు నీవు సాక్ష్యం ఇవ్వాలి, ఏమనంటే బ్రహ్మగారికి తండ్రి దర్శనం అయింది అని. అప్పుడు పుహపవతి అంటుంది నేనెందుకు అబద్ధపు సాక్ష్యం ఇవ్వాలి? అవును, ఒకవేళ బ్రహ్మనాతో రతి క్రియా చేస్తే సాక్ష్యం ఇవ్వగలను. గాయత్రి బ్రహ్మకి నచ్చచెబుతుంది వేరే మార్గం లేదు అని. అప్పుడు బ్రహ్మ పుహపవతితో సంభోగిస్తాడు. ముగ్గురు కలిసి ఆదిమాయ (ప్రకృతి) దగ్గరికి వస్తారు. ఇద్దరు దేవతలు పై షరతులు ఎందుకు పెట్టారంటే ఒకవేళ బ్రహ్మ తల్లి ఎదుట వారి అబద్ధపు సాక్ష్యంను చెబితే మాతా వాళ్లని శపిస్తుంది. ఇందువలనే అతడిని కూడ దోషిగా చేసుకున్నారు.

ఇక్కడ మహారాజ్ గరీబ్‌దాస్ జీ అంటారు– "దాస్ గరీబ్ యహ్ చుక్ ధూరో (ధూర్")

## "మాతా(దుర్గా)ద్వారా బ్రహ్మకి శాపం కలగడం"

దుర్గా బ్రహ్మని తండ్రి దర్శనం అయిందా అని అడుగుతుంది. అవునని బ్రహ్మ అనగానే సాక్ష్యం చూపించమని అడుగుతుంది. బ్రహ్మ అంటాడు వీరిద్దరి సమక్షంలో సాక్షాత్కారం అయింది.దుర్గా ఆ ఇద్దరు అమ్మాయిలని మీ ఎదుటనే సాక్షాత్కారం అయిందా అని అడుగుతుంది. అప్పుడు వాళ్లు అంటారు అవును మేము మా కళ్లతో చూశాము. భవానికి అనుమానం వస్తుంది. బ్రహ (కాల్) ఏవరికి దర్శనం ఇవ్వను అని ప్రతిజ్ఞ చేసిరి.వీళ్లేమో దర్శనం అయింది అంటున్నారు. అప్పుడు అష్టంగి (ప్రకృతి) ధ్యానం చేసి కాల్‌ని ఏంటి ఇది నిజమా?అబద్ధమా? అని అడుగుతుంది. జ్యోతి నిరంజన్ అంటాడు వీళ్లు ముగ్గురు అబద్ధం చెబుతున్నారు. అప్పుడు మాతా అంటుంది నీవు అబద్ధం చెబుతున్నావు. ఆకాశవాణి అయింది మీకు ఏమియు దర్శనం అవలేదు అని. ఈ మాట విని బ్రహ్మ తల్లితో అమ్మా! నేను శపథం చేసి తండ్రి వెదకడానికి వెళ్లితిని. కానీ నాకు తండ్రి దర్శనం అవలేదు.తిరిగి రావడానికి సిగ్గుగా అనిపించింది.అందువలనే మేము ఈ అబద్ధము చెప్పాల్సి వచ్చింది. అప్పుడు తల్లి అంటుంది నేను మిముల్ని శపిస్తాను.

బ్రహ్మకి శాపం:– నీ పూజ జగంలో జరుగదు. మునుముందు నీ వంశస్థులు ఉంటారు వాళ్లు మోసాలు చేస్తారు. అబద్దాలని తయారుచేసి జగత్తుని భ్రమింపజేస్తారు. పైకి కర్మలు చేస్తు కనిపిస్తారు కానీ లోపల వికారాలు ఉంటుయి. కథా పురాణాల్ని చదివి వినిపిస్తారు, స్వయంగా సద్గ్రంథాలలో ఉన్న వాస్తవికత తెలియకపోయిన , మాన వశంతో మరియు ధనం కోసం గురువులుగా మారి అనుసరించువారికి లోకవేదం (శాస్త్ర విరుద్ధ కల్పిత కథ) వినిపిస్తారు. దేవి–దేవతల పూజా చేస్తూ మరియు చేయిస్తూ, ఇతరులని నిందిస్తూ కష్టంపై కష్టంను భరిస్తారు. వీరిని అనుసరించు వారికి పరమార్థంను చెప్పరు. దక్షిణ కోసం జగత్‌ని భ్రమింపజేస్తారు. తమని తాము గొప్పగా భావిస్తారు, ఇతరులని నీచులుగా చూస్తారు. ఎప్పుడైతే తల్లి ముఖం నుండి ఇది వినగానే బ్రహ్మ స్పృహని కోల్పోయి నేలపై పడిపోతాడు. చాలా సమయం

పిదప స్పృహలోకి వస్తాడు.

గాయత్రికి శాపం:- నీవు మృతలోకంలో ఆవు అవుతావు. నీకు ఎన్నో ఎద్దులు పతులుగా ఉంటాయి.

పుహపవతికి శాపం:- నీ స్థానం మురకి గల, చెడు స్థలంలో ఉంటుంది. నీ పువ్వులని ఏవరు పూజకి ఉపయోగించరు. ఈ అబద్ధపు సాక్ష్యం వలన నీవు నరకంను అనుభవించాలి. నీ పేరు ' కేవడా కేతకి' అగును. (హరియాణాలో 'కూసోంధి' అంటారు.ఇది మురికి ఉన్న చోట ఉంటుంది.)

ఈ విధంగా ముగ్గురిని శపించి మాతా భవాని చాలా పశ్చాతం చెందింది. (ఈ విధంగా మొదట జీవుడు ఆలోచించక మనసు (కాల్ నిరంజన్) ప్రభావంతో తప్పు పని చేసేస్తాడు.కానీ ఆత్మ (సతపురుష్ అంశం) ప్రభావంతో అతడికి జ్ఞానం అవుతుంది అప్పుడు పశ్చాత్తాపడుతాడు. ఎలాగైతే తల్లి తండ్రులు తమ పిల్లలని చిన్న తప్పుకి శిక్షిస్తారు (క్రోధవశమై). కానీ తరువాత చాల బాధపడుతారు. ఈప్రక్రియ మనసు (కాల్-నిరంజన్) ప్రభావంతో అన్ని జీవులలో పనిచేస్తుంటుంది). అవును, ఇక్కడ ఒక విశేషం ఉంది, ఏమనంటే నిరంజన్ (కాల్-బ్రహ్మ) కూడ తను న్యాయాన్ని చేసిఉన్నాడు- ఒకవేళ ఎదైన జీవి, ఎదైన బలహీన జీవిని సతాయిస్తే (బాదపెడితే) , దానికి బదులు చెల్లించాల్సి ఉంటుంది. ఎప్పుడైతే ఆది భవాణి (ప్రకృతి, అష్టంగి) బ్రహ్మ, గాయత్రి మరియు పుహపవతికి శాపంను ఇచ్చిందో అలఖ్ నిరంజన్ (బ్రహ్మ-కాల్) అంటాడు హే భవాని! ఇది నువు మంచిగా చేయలేదు. ఇక నేను (నిరంజన్) నిన్ను కూడ శపిస్తాను. ద్వాపర యుగంలో నీకు కూడ ఐదుగురు భర్తలు ఉంటారు. (ద్రోపది ఆదిమాయ యొక్క అవతారం) ఎప్పుడైతే ఈ ఆకాశవాణి వినిందో ఆదిమాయ అంటుంది హే జ్యోతినిరంజన్! నేను నీ వశమై ఉన్నాను నీ ఇష్టంవచ్చినట్టు చేసుకో.

## "విష్ణువు తన తండ్రి(కాల్/బ్రహ్మ)ప్రాప్తి కోసం చేయు ప్రస్థానం మరియు మాతా యొక్క ఆశీర్వాదం పొందడం"

దీని తరువాత ప్రకృతి విష్ణువుని అంటుంది కుమారా! నీవు కూడ నీ తండ్రి జాడను తెలుసుకో. అప్పుడు విష్ణు తన తండ్రిని వెదుకుతూ-వెదుకుతూ పాతాల లోకంకు వెళు ్లతాడు. అక్కడ శేషనాగం ఉండింది.విష్ణువు తన హద్దులోకి ప్రవేశించడం చూసి క్రోధితుడై విషంను చీమ్ముతుంది. దాని విష ప్రభావంతో విష్ణుగారి రంగు నీలంగా మారుతుంంది,ఎలాఐతే స్ప్రే పెంట్ చేస్తే అవుతుంది. అప్పుడు విష్ణు ఈ నాగుకు మజా చూపించాలి అని అనుకుంటాడు. అప్పుడు జ్యోతినిరంజన్ (కాల్) చూస్తాడు ఇక విష్ణుని శాంతపరచాలి అని ఆకాశవాణి చేస్తాడు విష్ణు నీవు నీ మాతా దగ్గరికి వెళ్ళు మరియు సత్యం చెప్పు. ఏ కష్టమైతే శేషనాగు వలన కలిగిందో, దాని ప్రతిశోధం ద్వాపర యుగంలో తీసుకో. ద్వాపర యుగంలో మీరు (విష్ణు) కృష్ణ అవతారంను ధరిస్తారు మరియు కాలిదహ్ లో కాళింద్రి పేరుగల నాగు, శేషనాగు యొక్క అవతారం అవుతుంది.

ఊంచ్ హెూయి నే నీచ సతావై, తాకర్ ఓఏల్ (బదలా) మోహి సోం పావై ।
జో జీవ్ దేయి పిర్ పుని కాహుం, హమ్ పునీ ఓఏల్ దివావైం తాహుం ॥

**విష్ణువు మాతా వద్దకి వచ్చిరి మరియు తనకి తండ్రి దర్శనం కాలేదు అని నిజం చెప్పిరి. ఈ మాట విని మాతా (ప్రకృతి) చాలా ప్రసన్నురాలైంది మరియు అంది కుమారా నీవు సత్యవాదివి. ఇక నేను నా శక్తితో నిన్ను నీ తండ్రితో కలిపిస్తాను మరియు నీ మనసులోగల సంశయాలని తొలగిస్తాను.**

కబీర్ దేఖ్ పుత్ర తోహి పితా భిటాఊం, తౌరే మన్ కా ధోఖా మిటాఊ ।
మన్ స్వరూప కర్తా కహ్ జానోం, మన్ తే దుజా ఔర్ న మానో ।
స్వర్గ పాతాల దౌర్ మన్ కేరా, మన్ అస్థిర్ మన్ అహై అనేరా ।
నిరంకార్ మన్ హీ కో కహియే, మన్ కి ఆస్ నిశ్ దిన్ రహియే ।
దేఖ్ హూాం పలటి సున్య మహ్ జ్యోతి, జహాం పర్ ఝిల్‌మిల్ ఝూలర్ హెూతి ॥

**మాతా విష్ణువుతో అంటుంది మనస్సే జగత్తు యొక్క కర్త. ఈయనే జ్యోతి నిరంజన్. ధ్యానంలో ఒక వెయ్యి జ్యోతులు కనిపిస్తాయి అదియే ఆయన రూపం. శంఖువు, ఘంటా మొదలగు వాటి శబ్దం వింటే, అది మహాస్వర్గంలో నిరంజన్ యొక్క శబ్దం అవుతున్నట్లు. నీవు సకల దేవతలకి మకుటంలాంటి వాడవు మరియు నీ ప్రతి కోరిక మరియు కార్యము నేనే పూర్తి చేస్తాను. నీ పూజా సర్వ జగత్తులో జరుగుతుంది. నీవు నాకు సత్యం చెప్పావు. కాల్ యొక్క 21 బ్రహ్మాండాలలోని ప్రాణులకి ఒక విశేష అలవాటు ఉంది,ఏమిటంటే తమ వ్యర్థమైన మహిమని తయారు చేస్తారు. ఏలాఐతే దుర్గదేవి శ్రీ విష్ణుగారితో అంటుంది నీ పూజ సర్వ జగత్తులో అవుతుంది. నేను నీకు తండ్రి దర్శనం చేయించాను. దుర్గాదేవి కేవలం ప్రకాశాన్ని చూపించి విష్ణువుని నమ్మిస్తుంది. శ్రీ విష్ణువు గారు కూడ ప్రభువు యొక్క ఈ స్థితినే తనని అనుసరించువారికి (మునులు, ఋషులు) తెలియజేసిరి, పరమాత్మ యొక్క ప్రకాశం మాత్రమే కనిపిస్తుంది మరియు పరమాత్మా నిరాకారుడని. దీని తరువాత భవాని మహేశ్వరుడి దగ్గరికి వెళ్లి అంటుంది మహేష్! నీవు కూడ వెళ్లి నీ తండ్రిని వెదుకు. నీ ఇద్దరు అన్నయ్యలకి తండ్రి దర్శనం అవలేదు. వారికి ఏమి ఇవ్వాలో అది ప్రసాదించబడింది. ఇక నీవు అడుగు నీకేమి కావాలో. అప్పుడు మహేషుడు అంటాడు హే జనని! నా ఇద్దరు పెద్దన్నలకి తండ్రి దర్శనం అవలేదు ఇక ప్రయత్నం చేయడం వ్యర్థమవుతుంది. కృపతో నాకు నేను అమరుడిగా (మృత్యుంజయుడు) ఉండు వరమును ప్రసాదించు. అప్పుడు మాతా అంటుంది ఇది నేను చేయలేను. కానీ యుక్తిని చెప్పగలను, దాని వలన నీ ఆయస్సు అందరికంటే ఎక్కువగా అవుతుంది. యుక్తి యోగ సమాధియే. (ఇందువలనే మహాదేవుడు ఎక్కువగా సమాధిలోనే ఉంటారు). ఈ ప్రకారంగా మాతా (అష్టంగి, ప్రకృతి) ముగ్గురు పుత్రులకి విభాగాలని పంచుతుంది:-**

**భగవాన్ బ్రహ్మగారికి కాల్‌లోకం యందు 84 లక్షల శరీరాల్ని రచించు (తయారుచేయు) అనగా రజోగుణాన్ని ప్రభావితం చేసి సంతానం ఉత్పత్తి చేసేలా వివశు లని చేసే, జీవ ఉత్పత్తి చేయు విభాగంను ప్రధానం చేసిరి.**

భగవాన్ విష్ణుగారికి ఈ జీవుల పాలన పోషణ (కర్మానుసారంగా) చేయు, మరియు మోహ-మమతను ఉత్పత్తి చేసి జీవులని స్థితిలో ఉంచు విభాగం ఇచ్చిరి.

భగవాన్ శివశంకరుడికి సంహారం చేయు విభాగం ప్రధానం చేయబడింది. ఎందుకంటే వీరి తండ్రి నిరంజనుడికి ప్రతిరోజు ఒక లక్ష మానవ శరీర ధారి జీవులని తినాల్సి ఉంటుంది.

ఇక్కడ ఒక ప్రశ్న ఉత్పన్నమవుతుంది బ్రహ్మా, విష్ణు మరియు శంకరుడి ద్వారా ఉత్పత్తి, స్థితి మరియు సంహారం ఏలా జరుగుతుంది. ఈ ముగ్గురు ఎవరి లోకంలో వారుంటారు. ఎలాఐతే నేడు సమాచార వ్యవస్థకోసం, ఉపగ్రహాలని ఆకాశంలోకి పంపిస్తారు మరియు కింద నేలపై నుండి సమాచార వ్యవస్థని నడిపిస్తారు. సరిగ్గా ఈ విధంగానే ముగ్గురు దేవతలు ఎక్కడ ఉన్నా వీరి శరీరం నుండి వెలువడు సూక్ష్మగుణాల తరంగాలు మూడులోకాలలో స్వయంచాలకంగా ప్రతి ప్రాణిపై ప్రభావాన్ని చూపిస్తూంటాయి.

పై వివరణ ఒక బ్రహ్మాండంలోని బ్రహ్మ (కాల్) యొక్క రచనది. ఇలాంటి క్షర పురుషుడివి ఇరవైఒక్క బ్రహాండాలు కలవు.

క్షర పురుషుడు (కాల్) స్వయంగా ప్రకటితము కాదు అనగా వాస్తవిక శరీర రూపంలో అందరి ముందుకు రాడు. ఆయనని ప్రసన్నం చేసుకోవడానికి ముగ్గురు దేవతలు (బ్రహ్మా, విష్ణు మరియు శివుడు) వేదాలలో వర్ణింపబడిన విధంగా కఠోర సాధన చేసిన కూడ కాల్ దర్శనం కాలేదు. తరువాత వేదాలను ఋషులు చదివారు. కానీ వారు అర్థం చేసుకోలేకపోయారు. ఎందుకంటే అందరి బుద్ధి కాల్ ఆధీనంలో ఉంది. వేదాలలో రాసి ఉంది 'అగ్నే: తనుర్ అసి' (పవిత్ర యజుర్వేద అ.1మంత్రం 15) అనగా పరమేశ్వరుడు శశరీరుడు అని. పవిత్ర యజుర్వేదం అ.5 మ.1 రెండుపార్లు రాసి ఉంది'అగ్నే: తనుర్ అసి విష్ణవే త్వా సోమస్య తనుర్ అసి' ఈ మంత్రంలో వేదం రెండుసార్లు సాక్ష్యం ఇస్తుంది ఏమనంటే సర్వవ్యాపక, సర్వులని పాలించు కర్త సతపురుషుడు సశరీరుడై ఉన్నాడు. పవిత్ర యజుర్వేదం అ 40 మ. 8లో చెప్పబడింది (కవీర్ మనిషి) ఏ పరమేశ్వరుడి సర్వ ప్రాణులకి కోరిక ఉందో ఆయనే కవీర్ అర్థంలో కబీర్ పరమేశ్వరుడు. ఆయన (కబీర్) శరీరం నాడులు లేని (అస్నావీరమ్) ది, వీర్యం, ఐదు తత్వాల ద్వారా తయారుచేయబడిన భౌతిక శరీర రహితంగా (అకామయ) ఉంది. సర్వజీవుల ప్రభువు అన్నింటికంటే పైనగల సత్యలోకంలో విరాజిల్లుతున్నారు. అట్టి పరమేశ్వరుడికి తేజోమయమైన (స్వర్జ్యోతి) స్వయం ప్రకాశిత శరీరం ఉంది, అది శబ్ద రూపంలో ఉంది అనగా అవినాశియై ఉంది. ఈ కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) యే సకల బ్రహ్మాండాలని రచించిన (వ్యదధాతా) సర్వ బ్రహ్మాండాల రచనకర్త (స్వయంభు:) స్వయం ప్రకటితమగు (యథా తథ్య అర్థాన్) వాస్తవంలో అవినాశియై ఉన్నారు (గీతా అ. 15 శ్లోకం 17లో కూడ ప్రమాణం ఉంది). భావార్థ ఏమిటంటే పూర్ణ బ్రహ్మ యొక్క శరీర నామం కబీర్ (కవిర్ దేవ్). ఆ పరమేశ్వరుడి శరీరం కాంతిపుంజ తత్వంతో చేయబడినది. పరమాత్మా యొక్క శరీరం అతి సుక్ష్మంగా ఉంటుంది అది దివ్య దృష్టి తెరవబడిన సాధకులకి మాత్రమే కనిపిస్తుంది. ఈ విధంగానే జీవుడికి కూడ సూక్ష్మ

శరీరం ఉంటుంది దాని పైననే ఐదు తత్వాల అతుకు (కవరు) అనగా ఐదు తత్వాల కాయం ఉంటుంది. ఏదైతే మాతా-పితల సంయోగంతో (శుక్రం) వీర్యముతో తయారుచేయబడింది. శరీరం విడిచిన తరువాత కూడ జీవుడి సూక్ష్మ శరీరం తోడుగా ఉంటుంది. ఆ శరీరం కూడ దివ్యదృష్టి తెరవబడిన సాధకులకి కనిపిస్తుంది. ఈ విధంగా పరమాత్మ మరియు జీవుడి సాకార స్థితిని తెలుసుకోండి. వేదాలలో ఓం నామ స్మరణ యొక్క ప్రమాణం ఉంది.అది కేవలం బ్రహ్మ సాధన మాత్రమే. ఓం నామ జపం ద్వారా పూర్ణ ప్రభువుని పొందవచ్చు అని తెలుసుకుని ఋషులు కొన్ని వేల సంవత్సరాలు హఠయోగం (సమాధి) చేసిరి. కానీ ప్రభువు దర్శనం అవలేదు, కొన్ని సిద్ధులు ప్రాప్తించాయి. ఆ సిద్ధులతో ఆడుకుని, వాడుకొని ఋషులు కూడ జనన మృత్యువు చక్రంలోనే ఉండిపోయినారు.వారి అనుభవాన్ని లిఖిబద్ధం (గ్రంథస్తం) చేసి, అందులో పరమాత్మని నిరాకారుడిగా పేర్కొన్నారు. బ్రహ్మ (కాల్) ప్రతిజ్ఞ చేశాడు, ఏమనంటే నేను నా వాస్తవిక రూపంలో ఏవరికి దర్శనం ఇవ్వను. నన్ను అవ్యక్తుడిగా భావిస్తారు. (అవ్యక్తం యొక్క భావార్థం ఏమిటంటే ఆకారం ఉంటుంది కానీ వ్యక్తిగత రూపంలో స్థూల రూపంలో దర్శనం ఇవ్వరు. ఎలాగైతే ఆకాశంలో మేఘాలు కమ్మివేయడం వలన పగటి పూట సూర్యుడు కనిపించదు. సూర్యుడు కనిపించదు కానీ వాస్తవంలో మేఘాల వెనుక వైపున ఎలా ఉండాలో అలానే ఉంటాడు, ఈ స్థితిని అవ్యక్త అంటారు.) (ప్రమాణం కోసం గీతా అ. 7 శ్లోకం 24-25, అ. 11 శ్లోకం 48 & 32).

పవిత్ర గీతా చెప్పు బ్రహ్మ (కాల్) శ్రీ కృష్ణుడి శరీరంలో ప్రేతంలా ప్రవేశించి అంటున్నాడు. హే అర్జున్! నేను పెద్దగా అయిన కాల్‌ను మరియు అందరిని తినడానికి వచ్చియున్నాను. (గీతా అ.11 శ్లోకం 32). ఇది నా వాస్తవ రూపం, దీనిని నీవు కాకుండా అంతకుముందు ఎవరు చూడలేకపోయారు మరియు ఇక ముందు కూడ ఎవరు చూడలేరు.అనగా వేదాలలో వర్ణిత యజ్ఞం-జపం-తపం మరియు ఓం నామం మొదలగు విధులతో నా ఈ వాస్తవిక స్వరూపం యొక్క దర్శనం కాదు. (గీతా అ. 11 శ్లోకం 48) నేను కృష్ణుడను కాను, ఈ మూర్ఖ మనుషులు కృష్ణ రూపంలో అవ్యక్తం కానీ నన్ను వ్యక్తుడిగా (మనుష్య రూపంగా) భావిస్తున్నారు. వీరు నా వ్యర్థ నియమంతో అపరిచితులై ఉన్నారు, అది ఎమిటంటే నేను ఎప్పటికి వాస్తవిక ఈ కాల్ రూపంలో అందరి ఎదుటకు రాను. నా యోగ మాయ ద్వారా దాగి ఉంటాను. (గీతా అ. 7 శ్లోకం 24-25)

విచారం చేయండి:- తను దాగి ఉండే విధానంను స్వయంగా అశ్రేష్టమైనదిగా ఎందుకు అంటున్నారో?

ఒకవేళ ఒక తండ్రి తన బిడ్డలకి కూడ దర్శనం ఇవ్వకుంటే అందులో ఎదో ఒక లోపం ఉన్నట్లు. ఆ కారణంగానే దాగి ఉంటాడు మరియు సౌకర్యాలని కూడ ప్రసాదిస్తున్నాడు. కాల్‌కి శాపం తగలడం వలన ఒక లక్ష మానవ శరీర ధారి జీవులని ప్రతిరోజు తినాల్సి ఉంటుంది మరియు 25శాతం ఎక్కువగా ఉత్పన్నం అవుతారో వారికి ఆశ్రయం కల్పించడానికి మరియు కర్మ భోగం యొక్క దండన ఇవ్వడానికి 84 లక్షల యోనిల రచన చేయబడి ఉంది. ఒకవేళ అందరి ఎదుట కూర్చొని ఒకరి కుతురిని, ఒకరి భార్యని, ఒకరి కొడుకుని, తల్లి తండ్రులని తిన్నట్లయితే అందరికి కాల్ (బ్రహ్మ) పై ద్వేషం కలుగుతుంది మరియు

# బ్రహ్మలోకం యొక్క లఘు చిత్రం



# జ్యోతి నిరంజన్ (కాల్) బ్రహ్మ యొక్క లోకాల (21 బ్రహ్మండాల) లఘు చిత్రం



ఎప్పుడైన పూర్ణ పరమాత్మ కవిరగ్ని (కబీర్ పరమేశ్వర్) స్వయంగా వచ్చి లేదా తన సందేశ వాహకుడిని (దూతని) పంపితే అన్ని ప్రాణులు సత్యభక్తి చేసి కాల్ యొక్క చెరనుండి వెళ్ళిపోతారు. అందువలననే కాల్ మోసం చేసి ఉంచుతాడు. గీతా అధ్యాయం 7 శ్లోకం 18, 24, 25లో తన సాధన ద్వారా అగు ముక్తిని (గతి) కూడ (అనుత్తమం) అతి అశ్రేష్టమైనదిగా అనినాడు మరియు తన విధానాన్ని (నియమం) కూడ (అనుత్తమ్) అశ్రేష్టమైనదిగా చెప్పినాడు.

ప్రతిఒక బ్రహ్మాండంలోని బ్రహ్మలోకంలో ఒక మహాస్వర్గం తయారు చేసినాడు. మహాస్వర్గంలో ఒక స్థానంపై నకిలి సతలోకం– నకిలి అలఖ లోకం–నకిలి అగమ లోకం మరియు అనామి లోకం యొక్క రచనని ప్రాణులని మోసం చేయడానికి ప్రకృతి (దుర్గా/ ఆదిమాయ) ద్వారా చేయబడి ఉంది. కబీర్ సాహెబ్ గారి ఒక శబ్దం కలదు' కర్ నైనో దిదార్ మహల్ మే ప్యారా హై'లో వాణి కలదు 'కాయ భేద్ కియా నిరవారా, యహ్ సబ్ రచనా పిండ మంఝారా హై। మాయ అవిగత్ జాల్ పసారా, సో కారిగర్ భారా హై। ఆదిమాయ కిన్హి చతురాయి, ఝుఠి బాజి పిండ దిఖాయి, అవిగత్ రచనా రచి అండ మాహి వాకా ప్రతిబింబ డారా హై।'

ఒక బ్రహ్మాండంలో మిగత లోకాల యొక్క రచన ఉంది. అవి శ్రీ బ్రహ్మగారి బ్రహ్మ లోకం, శ్రీ విష్ణుగారి లోకం, శ్రీ శివుడి లోకం. వారి వారి లోకాలలో కూర్చొని ముగ్గురు ప్రభువులు కిందగల మూడు లోకాలపై (స్వర్గలోకం అనగా ఇంద్రలోకం–పృథ్వీలోకం మరియు పాతాలలోకం) ఒక్కొక్క విభాగం యొక్క యజమానులై పనులు (మంత్రులై ప్రభుత్వాన్ని నడిపిస్తారు) చేస్తారు మరియు తమ తండ్రి కాల్ యొక్క ఆహారం కోసం ప్రాణుల ఉత్పత్తి, స్థితి మరియు సంహారం యొక్క కార్యాన్ని చేస్తుంటారు. ముగ్గురు ప్రభువుల యొక్క జన్మ మృత్యువు అవుతుంది. అప్పుడు కాల్ వీరిని కూడ తింటాడు. ఈ బ్రహ్మాండలో (దీనిని అండం (గుడ్డు) అని కూడ అంటారు.ఎందుకంటే బ్రహ్మాండం గుండ్రంగా ఉ ంటుంది, దీనిని పిండం అని కూడ అంటారు. ఎందుకంటే శరీరం (పిండం) లో ఒక బ్రహ్మాండం యొక్క రచన కమలాలలో టి.వి. లాగా చూడవచ్చు) ఒక మానసరోవరం మరియు ధర్మరాయ్ (న్యాయాధీశుడు) యొక్క లోకం కలదు మరియు ఒక రహస్య స్థానంపై పూర్ణ పరమాత్మ వేరే రూపాన్ని ధరించి ఉంటాడు. ఎలాఐతే వేరే దేశస్థుడికి రాయబార కార్యాలయం, క్వార్టర్స్ ఉంటుంది. అక్కడికి ఎవరు వెళ్లలేరు. సత్యలోకం యొక్క భక్తి అసంపూర్ణంగా గల ఆత్మలు అక్కడ ఉంటాయి. ఎప్పుడైతే భక్తి యుగం వస్తుందో ఆ సమయంలో పరమేశ్వర కబీర్ తన ప్రతినిధి పూర్ణ సంత్, సతగురుని పంపిస్తారు. ఈ పుణ్య ఆత్మలు భక్తియుగ సమయంలో భూమిపై మానవ శరీరాన్ని పొందుతాయి మరియు వీరు శీఘ్రంగా సత్యభక్తిని చేస్తారు. సతగురువు ద్వారా దీక్షని పొంది పూర్ణ మోక్షాన్ని పొందుతారు. ఆ స్థానంపై ఉండునటువంటి హంస ఆత్మల యొక్క నిజ భక్తి సంపాదన ఖర్చు అవదు. పరమాత్మ యొక్క భాండాగారంతో అన్ని సౌకర్యాలు లభిస్తాయి. బ్రహ్మ (కాల్) యొక్క ఉపాసకుల భక్తి సంపాదన స్వర్గం–మహాస్వర్గంలో సమాప్తం అయిపోతుంది. ఎందుకంటే ఈ కాల్ లోకం (బ్రహ్మలోకం) మరియు పరబ్రహ్మ లోకంలో ప్రాణులకి వారు

చేసిన కర్మఫలమే లభిస్తుంది.

క్షర పురుషుడు తన 20 బ్రహ్మాండాలని నాలుగు మహాబ్రహ్మాండాలుగా విభజించినాడు. ఒక మహాబ్రహ్మాండంలో ఐదు బ్రహ్మాండాల సమూహంను తయారుచేశాడు. నాలుగు వైపుల గుండ్రటి పరిధిలో ఆపి ఉంచినాడు. (పటం చూడండి) 21వ బ్రహ్మాండం యొక్క రచన ఒక మహాబ్రహ్మాండం అంత తీసుకుని చేసిరి. 21వ బ్రహ్మాండంలోకి ప్రవేశించగానే మూడు దారులు ఉంటాయి. 21వ బ్రహ్మాండంలో కూడ ఎడమవైపు నకలి సతలోకం, నకలి అలఖ్‌లోకం, నకలి అగమలోకం మరియు నకలి అనామి లోకం యొక్క రచనా ప్రాణులని మాయలో ఉంచడానికి ఆదిమాయ (దుర్గా) ద్వారా చేయబడినది మరియు కుడివైపు పన్నెండు సర్వ శ్రేష్టమైన బ్రహ్మ సాధకులని (భక్తులని) ఉంచుతాడు. మరల ప్రతేక్యమైన యుగంలో వాటిని తన సందేశ వాహకుడిగా (సంత్ సతగురు) తయారు చేసి పృథ్విపైకి పంపిస్తాడు, అతడు శాస్త్రవిధి రహిత సాధన మరియు జ్ఞానంను చెబుతాడు మరియు స్వయం కూడా భక్తిహీనులౌతారు మరియు అనుసరించెవారిని కాల్ చెరలో పడేసి పోతారు. తరువాత గురువుగారు మరియు అనుసరించెవారు ఇద్దరును నరకానికి పోతారు. ఇంకా ఎదుట ఒక తాళం వేసి ఉంటుంది. ఆ మార్గం కాల్ (బ్రహ్మ) యొక్క నిజలోకానికి వెళ్తుంది. అక్కడ ఈ బ్రహ్మ (కాల్) తన వాస్తవిక మానవ సదృశ కాల్ రూపంలో ఉంటాడు. ఈ చోటనే ఒక రాయి ముక్క రొట్టె పెంచు ఆకారంలో (రొట్టేలు కాల్చడానికి ఇనుముతో చేసిన గుండ్రటి పెంచు) స్వత: (ఎప్పటికి) వేడిగా ఉంటుంది. దానిపై ఒక లక్ష మానవ శరీర ధారి ప్రాణుల సూక్ష్మ శరీరాలని వేయించుకుని వాటినుండి మురికిని తీసి తింటాడు. ఆ సమయంలో అన్ని ప్రాణులు చాలా బాదని అనుభవిస్తాయి మరియు హాహాకారం మొదలవుతుంది. తరువాత కొంత సమయం పిదప అవి మూర్చపోతాయి. జీవం చనిపోదు. తరువాత ధర్మరాయుడి లోకంలోకి వెళ్లి కర్మాధారంపై మిగత జన్మలని పొందుతాయి మరియు జన్మ మృత్యువు చట్రంలో ఉండిపోతాయి. పైన చెప్పిన ఎదుట గల తాళాన్ని బ్రహ్మ (కాల్) కేవలం తన ఆహారమైన ప్రాణులకోసం కొన్ని క్షణాల వరకు మాత్రమే తెరుస్తాడు. పూర్ణ పరమాత్మా యొక్క సత్యనామం మరియు సారనామంతో ఈ తాళం స్వయంగానే తెరచుకుంటుంది. ఈ విధంగా కాల్ యొక్క వలని పూర్ణ పరమాత్మ కవిర్దేవ్ (కబీర్ సాహెబ్) స్వయంగా తన నిజ భక్త ధర్మదాసుడికి వివరించారు.

## "పరబ్రహ్మ యొక్క ఏడు సంఖ బ్రహ్మాండాల స్థాపన"

కబీర్ పరమేశ్వర్ (కవిర్దేవ్) ఇంకా చెబుతున్నారు ఏమినంటే పరబ్రహ్మ (అక్షర పురుషుడు) తన కార్యంలో తప్పుని చేసినాడు. ఎందుకంటే ఇతడు మానసరోవరంపై పడుకుని ఉండేను మరియు ఎప్పుడైతే పరమేశ్వరుడు (నేను అనగా కబీర్‌సాహెబ్) ఆ సరోవరంలోకి గుడ్డుని పంపినారో అక్షర పురుషుడు దానిని క్రోధంతో చూసినాడు. ఈ రెండు అపరాధాల వలన ఇతడిని ఏడు సంఖ బ్రహ్మాండాల సహితంగా సతలోకంనుండి బయటకు పంపించబడినాడు. రెండవ కారణం అక్షర పురుషుడు తన మిత్రుడు బ్రహ్మ (క్షర పురుషుడి) వియోగంలో వ్యాకులుడై పరమపితా కవిర్దేవ్ (కబీర్‌పరమేశ్వర్) ని మరిచి

అతడినే గుర్తుచేసుకొనసాగాడు. మరియు ఆలోచించాడు ఏమనంటే క్షరపురుషుడు (బ్రహ్మ) చాలా ఆనందం (ఎంజాయ్) చేస్తున్నాడు కావచ్చు, నేను వెనుక ఉండిపోయాను మరియు మిగత కొన్ని ఆత్మలు ఏవైతే పరబ్రహ్మతోపాటు ఏడు సంఖ బ్రహ్మాండంలలో జన్మ మృత్యువు యొక్క కర్మదండనని అనుభవిస్తున్నాయో, ఆ హంస ఆత్మలు కాల్ (బ్రహ్మ) యొక్క ఇరవై ఒక్క బ్రహ్మాండాలలో ఇరికినవో తోటి ఆత్మల జ్ఞాపకంలో ఉండిపోయినవి మరియు పూర్ణ పరమాత్మ సుఖదాయి కబీర్‌దేవ్ యొక్క జ్ఞాపంకంను మరిచిపోయాయి. పరమేశ్వర్ కబీరదేవ పలుమార్లు వివరించిన కూడ వారి ఆసక్తి తక్కువ కాలేదు. పరబ్రహ్మ (అక్షర పురుషుడు) ఆలోచించాడు. నేను కూడా వేరొక స్థానంను పొందితే మంచిగా ఉంటుంది. ఇలా ఆలోచించి రాజ్యప్రాప్తి యొక్క ఇచ్చతో (కోరికతో) సారనామం యొక్క జపాన్ని ప్రారంభిస్తాడు. ఈ విధంగా మిగత ఆత్మలు (ఎవైతే పరబ్రహ్మ యొక్క ఏడు సంఖ బ్రహ్మాండంలలో ఇరికి ఉన్నవో) ఆలోచించాయి. బ్రహ్మ (కాల్) తో వెళ్లిన ఆత్మలు అక్కడ చాలా సంతోషంతో ఉండవచ్చు, మనం వెనుక ఉండిపోయాం అని. పరబ్రహ్మ మనసులో ఈ ధారణ ఏర్పడింది, ఏమనంటే క్షరపురుషుడు వేరుపడి చాలా సంతోషంగా ఉన్నాడు. ఇలా విచారం చేసి అంతరాత్మలో వేరు వేరు స్థానాలని పొందాలి అను పట్టుదలని పెంచుకుంటాడు. పరబ్రహ్మ (అక్షర పురుషుడు) హఠయోగం చేయలేదు, కానీ కేవలం వేరొక రాజ్యప్రాప్తి కోసం సహజ ధ్యాన యోగం విశేషంగా పట్టుదలతో చేయసాగాడు. వేరొక స్థానాన్ని పొందడం కోసం పిచ్చివాడిలాగా సంచరించసాగాడు, అన్నం, నీరు తాగడం మానేశాడు.మిగతా కొన్ని ఆత్మలు అతడి వైరాగ్యంపై ఆసక్తులై అతడిని ఇష్టపడసాగాయి. పూర్ణ ప్రభువు అడగగా పరబ్రహ్మ (అక్షర పురుషుడు) వేరొక స్థానంను అడిగినాడు మరియు కొన్ని హంస ఆత్మలు కావాలని యాచించాడు. అప్పుడు కవిర్దేవ్ ఏ ఆత్మలైతే స్వేచ్చగా నీతో వెళ్ళాలి అనుకుంటాయో వాటిని పంపిస్తాను అని అంటారు. పూర్ణ ప్రభువు అడిగినారు ఏ హంస ఆత్మ పరబ్రహ్మతో పాటు వెళ్లాలి అనుకుంటుందో, ఇష్టాన్ని వ్యక్తం చేయండి అని. చాలా సమయం తరువాత ఒక హంస ఆత్మ స్వీకృతిని ఇస్తుంది, పిదప చూస్తు చూడగానే అన్ని ఆత్మలు కూడ స్వీకృతిని ఇస్తాయి. మొట్టమొదట స్వీకృతిని ఇచ్చిన హంస ఆత్మని స్త్రీగా చేసినారు. ఆమె పేరు ఈశ్వరీయ మాయ (ప్రకృతి సురతి) అని పెట్టినారు మరియు మిగత ఆత్మలని ఆ ఈశ్వరీయ మాయలో ప్రవేశింపజేసి అచింతుడి ద్వారా పరబ్రహ్మ (అక్షర పురుషుడు) వద్దకి పంపిస్తారు. (పతివ్రతా స్థానంనుండి పడిపోయిన శిక్షని పొందినారు). చాలా యుగాల వరకి ఇద్దరు ఏడు సంఖ బ్రహ్మాండాలలోనే ఉండినారు, కానీ పరబ్రహ్మ చెడు వ్యవహారం చేయలేదు. ఈశ్వరీయ మాయ యొక్క స్వేచ్ఛతో అంగీకరించి మరియు తన శబ్ద శక్తి ద్వారా గోళ్లతో స్త్రీ ఇంద్రి (యోనిని) ని చేసినాడు. ఈశ్వరీ దేవి యొక్క అంగీకారంతో సంతానంను ఉత్పత్తి చేసినాడు. ఇందువలన పరబ్రహ్మ లోకంలో (ఏడు సంఖ బ్రహ్మాండాల్లో) ప్రాణులకి తప్తశిల యొక్క కష్టం లేదు మరియు అక్కడ పశు పక్షిలు కూడ బ్రహ్మలోక దేవుళ్లతో మంచి చరిత్ర యుక్తమై ఉన్నవి. ఆయుష్షు కూడ చాలా పెద్దదిగా ఉంటుంది. కానీ జన్మ మృత్యువు కర్మాధారంపై కర్మదండన మరియు పరిశ్రమ చేసే పొట్ట నింపుకోవాలి. స్వర్గం మరియు

నరకం కూడ అదే విధంగా తయారు చేయబడినవి.పరబ్రహ్మ (అక్షర పురుషుడు) కి ఏడు సంఖ బ్రహ్మాండాలు అతడి ఇచ్ఛా రూపి భక్తి ధ్యానం అనగా సహజ సమాధి విధి ద్వారా చేసిన సంపాదన ప్రతిఫలంగా ప్రసాదించబడినవి మరియు సత్యలోకం నుండి వేరువేరు స్థానాలపై గోళాకారపు పరిధిలో బందించి ఏడు సంఖ బ్రహ్మాండాలతో పాటు పరబ్రహ్మ (అక్షర పురుషుడు మరియు ఈశ్వరీయ మాయని బహిష్కరించినారు.

పూర్ణ బ్రహ్మ (సతపురుషుడు) అసంఖ్య బ్రహ్మాండాలు సత్యలోకం మొదలగు వాటిలో కలడు మరియు బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాలు మరియుపరబ్రహ్మ యొక్క ఏడు సంఖ బ్రహ్మాండాలకి కూడ ప్రభువు (మాలిక్). అనగా పరమేశ్వర్ కవిర్దేవ్ సముహం యొక్క ప్రభువు (కుల్ కా మాలిక్).

శ్రీ బ్రహ్మగారికి, శ్రీ విష్ణువుగారికి మరియు శ్రీ శివగారికి నాలుగు-నాలుగు భుజాలు కలవు మరియు 16 కళలు కలవు. దుర్గాదేవికి ఏనిమిది భుజాలు మరియు 64 కళలు కలవు. బ్రహ్మ (కాల్) కి ఒక వేయ్యి భుజాలు మరియు ఒక వేయ్యి కళలు కలవు మరియు 21 బ్రహ్మాండాలకి ప్రభువు.పరబ్రహ్మ (అక్షర పురుషుడు) కి పదివేల భుజాలు కలవు మరియు పది వేల కళలు కలవు మరియు ఏడు సంఖ బ్రహాండాలకి ప్రభువు. పూర్ణ బ్రహ్మ (పరమ అక్షర పురుషుడు అనగా సతపురుషుడు) కి అసంఖ్య భుజాలు మరియు అసంఖ్య కళలు కలవు మరియు బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాలు మరియు పరబ్రహ్మ యొక్క ఏడు సంఖ బ్రహ్మాండాలతో పాటు అసంఖ్య బ్రహ్మాండాలకి ప్రభువు. ప్రతి ఒక్క ప్రభువు తన అన్ని భుజాలని కుదించకుని కేవలం రెండు భుజాలు కూడ ఉంచుకోగలరు మరియు ఎప్పుడు పడితే అప్పుడు అన్ని భుజాలని కూడ ప్రకటించుకోగలరు. పూర్ణ పరమాత్మ పరబ్రహ్మ యొక్క ప్రతిఒక్క బ్రహ్మాండంలో కూడ వేరొక స్థానాన్ని తయారుచేసుకుని వేరే రూపంలో రహస్యంగా ఉంటాడు. ఎలాఅర్థం చేసుకోవాలంటే తిరిగే ఒక కెమెరాని బయట పెట్టెస్తారు మరియు లోపల టి.వి. (టెలివిజన్) పెట్టెస్తారు. టి.వి.పై దృశ్యం కనిపిస్తుంది మరియు టి.వి.ని బయట పెట్టి లోపల కెమెరాని బిగించుతారు, అందులో కేవలం లోపల కూర్చొను ప్రతినిధుల చిత్రం కనిపిస్తుంది. దానివలన అందరు పనివాళ్లు అప్రమత్తంగా ఉంటారు.

ఈ విధంగా పూర్ణ పరమాత్మ తన సతలోకంలో కుర్చొని అందరిని నియంత్రించి ఉండినారు మరియు ప్రత్యేక బ్రహ్మాండంలో కూడ సతగురు కవిర్దేవ్ విద్యామానులై ఉంటారు. ఎలా అంటే సూర్యుడు దూరంగా ఉంటు కూడ తన ప్రభావాన్ని మిగత లోకాలలో కూడ ఉంచి ఉన్నారు.

## "పవిత్ర అధర్వణవేదంలో సృష్టి రచన యొక్క ప్రమాణం"

**ఖండం సంఖ్య 4 అనువా సంఖ్య 1 మంత్ర సంఖ్య 1 :-**

బ్రహ్మ జజ్ఞానం ప్రథమం పురస్తాద్ ని సీమత: సురుచో వేన ఆవ: ।

స బుద్న్యా ఉపమా అస్య వీష్ఠా: సతశ్చ యోనిమసతశ్చ వి వ: ॥1॥

బ్రహ్మ-జ-జ్ఞానమ్-పథ్రమం-పురస్తాత్-విసిమత:-సురుచ:-వేన:-ఆవ:-స:-బుధ్న్యా:-ఉపమా-అస్య-విష్ఠా-సత:-చ-యోనిం-అసత:-చ-వి వ:

అనువాదం: (ప(థమం) పూర్వపు అర్థంలో సనాతన (బ్రహ్మ) పరమాత్మా (జ) ప్రకటితమై (జ్ఞానం) తన ఆలోచనతో (పురస్తాత్) శిఖరంలో అనగా సతలోకం మొదలగు వాటిని (సురుచ:) స్వ ఇచ్ఛతో పెద్ద ఇష్టంతో స్వప్రకాశిత (విసిమత:) హద్దులేకుండా అనగా విశాలంగా వివిధ లోకాలని ఆ (వేన:) నేయువాడైన అతనే అనగా బట్ట మాదిరి నేసి (ఆవ:) సురక్షితం చేశారు (చ) మరియు (స:) ఆ పూర్ణ బ్రహ్మయే సర్వ రచనా కర్తా (అస్య) అందువలన ఆ (బుధ్న్యా:) ముఖ్య మాలికు యే (యోనిమ్) మూలస్థానమైన సతలోకం యొక్క రచనా చేసిరి (అస్య) దీని (ఉపమా) సదృశ అనగా పోలికతో (సత:) అక్షర పురుషుడు అనగా పరబ్రహ్మ యొక్క లోకాలు కొన్ని స్థాయి (స్థిర) (చ) మరియు (అసత:) క్షర పురుషుడి అస్థాయి లోకాలు మొదలగు (వి వ:) ఆవాస స్థానలు భిన్నంగా (విష్ఠా:) స్థాపించినారు.

భావార్థం:- **పవిత్ర వేదాలను చెప్పు బ్రహ్మ (కాల్) అంటున్నాడు సనాతనమైన పరమేశ్వరుడే స్వయంగా అనామయ లోకం నుండి సత్యలోకంలో ప్రకటితమై తన ఆలోచనతో బట్టలాగా రచనా చేసి పైనగల సతలోకం మొదలగు వాటిని హద్దులేని విధంగా, స్వప్రకాశితంగా, అజర-అమర్ అనగా అవినాశి గా ఆపాదు మరియు కిందగల పరబ్రహ్మ యొక్క ఏడు సంఖ బ్రహ్మాండాలు మరియు బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాలు మరియు వీటిలోని చిన్న చిన్న రచన కూడ ఆ పరమాత్ముడే స్థాపించినారు అనగా రచించినారు.**

**ఖండం 4 అనువాక్యం సంఖ్య 1 శ్లోకం 2 :-**

ఇయం పిత్ర్యా రాష్ట్ర్యేత్వగ్రె ప్రథమాయ జనుషే భువనేష్ఠా: ।
తస్మా ఏతం సూరూచం హ్వారమహ్యాం ధర్మం శ్రీణన్తు ప్రథమాయ్ ధాస్యవే ॥2॥

ఇయమ్-పిత్ర్యా-రాష్ట్రి-ఎతు-అగ్రే-ప్రథమాయ-జనుషే-భువనేష్ఠా:-తస్మా-ఎతమ్-సురుచమ్ - హవారమహ్యామ్ - ధర్మమ్-శ్రీణాన్తు-ప్రథమాయ-ధాస్యవే

అనువాదం:- (ఇయమ్) ఈ (పిత్ర్యా) జగతపితా పరమేశ్వరుడె (ఎతూ) ఈ (అగ్రే) సర్వోత్తమ (ప్రథమాయ) అన్నింటి కంటే ముందు అనగా మొదటి మాయ పరానందిని (రాష్ట్రి) రాజేశ్వరి శక్తి అనగా పరాశక్తి దేనినైతే ఆకర్షణ శక్తి అని కూడ అంటారు, దానిని (జనుషే) ఉత్పన్నం చేసి (భూవనేష్ఠా:) లోక స్థాపన చేసిరి (తస్మా) ఆ పరమేశ్వరుడే (సురుచమ్) పెద్ద కోరికతో స్వేచ్ఛతో (ఎతమ్) ఈ (ప్రథమాయ) ప్రథమ ఉత్పత్తి శక్తి అనగా పరాశక్తి ద్వారా (హారమహ్యామ్) ఒకరినొకరి వియోగాని ఆపుకునే అనగా ఆకర్షణ శక్తి యొక్క (శ్రీణాన్తు) గురుత్వ ఆకర్షణకి పరమాత్ముడు ఆదేశించారు ఎల్లప్పటికి ఉండండి, దానిని ఎప్పటికిని సమాప్తం అవని (ధర్మమ్) స్వభావంతో (ధాస్యవే) ధారణ చేసి తానే అనగా బట్ట మాదిరిగా నేయబడి ఆపబడినవి.

**భావార్థం:- జగతపితా పరమేశ్వర్ తన శబ్ద శక్తితో రాష్ట్రి అనగా సర్వ ప్రథమ మాయ రాజేశ్వరిని ఉత్పన్న చేసినారు మరియు ఆ పరాశక్తి ద్వారానే ఒకరినొకరు ఆకర్షణ శక్తి నుండి ఆపుకును, ఎప్పటికిని సమాప్తం కానీ గుణాలతో పైన తెల్పిన అన్ని బ్రహ్మాండాల్ని స్థాపించినారు.**

ఖాండ నం. 4 అనువాకం సం. 1 మంత్రం సం.3 :-

ప్ర యో జజ్ఞే విద్వానస్య బన్ధుర్విశ్వా దేవానాం జనిమా వివక్తి ।

బ్రహ్మ బ్రహ్మణ ఉజ్జభార్ మధ్యాన్నిచైరుచ్చై: స్వధా అభి ప్ర తస్థౌ ॥3॥
ప్ర– య:–జజ్ఞే–విద్వానస్య–బన్ధు–విశ్వా–దేవానామ్–జనిమా–వివక్తి–బ్రహ్మ:–బ్రహ్మణ: –ఉజ్జభార్– మధ్యాత్– నిచై:–ఉచ్చై:– అభి:–ప్రతస్థౌ

అనువాదం:– (ప్ర) సర్వ ప్రథమ (దేవానామ్) దేవతల మరియు బ్రహ్మాండాల (జజ్ఞే) ఉత్పత్తి జ్ఞానంను (విధ్వానస్య) జిజ్ఞాస గల భక్తుడి (య:) ఎవరైతే (బన్ధు:) వాస్తవిక స్నేహితుడు అనగా పూర్ణ పరమాత్మయే తన నిజసేవకుడికి (జనిమా) తన ద్వారా సృష్టించబడిన దానిని (వివక్తి) స్వయంగా ఉన్నది ఉన్నట్లు చెబుతాడు ఏమనంటే (బ్రహ్మణ:) పూర్ణ పరమాత్మా (మధ్యాత్) తన మధ్యనుండి అనగా శబ్ద శక్తితో (బ్రహ్మ:) బ్రహ్మ క్షర పురుషుడు అనగా కాల్‌ని (ఉజ్జభార్) ఉత్పన్నం చేసి (విశ్వా) పూర్ణ సంసారాన్ని అనగా అన్ని లోకాలని (ఉచ్చై:) పైన సతలోకాన్ని మరియు (నిచై:) కింద పరబ్రహ్మ మరియు బ్రహ్మ యొక్క అన్ని బ్రహ్మాండాలని (స్వధా) తనని ధారణ చేయునటువంటి (అభి:) ఆకర్షణ శక్తితో (ప్ర తస్థౌ) రెండింటిని సరియైన విధంగా స్థాపింపచేసినారు.

**భావార్థం :– పూర్ణ పరమాత్మా తన ద్వారా రచింపబడిన సృష్టి జ్ఞానాన్ని మరియు అన్ని ఆత్మల యొక్క ఉత్పత్తి జ్ఞానంను తన నిజమైన దాసుడికి స్వయంగా చెబుతాడు.ఏమనంటే పూర్ణ పరమాత్మ తన మధ్యనుండి అనగా తన శరీరంతో తన శబ్ద శక్తి ద్వారా బ్రహ్మ (క్షర పురుషుడు) ని ఉత్పత్తి చేసినారు మరియు సర్వ బ్రహ్మాండాలు పైన సతలోకం, అలఖ లోకం, అగమలోకం, అనామి లోకం మొదలగు మరియు కిందగల పరబ్రహ్మ ఏడు సంఖ బ్రహ్మాండాలు మరియు బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాల్ని తనని ధారణ చేయు ఆకర్షణ శక్తితో ఆగబట్టి ఉంచినాడు.**

**పూర్ణ పరమాత్మ కబీర్ పరమేశ్వర్ (కవిర్దేవ్) తన నిజ సేవకులు అనగా దాసులు, సఖులైన శ్రీ ధర్మదాస్‌జీ, ఆదరణీయ గరీబ్‌దాస్‌జీ మొదలగు వారికి తన ద్వారా రచించిన సృష్టి జ్ఞానంను స్వయంగా తెలిపిరి. పై వేద మంత్రం కూడ ఈ సమర్థనే చేయుచున్నది.**

కాండం సం. 4 అనువాకం సం. 1 మంత్రం సం. 4

స: హి దావ: స: పృథివ్యా ఋతస్థా మహి క్షేమం రోదసి అస్కభాయత్ ।
మహాన్ మహి అస్కభాయద్ వి జాతో ధ్యాం సద్మ పార్థివం చ రజ: ॥
స:–హి–దివ:–స–పృథివ్యా–ఋతస్థా–మహి–క్షేమమ్–రోదసి–అకస్భాయత్–మహాన్–మహి–అకస్భాయద్– విజాత: – ధామ్–సదమ్–పార్థివమ్–చ–రజ:

అనువాదం:– (స:) ఆ సర్వశక్తిశాలి పరమాత్ముడే (హి) సందేహంలేకుండా (దివ:) పైనగల నాలుగు దివ్య లోకాలని –సతలోకం,అలఖలోకం, అగమలోకం, మరియు అనామి లోకం అనగా అకహలోకం, అనగా దివ్య గుణాలుకల లోకాల్ని (ఋతస్థా) సత్యంగా స్థిరపరిచి అనగా చీరస్థాయిగా స్థిరికరించి (స) వాటికి సమానమైన (పృథివ్యా) కిందకల పృథ్విలోకాల్ని–పరబ్రహ్మ ఏడు సంఖ బ్రహ్మాండాలు మరియు కాల్ యొక్క 21 బ్రహ్మాండాలు (మహి) పృథ్వితత్వంతో (క్షేమం) సురక్షితంగా (అస్కభాయత్) ఆపినారు (రోదసి) ఆకాశ్ తత్వం మరియు పృథ్వితత్వం రెండిటికి పైన కిందకల బ్రహ్మాండాల్ని (ఏలాఅంటే ఆకాశం

ఒక సూక్ష్మతత్వం, ఆకాశం యొక్క గుణం శబ్దం, పూర్ణ పరమాత్మ పై లోకాల్ని శబ్ద రూపంతో రచించిరి అవి తేజోమయమై ఉన్నవి. మరియు కిందకల పరబ్రహ్మ ఏడు సంఖ బ్రహ్మాండాలు మరియు బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాలను పృథ్వితత్వంతో రచించిరి.) (మహాన్) పూర్ణ పరమాత్మ (పార్థివమ్) పృథ్వి వంటి (వి) వివిధ వివిధ (ధామ్) లోకాల్ని (చ) మరియు (సదమ్) ఆవాస స్థానాలు (మహి) పృథ్వితత్వంతో (రజ:) ప్రత్యేక బ్రహ్మాండంలో చిన్న చిన్న లోకాలయొక్క (జాత:) రచనా చేసి (అస్కభాయత్) స్థిరపరిచిరి.

**భావార్థం:- పైనగల నాలుగు లోకాలు సతలోకం, అలఖలోకం, అగమలోకం, మరియు అనామిలోకం వీటిని అజర్-అమర అనగా చిరస్థాయి అనగా అవినాశిగా మరియు కిందకల బ్రహ్మ మరియు పరబ్రహ్మ యొక్క లోకాలను అస్థాయిగా అనగా నాశనం కలవిగా రచనా చేసి మరియు మిగతా చిన్న-చిన్న లోకాలని కూడ ఆ పరమాత్ముడే రచించి స్థిరపరిచినాడు.**

కాండం సం. 4 అనువాకం సం. 1 మంత్రం 5

స: బుధ్న్యాదాష్ట్ర జనుషో2భ్యగ్రం బృహస్పతిర్దేవతా తస్య సమ్రాట్ ।

అహర్యచ్ఛుక్రం జ్యోతిషో జనిష్టాథ్ ద్యుమన్తో వి వసన్తు విప్రా: ॥5॥

స:- బుధ్న్యాత్-అష్ట్ర-జనుషే: -అభి-అగ్రం- బృహస్పతి:-దేవతా-తస్య -సమ్రాట-అహ: -యత్ -శుక్రం- జ్యోతిష:- జనిష్ట- అథ- ద్యుమన్త: -వి -వసన్తు- విప్రా:

అనువాదం:- (స:) ఆ (బుధ్న్యత్) మూల యజమాని ద్వారా (అభి-అగ్రమ్) మొట్టమొదటి స్థానంపై (ఆష్ట్ర) అష్టంగి మాయ-దుర్గా అనగా ప్రకృతిదేవి (జనుషే:) ఉత్పన్నం అయింది ఎందుకంటే కిందకల పరబ్రహ్మ మరియు బ్రహ్మ యొక్క లోకాల ప్రథమ స్థానం సతలోకమే దీనిని మూడవ ధామం అని కూడ అంటారు (తస్య) ఈ దుర్గా యొక్క మాలిక్ కూడ ఈ (సమ్రాట్) రాజాధిరాజ (బృహస్పతి:) అందరికంటే పెద్దపతి మరియు జగతగురు (దేవతా) పరమేశ్వరుడే. (యత్) ఎవరినుండి (అహ:) అందరి వియోగం అయిందో (అథ) దీని తరువాత (జనిష్ట) దుర్గాదేవి కడుపునుండి ఉత్పన్నం అయి (విప్రా:) భక్త ఆత్మలు (వి) వేరొక (ద్యుమన్త:) మనుష్యలోకం లేదా స్వర్గలోకంలో జ్యోతినిరంజన్ యొక్క ఆదేశంతో దుర్గా అంటుంది (వసన్తు) నివాసం ఉండండి అనగా అవి (ఆత్మలు) నివాసం ఉండసాగినవి.

**భావార్థం:- పూర్ణ పరమాత్మ పైనకల నాలుగు లోకాలలోని కిందినుండి మొదటి అనగా సత్యలోకంలో ఆష్టా అనగా అష్టంగి (ప్రకృతి/దుర్గా) ని ఉత్పత్తి చేసినారు. ఈయనే రాజాధిరాజు, జగత్‌గురు, పూర్ణ పరమేశ్వరుడు (సతపురుషుడు). వీరినుండియే అందరి వియోగం అయింది. పిదప అన్ని జీవులు/ప్రాణులు జ్యోతినిరంజన్ (కాల్) యొక్క (వీర్య) బీజంతో దుర్గా యొక్క గర్భం ద్వారా ఉత్పన్నం అయి స్వర్గ లోకం మరియు పృథ్విలోకంపై నివాసం ఉంగసాగిరి.**

కాండం సం. 4 అనువాకం 1 మంత్రం 6

నూనం తదస్య కావ్యో హినోతి మహో దేవస్య పూర్వస్య ధామ్ ।

ఎష జజ్ఞే బహుభి: సాకమిత్థా పుర్వే అర్ధె విషితే ససన్ ను ॥6॥

నూనమ్-తత్-అస్య-కావ్య:-మహ:-దేవస్య- పూర్వస్య-ధామ్-హినోతి-పూర్వే- విషితే-

కాదు. అప్పుడు రాణి అంటుంది అయితే నేను కూడ అన్నం తినను. కరుణామయ సాహెబ్ అంటారు సరే తల్లి తీసుకురా తింటాను, ఎందుకంటే సమర్థుడు అని వారిని అంటారు ఏవరైతే దేనినైతే అనుకుంటారో, దానినే చేస్తారు. కరుణామయ సాహెబ్ భోజనం చేస్తారు. పిదప రాణిని అడుగుతారు ఈ సాధనని నీవు చేస్తున్నావు కదా దీనిని నీకు ఏవరు చెప్పారు? రాణి అంటుంది నా గురుదేవుల ఆదేశానుసారంగా చేస్తున్నాను అని. కరుణామయ సాహెబ్ అడుగుతారు ఏం ఆదేశం ఇచ్చారు నీ గురుదేవులు? ఇంద్రమతి అంటుంది బ్రహ్మ-విష్ణు-మహేషుల పూజా, ఏకాదశి వ్రతం, తీర్థయాత్రలు, దేవిపూజ, శ్రాద్దం తీయుట, మందిరాలకి వెళ్లుట, సంత్‌ల సేవ చేయడం. కరుణామయ సాహెబ్ అంటారు ఏ సాధన ఐతే నీ గురుదేవులు ఇచ్చారో అది నిన్ను జన్మ-మృత్యువు మరియు స్వర్గం-నరకం అను చక్రం యందు బందించి ఉంచుతుంది మరియు ఎనభైనాలుగు లక్షల యోనిలయందు జన్మల కష్టం నుండి విముక్తిని ఇవ్వదు. రాణి అంటుంది మహారాజ్‌గారు! ఎంతమంది సంత్ లు ఉ న్న, వారి-వారి అనుభవాన్ని (ప్రభువు) వారి గొప్పతనంగా చెబుతారు. నా గురుదేవుల గురించి ఏమియు అనకండి. నేను ముక్తిరాలుని అయిన కాకపోయిన పర్వాలేదు.

అప్పుడు కరుణామయ సాహెబ్ ఆలోచిస్తారు ఈ అమాయకపు ప్రాణినికి ఏలా తెలియచేయను? వీరు పట్టుకున్న తోకను విడిచిపెట్టలేరు, కానీ చనిపోగలరు. కరుణామయ సాహెబ్ అంటారు కుమారి! అలా అయితే నీ ఇష్టం, నేను నిందించడం లేదు. నేను మీ గురుదేవులను ఏమైనా తిట్టానా లేదా చెడ్డది అని చెప్పానా? నేను భక్తిమార్గాన్ని చెబుతున్నాను. ఈ భక్తి శాస్త్ర విరుద్దంగా ఉంది. నిన్ను ఇది భవసాగరాన్ని దాటించలేదు. నీ రాబోయే కర్మఫలాన్ని నశింపచేయదు మరియు విను ఈ రోజు నుండి మూడవ రోజున నీ మృత్యువు అవుతుంది. నీ గురువు కానీ నీ యొక్క ఈ నకలి సాధనా నిన్ను కాపాడలేదు. (ఏప్పుడైతే చనిపోవు సమయం వస్తుందో అప్పుడు జీవుడికి భయం వేస్తుంది. లేకపోతే వినరుకదా) రాణి ఆలోచిస్తుంది సంత్ లు అబద్ధం చెప్పరు. ఒకవేళ నేను ఎల్లుండే చనిపోతే, ఈ భయంతో కరుణామయ సాహెబ్‌ని అడుగుతుంది సాహెబ్! నా ప్రాణం కాపాడబడుతుందా? కరుణామయ సాహెబ్ అంటారు అవును, కాపాడబడుతుంది. ఒకవేళ నీవు నానుండి ఉపదేశం తీసుకుంటే, నా శిష్యురాలువు అయితే, పూర్వపు పూజలని విడిచిపెడితే, అప్పుడు నీ ప్రాణం నిలబడుతుంది. ఇంద్రమతి అంటుంది నేను విన్నాను, ఏమనంటే గురుదేవులని మార్చకూడదని, పాపం తగులుతుందని. కరుణామయ సాహెబ్ అంటారు లేదు కుమారి ఇది నీ భ్రమ మాత్రమే. ఒక వైద్యుడి మందు పని చేయనపుడు వేరొక వైద్యుడి మందుని తీసుకోమా? ఒక ఐదవ తరగతి ఉపాధ్యాయుడు ఉంటాడు. ఇంకా పై తరుగతులకి ఉపాధ్యాయుడు ఉంటాడు. కుమారి తర్వాతి తరగతిలోకి వెళ్లాలి కదా. పూర్తి జీవితం ఐదవ తరగతిలోనే ఉంటావా? దీనిని వదిలివేయాల్సిందే. నీవు ముందు ఉన్న చదువుని చదువు, నేను అది చదివించడానికే వచ్చాను. ఉరికే అంగీకరించెది కాదు కానీ మృత్యువు కనబడుతుంది, సంత్ చెబుతున్నాడు కదా ఒకవేళ మాట నిజం అయితే ఎలా?అని ఆలోచన చేస్తు ఇంద్రమతి అంటుంది మీరు ఎలా అంటున్నారో అలానే చేస్తాను. కరుణామయ సాహెబ్ గారు ఉపదేశం ఇస్తారు. తరువాత ఇలా చెబుతారు మూడవ రోజున

నా రూపంలో కాల్ వస్తాడు. నీవు అతనితో మాట్లాడవద్దు. ఏ నామాన్ని ఐతే నీకు ఇచ్చినానో దానిని రెండు నిమిషాలు జపించు. రెండు నిమిషాల తరువాత అతనిని చూడు, తరువాత సత్కారం చేయి. వాస్తవానికి గురువులు వస్తే అతి శీఘ్రంగా పాదాలపై పడిపోవాలి. కానీ ఇది ఈ ఒకసారి నా ఆదేశం మాత్రమే. రాణి అంటుంది చాలా మంచిది మీరు చెప్పినట్లు చేస్తాను.

ఇప్పుడు రాణికి చింత లోపల ఉండసాగింది. శ్రద్ధతో జపం చేస్తు ఉండింది. కరుణామయ సాహెబ్ రూపాన్ని ధరించి గురుదేవుని రూపంలో కాల్ వస్తాడు, పిలుస్తాడు ఇంద్రమతి, ఇంద్రమతి అని, ముందుగానే భయం ఉండింది, నామ స్మరణ చేసింది.కాల్ వైపు చూడలేదు.రెండు నిమిషాల తరువాత చూసింది కాల్ రూపం మారిపోయింది. కాల్ నిజ స్వరూపం కనబడసాగింది. కరుణామయ సాహెబ్ స్వరూపం లేదు. అప్పుడు కాల్ చూసుకున్నాడు తన మారిన స్వరూపాన్ని. కాల్ తెలుసుకుంటాడు ఈమె దగ్గర ఏదో శక్తి మంత్రం ఉంది అని. నీన్ను తర్వాత చూస్తాను అని వెళ్లిపోతాడు. ఇప్పుడైతే బతికిపోయాను. రాణి చాలా సంతోషించింది. సంతోషాన్ని ఆపుకోలేకపోయింది తన సేవకురాలితో అంటుంది నా మృత్యువు జరిగెది ఉండేను, కానీ నా గురుదేవులు నన్ను కాపాడారు. రాజు దగ్గరికి పోతుంది మరియు చెబుతుంది. ఈ రోజు నా ప్రాణాలు పోయి ఉండెవి నాగురుదేవులు నన్ను రక్షించారు. నన్ను చంపడానికి కాల్ వచ్చియుండెను. రాజా అంటాడు నీవు ఇలాంటి కథలు చెబుతునే ఉంటావు. కాల్ వచ్చెదుంటే నిన్ను విడిచిపెడతాడా? ఈ సంత్ లు అలానే భయపెట్టిస్తుంటారు. రాజుగారి మాటని రాణి ఎలా అంగీకరిస్తుంది? సంతోషంతో రాణి తన గదిలోకి వెళ్ళి పడుకుంటుంది. కొంత సమయం తరువాత పాము వేషం ధరించి కాల్ వస్తాడు మరియు రాణిని కరుస్తాడు. పాము కాటు వేయగానే రాణికి తెలుస్తుంది. రాణి బిగ్గరగా అరుస్తుంది. నన్ను పాము కాటు వేసింది అని. సేవకులు పరుగెడుతారు. చూసిచూడగానే ఒక మోరి (నీరు పోవు చిన్న రంధ్రం) నుండి ఆ పాము వెళ్ళిపోతుంది. తన గురుదేవులని పిలిచి రాణి స్పృహ కోల్పోతుంది. కరుణామయ (కబీర్) సాహెబ్ అక్కడ ప్రకటితులౌతారు. జనులకు చూపుటకు ఏదో మంత్రం అంటారు (వారు వాస్తవానికి మంత్రం చెప్పకుండా కూడ ప్రాణం పోయగలరు, ఏ మంత్ర తంత్రం అవసరం లేదు) ఇంద్రమతిని జీవితులుగా చేస్తారు. రాణి చాలా ధన్యవాదాలు తెలుపుతు హే బంది ఛోడ్ ఒకవేళ నేను ఈరోజు నేను మీ శరణులో లేనిచో నా మృత్యువు అవుతుండెను.కరుణామయ (కబీర్) సాహెబ్ అన్నారు ఇంద్రమతి! నేను కాల్ని నీ ఇంటికి కూడ రానిచ్చెవాడిని కాదు. నీపై పాము కాటుకూడ వేసేది కాదు. కానీ నీకు విశ్వాసం కాదు. నీవు ఆలోచించె దానివి నా పై ఎలాంటి ఆపద వచ్చెది రాకుండె గురువుగారు నన్ను అనవసరంగా భయపెట్టి నామదానం ఇచ్చారుఅని. అందువలన నీకు కొంచం ఈ విధంగా చూపించాల్సి వచ్చింది. లేదంటే కుమారి నీకు విశ్వాసం అయ్యేది కాదు.

ధర్మదాస్ యహా ఘనా అంధేరా, బిన్ పరచయ్ జీవ జమ కా చేరా ।

కబీర్ సాహెబ్ అంటారు ఇక నేను ఎప్పుడు అనుకుంటే అప్పుడు నీ మృత్యువు అవుతుంది. గరీబదాస్ అంటారు :-

గరీబ, కాల్ డరై కరతార్ సే, జయ జయ జయ జగదీశ్ ।
జౌరా జౌరి ఝూడతి, పగ్ రజ్ డారే శీశ్ ॥

**ఈ కాల్, కబీర్ భగవాన్ (కబీర్ పరమేశ్వర్) కి భయపడుతాడు మరియు ఈ మృత్యువు కబీర్ సాహెబ్ గారి బూట్లు తుడుస్తుంది. అనగా పనిమనిషి లాంటిది. ఆ ధూళిని తన నుదుటిపై రాసుకుని మీ భక్తుల దగ్గరికి వెళ్లను అని అంటుంది.**

గరీబ్, కాల్ జో పిసై పిసనా, జౌరా హై పనిహార్ ।
యే దో అసల్ మజుర్ హై, మేరే సాహెబ్ కే దరబార్ ॥

**ఈ కాల్ ఎవరైతే 21 బ్రహ్మాండాలకి భగవానుడో మరియు బ్రహ్మ, విష్ణు మరియు మహేశ్ యొక్క తండ్రియో, ఆయన నా కబీర్ పరమేశ్వర్‌గారి వద్ద పిండి పిసుకుతాడు అనగా పనిమనిషి మరియు మృత్యువు నా కబీర్ పరమేశ్వరుడి నీళ్లు నింపుతుంది అనగా ఒక విశేషమైన పనిమనిషి. ఈ రెండు పని మనుషులు కబీర్ పరమేశ్వరుడి దరబారులో ఉన్నారు. కొన్ని రోజుల తరువాత కబీర్ పరమేశ్వర్ మరల వచ్చి రాణి ఇంద్రమతికి సతనామాన్ని ప్రసాదిస్తారు.**

**తరువాత కొన్ని రోజులు అయినాకా కరుణామయ సాహెబ్ ఇంద్రమతి యొక్క అతి శ్రద్ధని చూసి సారనామాన్ని కూడ ప్రసాదిస్తారు. అనగా శబ్దాన్ని ప్రసాదిస్తారు.కరుణామయ సాహెబ్ (కబీర్) రాణి ఇంద్రమతికి సమయ-సమయంపై దర్శనం ఇవ్వడానికి వెళ్లెవారు. అప్పుడు ఇంద్రమతి ప్రార్థన చేసేది. తన భర్తని కూడ నచ్చచెప్పి, అంగీకరించునట్లు చేయ్యండి అని. మీ చరణాలలో వారు కూడ వస్తే నా జీవితం సఫలం అవుతుంది.కరుణామయ సాహెబ్ చంద్రవిజమ రాజుతో చంద్రవిజయ్‌గారు! మీరు కూడ ఈ నామాన్ని తీసుకోండి, ఇది రెండు రోజుల రాజ్యం మరియు రాజహాసం మాత్రమే. తరువాత 84లక్షల యోనిల యందు ప్రాణి వెళ్లిపోతాడు. చంద్రవిజయ్ అంటారు భగవాన్ నేను నామాన్ని తీసుకోలేను మరియు మీ శిష్యరికాన్ని వద్దనుకోవడం లేదు. కావాలంటే భాండాగారంలోని సంపదని దానం ఇవ్వండి, కావాలంటే ఎలాంటి సత్సంగాన్ని చెయించండి, నేను కాదనను. కరుణామయ సాహెబ్ అడిగారు మీరు నామాన్ని ఎందుకు తీసుకోరు? రాజు అనినారు నేను పెద్ద పెద్ద రాజుల యొక్క విందులకి వెళ్లాల్సి ఉంటుంది. కరుణామయ సాహెబ్ అడిగారు విందులకి వెళ్లుటకు నామం ఏలా అడ్డంకి అవుతుంది? సభకు వెళ్లండి, అక్కడ కాజు తినండి, పాలు తాగండి, శరబత్ తాగండి, మద్యంను మాత్రము ముట్టకండి. మద్యం సేవించడం మహాపాపమైనది. కానీ రాజు వినలేదు.**

**రాణి యొక్క ప్రార్థనపై కరుణామయ సాహెబ్‌గారు రాజుకి మరల నచ్చచెప్పారు. నామం లేకుండా ఈ జీవితం వ్యర్థం అవుతుంది. మీరు నామాన్ని తీసుకొండి. రాజా మరల అంటారు గురుజీ! నన్ను నామం తీసుకోమని అనకండి. నేను మీ శిష్యరికంను కాదనడం లేదు. కావాలంటే ఎంతైన దానం చేయండి, ఎంతైన సత్సంగం చేయండి. కరుణామయ సాహెబ్‌గారు ఇంద్రమతితో కుమారి! ఈ రెండు రోజుల సుఖాన్ని చూసి ఇతని బుద్ధి భ్రష్టుపట్టి ఉంది. నీవు ప్రభు చరణాలయందు నిల్చి ఉండు. నీ ఆత్మకళ్యాణం చేసుకో. ఇక్కడ ఏవరు ఎవరికి భర్త కారు, ఏవరు ఎవరికి భార్య కాదు. పూర్వ జన్మ సంస్కాలములవలన కలుగు**

రెండు రోజుల సంబంధం ఇది. నీ కర్మని నీవు తయారు చేసుకో. ఇంద్రమతి 80 సం॥ల ముదుసలి అయింది. ఎక్కడో 40 సం॥లకి చనిపోవాల్సిన ఆమె శరీరం ఊగుచుండెను, అప్పుడు కరుణామయ సాహెబ్ అంటారు చెప్పు ఇంద్రమతి ఏం కోరుకుంటున్నావు? సతలోకానికి వెళ్దామా? ఇంద్రమతి అంటుంది పరమేశ్వర్ నేను తయార్రై ఉన్నాను. పూర్తిగా తయార్రై ఉన్నాను దాతా తీసుకెళ్లండి. కరుణామయ సాహెబ్ అంటారు మనుమడు , మనువరాల్ల యందు ఎమైన మమత ఇంకా మిగిలి ఉందా? రాణి అంటుంది లేదు ప్రభు కించిత్ మాత్రం కూడా లేదు. మీరు జ్ఞానమే నిర్మలంగా ఇచ్చేశారు. ఇక ఈ చెడు లోకం గురించి ఏం ఇష్టాన్ని చూపను? కరుణామయ సాహెబ్ అంటారు పద కుమారి అని. రాణి ప్రాణ త్యాగం అయింది. పరమేశ్వర్ కబీర్ (కరుణామయ) బంధ విముక్తి కలిగించువారు రాణి ఇంద్రమతి ఆత్మని పైకి తీసుకెళ్తారు. ఈ బ్రహ్మాండంలోనే ఒక మానసరోవరం ఉంది. ఆ మానసరోవరంపైకి వెళ్లి ఈ ఆత్మకి స్నానం చేయించాల్సి ఉంటుంది. ఈ ప్రాణిని కబీర్ పరమేశ్వర్ పూర్తి గురు రూపంలో ప్రకటితులై కొంత సమయం వరకు మానసరోవరంపై ఉంచుతారు. కబీర్ పరమేశ్వర్ మరల ఇంద్రమతిని అడుగుతారు ఈ సంసారంలో నీకు ఏదైనా ఇష్టం ఉంటే మరల జన్మించాల్సి ఉ ంటుంది. మనసులో ఏదైనా కోరిక ఉంటే సతలోకానికి వెళ్లలేవు. ఇంద్రమతి అంటుంది సాహెబ్ మీరు అంతర్యామి, ఏ కోరిక లేదు. మీ చరణాల కోరికయే ఉంది. కానీ మనసులో ఒక శంఖా ఉన్నట్లు ఉంది. నా భర్త నన్ను ఏప్పుడు ధార్మిక పనులు చేయవద్దని చెప్పలేదు. లేదంటే ఈ రోజుల్లో భర్తలు భార్యల మాటలు వినరు కదా. ఒకవేళ ఆయన నన్ను వద్దనంటే నేను మీ పాదాల యందు ఉండెదానిని కాదు. నా ఆత్మకళ్యాణం జరిగెది కాదు. అతనికి ఈ శుభ కార్యంయందు సహాయం చేసినందుకు ఏమైనా లాభం లభిస్తే ఏప్పుడైన ఆయనపై దయని కురిపించండి దాతా. కబీర్ పరమేశ్వర్ చూశారు ఈ అమాయకురాలు అతని వెంట మరల పడిపోయింది. సాహెబ్ అన్నారు, సరే కుమారి, ఇక రెండు, మూడు సంవత్సరాలు ఇక్కడె ఉండు.

రెండు సంవత్సరాల తరువాత రాజు కూడ చనిపోవుచుండెను. ఎందుకంటే నామాన్ని తీసుకోలేదు. యమదూతలు వచ్చినారు. రాజు దరబారమందు కళ్లు తిరిగి పడిపోయాడు. యమ దూతలు అతని మెడని ఒత్తుతారు. రాజుకి మల మూత్రం బయటకు వస్తాయి. కరుణామయ కబీర్ పరమేశ్వర్ రాణితో అంటారు చూడు నీ రాజు యొక్క పరిస్థితి ఏమౌతుందో? అక్కడ మానసరోవరం నుండి పరమేశ్వరులు చూపించారు. ఇదంతా చూసి రాణి అంటుంది చూడండి దాతా ఒకవేళ అతడి భక్తి యందు సహాయం చేయుట యందు ఏమైన ఫలం లభిస్తే అతనిపై దయ చూపండి. రాణికి అయినాకూడ కొంచెం మమత ఉండింది. కబీర్ పరమేశ్వర్ ఆలోచించారు. ఈమే మరల కాల్ వలలోకి పడుతుంది. ఇలా ఆలోచించి మానసరోవరం నుండి ఎక్కడైతే రాజా చంద్రవిజయ్ తన దర్భారులో అచేతనంగా పడిఉ న్నాడో అక్కడికి వెళ్లారు. యమదూతలు ఆయన ప్రాణాన్ని తీస్తున్నారు. కబీర్ పరమేశ్వర్ రావడంతోనే యమదూతలు ఆకాశంలోకి ఎగిరిపోయారు. ఎలైఐతే గద్దలు శవంనుండి ఎగిరిపోతాయో అలా. చంద్రవిజయ్‌కి చేతనం వస్తుంది. ఎదుట కరుణామయ సాహెబ్

నిలబడి ఉన్నారు. కేవలం చంద్రవిజయ్ కి మాత్రమే కనిపిస్తున్నారు. వేరేవాళ్లకి కనిపించడం లేదు. చంద్రవిజయ్ చరణాలయందు పడిపోయారు. నన్ను క్షమించండి, నన్ను కాపాడండి అని యాచించారు. ఎందుకంటే రాజాకి అర్థం అయింది ఇక నా ప్రాణాలు పోతున్నాయి అని. (ఎప్పుడైతే ప్రాణంపైకి వస్తుందో అప్పుడు కళ్లు తెరుస్తాయి కదా) అందుకే క్షమించండి ధాతా, నా ప్రాణాన్ని కాపాడండి ప్రభు అని ప్రార్థిస్తున్నాడు. కబీర్ పరమేశ్వర్ అంటారు రాజా నేడు కూడ అదే మాట , ఆ రోజు కూడ అదే మాట అన్నాను, నామం తీసుకోవాల్సిందే. రాజా అంటారు నేను నామం తీసుకుంటాను, ఇప్పుడే తీసుకుంటాను. కబీర్ పరమేశ్వర్ గారు నామ ఉపదేశాన్ని ఇస్తారు మరియు అంటారు నేను నీకు రెండు సం॥ల ఆయువుని ఇస్తున్నాను, ఒకవేళ ఇందులో ఒక శ్వాస కూడ వ్యర్థంగా పోయిందో నీ కర్మదండన ఉండిపోతుంది.

కబీర్, జీవన తో థోడా భలా, జై సత సుమరణ హెూ । లాఖ వర్ష కా జీవనా, లేఖే ధరే నా కో ॥

శుభకర్మ యందు సహాయం చేయడంవలన పొందిన పూర్వపు కర్మ మరియు శ్రద్దతో రెండు సంవత్సరాల స్మరణ మరియు మూడు నామాలని ప్రసాదింపచేసి కబీర్ పరమేశ్వర్ చంద్రవిజయ్ని కూడ భవసాగరం నుండి దాటిస్తారు. అనండి (కబీర్ పరమేశ్వర్) " కవిర్దేవ్ కీ జయ్ ". " జయ్ బంది ఛోడ్ "

కబీర్ పరమేశ్వర్ నిజమైన శ్రద్దాలు యొక్క ఆయువుని పెంచుతారు మరియు అతని కుటుంబాన్ని రక్షిస్తారు. అని పై వివరణ ద్వారా తెలుస్తుంది. ఈ ప్రమాణములు చాలా పూర్వపువి. వర్తమానంలో పూజ్య కబీర్ పరమేశ్వర్ గారి శక్తితో సతగురు రామపాల్దాస్ గారి ద్వారా అయిన కష్టనివారణ మరియు ఆయుస్సు వృద్ధి యొక్క చాలా ప్రమాణాలని చదవండి ఈ పుస్తకంలోని 'సత్యభక్తినుండి భ్రమితులైన మరియు దారి తప్పిన వారికి మార్గ విషయాలు' అను అధ్యాయంలో.

## "కబీర్ పరమేశ్వర్(కవిర్దేవ్)గారు కలియుగంలో ప్రకటితమవడం"

విక్రమి సంవత్సరం 1455 (క్రీ. శ. 1398) జేష్ఠమాసం, పూర్ణిమ పొద్దు పొద్దున బ్రహ్మీమూహుర్తంలో ఆ పూర్ణ పరమేశ్వర్ కబీర్ (కవిర్దేవ్) స్వయంగా తన మూల స్థానం సతలోకం నుండి వచ్చారు. కాశీలోని లహర్తారా చెరువు నందు కల కమలం పువ్వుపై ఒక బాలుడి రూపాన్ని ధరిస్తారు. మొదట నేను మీకు నీరు-నీమా గురించి చెబుతాను వారు ఎవరు ఏమిటి అని? ద్వాపరయుగంలో నీరు-నీమా సుపచ సుదర్శన్ యొక్క తల్లితండ్రులు. వీరు కబీర్ సాహెబ్ యొక్క మాటల్ని ఆ సమయంలో స్వీకరించలేదు. చివరి సమయంలో సుదర్శన్ కరుణామయ రూపంలో వచ్చినటువంటి కబీర్ సాహెబ్ని ప్రార్థిస్తారు ప్రభు! మీరు నాకు ఉపదేశం ఇచ్చారు అంటే అన్ని ఇచ్చినారు. మీ నుండి ఇప్పటి వరకు ఏమి అడగాల్సిన ఆవశ్యకత రాలేదు. ఎందుకంటే మీరు నా సర్వమనోకామనలని పూరించారు మరియు ఎదైనా వాస్తవిక భక్తి సంపద కలదో దానితో కూడా నన్ను పరిపూర్ణం చేశారు. ఒక ప్రార్థన ఉంది ఈ దాసుడిది. ఒకవేళ ఉచితం అనిపిస్తే దీనిని స్వీకరించండి. నా తల్లి తండ్రులు ఒకవేళ ఎదైన జన్మలో ఎప్పుడైన మనుష్య శరీరాన్ని పొందితే వారిని కాపాడండి. వాళ్లు చాలా పుణ్యాత్ములు,

కానీ నేడు వీరి బుద్ధి విపరీతమై ఉంది. వీరు పరమాత్మ యొక్క వాణిని అంగీకరించలేదు. కబీర్ పరమేశ్వర్ అంటారు చింతించకు, నీవు మాతాపితల చక్రం యందు పడితే ఇక్కడే ఉ ండిపోతావు. సమయం వచ్చినపుడు వీరిని కూడ కాపాడుతాను. కాల్ యొక్క వలనుండి దాటిస్తాను. నీవు నిశ్చింతగా సతలోకానికి వెళ్ళు. సుదర్శన్ సతలోకంకు వెళ్లిపోతారు.

సుదర్శన గారి మాతాపితలే కలియుగంలో నీరు-నీమా జన్మం కంటే ముందుగా కూడ బ్రహ్మణ ఇంటిలో రెండు జన్మలు ఎత్తారు, ఆ సమయంలలో కూడ వారికి సంతానం లేదు. పిదప మూడవ మనుష్య జన్మం కాశీలో అయింది. ఆ సమయంలో కూడ వారు బ్రహ్మణ మరియు బ్రహ్మణి (గౌరీ శంకర్ మరియు సరస్వతీ నామంతో) లుగా ఉన్నారు, సంతానం కూడ లేకుండెను.

నీరు-నీమా ఇద్దరు గౌరీ శంకర్ - సరస్వతీ నామాలు కల బ్రహ్మణ కులస్థులు. వీరు భగవాన్ శివుడి ఉపాసకులు. భగవాన్ శివుడి మహిమని నిస్వార్థత భావంతో భక్తులకు వినిపించేవారు. ఎవరినుండి పైసలు తీసుకునేవారు కారు. ఎంత నిజాయితి కల ఆత్మలు అంటే ఒకవేళ ఎవరైనా వీరికి తనంత తానుగా దక్షిణ ఇస్తే, దానిలోంచి వారి భోజనానికి యోగ్యమైనంత తీసుకుని మిగతాదంతా భోజనంగా వేరేవారికి పెట్టెవారు.

మిగతా స్వార్థి బ్రహ్మణులు గౌరీ శంకర్ - సరస్వతీతో ఈర్శ పడేవారు. ఎందుకంటే గౌరీ శంకర్ - సరస్వతీ నిస్వార్థంగా కథలు చెప్పేవారు. డబ్బులకోసం భక్తులని మభ్యపెట్టెవారు కాదు, అందువలన అందరు ప్రశంసించేవారు. ఇంకో వైపు ముస్లింలకి తెలిసిపోయింది వీరితో పాటు ఏ హిందు బ్రహ్మణుడు లేదు అని. ముస్లింలు దీనిని అవకాశంగా తీసుకుని వారిని బలవంతంగా ముస్లింలుగా మార్చుతారు. ముసలమానులు తమ నీళ్లని పూర్తిగా వారి ఇంటిలో చల్లుతారు మరియు వారి నోటిలో కూడ వేస్తారు. అన్ని బట్టలపై కూడ చల్లుతారు. అందువలన హిందు బ్రహ్మణులంతా వీరు ముస్లింలు అయినారు అని అనేవారు. ఈ రోజు నుండి వీరికి మాతో ఎలాంటి సంబంధం లేదు అని కూడా అనేవారు.

## "నీరు-నీమాకు బట్టలు నేయుపని ఉపాధి మరియు పరమేశ్వరుడి ప్రాప్తి"

అమాయకపు గౌరీ శంకర్ - సరస్వతీ వివశులౌతారు. ముస్లింలు గౌరీ శంకర్ పేరుని నీరు అని మరియు సరస్వతీ పేరుని నీమా అని పెడుతారు. మొదట్లో వారి వద్దకు పూజా చేయించుకోడానికి వచ్చేవారు దానివలన వారి దినం గడుస్తు ఉండెది. మరియు మిగిలిన ఏదైనా రూపాయిని వారు దుర్వినియోగపరిచెవారు కాదు. ఆ మిగిలిన డబ్బుతో ధర్మ-భండారా (అంటే భోజనం పెట్టడం) చేసేవారు. పూజతో పాటు కథలు చెప్పడం కూడ (బంద) ఆగిపొయింది. వారు ఆలోచించిరి ఇక ఏమి చేయడం? వారు బట్టలు తయారు చేయడానికి ఒక చక్రం కొన్నారు మరియు బట్టలు నేయు పని మొదలుపెడుతారు. బట్టలు నేయుచు జీవనాన్ని కొనసాగించెవారు. బట్టలు నేయడంవలన వచ్చిన డబ్బుతో ఇల్లు గడిచెది.ఒకవేళ డబ్బులు మిగిలితే మరల దానితో భండార యందు ఖర్చు చేసేవారు. హిందు బ్రహ్మణులు నీరు-నీమాలని గంగానదిలో, గంగానది ఒడ్డున స్నానం చేయుటను నిషేదించారు. అనేవారు మీరు ఇప్పుడు ముసలమానులు కావున ఇక్కడ స్నానం చేయకూడదు అని.

గంగానది యొక్క ఒక పాయ నీరు అలల ద్వారా పొంగుతు కాశీలోని ఒక లహరతారా నామంకల చాలా పెద్ద సరోవరాన్ని నింపుతు ఉండెది. చాలా నిర్మలమైన జలంతో నిండి ఉండెది. దాని యందు కమలాలు విచ్చుకుని ఉండెవి. క్రీ.శ. 1398 (విక్రమి సం. 1455) జేష్ఠ మాసం, శుద్ధ పూర్ణిమ యొక్క బ్రహ్మీమూహుర్తం (సూర్యోదయం కంటే రెండున్నర గంటల ముందు) లో తన సత్యలోకం (ఋతధామం) నుండి శశరీరంగా వచ్చి పరమేశ్వర్ కబీర్ (కవిర్దేవ్) బాలకుడి రూపాన్ని ధరించి లహరతారా చెరువుయందు కల కమలం పువ్వుపై విరాజితులౌతారు. ఆ లహరతారా చెరువు యందే నీరు-నీమా పొద్దు పొద్దున బ్రహ్మీమూహుర్తంలో స్నానం చేయడానికి ప్రతిరోజు వెళ్లెవారు (బ్రహ్మీమూహుర్తం అనగా సూర్యోదయం కంటే రెండున్నర గంటల ముందు సమయం). ఒక చాలా తేజపుంజంకల మెరుస్తున్న బంతి (గోళం) (బాలుడి రూపంలో పరమేశ్వర్ కబీర్ సాహెబ్ తేజోమయ శరీరంలో వచ్చి ఉండిరి, దూరం వలన ప్రకాశపుంజంలాగా కనిపించెది) మీది నుండి (సతలోకం నుండి) వచ్చింది మరియు కమలం పువ్వుపై పడింది. దానివలన పూర్తి లహరతార చెరవు కాంతివంతంగా అయిపోయింది మరియు తరువాత ఒక మూలయందు వెళ్లిపోయి అదృశ్యం అయిపోయింది. ఈ దృశ్యాన్ని స్వామి రామానందగారి యొక్క ఒక శిష్యుడు ఋషి అష్టానందజీ కళ్లతో చూచుచుండిరి. అష్టానందజీ కూడ స్నానం చేయడానికి ఏకాంత స్థానంపై అదే లహరతారా సరస్సు యందు ప్రతిరోజు వచ్చేవారు. అక్కడ కూర్చొని తన సాధనా గురుదేవులు ఇచ్చిన మంత్రాలని జపించెవారు మరియు ప్రకృతిని ఆనందించెవారు. స్వామి అష్టానందజీ అంతటి ప్రకాశాన్ని చూడగానే వారి కళ్లు కూడా ముసుకున్నాయి. ఋషి అనుకున్నారు ఇది నా భక్తి యొక్క ప్రాప్తమా ఈ ప్రకాశం లేక నన్ను నేను మోసగించుకుంటున్నానా. ఇలా ఆలోచించి ఇలా ఎందుకు జరిగిందని కారణం అడుగుటకు తన గురుదేవుల వద్దకి వెళ్లారు.

ఆదరణీయ రామానందగారిని అష్టానందజీ అడుగుతారు గురుదేవ! నేను ఇవాళ ఎలాంటి వెలుతురుని చూశానంటే నా జీవితంలో అంతకుముందు ఎన్నడు చూడలేదు. ఆకాశం నుండి ఒక ప్రకాశ సమూహం వచ్చుచుండెను. నేను చూడగానే నా కళ్లు ఆ వెలుతురిని భరించలేక పోయాయి. అందువలన నా కళ్లు మూయబడ్డాయి. మూయబడిన కళ్లలో ఒక శిశు (బాలుడి) రూపం కనిపించింది. (ఏలాఐతే సూర్యుని చూసిన తరువాతనే సూర్యుని గోళం కనిపిస్తుంది, అలానే బాలుడు కనిపించసాగెను.). ఇది ఏమైనా భక్తి వలన కలిగిన ఫలమా లేక నా దృష్టి దోషమా? తెలియడంలేదు. స్వామి రామానందగారు అంటారు పుత్రుడా! ఇలాంటి లక్షణం ఎప్పుడైతే పై లోకం నుండి ఏవరైన అవతరిస్తారో అప్పుడు కనిపిస్తుంది. వారు ఎవరి వద్దనైన ప్రకటితులౌతారు, ఏ తల్లి నుండి జన్మని పొందుతారు మరియు తరువాత లీలా చేస్తారు. (ఎందుకంటే ఋషులకి ఇంతయే జ్ఞానం ఉండింది ఏవరైన తల్లి నుండియే జన్మిస్తారు అని. ఎంతైతే ఋషికి జ్ఞానం ఉందో అంత వరకు తన శిష్యుడి సందేహాన్ని నివృత్తి చేయగలరు)

నీరు మరియు నీమా ప్రతిదినంలానే ఆ రోజు కూడా స్నానం చేయడానికి వెళ్లారు. మార్గంలో నీమా ప్రభువుతో ప్రార్థన చేస్తుంది హే భగవాన్ శివ! (ఎందుకంటే వాళ్లు

ముసిలిములుగా మార్చబడిన కూడా వారి యొక్క సాధనా హృదయంయందునే ఉ
ండిపోయింది.అందువలన శివుడినే ప్రార్థించెవారు).మీ ఇంటిలో మా కొరకు ఒక పిల్లవాడు కూడ లేడా? మాకు కూడ ఒక పుత్రుడిని ఇస్తే, మా జీవితం సఫలం అయ్యేది. ఇలా అంటు వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమె భర్త నీరు అంటాడు నీమా ప్రభు యొక్క ఇచ్చాపై ప్రసన్నంగా ఉండటంలోనే హితం ఉంది. ఇలా ఎడుస్తు ఉంటే నీ శరీరం బలహీనమవుతుంది. కళ్లతో చూడడం ముగిసిపోతుంది. మన భాగ్యంలో సంతానం లేదు. ఇలా మాట్లాడుకుంటు లహరతారా సరస్సు దగ్గరికి చేరుకుంటారు. కొంచెం-కొంచెం చీకటిగా ఉండెను. నీమా స్నానం చేసి బయటకు వస్తుంది. తన బట్టలని మార్చుకుంటుంది. నీరు స్నానం చేయడానికి చెరువు యందు దిగి మునిగి తేలుతూ స్నానం చేయసాగాడు. నీమా విడిచిన బట్టలని ఉతకడానికి మరల చెరువు ఒడ్డుపైకి వస్తుంది. అప్పటివరకి చీకటి తక్కువై, సూర్యోదయం కావాల్సి ఉ
ండెను. నీమా చెరువులో తన ఎదుట కల ఒక కమలం పువ్వుపై ఎదో వస్తువు కదులుతున్నట్లు చూస్తుంది. కబీర్ సాహెబ్ బాలుడి రూపంలో ఒక కాలు యొక్క బోటన వేలుని నోటిలో ఉ
ంచుకుని రెండవ కాలుని ఊపుతు ఉండినారు. మొదట నీమా అనుకుంటుంది ఏమైనా పాము కావచ్చు నా భర్త వైపు  వస్తుంది అని. తరువాత నిశితంగా చూస్తుంది. అది బాలుడు అని తెలుసుకొనుటకు సమయం పట్టలేదు. బాలుడు కమలం పువ్వుపై ఒక్కసారిగా తన భర్తని అంటుంది చూడండి బాలుడు మునిగిపోతాడు, బాలుడు జాగ్రత్త మునిగిపోతాడు. నీరు అంటాడు అమాయకురాల నీవు పిల్లల ద్యాసలో పడి పిచ్చిదానివి అయ్యావు. నీళ్లలో కూడ నీకు బాలుడు కనిపిస్తున్నాడా! నీమా అంటుంది, అవును, అదిగో ఎదుట కల కమలంపై చూడండి. నీమా యొక్క బిగ్గరమైన మాటలతో ప్రభావితమై నీమా తన చేతితో ఎటువైపైతే సంకేతం చేస్తుందో అటువైపు నీరు చూస్తాడు, ఒక కమలపు పువ్వుపై నవజాత శిశువు పడుకుని ఉండెను. నీరు ఆ పిల్లవాడిని పువ్వుతో పాటుగా ఎత్తుకుని వస్తాడు మరియు నీమాకి ఇస్తాడు. తను స్నానం చేస్తాడు. నీరు స్నానం చేసి బయటకు వస్తాడు నీమా బాలుడి రూపంలో వచ్చిన పరమేశ్వర్‌ని చాలా ముద్దాడుతు, ప్రేమచేస్తు ఉంటుంది మరియు శివ ప్రభువు యొక్క ప్రశంస మరియు స్తుతి చేస్తుంది ప్రభు మీరు నా కొన్ని సంవత్సరాల మనోకోరిక పూర్ణం చేశారు. (ఎందుకంటే ఆమె శివుడిని పూజించెది) అంటు ఉండిది. శివ ప్రభు ఈ రోజే హృదయంతో పిలిచాను, ఈ రోజే విన్నారు.

ఆ కబీర్ పరమేశ్వరుడు, ఎవరి నామాన్ని పలకడం వలన హ్రాయంలో ఒక విశేషమైన స్పందన కలుగుతుంది. ఆయన ప్రేమలో రోమరోమం నిలబడుతుంది. ఆత్మ పైకి వస్తుంది మరియు ఏ మాతా-చెల్లెలు తన హృదయానికి హత్తుకుని పుత్రుడికి ప్రేమ అను ఆనందంను ఇస్తుందో ఆ ఆనందం అవర్ణనీయమైనది. ఎలాఅంటే ఒక వ్యక్తి బెల్లమును తిని అన్యులకి దాని ఆనందాన్ని చెప్పలేము అది కేవలం తిన్న వాళ్లకె తెలుస్తుంది. ఎలా ఐతే తల్లి ప్రేమ ఇస్తుందో అలానే శిశు రూపధారి పరమేశ్వరుడి ముఖాన్ని ముద్దాడుతుంది, హృదయానికి హత్తుకుంటుంది మరియు ఉకె-ఉకె పరమేశ్వరుడి ముఖారవిందాన్ని చూస్తు ఉండింది. ఇదంతా నీరు కూడ చూస్తున్నాడు. (మనుషుడు సమాజం వైపు ఎక్కువ చూస్తాడు) నీరు విచారం

చేయసాగాడు ఇలా– మముల్ని ముసులిములు అంతగా ఇష్టపడడం లేదు మరియు హిందువులు ద్వేషిస్తున్నారు. ఈ ద్వేషం వలనే ముస్లింలు మనల్ని ముస్లింలుగా మార్చినారు. మాకు నా అనేవాళ్లు ఏవరులేరు. ఒకవేళ ఈ బాలుడిని మేము తీసుకువెళ్తె అందరు అడుగుతారు ఈ బాలుడిని ఎక్కడినుండి తీసుకు వచ్చారు? ఈ బాలుడి మాతాపితలు ఎవరు? ఆ బాలుడి అమ్మ ఏడుస్తు ఉండవచ్చు? నేను ఏం సమాధానం చెప్పాలి, ఎలా చెప్పాలి? కమలం పువ్వు పై నుండి తీసుకువచ్చాం అంటే ఏవరైనా నమ్ముతారా? నమ్మరు. ఇలా విచారించుకుంటు నీరు నీమాతో అంటాడు నీమా ఈ బాలుడిని ఇక్కడె వదిలేద్దాం. నీమా అంటుంది నేను బాలుడిని వదిలి వెళ్లలేను. నా ప్రాణాలు వెళ్లిపోతాయి, నేను కుమిలి కుమిలి చనిపోతాను. నాకు తెలియదు ఈ బాలుడు నాపై ఏం మాయ చేశాడో? నేను మాత్రం వదిలి వెళ్లలేను. నీరు నీమాతో పూర్తి విషయాన్ని చెబుతాడు పిల్లవాడిని తీసుకువెళ్తె మనకు ఇలా జరగవచ్చును అని. నీమా అంటుంది ఈ బాలుడికోసం నేను ఈ ప్రదేశాన్ని విడిచిపెట్టగలను.కానీ ఇతడిని వదులుకోలేను. నీరు ఆమె అమాయకత్వాన్ని చూసి తను పిచ్చిదైపోయింది, సమాజాన్ని చూడడం లేదు. నీరు నీమాతో అంటాడు నేను నిన్ను పుత్రులు లేరని ఎనాడు అనలేదు. నీవు అనేదానినే స్వీకరిస్తునే ఉండెవాడిని. కానీ నేడు నేను ఈ మాటని అంగీకరించను. ఈ బాలుడిని ఇక్కడనే ఉంచు, లేదంటే నీ రెండు చెంపలు వాయిస్తాను. ఆ మహాపురుషుడు మొదటిసారి తన భార్య పైకి చేతి ఎత్తుతాడు. అదే సమయంలో శిశు రూపంలో కబీర్ పరమేశ్వర్ (కవిర్దేవ్) అంటారు నీరు నన్ను ఇంటికి తీసుకెళ్లండి మీకు ఏలాంటి ఆపద రాదు. శిశు రూపంలో పరమేశ్వరుడి వచనాలని విని నీరు కొంచెం కంగారు పడతాడు. ఈ బాలుడు అవతార పురుషుడా లేక సిద్ధపురుషుడా మరియు నాపై ఎలాంటి ఆపత్తి రాకుండుగాక అని లోపల అనుకుంటు నోరు మూసుకుని నడవసాగాడు.

ఎప్పుడైతే బాలుడిని ఇంటికి తీసుకుపోయినారో అందరు ఏవరి బాలుడు అనడానికి బదులుగా కాశీలోని స్త్రీలు, పురుషులు మరియు బాలురు చూడడానికి వచ్చారు మరియు అనసాగిరి ఈ బాలుడు ఏదో దేవుడిలాగా అనిపిస్తున్నారు. ఇంత సుందరమైన శరీరం, ఇలాంటి తేజోమయ బాలుడిని మునుపెన్నడు చూడలేదు. ఒకరు అనేవారు ఇతను బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులలో ఒక ప్రభువు అని.బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులు అనేవారు ఇది పై లోకాలనుండి వచ్చినటువంటి శక్తియే. ఇలా అందరూ వారి వారి భావాలని చెప్పెవారు.

గరీబ, చౌరాసి బంధన్ కాటన్, కిని కలప కబీర్। భవన చతురదశ లోక సబ, టుటైం జమ జంజీర్ ॥376॥
గరీబ, అనంత కోటి బ్రహ్మాండ మే, బంది ఛోడ్ కహాయ్। సో తౌ ఎక కబీర్ హై, జనని జన్యా న మాయ్ ॥377॥
గరీబ, శబ్ద స్వరూప సాహిబ్ ధని, శబ్ద సింఘు సబ మాంహి॥ బాహర భీతర రమి రహ్యా, జహా తహా సబ ఠాంహి॥378॥
గరీబ, జల థల పృథ్వి గగన మే,బాహర భితర ఏక। పురణబ్రహ్మ కబీర్ హై, అవిగత పురుష అలేఖ ॥379॥
గరీబ, సేవక హోయ్ కరి ఊతరే, ఇస పృథ్వి కే మాహి। జీవ ఉధారన జగతగురు, బార బార బలి జాహి ॥380॥
గరీబ, కాశిపూరి కరత కియా, ఉతరే అధర అధార్। మోమన్ కు ముజరా హువా, జంగల్ మే దిదార్ ॥381॥
గరీబ, కోటి కిరణ శశి భాన సుధి, ఆసన అధర బిమాన। పరసత్ పురణబ్రహ్మ కుం, శితల పిండరు ప్రాణ ॥382॥
గరీబ, గోద లియా ముఖ చుంబి కరి, హేమ రూప ఝలకంత। జగర మగర కాయా కరై, దమకై పదుమ అనంత ॥383॥

గరీబ, కాశి ఉమటి గుల భయా, మోమన్ కా ఘర్ ఘేర్। కోయి కహై బ్రహ్మ విష్ణు హై, కోయి కహై ఇంద్ర కుబేర్ ॥384॥
గరీబ,కోయి కహై ఛల ఈశ్వర నహి, కోయి కినర కహలాయ। కోయి కహై గణ ఈశ కా, జ్యుం జ్యుం మాత రిసాయ్॥388॥
గరీబ, కోయి కహే వరుణ ధర్మరాయ హై, కోయి కహే కుతే ఈశ। సోలహ్ కలా సుభాన గతి, కోయి కహై జగదీశ॥385॥
గరీబ, భక్తి ముక్తి లే ఉతరే, మేటన తినుం తాప। మోమన్ కే డేరా లియా, కహై కబీరా బాప ॥386॥
గరీబ, దుధ న పివై న అన్న బఖై, నహి పలనే ఝులంత। అధర అమాన ధియాన మే, కమల కలా ఫులంత్ ॥387॥
గరీబ, కాశి మే అచరజ భయా, గయి జగత కి నింద్। ఐసే దుల్హే ఊతరే, జ్యుం కన్యా వర బింద్ ॥389॥
గరీబ, ఖలక మూలక దేఖన్ గయా, రాజా ప్రజా రిత్। జంబుదిప జిహాంన మే, ఉతరే శబ్ద అతిత్ ॥390॥
గరీబ, దుని కహై యోహ్ దేవ హై, దేవ కహత్ హై ఈశ। ఈశ కహై పారబ్రహ్మ హై, పురణ బిసవే బిస్ ॥391॥

**పరమేశ్వర్ కబీరుయే అనాది పరమ గురువులు వారు రూపాలని ధరించి సంత్ మరియు ఋషి వేశంలో సమయ-సమయంపై (స్వయంభూ) స్వయంగా ప్రకటితులౌతారు. కాల యొక్క దూతలు (సంత్) ద్వారా ప్రక్కదోవపట్టినటువంటి తత్వజ్ఞానాన్ని చక్కదిద్దుతారు, బాగుచేస్తారు. కబీరు సాహెబుయే బ్రహ్మ-విష్ణు-మహేశ్వరు మొదలగు దేవతలు, ఋషి, ముని మరియు సంత్‌లకి సమయ-సమయంపై తన సతలోకం నుండి వచ్చి నామ ఉపదేశాన్ని ఇచ్చారు. ఆదరణీయ గరీబదాస్ మహారాజ్ గారు తన వాణియందు రాసినారు ఏదైతే కబీరుయే స్వయంగా చెప్పిన విషయం:-**

ఆది అంత హమరా నహి, మధ్య మిలావా మూల్। బ్రహ్మ జ్ఞాన సునాఈయా, ధర పిండా అస్థుల్ ॥
శ్వేత భుమికా హమ గయే, జహా విశ్వమ్బరనాథ్। హరియమ్ హిరా నామ దే, అష్ట కమల దల్ స్వా (తి ॥
హమ బైరాగి బ్రహ్మ పద, సన్యాసి మహాదేవ। సోహం మంత్ర దియా శంకర కుం, కరత హమారి సేవ ॥
హమ్ సుల్తాని నానక తారే, దాదు కుం ఉపదేశ్ దియా। జాతి జులాహా భేద న పాయా, కాశి మాహే కబీర్ హుఆ॥

సతయుగ మే సతసుకృత కహ్ టేరా, త్రేతా నామ మునింద్ర మేరా।
ద్వాపర మే కరుణామయ కహలాయా, కలియుగ మే నామ కబీర్ ధరాయా ॥
చారో యుగో మే హమ పుకారై, కుక కహై హమ హేల రే।
హిరే మానిక్ మోతి బరసే, యే జగ చుగతా ఢేల రే ॥

**పై వాణి వలన సిద్ధించబడినది కబీర్ పరమేశ్వరుడే అవినాశి పరమాత్మా అని. ఈయన అజర అమరుడు (చీరంజివి). ఈ పరమాత్మయే నాలుగు యుగాలలో స్వయంగా అతిథి రూపంలో కొంత సమయం ఈ సంసారంలోకి వచ్చి తన సతభక్తి మార్గాన్ని ప్రసాదిస్తారు.**



# పూర్ణ సంత్ యొక్క గుర్తింపు

(పవిత్ర సద్‌గ్రంథాల నుండి పూర్ణ సంత్ యొక్క గుర్తింపు (చిరునామా) )

**వేదాలు, గీతా మొదలగు పవిత్ర సద్‌గ్రంథాలలో ప్రమాణం కనిపిస్తుంది. ఎప్పుడైతే ధర్మానికి హాని కలుగుతుంది మరియు అధర్మం యొక్క వృద్ధి అవుతుందో మరియు వర్తమానంలో నకిలి సంత్‌లు, మఠాధిపతులు మరియు గురువుల ద్వారా భక్తి మార్గ స్వరూపం చెడుగా చేయబడుతుందో, అప్పుడు పరమేశ్వరుడు స్వయంగా వచ్చి లేదా తన పరమజ్ఞాని సంత్‌ని పంపించి సరియైన జ్ఞానం ద్వారా ధర్మంను మరల స్థాపింపచేస్తాడు. ఆయన భక్తి మార్గాన్ని శాస్త్రానుకూలంగా తెలియచేస్తాడు. ఆయన గుర్తింపు ఏమిటంటే వర్తమానంలోని ధర్మ గురువులు ఆయనకి వ్యతిరేకంగా నిలబడి రాజులని మరియు ప్రజలని మభ్యపెడుతు ఆయనపై హత్యాచారాలు చేయిస్తారు. కబీర్ సాహెబ్ తన వాణి యందు అంటారు:-**

జో మమ సంత్ సత ఉపదేశ దృఢావై (బతావై) , వాకే సంగ సభి రాడ బఢావై ।
యా సబ సంత్ మహంతన కి కరణీ, ధర్మదాస్ మై తో సే వర్ణి ॥

**కబీర్ సాహెబ్ తన ప్రియ శిష్య ధర్మదాసుతో ఈ వాణి యందు తెలియజేస్తున్నారు నా యొక్క సంత్ సతభక్తి మార్గాన్ని బోదిస్తాడు, అతనితో అందరూ సంత్‌లు మరియు మఠాధిపతులు గొడవలు పడుతారు.ఇదియే ఆయనని గుర్తించగల చిహ్నం.**

**రెండవ చిహ్నం ఆ సంత్ అన్ని ధర్మాల గ్రంథాలని క్షుణ్ణంగా తెలిసినవాడు. ప్రమాణం సతగురు గరీబదాస వాణి యందు:-**

"సతగురు కే లక్షణ కహూ, మధురే బైన వినోద । చార వేద షట్ శాస్త్ర, కహై అఠారా బోధ్ ॥"

**ఆయన నాలుగు వేదాలు, ఆరు శాస్త్రాలు, పద్దెనిమిది పురాణాలు మొదలగు అన్ని గ్రంథాలు తెలిసినవాడు, అనగా వాటి సారాన్ని గ్రహించి బయటకు తీసి చెబుతాడు. యజుర్వేదం అధ్యాయం 19 మంత్రం 25, 26లో రాసి ఉంది. వేదాలలోని మిళిత వాక్యాలు అనగా సాంకేతిక శబ్దాలు మరియు ఒక చౌపాయి శ్లోకాలని పూరించి విస్తారంగా చెబుతాడు మరియు మూడు సమయాల పూజని చెబుతాడు. పొద్దున పూర్ణ పరమాత్మా యొక్క పూజా, మధ్యాహ్నం విశ్వంలోని సకల దేవతల సత్కారం మరియు సంధ్యాహారతి వేరొక విధంగా చెబుతాడు. అతడు జగత్తుకి ఉపకారం చేయు సంత్ అవుతాడు.**

**యజుర్వేదం అ. 19 మంత్రం 25**

సందిఛేదం : అర్ధ బుచై: ఉక్థానామ్ రూపమ్ పదై: ఆప్నోతి నివిద: ।
ప్రణవై: శస్త్రాణామ్ రూపమ్ పయసా సోమ: ఆప్యతే ॥25॥

అనువాదం:- ఏ సంత్ (అర్ధ బుచై:) వేదాల యొక్క అర్ధ వాక్యాలు అనగా సాంకేతిక శబ్దాలని పూర్ణం చేసి (నివిద:) అందిస్తాడు (పదై:) శ్లోకం యొక్క నాలగవ భాగాన్ని అనగా అంశిక వాక్యాలని (ఉక్థానమ్) శాస్త్రాల (రూపమ్) రూపంలో (ఆప్నోతి) ప్రాప్తించేస్తాడు అనగా సారాంశాన్ని పూర్ణ రూపంతో తెలియజేస్తాడు (శస్త్రాణమ్) ఎలా అయితే శస్త్రాలని ప్రయోగించు విధానం తెలిసినవాడు వాటిని (రూపమ్) పూర్ణ రూపంతో ప్రయోగం చేస్తాడు ఇలాంటి పూర్ణ

సంత్ (ప్రణవై:) ఓంకారం అనగా ఓం-తత్-సత్ మంత్రాలని పూర్ణ రూపంతో తెలుసుకొని మరియు తెలియజేసి (పయసా) పాలు నీళ్లు వేరు చేస్తారు అనగా నీళ్లులేని పాలవంటి తత్వజ్ఞానంను ప్రసాదిస్తాడు. దానివలన (సోమ:) అమర పురుషుడు అనగా అవినాశి పరమాత్మని (ఆప్యతే) పొందుతాడు. ఆ పూర్ణ సంత్ వేదాలని తెలిసినవాడిగా అనబడతాడు.

**భావార్థం :- తత్వదర్శి సంత్ ఆయనే అవుతాడు ఎవరైతే వేదాల సాంకేతిక శబ్దాలని పూర్ణ విస్తారంగా వివరించగలుగుతారు. దానివలన పూర్ణ పరమాత్మ యొక్క ప్రాప్తి అవుతుంది. ఆయన వేదాలని తెలిసినవాడిగా పిలవబడుతాడు.**

యజుర్వేదం అ. 19 మంత్రం 26

సందిఛేదం :- అశ్విభ్యామ్ ప్రాత: సవనమ్ ఇంద్రేణ ఐన్ద్రమ్ మాధ్యన్దినమ్
వైశ్వదైవమ్ సరస్వత్యా తృతీయమ్ ఆప్తమ్ సవనమ్ (26)

అనువాదం:- ఆ పూర్ణ సంత్ మూడు సమయాల సాధనని చెబుతాడు (అశ్విభ్యామ్) సూర్యుడి ఉదయం, అస్తమయంతో అగు ఒక రోజు యొక్క ఆధారంతో (ఇన్ద్రేణ) ప్రథమ శ్రేష్ఠతతో సర్వదేవుల యజమాని-మాలిక్ పూర్ణ పరమాత్మా యొక్క (ప్రాత: సవనమ్) పూజని ప్రాత:కాలంలో చేయాల్సిందిగా చెబుతాడు. అది పూర్ణ పరమాత్మా కోసం ఉంటుంది. రెండవది (మధ్యాన్దినమ్) పగలు చెయాల్సిందిగా చెబుతాడు అది (వైశ్వదైవమ్) సర్వ దేవతల సత్కార సంబంధిత (సరస్వత్యా) అమృతవాణి ద్వారా సాధన చేయాల్సిందిగా చెబుతాడు మరియు (తృతీయమ్) మూడవది (సవనమ్) పూజ సాయంత్రం (ఆప్తమ్) ప్రసాదిస్తాడు అనగా ఎవరైతే మూడు సమయాల సాధనని వేరువేరుగా చేయాలి అని చెబుతాడో ఆయన జగత్తుకి ఉ పకారం చేయు సంత్ అవుతాడు.

**భావార్థం :- పూర్ణ సంత్ దినంలో మూడుసార్లు (ప్రాత:కాలం, పగలు, సాయంత్రం) సాధన చేయాల్సిందిగా చెబుతాడు. ప్రొద్దున పూర్ణ పరమాత్మా యొక్క పూజ, మధ్యాహ్నం సర్వదేవతల సత్కారం కోసం మరియు సాయంత్రం సంధ్యాహారతి మొదలగునవి అమృతవాణి ద్వారా చేయాలి అని చెబుతాడు. ఆయన సర్వ సంసారానికి ఉపకారం చేయువాడు అవుతాడు.**

యజుర్వేదం అ. 19 మంత్రం 30

సందిఛేదం: వ్రతేన దిక్షామ్ ఆప్నోతి దిక్షయా ఆప్నోతి దక్షిణామ్ ।
దక్షిణా శ్రద్ధామ్ ఆప్నొతి శ్రద్దయా సత్యమ్ ఆప్యతే ॥30॥

అనువాదం: (వ్రతేన) దుర్వసనాల వ్రతం ఉంచడంతో అనగా మద్యం, మాంసం మరియు పొగాకు మొదలగు వాటి సేవనం నుండి సంయమనం ఉంచు సాధకుడు (దీక్షాణ్) పూర్ణ సంత్ నుండి దీక్షని (ఆప్నోతి) పొందుతాడు అనగా అతడు పూర్ణ సంత్ యొక్క శిష్యుడౌతాడు. (దీక్షయా) పూర్ణ సంత్ దీక్షిత శిష్యుడి నుండి (దక్షిణామ్) దానంను (ఆప్నోతి) ప్రాప్తిస్తుంది అనగా సంత్ అతడినుండియే దక్షిణ తీసుకుంటాడు, ఏవరైతే ఆయన నుండి నామాన్ని తీసుకుంటారు. ఈ విధంగా విధిప్రకారంగా (దక్షిణ) గురుదేవుల ద్వారా చెప్పిన అనుసారంగా ఏవరైతే దాన దక్షిణతో ధర్మం చేస్తాడో అతడినుండి (శ్రద్ధామ్) శ్రద్ధని (ఆప్నొతి) పొందుతాడు. (శ్రద్దయా) శ్రద్దతో భక్తి చేయడం వలన (సత్యమ్) ఎల్లపుడు ఉండునటువంటి

సుఖం మరియు పరమాత్మా అనగా అవినాశి పరమాత్మని (ఆప్యతే) పొందుతాడు.

**భావార్థం:- పూర్ణ సంత్ అతడిని శిష్యుడిగా చేసుకుంటారు ఎవరైతే సదాచారియై ఉంటాడు. తినకూడని పదార్థాల సేవనం మరియు మత్తుపదార్థాల సేవనం చేయను అని మాట ఇస్తాడు. పూర్ణ సంత్ అతడి నుండియే దానాన్ని గ్రహిస్తాడు ఏవరైతే ఆయన శిష్యుడు అవుతాడు. తరువాత గురుదేవుల నుండి దీక్షని పొంది పిదప దాన-దక్షిణ చేస్తాడు దానివలన శ్రద్ధ పెరుగుతుంది. శ్రద్ధతో సత్యభక్తి చేయడం వలన అవినాశి ప్రభువుని పొందుతాడు అనగా పూర్ణ మోక్షం అవుతుంది. పూర్ణ సంత్ భిక్ష మరియు చందా అడుగుతు తిరుగడు.**

కబీర్, గురు బిన్ మాలా ఫేరతే గురు బిన్ దేతే దాన్ ।
గురు బిన్ దోనో నిష్ఫల్ హై, పుఛో వేద పురాణ ॥

**మూడవ గుర్తు మూడు విధాల మంత్రాలని (నామంలను) మూడు సార్లు ఉపదేశం చేయిస్తాడు. దాని వర్ణన కబీర్ సాహెబ్ గ్రంథ పేజి నం. 265 బోనసాగరంలో దొరుకుతుంది మరియు గీతా అధ్యాయం 17 శ్లోకం 23 మరియు సామవేదం సంఖ్య 822లో దొరుకుతుంది.**

కబీర్ సాగరలో అమర ముల బోధ సాగర పేజి 265పై
తబ్ కబీర్ అస కహెవే తిన్హా, జ్ఞానభేద సకల కహ తిన్హా ॥
ధర్మదాస్ మై కహెూ బిచారి, జిహితే నిబహై సబ సంసారి ॥
ప్రథమహి శిష్య హెూయ్ జో ఆయి, తా కహై పాన్ దేహు తుమ బాయి ॥1॥
జబ దేఖహు తుమ దృఢతా జ్ఞానా, తా కహై కహు శబ్ద ప్రవానా ॥2॥
శబ్ద మాంహి జబ నిశ్చయ ఆవై, తా కహై జ్ఞాన అగాధ్ సునావై ॥3॥

**రెండసారి మరల తెలియచేసిరి-**

బాలక సమ జాకర హై జ్ఞానా । తాసోం కహహు వచన ప్రవానా ॥1॥
జా కో సూక్ష్మ జ్ఞాన్ హై బాయి । తా కో స్మరన దేహు లఖాయి ॥2॥
జ్ఞాన గమ్య జా కో పుని హెూయి । సార శబ్ద జా కో కహ్ సోయి ॥3॥
జా కో హెూఎ దివ్య జ్ఞాన పరవేశా, తాకో కహే తత్వ జ్ఞాన ఉపదేశా ॥4॥

**పై వాణి ద్వారా స్పష్టం అవుతుంది కడిహారి గురు** (పూర్ణ సంత్) **మూడు స్థితులో సార నామం వరకు ప్రసాదిస్తారు మరియు నాలుగవ స్థితిలో సారశబ్దం ప్రసాదించాల్సి ఉంటుంది. ఎందుకంటే కబీర్ సాగర లో ప్రమాణం తరువాత చూసితిమి కానీ ఉపదేశం ఇచ్చు విధానం మొదటగా పూజ్య దాదా గురుదేవ్ మరియు పరమేశ్వర్ కబీర్ సాహెబ్గారు మా పూజ్య గురుదేవులకి ప్రదానం చేసి ఉండిరి. వారు మాకు ప్రారంభం నుండియే మూడు సార్లు నామదానం యొక్క దీక్ష చేయిస్తువస్తున్నారు.**

**మా గురుదేవులు రామపాల్ జీ గారు మొదటిసారి శ్రీ గణేషగారి, శ్రీ బ్రహ్మా-సావిత్రిగారి, శ్రీలక్ష్మి-విష్ణుగారి, శ్రీ పార్వతి-శంకర్గారి మరియు మాతా శేరాంవాలి యొక్క నామ జపం ఇస్తారు. ఆ దేవతల నివాసం మన మానవ శరీరంలో కల చక్రాలలో ఉంటుంది. మూలాధారంలో శ్రీ గణేషుడి నివాసం, స్వాద చక్రంలో బ్రహ్మా సావిత్రి నివాసం,**

నాభిచక్రంలో లక్ష్మీ విష్ణు నివాసం, హృదయ చక్రంలో పార్వతి శంకర్ నివాసం, కంఠ కమలంలో మాతా శేరాంవాలి నివాసం మరియు ఈ అన్ని దేవిదేవతల ఆది అనాది నామ మంత్రాలు ఉంటాయి. వాటి జ్ఞానం వర్తమాన గురువులకి లేదు. ఈ మంత్రాల జపం వలన ఈ ఐదు చక్రాలు విచ్చుకుంటాయి (తెరచుకుంటాయి). ఈ చక్రాలు తెరుచుకున్న తరువాత మానవుడు భక్తి చేయు యోగ్యుడౌతాడు. సతగురు గరీబదాస తన వాణిలో ప్రమాణం ఇస్తున్నారు:

పాంచ నామ గుర్ఝు గాయత్రి ఆత్మ తత్వ జగావో। ఓం కిలియం హరియం శ్రీయమ్ సోహం ధ్యావో ॥

భావార్థం: ఐదు నామములు గుర్ఝు గాయత్రి అంటారు. వీటిని జపించి ఆత్మని జాగృతం చేయండి.

రెండవసారి రెండు అక్షరంల జపం ఇస్తారు. అందులో ఒకటి ఓం మరియు తత్ (అది రహస్యమైనది ఉపదేశికి చెప్పబడుతుంది). దానిని శ్వాసతో పాటుగా జపం చేయాల్సి ఉంటుంది.

మూడవసారి సారనామం ఇస్తారు అది పూర్ణ రూపకంగా రహస్యమైనది.

## మూడు సార్లు నామ జపం ఇచ్చు ప్రమాణం:-

గీతా అ. 17 శ్లోకం 23

ఓం, తత్, సత్, ఇతి, నిర్దేశః, బ్రహ్మణః, త్రివిధః, స్మృతః,
బ్రాహ్మణాః, తేన, వేదాః, చ, యజ్ఞాః, చ, విహితాః, పురా ॥23॥

అనువాదం:- (ఓం) బ్రహ్మయొక్క (తత్) ఇది సాంకేతిక మంత్రం పరబ్రహ్మది (సత్) పూర్ణ బ్రహ్మది (ఇతి) ఈ విధమైన (త్రివిధః) మూడు విధాల (బ్రహ్మణః) పూర్ణ పరమాత్మా యొక్క నామ స్మరణ యొక్క (నిర్దేశః) సంకేతం (స్మృతః) చెప్పినారు (చ) మరియు (పురా) సృష్టి యొక్క ఆదికాలంలో (బ్రాహ్మణాః) విద్వానులు చెప్పినారు (తేన) ఆ పూర్ణ పరమాత్ముడే (వేదాః) వేదాలు (చ) మరియు (యజ్ఞః) యజ్ఞాదులను (విహితాః) రచించిరి.

సంఖ్యా నం. 822 సామవేదం ఉతార్చిక అధ్యాయం 3 ఖండం 5 శ్లోకం 8 (సంత్ రామపాల్‌దాస్ ద్వారా భాషా భావం)

మనీషిభి: పవతే పూర్వ్యః కవి:ర్నృభిర్యత: పరికోశాం అసిష్యదత్
త్రితస్య నామ జనయన్మధూ క్షరన్నిన్ద్రస్య వాయుం సఖ్యాయ వర్ధయన్ ॥8॥

మనీషిభిః, పవతే, పూర్వ్యః, కవీర్, నృభిః, యత్:, పరి, కోశాన్, అసిష్యదత్, త్రి, తస్య, నామ, జనయన్, మధు, క్షరనః, న, ఇంద్రస్య, వాయుమ్, సఖ్యాయ, వర్దయన్ .

అనువాదం:- (పూర్వ్యః) సనాతన అనగా అవినాశి (కవిర్ నృభిః) కబీర్ పరమేశ్వర్ మానవ రూపాన్ని ధరించి అనగా గురురూపంలో ప్రకటితమై (మనిషిభిః) హృదయంతో కోరుకునువారు శ్రద్ధతో భక్తిచేయు భక్తాత్మాలకి (త్రి) మూడు (నామ) మంత్ర అనగా నామ ఉపదేశాన్ని ఇచ్చి (పవతే) పవిత్రం చేసి (జనయన్) జన్మ మరియు (వాయుమ్) ప్రాణం అనగా జీవన శ్వాసలని, ఏవైతే సంస్కారవశ లెక్కలుగా వేసి ఉంటాయో వాటిని (కోశాన్) తన భాండాగారంతో (సఖ్యాయ) మిత్రత్వం యొక్క

ఆధారంతో (పరి) పూర్ణ రూపంతో (వర్ధయన్) పెంచుతాడు. (యత:) ఈ కారణంతో (ఇన్ద్రస్య) పరమేశ్వరుడి (మధు) వాస్తవిక ఆనందాన్ని (అసిష్యదత్) తన ఆశీర్వాద ప్రసాదంతో ప్రాప్తింపచేస్తాడు.

**భావార్థం: ఈ మంత్రంలో స్పష్టంచేసినారు పూర్ణ పరమాత్మా కవిర్ అనగా కబీర్ మానవ శరీరంలో గురువు రూపంలో ప్రకటితులై ప్రభువు ప్రేమికులకు మూడు నామంల జపంను ఇచ్చి సత్యభక్తి చేయిస్తాడు.ఆ మిత్ర భక్తుడిని పవిత్రుడుగా చేసి తన ఆశీర్వాదంతో పూర్ణ పరమాత్మా ప్రాప్తింపచేసి పూర్ణ సుఖాన్ని ప్రాప్తింపచేస్తారు. సాధకుడి ఆయువుని పెంచుతారు. ఈ ప్రమాణమే గీతా అధ్యాయం 17 శ్లోకం 23లో ఉంది. ఓం, తత్, సత్, ఇతి, నిర్దేశ:, బ్రహ్మణ:, త్రివిధ:, స్మృత:, భావార్థం ఏమిటంటే పూర్ణ పరమాత్మని పొందుటకు 1. ఓం 2. తత్ 3. సత్ మంత్ర జప స్మరణ చేయు నిర్దేశం కలదు. ఈ నామాలని తత్వదర్శి సంత్ ద్వారా పొందాలి. తత్వదర్శి సంత్ విషయంలో గీతా అ. 4 శ్లోకం 34లో చెప్పబడినది తత్వదర్శి సంత్ ద్వారా తత్వజ్ఞానంను తెలుసుకుని దాని తరువాత ఆ పరమపద పరమేశ్వరిడిని వెదకాలి. ఎక్కడైతే వెళ్ళిన తరువాత సాధకుడు తిరిగి సంసారంలోకి రాడు అనగా పూర్ణ ముక్తుడౌతాడు. ఆ పూర్ణ పరమాత్మా ద్వారానే ఈ సంసారం రచించబడి ఉంది.**

**విశేషం:- పై వివరణ ద్వారా స్పష్టం అయినది పవిత్ర నాలుగు వేదాలు కూడ సాక్షిగా ఉన్నవి పూర్ణ పరమాత్మాయే పూజా యోగ్యులు అని మరియు వారి వాస్తవిక నామం కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) అని మరియు మూడు మంత్రాల నామ జపం చేయడం వలనే పూర్ణ మోక్షం లభిస్తుంది. ధర్మదాస్ గారికి పరమేశ్వర్ కబీర్ సాహెబ్ సార శబ్దం ఇవ్వడానికి అంగీకరించలేదు మరియు ఇలా అనిరి ఒకవేళ సార శబ్దం ఏవరైన కాల్ దూత్ యొక్క చేతిలో పడిపోతే రానున్న తరాల వాళ్లు (హంసలు) భవసాగరాన్ని దాటలేరు. ఎలా అంటే కలియుగం యొక్క ప్రారంభంలో ప్రథమ తరం భక్తులు అశిక్షితులై ఉండిరి మరియు కలియుగం యొక్క అంతంలో చివరి తరం అగు భక్తులు కృతఘ్నులుగా ఉంటారు మరియు ఇప్పుడు వర్తమానంలో క్రీ. శ. 1947 నుండి భారతదేశం స్వతంత్రం పొందిన తరువాత నుండి మధ్యతరం ప్రారంభం అయినది. క్రీ.శ. 1951లో సతగురు రామపాల్‌జీ మహారాజ్‌ను పంపించడం జరిగింది. ఇప్పుడు భక్తజనులంతా శిక్షితులుగా ఉన్నారు. శాస్త్రాలు మన వద్ద విద్యామానమై ఉన్నవి. ఇక ఈ సతమార్గం, సత సాధన పూర్తి సంసారంలో వ్యాపిస్తుంది మరియు నకలి గురువులు, సంత్‌లు మరియు మఠాధిపతులు దాక్కుంటు తిరుగుతారు.**

**అందువలన కబీర్ సాగర్ , జీవ ధర్మ భోద్, భోద్ సాగర్, పేజి 1937 పై :-**

ధర్మదాస్ తోహి లాఖ దుహాయి, సార శబ్ద కహి బాహర్ నహి జాయి ।
సార శబ్ద బాహర్ జో పరి హై, బిచలి పిఢి హంస నహి తరి హై ॥

**పుస్తకం "ధని ధర్మదాస్ జీవన్ దర్శన్ ఎవం వంశ పరిచయ్" యొక్క పేజి 46పై రాసి ఉంది ఏమనంటే పదకొండవ తరానికి గద్దె లభించలేదు. ఆ మఠాధిపతి యొక్క పేరు 'ధీరజ నామ సాహెబ్', కవర్ధాలో ఉండెవాడు. దాని తరువాత పన్నెండవ మఠాధిపతి ఉగ్ర నామ సాహెబ్ దామాఖేడాలో గద్దెని స్థాపించినాడు మరియు తనే స్వయంగా మఠాధిపతి అయ్యి**

**కుర్చున్నాడు. దీని కంటే ముందు దామాఖేడాలో గద్దె లేకుండెను. దీని ద్వారా స్పష్టం అవుతుంది పూర్తి విశ్వంలో సతగురు రామపాల్‌జీ మహారాజ కాకుండా వాస్తవిక భక్తిమార్గం లేదు. సంత్ రామపాలజీ మహారాజ్ తన ప్రవచనంలో పదే పదే చెపుతారు అందరు ప్రభు ప్రేమి శ్రద్దాలులతో ప్రార్థన చేస్తారు ఏమనంటే తనని ప్రభువు ద్వారా పంపించబడిన దాసుడిగా భావించి తమ ఆత్మకల్యాణం చేసుకొండి అని.**

యహ్ సంసార్ సమఝదా నాహి, కహన్దా శ్యామ్ దోపహరే నుం ।
గరీబదాస్ యహ్ వక్త జాత హై, రోవోగే ఇస పహరే నుం ॥

**పన్నెండవ పంథ్ (గరీబదాస్ పంథ్ పన్నెండవ పంథ్‌గా కబీర్ సాగర్, కబీర్ చరిత్రబోద్ పై పేజి 1870పైన) యొక్క విషయంలో కబీర్ సాగర్, కబీర్ వాణి పేజి సం. 136-137పై వాణి రాసినారు:--**

సమ్వత్ సత్రాసై పచహత్తర్ హెూయి, తాదిన్ ప్రేమ ప్రకటే జగ సోయి ।
సాఖి హమారి లే జీవ సమఝావై, అసంఖ్య జన్మ ఠౌర నహి పావై ।
బారవే పంథ్ ప్రగట హై బాని, శబ్ద హమారే కి నిర్ణయ్ ఠాని ।
అస్థిర్ ఘర్ కా మరమ న పావై, యే బారా పంథ్ హమహి కో ధ్యావై ।
బారవే పంథ్ హమ హి చలి ఆవై, సబ్ పంథ్ మేటి ఏక హి పంథ చలావై ।
ధర్మదాస్ మోరి లాఖ దోహాయి, సార శబ్ద బాహర్ నహి జాయి ।
సార శబ్ద బాహర్ జో పరహి, బిచలి పిఢి హంస నహి తరహి ।
తేతిస అర్బ జ్ఞాన హమ భాఖా, సార శబ్ద గుప్త హమ రాఖా ।
మూల జ్ఞాన తబ తక ఛుపాయి, జబ లగ ద్వాదశ పంథ మిట జాయి ।

**ఇక్కడ సాహెబ్ కబీర్ తన శిష్యుడు ధర్మదాస్ గారికి వివరిస్తున్నారు క్రీ.శ. 1777లో నా జ్ఞానం యొక్క ప్రచారం జరుగుతుంది అది పన్నెండవ పంథ్ అవుతుంది. పన్నెండవ పంథలో మా వాణి ప్రకటితమవుతుంది కానీ సరియైన భక్తిమార్గం ఉండదు. తరువాత పన్నెండవ పంథలో మేమే నడుచుకుంటు వస్తాము మరియు అన్ని పంథ్‌లని తొలగించి కేవలం ఒక పంథ్‌ని నడిపిస్తాము. కానీ ధర్మదాస్ నీకు లక్ష ఆనలు (ప్రతిజ్ఞలు) ఈ సార శబ్దాన్ని ఏవరికైన ఇస్తే. ఇవ్వకు లేదంటే మధ్యతరం హంసలు భవసాగరాన్ని దాటలేవు. ఇందువలన ఎప్పటివరకైతే పన్నెండవ పంథలు తొలగింపబడి ఒక పంథ్ నడవదో అప్పటివరకు ఈ మూల జ్ఞానంను నేను దాచి ఉంచుతాను.**

**సంత్ గరీబదాస్ జీ మహారాజ్ గారి వాణి యందు నామం యొక్క మహాత్యం :-**

నామ అభైపద ఊంచా సంతో, నామ అభైపద ఊంచా ।
రామ దుహాయి సాచ కహత హు, సతగురు సే పుఛా ॥
కహై కబీర్ పురుష బరియామం, గరీబదాస ఏక నౌకా నామం ॥
నామ నిరంజన నీకా సంతో, నామ నిరంజన నీకా ।
తీర్థ వ్రత్ థోథరే లాగే, జప తప సంజమ ఫికా ॥

గజ తురక పాలకి అర్థా, నామ బినా సబ్ దానం వ్యర్థా ।

కబీర్, నామ గహే సో సంత సుజానా, నామ బినా జగ ఉరఝూనా ।

తాహి నా జానే యే సంసారా, నామ బినా సబ్ జమ కే చారా ॥

**సంత నానక సాహెబ్ జీ గారి వాణి యందు నామం యొక్క మహోత్యం :-**

నానక నామ చఢది కలాం, తేరే భాణే సబదా భలా ।

నానక దు:ఖియా సబ సంసార్, సుఖియా సోయ్ నామ ఆధార్ ॥

జాప తాప జ్ఞాన సబ ధ్యాన్, షట శాస్త్ర సిమరత్ వ్యాఖాన్ ।

జోగ అభ్యాస కర్మ ధర్మ సబ క్రియా, సగల త్యాగవణ మధ్య ఫిరియా ।

అనేక ప్రకార కిఏ బహుత్ యత్నా, దాన్ పుణ్య హెూమై బహు రత్నా ।

శిశ కటాయే హెూమై కర రాతి, వ్రత నేమ కరే బహు భాంతి ॥

నహి తుల్య రామ నామ విచార్, నానక గురుముఖ నామ జపియే ఏక బార్ ॥

**(పరమ పూజ్య కబీర్ సాహెబ్ (కవిర్ దేవ్) గారి అమృతవాణి)**

సంతో శబ్దయి శబ్ద బఖానా ॥టేక॥ శబ్ద ఫాంస ఫసా సబ కోయి శబ్ద నహి పహచానా ॥ ప్రథమహి బ్రహ్మ స్వం ఇచ్ఛా తే పాంచౌ శబ్ద ఉచారా॥ సోహం, నిరంజన్, రంరకార్, శక్తి ఔర్ ఓంకారా॥ పాంచౌ తత్వ ప్రకృతి తినో గుణ ఉపజాయా । లోక ద్వీప చారో ఖాన చౌరాసి లఖ బనాయా ॥ శబ్దయి కాల్ కలందర్ కహియే శబ్దయి భర్మ భులాయా ॥ పాంచ శబ్ద కి ఆశా మే సర్వస మూల గంవాయా॥ శబ్దయి బ్రహ్మ ప్రకాశ్ మేంట కే బైఠే మూందే ద్వారా । శబ్దయి నిరగుణ శబ్దయి సరగుణ శబ్దయి వేద పూకారా ॥ శుద్ధ బ్రహ్మ కాయా కే భీతర్ బైఠ కరే స్థానా । జ్ఞాని యోగి పండిత ఔ సిద్ధ శబ్ద మే ఉరఝూనా ॥ పాంచయి శబ్ద హై ముద్రా కాయా బీచ ఠికానా । జో జిహసంక ఆరాధన్ కరతా సో తిహి కరత బఖానా ॥ శబ్ద నిరంజన చాంచరి ముద్రా హై నైనన్ కే మాహి॥ తాకో జానే గోరఖ యోగి మహా తేజ తప మాహి ॥ శబ్ద ఓంకార భుచరి ముద్రా త్రికుటి హై స్థానా । వ్యాస దేవ తాహి పహిచానా చాంద సూర్య తిహి జానా॥ సోహం శబ్ద అగోచరి ముద్రా భవర గుఫా స్థానా॥ శుకదేవ ముని తాహి పహిచానా సున్ అనహద కో కానా ॥ శబ్ద రంరకార ఖేచరి ముద్రా దసవే ద్వార ఠికానా ।బ్రహ్మా విష్ణు మహేశ ఆది లో రంరకార పహిచానా॥ శక్తి శబ్ద ధ్యాన్ ఉనముని ముద్రా బసే ఆకాశ్ సనేహి॥ ఝిలమిల్ ఝిలమిల్ జోత దిఖావే జానే జనక విదేహి ॥ పాంచ శబ్ద పాంచ్ హై ముద్రా సో నిశ్చయ్ కర జానా । ఆగే పురుష పురాన ని:అక్షర తినకి ఖబర్ న జానా॥ నౌ నాథ చౌరాసి సిద్ధి లో పాంచ శబ్ద మే అటకే । ముద్రా సాధ రహే ఘట్ భీతర్ ఫిర్ ఓంధే ముఖ లటకే ॥ పాంచ శబ్ద పాంచ హై ముద్రా లోక ద్వీప యమజాలా॥ కహై కబీర్ అక్షర కే ఆగే ని:అక్షర కా ఉజియాలా ॥

**“సంతో శబ్దయి శబ్ద బఖానా”లో రాసి ఉంది అందరు సంత్ జనులు శబ్దం యొక్క మహిమని వినిపిస్తారు. పూర్ణ బ్రహ్మ కబీర్ సాహెబ్‌జీ చెప్పియున్నారు ఏమనంటే శబ్దం సతపురుషుడికి కూడా ఉంది. అది సతపురుషుడి ప్రతీక మరియు జ్యోతినిరంజన్ (కాల్) యొక్క ప్రతీక కూడ శబ్దమే. కాల్ యొక్క శబ్దం చాంచరి ముద్రని ప్రాప్తింపచేస్తుంది. దీనిని**

గోరఖ యోగి చాలా అధికమైన తపస్సు చేసి పొందినారు. దీనిని పొందుట సాధారణ వ్యక్తికి సంభవంకానే కాదు. తరువాత గోరఖనాథ్ కాల్ వరకి కల సాధన చేసి సిద్దులైరి. కానీ ముక్తి పొందలేక పోయారు. ఎప్పుడైతే కబీర్ సాహెబ్ సత్యనామంను మరియు సారనామాన్ని ఇచ్చినారో అప్పుడు కాల్ నుండి గోరఖనాథగారు విడుదల అయినారు. ఇందువలన జ్యోతినిరంజన్ నామ జపం చేయువారు కాల్ యొక్క చెర నుండి బయట పడలేరు అనగా సత్యలోకానికి వెళ్లలేరు. ఓంకారం (ఓం) యొక్క జపం చేయుట వలన భుంచరి ముద్రా యొక్క స్థితిలోకి సాధకుడు వస్తాడు. వేద వ్యాసుడు ఓం నామ సాధన చేసిరి మరియు కాల్ వలలోనే ఉండిరి. సోహం నామ జపంతో అగోచరి ముద్ర స్థితి అయిపోతుంది మరియు కాల్ లోకంలో కల భంవర గుహలోకి ప్రవేశిస్తారు. దీని సాధన సుఖదేవ ఋషి చేసిరి. కేవలం శ్రీ విష్ణువుగారి లోకంలో కల స్వర్గం వరకు వెళ్ళిరి. రంరకార శబ్దంతో ఖైంచరి ముద్ర స్థితిని పొంది పదవ ద్వారం (సుష్మణ) వరకు వెళుతారు. బ్రహ్మ, విష్ణు మరియు మహేశ్వరుడు ముగ్గురును రంరకారంనే సత్యనామంగా భావించి కాల్ వలలోనే ఉండిపోయిరి. శక్తి (శ్రీయమ్) శబ్దం ఇది ఉనమునీ ముద్రని ప్రాప్తించేస్తుంది. దీనిని రాజా జనకుడు పొందినాడు కానీ ముక్తి కాలేదు. కొందరు సంత్‌లు ఐదు నామాలలో శక్తికి బదులుగా సత్యనామంను జతచేసినారు కానీ సత్యనామం యొక్క ఏ జపము లేదు. ఇదైతే సత్యమైన నామం వైపు సంకేతం ఇస్తుంది. ఎలాఐతే సత్యలోకాన్ని సచ్ఛఖండం కూడ అంటారు అలానే సత్యనామం మరియు నిజనామం. కేవలం సత్యనామ్-సత్యనామ్ జపం చేయడానికి లేదు. ఈ ఐదు శబ్దాల సాధన చేయు తోమ్మిది నాథ్‌లు మరియు **84** సిద్దులు కూడ వీటి వరకె పరిమితులైరి. మరియు శరీరంలో ధునిని (శబ్దం) వింటు ఆనందిస్తు ఉండిరి. వాస్తవిక సత్యలోక సాధనమైతే శరీరం (పిండ) నుండి (అండం) బ్రహ్మాండం నుండి వేరుగా ఉంది. ఇందువలనే మరల తల్లి యొక్క గర్భంలోకి వచ్చితిమి (వ్యతిరేకంగా వ్రేలాడి) అనగా జన్మ-మృత్యువు యొక్క కష్టం సమాప్తం అవలేదు.ఏ లాభం కూడ శరీరంలో అవుతుందో అది కాల్ (బ్రహ్మ) వరకే కలదు, ఎందుకంటే పూర్ణ పరమాత్మా యొక్క నిజ స్థానం (సతలోకం) మరియు ఆయన శరీరం యొక్క ప్రకాశం పరబ్రహ్మ కంటే కూడ అధికంగా ఉంది మరియు చాలా దూరం ఉంది. ఆయన కోసం పూర్ణ సంతయే పూర్తి సాధనలు చెబుతాడు. అవి ఐదు నామాలకంటే భిన్నంగా ఉంటాయి.

సంతో నతగురు మోహే భావై, జో నైనన్ అలఖ లఖావై ॥ ఢోలత ఢిగై నా బోలత బిసరై, సత ఉపదేశ దృడావై ॥
ఆంఖ నా ముంద్రై కాన నా రుదై నా అనహద్ ఉరఝావై ॥ ప్రాణ పుంజ క్రియాంఓ సే న్యారా, సహజ సమాధి బతావై॥

**ఘట రామాయణం రచయిత ఆదరణీయ తులసిదాస్ సాహెబ్ గారు హాథ్ రస్ వారు స్వయం అంటారు :- (ఘట రామాయణ ప్రథమ భాగం పేజి 27)**

పాంచో నామ కాల కే జానౌ తబ దాని మన్ సంకా ఆనౌ । సురతి నిరత లై లోక సిధాంఊ,
ఆదినామ లే కాల గిరాంఊ । సతనామ లే జీవ ఉబారి, అస చల జాంఊ పురుష దరబారి ॥
కబీర్, కోటి నామ సంసార్ మే, ఇనసే ముక్తి న హెూ । సార నామ ముక్తి కా దాతా, వాకో జానే న కోఎ ॥

పూరా సతగురు సోఎ కహావై, దోయ్ అఖర కా భేద బతావై ।
ఏక ఛుడావై, ఏక లఖావై, తో ప్రాణి నిజ ఘర్ జావై ॥

**గురు నానక గారి వాణి యందు మూడు నామంల ప్రమాణం:-**

జై పండిత్ తు పఢియా, బినా దూఉ అఖర దూఉ నామా ।
పరణవత నానక ఏక లంఘఏ, జే కర సచ సమావా ।
వేద కతేబ సిమరిత సబ సాంసత్, ఇన పఢి ముక్తి న హెూయి ॥
ఏక అక్షర జో గురుముఖ జాపై, తిస కి నిరమల్ హెూయి ॥

**భావార్థం: గురు నానకజీ మహారాజ తన వాణి ద్వారా వివరిస్తున్నారు, ఏమనంటే పూర్ణ సతగురు ఆయనే ఎవరైతే రెండు అక్షరాల జపం గురించి తెలిసినవారో. అందులో ఒకటి కాల్ మరియు మాయ నుండి విడిపిస్తుంది మరియు రెండవది పరమాత్మని చూపిస్తుంది. మూడవది ఒక అక్షరం కలది అది పరమాత్మతో కలుపుతుంది.**

**సంత్ గరీబదాస్ జీ మహారాజ గారి అమృతవాణిలో శ్వాస యొక్క నామం ప్రమాణం :-**

గరీబ, శ్వాంసా పారస భేద హమారా, జో ఖోజే సో ఉతరే పారా ।
శ్వాంసా పారా ఆది నిశాని, జో ఖోజే సో హెూఏ దరబాని ॥
శ్వాంసా హి మే సార పద, పద మే శ్వాంసా సార్ । దమ దేహి కా ఖోజ కరో, ఆవాగమన్ నివార్ ॥
గరీబ, శ్వాంస సురతి కే మధ్య హై, న్యారా కదే నహి హెూయ్ ।
సతగురు సాక్షి భుత కు, రాఖో సురతి సమోయ్ ॥
గరీబ, చార పదార్థ ఉర మే జోవై, సురతి నిరతి మన పవన్ సమోవై ।
సురతి నిరతి మన పవన పదార్థ (నామ) , కరో ఇక్తర్ యార్ ।
ద్వాదస అందర్ సమొయ్ లే, దిల్ అందర దిదార్ ।
కబీర్, కహతా హు కహి జాత్ హు, కహు బజా కర ఢోల్ ।
శ్వాంస జో ఖాలి జాత హై, తిన లోక కా మోల్ ।
కబీర్, మాలా శ్వాంస ఉశ్వాంస కి, ఫేరేంగే నిజ దాస్ ।
చౌరాసి భ్రమే నహి, కటైం కర్మ కి ఫాంస ॥

**గురు నానక దేవ గారి వాణి యందు ప్రమాణం :-**

చహఉఃు కా సంగ, చహఉఃు కా మిత్, జామై చారి హటావై నిత్ ।
మన్ పవన్ కో రాఖై బంద, లహే త్రికుటి త్రివేణి సంధ్ ।
అఖండ మండల్ మే సున్న సమానా, మన్ పవన్ సచ్చ ఖండ టికానా ॥

**పూర్ణ సతగురువు ఆయనే,ఎవరైతే మూడు సార్లు నామంను ఇస్తాడు మరియు శ్వాస యొక్క క్రియతో పాటు స్మరించు విధానం చెబుతాడు. అప్పుడే జీవుడు మోక్షం సంభవం అవుతుంది. ఎలాఐతే పరమాత్మా సత్యమో ఆ విధంగానే పరమాత్మా యొక్క సాక్షాత్కారం మరియు మోక్షాన్ని పొందు విధానం కూడ ఆది అనాది మరియు సత్యం. అది ఎన్నటికి మారదు. గరీబదాస్ జీ మహారాజ్ తన వాణి యందు అంటారు:-**

భక్తి బిజ పల్టటై నహి, యుగ జాహి అసంఖ । సాయి సిర పర రాఖియో, చౌరాసి నహి శంక ॥
ఘిసా ఆఎ ఏకో దేశ సే, ఉతరే ఏకో ఘట । సమఝో కా మార్గ ఎక హై, ముర్ఖ బారహ బాట్ ॥
కబీర్ భక్తి బిజ పల్టటై నహి, ఆన పడై బహు ఝోల్ । జై కంచన్ బిష్టా పరై, ఘటై న తాకా మోల్ ॥

**చాలా మంది మహాపురుషులకి సత్యనామం గురించి తెలియదు వారు మనసుకి వచ్చిన నామాన్ని ఇస్తారు. దానివలన సుఖం లభిస్తుంది, కానీ ముక్తి లభించదు. ఒకరు అంటారు తప్, హవనం, యజ్ఞం మొదలగునవి చేయండి అని మరియు కొంత మహాపురుషులు కనులు, చేవులు, మరియు మూతిని మూసి లోపలి నుండి ధ్యానం చేయండి అని చెబుతారు అది వారి మనసుకు నచ్చిన సాధన యొక్క ప్రతీక. కానీ కబీర్ సాహెబ్, సంత గరీబదాసజీ మహారాజ్, గురునానకదేవజీ మొదలగు పరమ సంతలు అన్ని క్రియల్ని వద్దని కేవలం ఒక నామం యొక్క జపం చేయ్యడానికి చెప్పినారు.**

**ఒక నైసత్రే దమస్ నామంకల భవిష్యవాణి చెప్పు వక్తా ఉండెటివాడు. అతడి సర్వ భవిష్యవాణిలు సత్యం అగుచున్నవి. సుమారు నాలుగు వందల సంవత్సరాల పూర్వం రాసినవి మరియు చెప్పబడినవి. ఆయన చెప్పినారు క్రీ.శ. 2006లో ఒక హిందు సంత్ ప్రకటితుడౌతాడు అనగా సంసారంలో అతడి చర్చయే జరుగుతుంది. ఈ సంత్ ముసిలిము కాదు, క్రిస్టియన్ కాదు, అతడు కేవలం హిందూవు అవుతాడు. అతడి ద్వారా చెప్పబడిన భక్తి మార్గం అన్నిటికంటే వేరుగా మరియు ప్రమాణాలపై ఆధారితమై ఉంటుంది. ఆయనని జ్ఞానంలో ఎవరు పరాజితులు చేయలేరు. క్రీ.శ. 2006లో ఆ సంత్ యొక్క ఆయుస్సు 50 నుండి 60 సం॥ల మధ్యలో ఉ ంటుంది. (సంత రామపాల్‌జీ మహారాజ్‌గారి జననం 8 సెప్టెంబరు 1951లో జరిగింది. జూలై, 2006లో సంత్‌గారి వయసు సరిగ్గా 55సం॥ అవుతుంది. ఇది భవిష్యవాణి ప్రకారం సరియైనది) ఆ హిందు సంత్ ద్వారా చెప్పబడిన జ్ఞానంను పూర్తి సంసారం స్వీకరిస్తుంది. ఆ హిందూ సంత్ యొక్క అధ్యక్షతలో సర్వసంసారంలో భారతదేశ శాసనం ఉంటుంది మరియు ఆ సంత్ యొక్క ఆజ్ఞతో అన్ని కార్యములు అవుతాయి. అతడి మహిమా ఆకాశం కంటే పైన ఉంటుంది. నైసత్రే దమస్ ద్వారా చెప్పబడిన సంకేతం సంత్ రామపాల్‌జీ మహారాజ్‌గారే. వారు 2006లో విఖ్యాతులైరి. తెలియని వారు చెడుగా చిత్రీకరించి ప్రసిద్ధులుగా చేసినారు కానీ సంత్ లో ఎలాంటి దోషం లేదు.**

**పైన చెప్పబడిన లక్షణాలు అన్నియు తతదర్శి సంత రామపాల్‌జీ మహారాజులో విద్యామానమై ఉన్నవి.**



# సంత్‌ని హింసుచువారికి వేయు శిక్ష

ఆదరణీయ గరీబదాస్ సాహెబ్ గారి జననం పావన గ్రామం-ఛూడానీ జిల్లా-ఇజ్జర్ లో శ్రీ బలరామ్‌జీ ధన్‌ఖడ్ (జాట్) గారి ఇంటిలో జరిగింది. మిముల్ని పూర్ణ బ్రహ్మ కబీర్ పరమేశ్వర్ (కవిర్దేవ్) సతలోకం నుండి క్రీ.శ.1727లో సశరీరంగా వచ్చి కలిసిరి మరియు మీ జీవంను సతలోకానికి తీసుకెళ్ళిరి. కుటుంబ సభ్యులు గరీబదాస్‌గారిని చనిపోయారు అని తెలుసుకుని శ్మశానంలో పెర్చిన కట్టెలపై ఉంచిరి. ఆ సమయంలోనే కవిర్దేవ్ మీ జీవంను (ఆత్మ) తిరిగి మీ శరీరంలో ప్రవేశింపచేసిరి. దాని తరువాత ఆదరణీయ గరీబదాస్ గారు కూడ పరమ పూజ్య కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) గారి కళ్లతో చూసిన మహిమని జనులకి వినిపించసాగిరి. ఏ దు:ఖంకల ప్రాణి కూడ మీ నుండి ఉపదేశాన్ని పొందుతాడో, అతడే సుఖి అవుతాడు. మీ యొక్క పెరుగుతున్న మహిమ మరియు తత్వజ్ఞానం ముందు మిగత గురువుల అసంపూర్తి జ్ఞానం చీట్టి విప్పబడడం వలన చుట్టుపక్కల కల సర్వ తత్వజ్ఞాన రహిత గురువులు (ఆచార్యులు) మీతో అత్యధికంగా ఈర్శ చేయసాగిరి. చుట్టు ప్రక్కల కల ముఖ్య-ముఖ్య చౌదరిలకు వ్యతిరేకమైన చిట్టీని వినిపించిరి. దానివలన చుట్టుపక్కల ఊళ్లలోని సామాన్య వ్యక్తి కూడ ప్రభు కబీర్‌గారి ప్రియ బాలుడైన ఆదరణీయ గరీబదాస్ గారితో ద్వేషం చేయసాగిరి.

ఢిల్లీలోని వాజిద్‌పూర్ గ్రామంలో మీకు ఒక శిష్యుడు ఉండేవాడు. అతనితో కూడ గ్రామం మొత్తం ద్వేషం చేస్తుండెది. అతడి ప్రార్థన పై మీరు కొన్ని రోజులు వాజిద్‌పురంలో ఆగితిరి. ఆ సమయంలో టిడ్డి దళం చుట్టుపక్కలగల క్షేత్రంలోని బాజరా పంటని నష్టం చేసిరి. కానీ మీ యొక్క సేవకుడి పంటకి ఏ హాని కలుగలేదు. మొత్తం గ్రామవాసులంతా మీ మహిమతో చాలా ప్రభావితులైరి మరియు జ్ఞానాన్ని స్వీకరించి తమ ఆత్మకళ్యాణం చేసుకొనిరి.

మీ యొక్క ఆదేశంతో మీ భక్తుడు ఆ బాజరా పంటని మొత్తం గ్రామంలో పంచిపెట్టినాడు. గరీబదాస్ గారు పలుమార్లు వద్దు అని చెప్పిన కూడ కొంత బాజరని ఎడ్లబండిలో వేసిరి మరియు ఇలా అనినాడు ప్రతి పూర్ణిమకి మీరు భండారా చేస్తారు, కొంత దానం మీ దాసుడిది కూడ అవుతుంది. భక్తుల శ్రద్ధని గ్రహించి మీరు స్వీకృతిని ప్రసాదించిరి (ఆదరణీయ గరీబదాస్ గారికి నలుగురు కుమారులు మరియు ఇద్దరు కన్యలు సంతానం ఉండిరి మరియు సుమారు 1300 ఎకరాల భూమికి ఆసాములుగా ఉండిరి) ఆ ఎడ్లబండిలో కూర్చుని మీరు ఛూడాని గ్రామానికి బయలుదేరిరి. మార్గంలో ఎడ్లబండి గ్రామం కాణౌందా చేరుకొగానే మొదటనే కాపూకాసిన స్వార్థి గురువులు (ఆచార్యులు) మిముల్ని ముట్టడించిరి. బాజరాని పూర్తిగా దోచిరి (తీసుకునిరి) మరియు ఆ గ్రామ చౌదరి ఛాజురామ్ ఛీక్కారాకు సూచన ఇచ్చిరి, ఏమనంటే ఆ హిందూ ధర్మం యొక్క ద్రోహిని పట్టుకున్నాం అని. చౌదరి ఛాజురామ్‌గారి ఆదేశంతో రచ్చబండ దగ్గర

కట్టెసిరి. చౌదరి గారు ప్రభుత్వం నుండి కొన్ని న్యాధికారాలు పొంది ఉండిరి. ఆరు నెలల శిక్ష, ఐదు వందల రూపాయల జరిమానా మరియు మహాదోషిని చెరలో బందించి ఉంచుట మొదలగు అధికారాలు ఉండెవి.

ఆ ధర్మ అజ్ఞానుల (ఆచార్యులు-గురువుల) ద్వారా పూర్వం నుండి వ్యతిరేకమైన చీట్టిని చదివిరి (అనగా చెడుగా వినిపించిరి) చౌదరి గారు పరమ ఆదరణీయ గరీబదాసజీ మహారాజగారిని కాఠ (చెర) లో బంధించిరి. (కాఠలో బందించడం ఒక రకమైన చాలా పెద్ద శిక్షగా ఉండింది, రెండు కాళ్ల మోకాళ్ల పైన రెండు (కాష్ట) పెద్ద కట్టెలు కట్టి రెండు చేతులని వెనుకకి కట్టెవేసేవారు. అందువలన వ్యక్తి కూర్చునేవాడు కాదు మరియు చాలా పీడ అయ్యేది. కాళ్లు ఉబ్బెవి) ఎడ్లబండివాడు ఖాళీ బండిని తీసుకుని వాజిద్‌పూర్‌కి వెళ్లిపోయాడు. ఆ గ్రామం కాణౌందా గ్రామం నుండి సుమారు 10 కి.మీ.దూరంలో కలదు. విషయం తెలియగానే వాజిద్‌పూర్ గ్రామంలోని కొందరు ముఖ్య వ్యక్తులు తొందరగా కాణౌందాను చేరుకునిరి మరియు చౌధరి ఛాజురామ్‌తో ప్రార్థన చేసిరి మరియు చాలా వివరించిరి. ఈయన సామాన్య వ్యక్తి కాదు, ఈ పరమ శక్తి సంపన్నుడు. మీరు క్షమని యాచించండి. చౌధరి ఛాజురామ్ గారు చాలా నిజాయితీ కల ఆత్మ మరియు చాలా దయాగుణం మరియు నమ్ర హృదయం కలిగిన వ్యక్తి. కానీ ఆ స్వార్థి మరియు మేమే గొప్ప అను ఆకలికల గురువు (ఆచార్యులు) ఆ పుణ్యాత్మా శ్రీ చౌధరిగారిని అబద్దపు కథని వినిపించి ప్రభువు ప్రేమి బాలుడైన ఆదరణీయ గరీబదాస్ గారి యెడల అత్యధిక మనస్పర్థని కలుగచేసిరి. ఆ కారణంచేత చౌదరి ఛాజురామ్ ఏమియు తెలుసుకోకుండా శిక్షని ప్రారంభించిరి. వాజిద్‌పూర్ గ్రామ భక్తుల ప్రార్థనని అంగీకరించి ఆదరణీయ గరీబదాస్ గారిని విడిచిపెట్టిరి. ఆదరణీయ గరీబదాస్ గారు ఏమియు అనలేదు మరియు తమ గ్రామం ఛూడానికి వచ్చిరి. కొన్ని రోజుల తరువాత ఛౌదరి ఛాజురామ్‌గారు ప్రాత:కాలంలో తిరగడానికి చెరువుగట్టుకి వెళ్లిరి. అక్కడ వారి రెండు చేతులని ఇద్దరు గుర్రపు స్వారీచేయువారు కొసిరి మరియు వారి సమక్షంలోనే అదృశ్యులైరి. ఈ దృశ్యం చెరవు గట్టుపై కల మిగత వ్యక్తులు కూడ చూసిరి. చాలా ఉపచారాలు చేయించిరి. కానీ బాధ మరియు రక్తస్రావం ఆగిపోలేదు. కొన్ని రోజులు చాలా చెడ్డగా అరుస్తు ఉండిరి. తరువాత ఒక వ్యక్తి వచ్చి సలహా ఇస్తాడు ఆ సంత్ గరీబదాస్ దగ్గరికి వెళ్లి క్షమించమని యాచించండి, వారు దయాస్వభావులు. కుటుంబ సభ్యులు ఆ చౌధరిగారిని గుర్రంపై కూర్చొబెట్టి ఛూడానికి తీసుకెళ్లిరి. శ్రీ ఛాజురామ్ వెళ్లగానే ఆదరణీయ గరీబదాస్‌గారి చరణాలలో పడిపోయిరి. క్షమించమని యాచించిరి. సంత్ గరీబదాస్ గారు ఆశీర్వదించిరి మరియు నామ ఉపదేశం ఇచ్చిరి మరియు జీవితాంతం భక్తి చేయండి అని అనిరి. చౌధరి గారు అన్నారు ధాతా నన్ను మీ విషయంలో చాలా భ్రమింపచేసినారు.

నాకు తెలియదు మీరు పూర్ణ పరమాత్ములే వచ్చినారని. ఆదరణీయ గరీబదాస్ గారు అన్నారు నేను పూర్ణ పరమాత్మా కబీర్ సాహెబ్ (కవిర్దేవ్) (జూలాహా) పంపించిన దాసుడను.ఆయన శక్తితోనే మీరు బాగుఅయినారు. నేను మీకు ఏలాంటి శాపంను ఇవ్వలేదు.

**మంచిగా లేదు. ఇలాంటి పవిత్ర జ్ఞానాన్ని నీవు ఎందుకు మరిచిపోయావు? మరల గీతా జ్ఞానాన్ని నేను పూర్తిగా చెప్పలేను అనగా నాకు జ్ఞప్తికి లేదు. ఇంకా శ్రీ కృష్ణుడు అంటారు ఆ సమయంలో నేను యోగయుక్తుడనై చెప్పి ఉంటిని. విచారించ దగ్గ విషయం ఏమిటంటే భగవాన్ శ్రీ కృష్ణుడు యుద్ధ సమయంలో యోగయుక్తులై ఉంటే శాంతి సమయంలో (ఈ క్షణం) యోగయుక్తమై ఉండుట అంత కఠినం కాదు కదా, ఎందుకంటే శ్రీ వ్యాసుడు ఆ పవిత్ర గీతా జ్ఞానంను కొన్ని సంవత్సరాల తరువాత ఉన్నది ఉన్నట్లు లిపిబద్ధం చేశారు ఆ సమయంలో ఆ కాల్ శ్రీ వాస్యుడి శరీరంలో ప్రవేశించినాడు మరియు పవిత్ర శ్రీ మద్ భగవత్ గీతాని లిపిబద్ధం చేస్తాడు. అది నేడు మన చేతులలో ఉంది అనగా నేడు మనకు అందుబాటులో ఉంది.**

**ప్రమాణం కోసం సంక్షిప్త మహాభారత పేజి నం. 667 మరియు పాత పేజి నం. 1531పై :-**

న శక్యం తన్మయా భూయస్తథా వక్తుమశేత: ।
పరం హి బ్రహ్మ కథితం యోగయుక్తేన తన్మయా ॥ (మహాభారత్, ఆశ్రవ 1612-13)

భగవాన్ అంటారు:- 'అది మొత్తానికి మొత్తం ఆ రూపంలో మరల బోదించడం ఇపుడు నా వలన కాదు. ఆ సమయంలో నేను యోగయుక్తమై పరమాత్మ తత్వం యొక్క వర్ణన చేసి ఉంటిని.'

సంక్షిప్త మహాభారతం ద్వితీయ భాగం పేజి నం. 1531

(శ్రీ కృష్ణుడు అర్జునుడితో గీతా విషయం గురించి అడుగుట సిద్ధ మహర్షి వైశంపాయనుడు మరియు కశ్యపుడు మధ్య సంవాదం)

పాండునందన్ అర్జున్ శ్రీ కృష్ణుడుతో పాటు ఉంటూ చాలా ప్రసన్నంగా ఉండిరి. ఆయన ఒకసారి ఆ రమనీయ సభయందు భగవానుడితో ఇలా అడుగుతారు- 'దేవకి నందన! యుద్ధం చేయు ముందు సమయంలో మీ మహా ఆత్మ యొక్క జ్ఞానం మరియు ఈశ్వరీయ స్వరూపం యొక్క దర్శనం అయి ఉండెను. కానీ కేశవ! మీరు స్నేహవశమై ముందుగా ఏ జ్ఞానం అయితే ఉపదేశించారో, అది అంతా ఈ సమయంలో బుద్ధి దోషం వలన మరిచిపోయాను. ఆ విషయాలని వినడానికి పదే పదే నా మనసుకి ఉత్కంఠగా ఉంటుంది, ఇటు మీరు తొందరగా ద్వారాకా వెళ్లాలి అనుకుంటున్నారు. ఇప్పుడు మరల ఆ సర్వ విషయాన్ని నాకు వినిపించండి.

వైశంపాయను ఉపవాచ - అర్జునుడు ఇలా అనగానే వక్తలయుందు శ్రేష్ఠ మహాతేజస్వీ భగవాన్ శ్రీ కృష్ణుడు ఆయనని ఆలింగనం చేసుకోని ఇలా సమాధానం ఇస్తారు.

శ్రీ కృష్ణుడు అంటారు: - అర్జున్ ! ఆ సమయంలో నేను నీకు అత్యంత గోపనియ (రహస్య) విషయాన్ని వినిపించితిని. తన స్వరూపం గురించి, ధర్మం, సనాతన పురుషోత్తమతత్వం యొక్క పరిచయం ఇచ్చి ఉంటిని మరియు (శుక్లం - కృష్ణ గతుల (మాసాల) నిరూపణ చేస్తు) నిత్యలోకాల యొక్క వర్ణన కూడ చేసితిని. కానీ నీవు వాటి అర్థం చేసుకోకపోవడం వలన ఆ ఉపదేశాలని జ్ఞప్తికి ఉంచుకోలేదు. ఇది తెలిసి నాకు చాలా బాధ అవుతుంది. ఆ విషయాలను ఇపుడు పూర్తిగా స్మరించడం సంభవం అని అనిపించడం లేదు. పాండునందన్ ! నిశ్చయముగా నీవు పెద్ద శ్రద్ధాహీనుడవే, నీ బుద్ధి సరిగా లేదనిపిస్తుంది. ఇపుడు ఆ ఉపదేశాన్ని ఉన్నది ఉన్నట్లు

చెప్పడం నాకు కఠినమవుతుంది, ఎందుకంటే ఆ సమయంలో యోగా యుక్తమై నేను పరమాత్మతత్వాన్ని వర్ణించి యుంటిని. (ఇంకా తెలుసుకునుటకు సంక్షిప్త మహాభారతం ద్వితీయ భాగాన్ని చదవండి)

విచారం చేయండి:-- పై ఉదహరించిన మహాభారత లిఖితాలు మరియు విష్ణుపురాణం యొక్క లిఖితాలు మరియు శ్రీ మద్ భగవత్ గీతా లిఖితాల ప్రమాణాలతో సిద్దిస్తున్నది ఏమిటంటే శ్రీ కృష్ణుడు గీతా యొక్క జ్ఞానాన్ని చెప్పలేదు. ఇది కాల్ రూపి బ్రహ్మ అనగా మహావిష్ణువు ప్రేతవశమై శ్రీ కృష్ణుడి శరీరంలో ప్రవేశించి చెప్పియున్నాడు.

**మిగతా ప్రమాణాలు :--**

**1. శ్రీ విష్ణుపురాణం (గీతా ప్రెస్ గోరఖపూర్ ద్వారా ప్రచురిత) చతుర్ద అంశం అధ్యాయం 2 శ్లోకం 26లో పేజి 233లో విష్ణువు (మహావిష్ణువు అనగా కాల్ రూపి బ్రహ్మ) దేవతల మరియు రాక్షసుల యుద్ధ సమయంలో ప్రార్థనని స్వీకరించి అంటాడు నేను రాజఋషి శశాద పుత్రుడు పూరన్జ్య యొక్క శరీరంలో అంశం మాత్రం అనగా కొంత సమయం కోసం ప్రవేశించి రాక్షసులని సంహరిస్తాను.**

**2. శ్రీ విష్ణుపురాణం (గీతా ప్రెస్ గోరఖపూర్ ద్వారా ప్రచురిత) చతుర్ద అంశం అధ్యాయం 3 శ్లోకం 6లో పేజి 242 లో విష్ణువు గంధర్వులు మరియు నాగుల యుద్ధంలో నాగుల పక్షం నిలబడి అంటారు 'నేను (మహావిష్ణువు అనగా కాల రూపి బ్రహ్మ) మానవధాతా యొక్క పుత్రుడు పురుకుత్సలో ప్రవేశించి ఆ సంపూర్ణ దృష్టులైన గంధర్వులను సంహరిస్తాను.**

**అన్య ప్రమాణం :- కొంత కాలం తరువాత శ్రీ యుధిష్ఠరుడికి భయంకరమైన స్వప్నంలు వచ్చెవి.శ్రీ కృష్ణుడుని కారణం మరియు సమాధానం అడగడంతో శ్రీ కృష్ణుడు అంటారు - నీవు యుద్ధంలో చేసిన పాపం అనగా నరులని సంహరించిన దోషం నీకు దు:ఖాన్ని కలిగిస్తోంది. ఇందుకోసం ఒక యజ్ఞంను చేయండి. శ్రీ కృష్ణుడి ముఖ కమలం నుండి ఈ మాట విని అర్జునుడికి చాలా బాధ వేస్తుంది మరియు మనసులోనే విచారం చేయసాగాడు. భగవాన్ శ్రీ కృష్ణుడు పవిత్ర గీతా చెప్పునపుడు అర్జున్ నీకు ఏ పాపం అంటదు, నీవు యుద్ధం చేయ్ అని అన్నారు (గీతా అధ్యాయం. 2 మ.37-38). ఒకవేళ యుద్దంలో చనిపోయిన స్వర్గాన్ని పొందుతావు, లేదంటే యుద్ధంలో విజేతవై పృథ్విపై రాజ్యం యొక్క ఆనందాన్ని పొందుతావు. అర్జునుడు ఇంకా ఆలోచిస్తాడు దు:ఖ నివారణకి శ్రీ కృష్ణుడు చెప్పిన యజ్ఞానానికి కోట్ల రూపాయలు ఖర్చు అవుతాయి. దాని వలన పెద్ద అన్నయ్య యుధిష్టరుడి కష్ట నివారణ అవుతుంది. ఒకవేళ శ్రీ కృష్ణుడితో వాద-వివాదం చేస్తే (గీతా జ్ఞానం చెపునపుడు యుద్దం చేయ్ నీకు ఏ పాపం తాకదు అని చెప్పారు ఇపుడేమో దానికి విరుద్ధంగా చెప్పుచున్నారు) కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది కావున అర్జునుడు యజ్ఞంను ఆపాలి అనుకుంటున్నాడు. కష్టనివారణ నాకు ఇష్టం లేదు అని అపార్థం చేసుకునే అవకాశం కలదు అని అర్జునుడు భావించి మౌనంగా ఉండడమే ఉత్తమం అని యజ్ఞం చేయడానికి స్వీకృతిని ఇస్తాడు. మీరు ఏలా అంటే అలా అంటాడు. శ్రీ కృష్ణుడు యజ్ఞం చేయు తిథిని నిర్ధారిస్తాడు. ఆ యజ్ఞం కూడ శ్రీ సుదర్శన్ స్వపచ్ భోజనం చేయడం వలన సఫలం అవుతుంది.**

కొంత కాలం తరువాత ఋషి దుర్వాసుడి శాపం వలన యాదవ కులం యొక్క వినాశం అవుతుంది. శ్రీ కృష్ణుడి పాదంయందు ఒక వేటగాడు (త్రేతాయుగంలో సుగ్రీవుడు తమ్ముడు వాలి యొక్క ఆత్మ) విషంతో కూడిన బాణాన్ని సంధిస్తాడు. ఆ సమయంలో పంచ పాండవులు సంఘటన స్థలంకు చేరుకుంటారు. శ్రీ కృష్ణుడు అంటాడు మీరు నా ప్రియ శిష్యులు నేను మీ ధార్మిక గురువుని అందువలన నా చివరి ఆజ్ఞను వినండి. ఒకటి అర్జునుడికి, ద్వారికలోని అందరూ స్త్రీలని ఇంద్రప్రస్థ (ఢిల్లీ) కి తీసుకెళ్లండి, ఎందుకంటే ఇక్కడ ఒక నరుడు కూడ మిగిలి లేదు. రెండవది మీరంతా అనగా పాండవులు రాజ్యాన్ని త్యాగం చేసి హిమాలయాలకి సాధన చేయడానికి వెళ్లి శరీరాన్ని విడిచిపెట్టండి. ఎందుకంటే యుద్ధంలో ఏ హత్యలైతే చేశారో, దానివలన మీ పై చాలా భయంకర పాపం ఉంది. ఆ సమయం అర్జునుడు తనని తాను ఆపుకోలేకపోయాడు శ్రీ కృష్ణుడితో అంటాడు ప్రభువు నేను ఈ సమయంలో ఇలా మాట్లాడడం సరియైనది కాదు, కానీ ప్రభు ఒకవేళ ఈ రోజు నా శంఖకి సమాధానం లభించకపోతే నేను ప్రశాంతంగా చనిపోలేను. జీవితాంతం ఏడుస్తు ఉంటాను. శ్రీ కృష్ణుడు అంటాడు అర్జున్ ఏమి అడగాలి అనుకుంటున్నావో అడుగు, నాకు చివరి గడియలు సమీపిస్తున్నవి. శ్రీ అర్జునుడు కన్నీళ్లతో అంటాడు ప్రభువు తప్పుగా భావించకండి. ఎపుడైతే మీరు పవిత్ర గీతా జ్ఞానం చెప్పారో ఆ సమయంలో నేను యుద్ధం చేయడానికి అంగీకరించలేదు. అపుడు మీరు అన్నారు అర్జున్ ! నీ రెండు చేతులలో లడ్డులున్నాయి. యుద్ధంచేసి చనిపోతే స్వర్గాన్ని పొందుతావు మరియు విజయం పొందితే పృథ్వి రాజ్యంను పొందుతావు మరియు నీకు ఎలాంటి పాపం అంటదు. మేము మీ యొక్క సమక్షంలోనే మరియు ఆజ్ఞనుసారం యుద్ధం చేశాము (ప్రమాణం గీతా అధ్యాయం. 2 శ్లోకం 37-38) హే భగవాన్! మా యొక్క ఒక చేతిలో కూడ లడ్డు లేకుండా పోయింది. యుద్ధంలో చనిపోయి స్వర్గ ప్రాప్తి జరగలేదు మరియు ఇపుడు రాజ్యంను త్యాగం చేయమని ఆదేశం ఇస్తున్నారు. పృథ్వి రాజ్యం యొక్క ఆనందాన్ని కూడ భోగించలేదు. ఇలాంటి దోషయుక్త వ్యవహారం చేయడంలో మీ స్వార్థం ఏమిటి ఉండెను? అర్జునుడి ముఖం నుండి ఈ వచనాలు విని యుధిష్టరుడు అంటాడు అర్జున్ ఇలాంటి స్థితిలో భగవాన్ అంతిమ శ్వాస తీసుకుంటున్నారు, ఇపుడు ఇలా వ్యవహరించడం శోభించదు. శ్రీ కృష్ణుడు అర్జునుడితో అంటాడు నేడు నేను నా అంతిమ స్థితిలో ఉన్నాను, మీరు నాకు అత్యంత ప్రియులు, నేడు వాస్తవాన్ని చెబుతాను ఏదో దృష్టమైన చెడ్డదైన ఒక శక్తి ఉంది అది మనల్ని యంత్రాల మాదిరిగా ఆడిస్తూ ఉంది. నేను గీతలో ఏమి చెప్పానో నాకె తెలియదు. కానీ ఇపుడు నేను ఏదైతే చెబుతున్నానో అది మీ హితంలో ఉంది. శ్రీ కృష్ణుడు ఈ మాటలని అశ్రువులు నిండిన కళ్లతో చెప్పి ప్రాణాలని త్యాగం చేస్తారు. పై వివరణ వలన సిద్ధం అయింది ఏమిటంటే పవిత్ర గీతా యొక్క జ్ఞానాన్ని శ్రీ కృష్ణుడు చెప్పలేదు.ఇది బ్రహ్మ (జ్యోతినిరంజన్-కాల్) చెప్పినాడు, అతడు 21 బ్రహ్మాండాలకి స్వామి. కాల్ ఎవరు? ఇది తెలుసుకోడానికి కృపతో చదవండి 'సృష్టి రచన' అను అధ్యాయంను ఇదే పుస్తకంలో 24-78.

శ్రీ కృష్ణుడు మరియు సర్వ యాదవుల అంతిమ సంస్కారం చేసి అర్జునుడిని విడిచి

నలుగురు అన్నదమ్ములు ఇంద్రప్రస్థ (ఢిల్లీ) కి వెళ్లిపోయిరి. వెనుక అర్జునుడు ద్వారికలోని స్త్రీలని తీసుకుని వస్తు ఉండెను. మార్గమధ్యంలో అడవిలోకల మనుషులు అందరు గోపికలని దోచుకుంటారు మరియు కొంతమందిని అపహరిస్తారు. అర్జునుడిని పట్టుకుని తన్నుతారు. అర్జునుడి చేతిలో అదే గాండివ ధనుస్సు ఉండెను, ఎద్దైతే మహాభారత యుద్ధంలో లెక్కలేనన్ని హత్యలు చేసిందో, అది కూడ నడవలేదు అనగా ఉపయోగపడలేదు. అపుడు అర్జునుడు అనుకుంటాడు ఈ శ్రీ కృష్ణుడు వాస్తవంలో అబద్ధికుడు మరియు కపటం కలవాడు. యుద్ధంలో పాపం చేయించేది ఉన్నపుడు నాకు శక్తిని ప్రసాదించినాడు, ఒక దెబ్బకి వేల యోదులని సంహరించేవాడిని మరియు నేడు ఆ శక్తి తీసేసుకున్నాడు. నిలబడి- నిలబడి తన్నించుకుంటున్నాను. ఈ విషయంలో పూర్ణ బ్రహ్మ కబీర్ సాహెబ్ (కవిర్దేవ్) గారు అంటారు శ్రీ కృష్ణుడు కపటి మరియు అబద్దీకుడు కాడు. ఈ నేరాలన్ని కాల్ చేస్తున్నాడు. ఎప్పటివరకైతే ఆత్మ కబీర్ పరమేశ్వరుడి శరణులోకి పూర్ణ సంత్ (తత్వదర్శి) యొక్క మాధ్యమం ద్వారా వెళ్లదో, అప్పటివరకు కాల్ ఇలాంటి కష్టాలపై కష్టాలని ఇస్తునే ఉంటాడు. పూర్తి సమాధానం తత్వజ్ఞానం ద్వారా అవుతుంది. అందువలన కాల్ ఎవరు? అని తెలుసుకోడానికి చదవండి ' సృష్టి రచన 'ని.

విశేష విచారం :- ఉదహరించిన ప్రమాణాల ద్వారా సిద్ధించబడింది ఏమిటంటే శ్రీ మద్ భగవత్ గీతా యొక్క జ్ఞానాన్ని శ్రీ కృష్ణుడు చెప్పలేదు. ఇది శ్రీ కృష్ణుడి శరీరంలో ప్రేతంలా ప్రవేశించి బ్రహ్మ (కాల్ అనగా జ్యోతినిరంజన్) చెప్పియుండెను.

## "శ్రీ మద్ భగవత్ గీతా సారం"

పరమేశ్వరుడిని వెదుకటులో ఆత్మ యుగాల నుండి ప్రయత్నిస్తోంది. ఎలాఐతే దాహం వేసన వాడికి జలం యొక్క కోరిక ఉంటుందో అలా. జీవాత్మ పరమాత్మ నుండి వేరుపడిన తరువాత మహా కష్టాలని అనుభవిస్తున్నది. ఏ సుఖమైతే పూర్ణ బ్రహ్మ యొక్క సతలోకం యందు ఉందో, ఆ సుఖం ఈ కాల్ ప్రభువు లోకంలో లేదు. కోటిశ్వరుడైన, పృథ్విపతి అయిన, సురపతి (స్వర్గం యొక్క రాజా ఇంద్రుడు) అయిన, శ్రీ బ్రహ్మ అయిన, శ్రీ విష్ణువు అయిన మరియు శ్రీ శివుడు అయిన కూడ ఈ కాల్ లోకంలో జన్మ-మృత్యువు మరియు చేసిన కర్మ ఫలాన్ని ఖచ్చితంగా అనుభవించాల్సి ఉంటుంది. (ప్రమాణం గీతా అధ్యాయం. 2 శ్లోకం 12, అధ్యాయం. 4 శ్లోకం 5 చదవండి) అందువలన పవిత్ర శ్రీమద్ భగవత్ గీతా యొక్క జ్ఞానదాతా ప్రభు (కాల్) అధ్యాయం 15 శ్లోకం 1 నుండి 4 మరియు అధ్యాయం 18 శ్లోకం 62లో చెప్పియున్నాడు అర్జున్! సర్వంగా భావించి ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు అతని కృపతో నీవు పరమశాంతిని మరియు సతలోకం (శాశ్వత స్థానంను) పొందుతావు. ఆ పరమేశ్వరుడి తత్వజ్ఞానం మరియు భక్తి మార్గాన్ని నేను (గీతా జ్ఞానదాతా) ఏరుగను. ఆ తత్వజ్ఞానాన్ని తత్వదర్శి సంత్ దగ్గరికి వెళ్లి ఆయనకి దండవత్ ప్రణామం చేసి మరియు వినమ్ర భావంతో అడుగు, అపుడు ఆ తత్వదర్శి సంత్ నీకు పరమేశ్వరుడి తత్వజ్ఞానంను చెబుతారు. పిదప వారు చెప్పినటువంటి భక్తి మార్గంపై సర్వ భావంతో ఏక లక్ష్యంతో నడువు. (ప్రమాణం గీతా అధ్యాయం. 4 మ.34) తత్వదర్శి సంత్ యొక్క గుర్తింపు గీతా

అధ్యాయం. 15 శ్లోకం 1 లో చెబుతు ఇలా అంటాడు ఈ సంసారం తలకిందులుగ వ్రేలాడదీయబడిన వృక్షంలా ఉంటుంది. పైన మూలం (వేర్లు) మరియు కిందకి శాఖలు (కొమ్మలు) కలవు. ఎవరికైతే ఈ సంసార రూపి వృక్షం గురించి తెలుసునో ఆయనే తత్వదర్శి సంత్ అవుతాడు. గీతా అధ్యాయం. 15. శ్లోకం 2 నుండి 4 లో అంటారు ఆ సంసార రూపి వృక్షానికి మూడు గుణాలు కల (రజోగుణం- బ్రహ్మ, సతగుణం- విష్ణు, తమోగుణం-శివ) కల శాఖలు కలవు. అవి (స్వర్గలోకం, పృథ్విలోకం మరియు పాతాళలోకం) మూడు లోకాల యందు పైన మరియు కిందికి విస్తరించి ఉన్నాయి. ఆ సంసార రూపి తలకిందులుగా వ్రేలాడదీయబడిన చెట్టు విషయంలో అనగా సృష్టి రచనా గురించి నేను ఈ గీతా జ్ఞానంలో చెప్పలేను. ఇక్కడ విచార కాలంలో (గీతా జ్ఞానం) మీకు చెపుచున్న జ్ఞానం పూర్ణజ్ఞానం కాదు. పూర్ణ జ్ఞానం కోసం గీతా అధ్యాయం 4 శ్లోకం 34లో సంకేతం ఇస్తు ఇలా చెప్పారు పూర్ణ జ్ఞానం (తత్వజ్ఞానం) కోసం తత్వదర్శి సంత్ వద్దకి వెళ్లండి, వారె చెప్పగలరు. నాకు పూర్ణజ్ఞానం లేదు. గీతా అధ్యాయం 15 శ్లోకం 4లో చెప్పబడినది తత్వదర్శి సంత్ దొరికిన పిదప ఆ పరమపద పరమేశ్వరుడిని (గీతా అధ్యాయం. 18 శ్లోకం 62 ఎవరి గురించి ఐతే చెబుతుందో) వెదకాలి. ఎక్కడికి వెళ్లిన తరువాత సాధకుడు మరల తిరిగి రాడో అనగా పూర్ణ మోక్షాన్ని పొందుతాడు. ఆ పూర్ణ పరమాత్మ ద్వారా తలకిందులుగాగల సంసార రూపి చెట్టు విస్తరించి ఉంది. భావార్థం ఏమిటంటే ఆ పరమేశ్వరుడు సర్వ బ్రహ్మాండాలని రచించినాడు మరియు నేను (గీతా జ్ఞానదాతా కాల్) కూడ ఆ ఆది పురుష పరమేశ్వర్ అనగా పూర్ణ పరమాత్మ యొక్క శరణులో ఉన్నాను. ఆయన సాధన చేయడం వలన అనాది మోక్షం (పూర్ణ మోక్షం) ప్రాప్తించబడుతుంది.

తత్వదర్శి సంత్ ఆయనే ఎవరైతే పైన మూలం (వేర్లు) మరియు మూడు గుణాలు కల (రజోగుణం- బ్రహ్మ, సతగుణం- విష్ణు, తమోగుణం-శివ) రూపి శాఖలు (కొమ్మలు) మరియు కాండం మరియు పెద్దకొమ్మ యొక్క పూర్తి అవగాహనని ప్రధానం చేస్తారు. (కృపతో చూడండి తలకిందులుగా వ్రేలాడి ఉన్న సంసార రూపి వృక్ష చిత్రం)

తన ద్వారా రచించిన సృష్టి యొక్క పూర్ణ జ్ఞానం (తత్వ జ్ఞానం) స్వయంగా పూర్ణ పరమాత్మ కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) తత్వదర్శి సంత్ యొక్క భూమికని పోషించి (కవిర్గిభి:) కబీర్ వాణి ద్వారా చెప్పియున్నారు. (ప్రమాణం కోసం ఋగ్వేద మండల 9 సూక్తం 96 మంత్రం 16 నుండి 20 వరకు మరియు ఋగ్వేద మండల 19 సూక్తం 90 మంత్రం 1 నుండి 5 మరియు అధర్వణవేదం ఖండం 4 అనువాకం 1 మంత్రం 1 నుండి 7లో)

కబీర్, అక్షర పురుష్ ఏక్ పేడ్ హై, జ్యోతి నిరంజన్ వాకి డార్ ।
తీనో దేవా శాఖా హై, పాత్ రూప సంసార్ ॥

పవిత్ర గీతాలో కూడ ముగ్గురు ప్రభువుల (1. క్షర పురుషుడు అనగా బ్రహ్మ 2. అక్షర పురుషుడు అనగా పరబ్రహ్మ మరియు 3. పరమ అక్షర పురుషుడు అనగా పూర్ణ బ్రహ్మ) విషయంలో వర్ణన ఉంది. ప్రమాణం కోసం గీతా అధ్యాయం 15 శ్లోకం 16-17, అధ్యాయం 8 మంత్రం 1 యొక్క ఉత్తర (సమాధాన) శ్లోకం 3 లో ఉంది అది పరమ అక్షర బ్రహ్మది.




పైకి వేర్లు కిందకు శాఖలు కలగి తలకిందులుగా
వ్రేలాడదీయబడిన సంసార రూపి వృక్షం

మరియు మూడు ప్రభువుల మరొక ప్రమాణం గీతా అధ్యాయం. 7 శ్లోకం 25లో గీతా జ్ఞానదాతా కాల్ తన విషయంలో అంటారు నేను అవ్యక్తుడను. ఇతను ప్రథమ అవ్యక్త ప్రభువు అయినాడు. పిదప గీతా అధ్యాయం 8 శ్లోకం 18లో చెప్పినారు ఏ సంసారము పగటి సమయంలో అవ్యక్త (పరబ్రహ్మ) ద్వారా ఉత్పన్నం అయి ఉంది. మరల రాత్రి సమయంలో అందులోనే లీనమైపోతుంది. ఇది రెండవ అవ్యక్తం ప్రభువు గురించి. అధ్యాయం 8 శ్లోకం 20లో చెప్పబడినది ఆ అవ్యక్త కంటే, రెండవ అవ్యక్తుడు (పూర్ణ బ్రహ్మ) ఉన్నాడు. అతడు పరమదివ్య పురుషుడు, సర్వ ప్రాణులు మరణించిన కూడ మరణం లేనివాడు. ఈయన మూడవ అవ్యక్తుడైనారు. ఈ ప్రమాణం గీతా అధ్యాయం 2 శ్లోకం 17 లో కూడ ఉంది, ఏమనంటే నాశరహితుడైన ఆ ప్రభువు గురించి తెలుసుకో అతడిని నాశనం చేయడంలో ఎవరు సమర్థులు కారు. తన విషయంలో గీతా జ్ఞానదాతా బ్రహ్మ అధ్యాయం 4 మంత్రం 5 మరియు అధ్యాయం 2 శ్లోకం 12 లో అంటారు నేనైతే నాశనం కలవాడను అనగా జన్మ మృత్యువు అవుతాయి.

పై సంసార రూపి చెట్టు యొక్క వేర్లు ఐతే పరమ అక్షర పురషుడు అనగా పూర్ణ బ్రహ్మ కవిర్దేవుయే. ఈయననే మూడవ అవ్యక్త ప్రభు అంటారు. చెట్టు యొక్క వేర్ల ద్వారానే మొత్తం చెట్టుకు ఆహారం అందచేయబడుతుంది. అందువలన గీతా అధ్యాయం. 15 శ్లోకం 17 లో చెప్పబడినది వాస్తవంలో పరమాత్ముడు బ్రహ్మ మరియ పరబ్రహ్మ కంటే వేరై ఉన్నారు. వారు మూడు లోకాలయందు ప్రవేశించి అందరి పాలన పోషణ చేస్తారు. వారే వాస్తవంలో అవినాశి ప్రభువులు.

1. క్షర అనగా నాశనం కలది. ఎందుకంటే బ్రహ్మ అనగా గీతాజ్ఞాన దాతా స్వయంగా చెప్పియున్నారు అర్జున్ నీవు మరియు నేను జన్మ మృత్యువు చక్రంలో ఉన్నాము. (ప్రమాణం కోసం గీతా అధ్యాయం 2 శ్లోకం 12, అధ్యాయం. 4 మ.5 చదవండి.)

2. అక్షర అంటే అవినాశి. ఇక్కడ పరబ్రహ్మని కూడ స్థాయి అనగా అవినాశి అని అన్నారు. కానీ వాస్తవంలో వీరు కూడ అవినాశి కారు. వీరు చిరస్థాయిలు ఎలాఅంటే పోలిక చూడండి. ఒక మట్టితో చేసిన కప్పు ఉంది అది తెలుపు రంగులో ఉండి చాయ్ తాగడానికి పనికి వస్తుంది. అది కింద పడగానే విరిగిపోతుంది. ఇలాంటి స్థితియే కాల్‌దిగా భావించండి. రెండవ కప్పు స్టీలుతో తయారు చేయబడినది అనుకుందాం. ఇది మట్టితో తయారైన కప్పు కంటే ఎక్కువగా (అవినాశి) అనిపిస్తుంది. కానీ దీనికికూడ తుప్పు పడుతుంది మరియు నశించిపోతుంది, కానీ కొంత ఎక్కువ సమయం తీసుకుంటుంది. అందువలన ఇది కూడ (పరబ్రహ్మ) వాస్తవంలో అవినాశి కాదు. మూడవ కప్పు బంగారంది ఉందనుకుందాం. స్వర్ణధాతువు వాస్తవంలో అవినాశి, దానికి నాశనం ఉండదు.

పరబ్రహ్మని అవినాశి అని కూడ అంటారు మరియు వాస్తవంలో అవినాశి వీరిద్దరికంటే వేరే ఉన్నారు, అందువలన అక్షర పురుషుడిని అవినాశి అని అనలేము కారణం:- ఏడు రజగుణ బ్రహ్మల మృత్యువు తరువాత ఒక సతగుణ విష్ణువు మృత్యువు అవుతుంది. ఏడు సతగుణ విష్ణువుల మృత్యువుల తరువాత ఒక తమోగుణ శివుడి మృత్యువు అవుతుంది.

ఏప్పుడైతే తమోగుణ శివుడి 70 వేల సార్లు మృత్యువు అవుతుందో అప్పుడు ఒక క్షర పురుషుడి మృత్యువు అవుతుంది. ఇది పరబ్రహ్మ యొక్క ఒక యుగం అవుతుంది. ఇలాంటి ఒక వేయ్యి యుగాలతో పరబ్రహ్మ యొక్క ఒక దినం మరియు అంతయే రాత్రి ఉంటుంది. ముప్పై పగలు, రాత్రులతో ఒక నెల, పన్నెండు నెలలతో ఒక సంవత్సరం మరియు వంద సంవత్సరాలు పరబ్రహ్మ యొక్క ఆయుస్సు అవుతుంది. అపుడు ఈ పరబ్రహ్మ మరియు అన్ని బ్రహ్మాండాలు ఏవైతే సతలోకం కంటే కింద కలవో, అవి నష్టం అవుతాయి. కొంత కాలం తరువాత అన్ని కిందకల బ్రహ్మాండాల యొక్క రచనా పూర్ణ బ్రహ్మ అనగా పరమ అక్షర పురుషుడు చేస్తారు. ఈ విధంగా ఈ తత్వజ్ఞానంను తెలుసుకోవాలి అర్థం చేసుకోవాలి. కానీ పూర్ణ బ్రహ్మ (సతపురుషుడు) మరియు అతడి సతలోకం సహిత పైన కల అలఖ్ లోకం, అగమ మరియు అనామి లోకంలు ఎప్పటికి నాశనం కావు.

అందువలన గీతా అధ్యాయం 15 శ్లోకం 17లో చెప్పబడినది ఏమిటంటే వాస్తవంలో ఉత్తమ ప్రభువు అనగా పురుషోత్తముడు బ్రహ్మ మరియు పరబ్రహ్మ కంటే వేరుగా ఉన్నారు. ఆయనే పూర్ణ బ్రహ్మ (పరమ అక్షర పురుషుడు). ఆయనే వాస్తవంలో అవినాశి ప్రభువు. ఆయన అందరి పాలన పోషణ చేయు సంసార రూపి వృక్షం యొక్క మూల రూపి పూర్ణ పరమాత్ముడు. చెట్టు యొక్క ఏ భాగమైతే భూమి నుండి బయటికి వచ్చి కనిపిస్తుందో అది కాండం అనబడుతుంది. దానిని పరబ్రహ్మ అని తెలుసుకోండి. కాండానికి కూడ ఆహారం మూలం నుండి ప్రాప్తించబడుతుంది. తరువాత ఆ కాండం నుండి చాలా కొమ్మలు ఉంటాయి. అందులో ఒక కొమ్మ బ్రహ్మ. దీనికి కూడ ఆహారం మూలం అనగా పరమ అక్షర పురుషుడి ద్వారానే దొరుకుతుంది. ఆ కొమ్మ తరువాత శాఖలుగా విడిపోతుంది. ఆ శాఖలు మూడు గుణాలు (రజోగుణం- బ్రహ్మ, సతగుణం- విష్ణువు, తమోగుణం - శివుడు) అని భావించండి. వీటికి కూడ ఆహారం మూలం (పూర్ణ బ్రహ్మ) ద్వారానే ప్రాప్తిస్తుంది. ఈ మూడు శాఖలకి కల ఆకుల రూపంలో మిగతా ప్రాణులు ఆశ్రయించి ఉంటాయి. వారికి కూడ వాస్తవంలో ఆహారం మూలం ద్వారానే ప్రాప్తించబడుతుంది. అందువలన అందరికి పూజనీయుడు పూర్ణ పరమాత్మయే అని సిద్ధమయినది. ఇలా కూడ అనకూడదా ఆకుల వరకి ఆహారం అందించుటలో కాండం, కొమ్మలు మరియు చిన్న రెమ్మల యొక్క యోగదానం ఏం లేదా? అందువలన చెప్పునది ఏమిటంటే అందరూ ఆదరణీయులే, కానీ పూజనీయులు అయితే కేవలం వృక్ష మూలమే (వేర్లు) అవుతాయి. ఆదరణ (గౌరవం) మరియు పూజ యందు భేదం కలదు. ఎలాఅంటే పతివ్రత స్త్రీ అందరిని సత్కరిస్తుంది, ఎలాఐతే జ్యేష్ఠ తన భర్త యొక్క అన్నయ్యలని పెద్ద అన్నయ్యలా , మరిదిని చిన్న తమ్ముడిలా, కానీ పూజ తన పతిదే చేస్తుంది అనగా ఏ భావం ఐతే తన భక్తి యందు ఉంటుందో అలా వేరే పురుషుల యందు పతివ్రత స్త్రీలకు ఉండదు.

రెండవ వివరణ :- ఒక సమయంలో హరియాణ ప్రాంతంలో కరువు వచ్చింది. ఆ సమయంలో ఆరువందల కోట్ల నష్టం జరిగింది. ఆ నష్టాన్ని పూర్తిగా భరించే స్థితిలో హరియాణ ప్రభుత్వం లేకుండెను. ఎందుకంటే హరియాణ బడ్జెట్ మొత్తం తొమ్మిది వందల కోట్లు ఉ

ండెను. అపుడు ప్రధానమంత్రి ఆ క్షమతను పూర్తిచేశారు. అనగా కేంద్ర ప్రభుత్వం ఆదుకుంది. ఆ ఆరు వందల కోట్ల వితరణ/ పంపిణీ హరియాణ ప్రభుత్వం యొక్క అధికారులు మరియు ఉద్యోగులు చేశారు. సహాయం పొందినవారు, వాళ్లకి డబ్బు ఇచ్చినవారినే ఆదుకున్న వాడిగా భావిస్తారు. వారి నుండె భవిష్యత్తులో కూడ సహాయాన్ని ఆశిస్తారు. వారి పూజ (లంచం మొ॥ వాటితో) చేస్తుంటారు. కానీ ఎవరైతే శిక్షితులై ఉంటారో వారికి తెలుసు ఈ ఉద్యోగుల యోగదానం సహాయం చేయటంలో ఎంత ఉందో అని? వారు ఆదరిస్తారు కానీ పూజ చేయరు. వేరే ఇంకా ఏదైనా పనికోసం వారిని ఆశ్రయించరు.

కరవు సహాయార్థం డబ్బులు ఇవ్వడానికి ఆ ప్రాంతానికి మంత్రిగారు వస్తారు. వారంటారు నేను మన ప్రాంతం కోసం పది లక్షలు రూపాయలు ఇచ్చితిని. ఆ గ్రామంలో లబ్ధి పొందిన వారి పేర్లు చదువుతారు. 1. రామయ్యకు 10,000రూ॥ ఇచ్చాము. మొ॥ వారికి ఇచ్చాము. తరువాత ఆ ప్రాంత ముఖ్యమంత్రి అదే గ్రామానికి వస్తారు, వారు కూడ మీ గ్రామానికి పది లక్షలు ఇచ్చాను అని చెబుతారు. వారుకూడ లబ్ధిపొందిన వారి పేర్లు చదువుతారు 1. రామయ్య కు 10,000, మొ॥. తరువాత అదే ఊరికి ప్రధానమంత్రి వస్తారు. వారుకూడ మీ ఊరికి పది లక్షల కరువు సహాయం ఇచ్చితిమి అని అంటారు, మరల పేర్లు చదువుతారు. 1. రామయ్యకు 10,000 ఇచ్చాము మొ॥. కానీ రామయ్య అనుకుంటాడు వీరంతా అబద్ధం చెబుతున్నారు. నాకు డబ్బులు మన గ్రామ పట్వారీ ఇచ్చాడు. రామయ్య తన అజ్ఞానంతో గ్రామ పట్వారీని పూజిస్తారు. మరియు పట్వారీతో పనులు అవుతాయి అని భావిస్తారు. ఎవరైతే శిక్షితులు తెలివైనవారు ఉంటారో వారు తెలుసుకుంటారు ఏమనంటే ప్రధానమంత్రి ఇవ్వకుంటే ముఖ్యమంత్రి , మంత్రి మరియు పటవారి ఇచ్చి ఉండెవారు కాదు అని. ఒక వేళ ముఖ్యమంత్రి తన కరువు సహాయార్థ నిధి నుండి సహాయాన్ని చేసిన వంద వంద రూపాయలు కఠినంగా కరవు పీడితులకి ఇవ్వగలిగెవారు. కానీ అది నామ మాత్రమే అవుతుంది. ఈ విధంగా తెలివైన వ్యక్తి తెలుసుకుంటాడు ఏవరి క్షమత ఏమిటి అని. దాని ఆధారంగా వారియందు ఆస్థా/ భక్తి ఉంటుంది. అగౌరవనీయులు ఏవరు ఉండరు, కానీ పూజింపదగు వారు ఏవరు అని ఆలోచించి నిర్ణయంచుకోవాలి. ఇదేవిధంగా గీతా అధ్యాయం. 2 శ్లోకం 46 లో చెప్పబడినది అర్జున్ చాలా పెద్ద జలాశయాన్ని (దానిలో జలం పది ఏళ్లు వానలు పడకపోయిన ఎండిపోదో అలాంటిది) పొందిన తరువాత చిన్న జలాశయం (దానిలోని నీరు ఒక సంవత్సరం వాన పడకపోయిన ఎండిపోదు) గురించి ఎలాంటి ఆస్థా అయితే ఉ ంటుందో, అదే విధంగా పూర్ణ పరమాత్ముని పొందు జ్ఞానంతో పరిచితులైన పిదప నీ ఆస్థా మిగతా ప్రభువుల యందు అలానే ఉంటుంది. ఆ జలాశయం చెడ్డదిగా అనిపించదు, కానీ దాని క్షమత గురించి తెలుస్తుంది. ఇది కూడ కొంత సమయమే పనికి వస్తుంది అని.

గీతా అధ్యాయం 7 శ్లోకం 12 నుండి 15లో మూడు గుణాల వలన ఏదైతే జరుగుచున్నదో (రజోగుణ - బ్రహ్మ వలన జీవుల ఉత్పత్తి, సతగుణ-విష్ణువు వలన స్థితి మరియు తమోగుణ - శివుడు వలన సంహారం) దీనికి ముఖ్య కారకుడను నేనే (కాల్). ఏ సాధకుడు మూడు గుణాల పూజ చేస్తారో అతడు రాక్షస స్వభావాన్ని ధరించి మనుష్యులలో నీచమైన దుష్కర్మలు

చేయు మూర్ఖులై నా (కాల్) భక్తి కూడ చేయరు. తరువాత తన భక్తిని అతి అనుత్తమైనదిగా అని చెబుతారు. గీతా అధ్యాయం 7 శ్లోకం 18లో, ఇందువలన గీతా అధ్యాయం 15 శ్లోకం 4 మరియు గీతా అధ్యాయం 18 శ్లోకం 62లో చెప్పబడినది. పూర్ణ పరమాత్మ యొక్క భక్తి చేయడం వలన నే పూర్తి మోక్షం లభిస్తుంది. అది శాస్త్రవిధి అనుసారమైన భక్తి. మరియు మిగతా ప్రభువుని ఇష్ట రూపంలో చేయు సాధన / పూజ శాస్త్రవిధికి విరుద్ధంగా ఉండడం వలన వ్యర్థమైనది. (ప్రమాణం గీతా అధ్యాయం 16 శ్లోకం 23-24)

ఒక మామిడి మొక్కను నర్సిరి నుండి తీసుకువచ్చి దాని వేర్లని భూమిలో రంధ్రం చేసి పాతిపెట్టాలి. తరువాత వేర్లకి పోషణ చేస్తే (పూజ) మొక్క పెద్దదవుతు చెట్టు అవుతుంది. పిదప కొమ్మలకి పండ్లు వస్తాయి. ఒక వేళ ఎవరైన మొక్క శాఖలని భూమిలో పాతిపెట్టి వేర్లని పైకి పెట్టి, దాని పోషణ చేస్తే, ఆ మొక్క చనిపోతుంది. (కృపతో చూడండి సరియైన విధంగా మరయు తిరోగతిగా నాటిన భక్తి రూపి మొక్క పటం 226-227)

భావార్థం ఏమిటంటే సాధకుడికి పూర్ణ పరమాత్మ (మూలం) యొక్క సాధన (పూజ) ఇష్టమైన రూపాలలో చేయడం వలన దాని ఫలం ముగ్గురు బ్రహ్మ, విష్ణు మరియు శివ (శాఖ) లే ప్రధానం చేస్తారు. ఎందుకంటే ఈ భగవానులు చేసిన కర్మఫలాన్ని ఉన్నది ఉన్నట్లు ఇస్తారు.

ఒక వేళ మీకు ఏదైన కంపెనీలో ఉద్యోగం కావాలంటే పూజ కంపెనీ యొక్క యజమానిది చేయాల్సి ఉంటుంది. వారిని ప్రార్థన పత్రం ద్వారా యాచించి ఉద్యోగాన్ని పొందాల్సి ఉంటుంది. అయిన కూడ ఉద్యోగం (పని) (పూజ) యజమానిదే చేస్తారు. ఏదేని పని ఆ ఉద్యోగికి చెప్పబడుతుందో దానిని అతడు తన సేవా కాలంలో చేస్తాడు. ఈ పూజ (పని) యజమానిదే అవుతుంది. ఉద్యోగం చేసినందుకు శ్రమ ఫలితం యజమాని యొక్క వేరే నియమిత ఉద్యోగి ఇస్తాడు. ఎలా అంటే షిఫ్ట్ అధికారి హాజరుని బట్టి లెక్కలు చేసి రిపోర్టుని క్యాషియర్‌కి పంపిస్తాడు. అక్కడ ఆ ఉద్యోగికి పని ఫలం లభిస్తుంది. సూపర్‌వైజర్ / క్యాషియర్ కేవలం చేసిన కర్మలను మాత్రమే ఇస్తారు. దానిలో ఏలాంటి మార్పు చేయలేరు. ఒక్క రూపాయి ఎక్కువ ఇవ్వలేరు ఒక రూపాయి తక్కువ ఇవ్వలేరు. ఒక వేళ ఆ ఉద్యోగి నీతి, నిజాయితీతో ఉద్యోగం (పూజ) యజమానిది చేస్తే యజమాని అతడి సేవ యొక్క ధనరాశిని వృద్ధి చేస్తాడు. మరియు వేరే విధంగా బహుమతి రూపంలో ధనరాశిని అధికముగా ఇస్తాడు. ఒకవేళ యజమాని పనిని త్యాగం చేసి వేరే అధికారుల పని చేస్తే అతడి యజమాని నుండి లభించు ధన లాభం ఆగిపోతుంది. అందువలన అతను నిర్ధనుడు అవుతాడు. అధికారగణం అతడికి అంత ధనాన్ని ఇవ్వలేదు. కంపెనీ యజమాని కంటే తక్కువ సౌకర్యాలు దొరకడం వలన అతడు మిగత అధికారుల సేవకుడు అనగా యజమానిని త్యాగం చేసి మిగతా ఉపాసన చేయు వ్యక్తి మహాదు:ఖి అవుతాడు. కృపతో ఇదేవిధంగా తత్వజ్ఞానం యొక్క ఆధారంగా పవిత్ర శ్రీమద్ భగవత్ గీతా జ్ఞానంను తెలుసుకోండి.

పూర్ణ బ్రహ్మ కుల యజమాని పూజని త్యాగం చేసి మిగతా దేవతల పూజ చేయడం వలన సాధకుడికి పూర్ణ లాభం ప్రాప్తించదు మరియు సాధకుడు సాధన చేస్తు చేస్తు కూడ

మహాకష్టాన్ని ఎత్తుకుంటు ఉంటాడు.

ఇందువలన పవిత్ర గీతా అధ్యాయం 7 శ్లోకం 12 నుండి 15 మరియు 20 నుండి 23 వరకు మూడు గుణములు అనగా మూడు దేవతల పూజ చేయునటువంటి వారు రాక్షస స్వభావాన్ని ధరించినవారై, మనుషులలో నీచులై, దుష్కర్మలు చేయు మూర్ఖులు అని అనినారు మరియు వారు నా (కాల్- బ్రహ్మ అనగా కంపెనీ యజమాని యొక్క షిఫ్ట్ అధికారి) యొక్క పూజ (ఉద్యోగం) చేయరు . భావార్థం ఏమిటంటే ఎవరైతే ముగ్గురు దేవతలు మరియు మిగత దేవతల యొక్క పూజ చేస్తారో (క్యాషియర్ యొక్క పని చేస్తారో) వారిని మూర్ఖులు మరియు రాక్షస స్వభావంకల రాక్షసులు అని అనబడ్డారు. ఒక వ్యక్తికి లాభాన్ని సంపాదించడం తగ్గినపుడు అతడు కొంచెం కింద మీద చేస్తాడు. దొంగతనం లేదా కల్తిచేయడం మొ॥ చెడు మార్గములు అనుసరిస్తాడు. ఆ కారణం చేత సమాజంలో హేయమవుతాడు మరియు దరిద్రుడు అవుతాడు. ఇదేవిధంగా మూడు దేవతల (బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు) మరియు మిగతా దేవతల పూజ వలన పూర్తి లాభం జరుగదు. అందువలన సాధకుడు అబద్ధపూ, కపటపు మరియు మిగతా వికారపూరిత పనులు చేస్తుంటారు. తరువాత పాపం యొక్క కర్మ దండన కూడ అనుభవిస్తాడు. అందువలన కాల్ అంటున్నాడు ఈ అమాయకపు సాధకులు నా పూజ కూడా చేయరు. నేను ఈ బ్రహ్మ, విష్ణు మరియు శివుల కంటే ఎక్కుల ఫలితాన్ని (చేసిన కర్మ యొక్క ఫలాన్ని) ఇవ్వగలను. అది పై ప్రభువుల కంటే అధికంగా ఉంటుంది. ఇంకా గీతా అధ్యాయం 7 శ్లోకం 18లో చెప్పబడినది నా పూజ కూడా పూర్తి లాభదాయకం కాదు. అందువలన తన పూజని కూడా గీతా జ్ఞానదాతా (కాల్) ప్రభువు అతి వ్యర్థమైనదిగా అనగా అతి కింది స్థాయిగా చెప్పినారు. అందువలన గీతా అధ్యాయం 15 శ్లోకం 4 మరియు గీతా అధ్యాయం 18 శ్లోకం 62లో చెప్పబడినది ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు ఆయన కృపతో నీవు పరమశాంతిని మరియు సతలోకంను పొందుతావు. అక్కడికి వెళ్లిన తరువాత సాధకుడి పున:జన్మ అవదు. అనగా ఆది మోక్షం ప్రాప్తిస్తుంది. గీతా జ్ఞానదాతా ప్రభువు అంటున్నాడు నేను కూడ ఆ ఆదిపురుషుడు పరమేశ్వర్ శరణులోనే ఉన్నాను. గీతా అధ్యాయం 7 శ్లోకం 12 నుండి 15, 18 మరియు 20 నుండి 23ని అర్థం చేసుకోవడానికి క్రింది వివరణని ధ్యానపూర్వకంగా చదవండి.

## "మూడు గుణాలు ఏమిటి? ప్రమాణ సహితంగా"

మూడు గుణాలు రజోగుణం బ్రహ్మ, సతగుణం విష్ణువు, తమోగుణం శివుడై ఉన్నారు. బ్రహ్మ (కాల్) మరియు ప్రకృతి (దుర్గా) ద్వారా ఉత్పన్నులై ఉన్నారు. మరియు ముగ్గురు నాశనం కలవారు.

ప్రమాణం:- గీతా ప్రెస్ గోరఖ్‌పూర్ నుండి ప్రచురిత శ్రీ శివమహాపురాణం, సంపాదకులు శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ పేజి సం.24 నుండి 26, విధ్యవేశ్వర్ సంహిత మరియు పేజి 110 అధ్యాయం 9, రుద్ర సంహిత" ఈ విధంగా బ్రహ్మ-విష్ణు మరియు శివ ముగ్గురు దేవతలలో గుణంలు కలవు, కానీ శివ (బ్రహ్మ-కాల్) ని గుణాతీతుడు అని అనినారు.

**రెండవ ప్రమాణం:- గీతా ప్రెస్ గోరఖ్‌పూర్ నుండి ప్రచురిత శ్రీమద్ దేవిభాగవత్ పురాణం, శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ చిమన్ లాల్ గోస్వామి, మూడవ స్కందం, అధ్యాయం5 పేజి 123:- భగవాన్ విష్ణు దుర్గాదేవిని స్తూతిస్తారు ఇలా:- నేను (విష్ణు) , బ్రహ్మ మరియు శంకర్ మీ కృపతోనే విధ్యామానులై ఉంటిమి. మా ఆవిర్భావం (జన్మ) మరియు తీరొభావం (మృత్యువు) అవుతుంది. మేము నిత్యులము (అవినాశి) కాము. నీవే నిత్యం, జగత్‌జననివి, ప్రకృతి మరియు సనాతన దేవివి.**

**భగవాన్ శంకర్ అంటారు:- భగవాన్ బ్రహ్మ మరియు భగవాన్ విష్ణు మీ నుండి ఉత్పన్నం అయినపుడు వాళ్ల పిదప ఉత్పన్నమగు నేను తమగుణ లీలా చేయు శంకరుడను నీ సంతానం కానా? అనగా నన్ను కూడ ఉత్పన్నం చేయువారు మీరే. ఈ సంసారం యొక్క సృష్టి-స్థితి-సంహారంలో నీ గుణములు ఎల్లవేళ ఉంటాయి. ఈ మూడు గుణాలతో జన్మించిన మేము, బ్రహ్మ-విష్ణు-శంకరుడు నియమానుసారంగా కార్యముచేయట యందు తత్పరులై ఉంటాము.**

**పై వివరణ కేవలం హిందిలోకి అనువదించబడిన శ్రీదేవి మహాపురాణంలోనిది, అందులో కొన్ని విషయాలు దాచడం జరిగింది. ఇందువలన ఈ ప్రమాణమే చూదండి శ్రీ మద్‌దేవిభాగవత్ మహాపురాణం సభాషటికం సమహాత్యం, ఖేమరాజ్ శ్రీ కృష్ణదాస్ ప్రకాశన్ ముంబయి, ఇందులో సంస్కృత సహితంగా హిందిలో అనువాదం చేయబడింది. మూడవ స్కందం అధ్యాయం. 4. పేజి 10, శ్లోకం 42 :-**

బ్రహ్మ-అహమ్ ఈశ్వర: పిలతే ప్రభావాత్సర్వే వయం జని యూతా న యదా తు నిత్యా:, కే అన్యే సురా: శతమఖ ప్రమూఖా: చ నిత్యా నిత్యా త్వమేవ జనని ప్రకృతి: పురాణా।(42)

**అనువాదం:- హే మాతా! బ్రహ్మ, నేను మరియు శివ నీ ప్రభావంచే జన్మితులము, నిత్యులముకాము అనగా మేము అవినాశులము, ఇక మిగతా ఇంద్రాది దేవతలు ఎటుల నిత్యులు అవగలరు. నీవే అవినాశివి, ప్రకృతి మరియు సనాతన దేవివి. (42)**

**పేజి 11-12, అధ్యాయం 5, శ్లోకం 8 :-**

యది దయార్ద్రమనా న సదాం2బికే కథమహం విహిత: చ తమోగుణ: కమలజశ్చ రజోగుణసంభవ: సూవిహిత: కిమూ సత్యగుణో హరి:।

**అనువాదం:- భగవాన్ శంకర్ ఇలా అంటారు:- హే మాతా! మాపై నీవు దయాయుక్తురాలువైతే నన్ను తమోగుణుడిగా ఎందుకు చేశావు? కమలం నుండి ఉత్పన్నమైన బ్రహ్మని రజోగుణుడిగా ఎందుకు చేశావు?మరియు విష్ణువుని సతగుణుడిగా ఎందుకు చేశావు? అనగా జీవుల జన్మ-మృత్యువు రూపి చెడు కార్యములయందు మముల్ని ఎందుకు నియమించావు?**

**శ్లోకం 12 :-**

రమయసే స్వపతింపురుషం సదా తవ గతిం న హి విహ్ విద్మ శివే (12)

**అనువాదం:- తన పతి అనగా కాల్ భగవానుడితో ఎల్లపుడు భోగ విలాసం చేస్తూంటావు. మీ గతి ఎవరికి తెలియదు.**

**మూడవ స్కందం పేజి 14, అధ్యాయ 5 శ్లోకం 43 :-** ఎకమేవా ద్వితీయం యత్ బ్రహ్మ వేదా వదంతి వై । సా కిం త్వమ్ వా2ప్యసౌ వా కిం సందేహం వినివర్తయ్

**అనువాదం :- ఏదైతే వేదాలలో అద్వితీయ కేవలం ఒక పూర్ణ బ్రహ్మ అని చెప్పబడినది. అది మీరెనా లేక ఇంకా వేరేనా? నా ఈ సందేహాన్ని నివారించండి. బ్రహ్మ యొక్క ప్రార్థనపై దేవి ఇలా అంటుంది.**

దేవ్యువాచ సదైకత్వం న భేదోఽస్తి సర్వదైవ మమాస్య చ ॥ యోఽసౌ సాఽహమహం యోఽసౌ భేదోఽస్తి మతివిభ్రమాత్ ॥2॥ ఆవయోరంతరం సూక్ష్మ యో వేద మతిమాన్హి స: ॥ విముక్త: స తు సంసారాన్ముచ్యతే నాత్ర సంశయ:॥3॥

**అనువాదం: దేవి అంటుంది- ఇది ఉంది అంటే నేను ఉన్నట్లే. నేను ఉంటే అది ఉన్నట్లే, మతి భ్రమించడం వలన భేదం కనిపిస్తోంది ॥2॥ మా ఇద్దరి మధ్యకల సూక్ష్మ భేదం ఉంది. అది ఎవరికైతే తెలుసో అతడే మతిమానుడు అనగా తత్వదర్శి. అతను సంసారం నుండి వేరుఅయి ముక్తుడవుతాడు. ఇందులో ఏ సందేహం లేదు.॥3॥**

సూమరణద్దర్శనం తూభ్యం దాస్యేఽహం విషమే స్థితే ॥ స్వర్తవ్యాఽహం సదా దేవా: పరమాత్మా సనాతన: ॥80॥ ఉభయో: సూమరణాదేవ కార్యసిద్ధిర్ సంశయమ్ ॥ బ్రహ్మోవాచ ॥ ఇత్యుక్త్వా విససర్జాస్మానంద త్వా శక్తి: సూసంసకృతాన్ ॥81॥ విష్ణవైఽథ మహాలక్ష్మీ మహాకాలిం శివాయ్ చ ॥ మహాసరస్వతీం మహ్యం స్థానాత్తస్మాద్విసర్జితా: ॥82॥

**అనువాదం:- సంకటం వచ్చినపుడు స్మరించండి నేను మీకు దర్శనం ఇస్తాను. దేవతలారా ! పరమాత్మ సనాతన దేవుడిని శక్తి రూపంతో భావించి ఎల్లపుడు నా స్మరణ చేయండి ॥80॥ ఇద్దరిని స్మరించడం వలన తప్పకుండ కార్యసిద్ధి అవుతుంది. బ్రహ్మ అంటాడు ఈ విధంగా సంస్కారం చేసి శక్తి ఇచ్చి మముల్ని విడిచి పెట్టారు ॥81॥ విష్ణువు కోసం మహాలక్ష్మీని, శివుడి కోసం మహాకాళి, మరియు నాకు మహా సరస్వతీని ఇచ్చి సాగద్రోలిరి ॥82॥**

మమ చైవ శరీరం వై సుత్రమిత్యాభిధియతే ॥ స్థూలం శరీరం వక్ష్యామీ బ్రహ్మణ: పరమాత్మాన: ॥83॥

**అనువాదం :- నా శరీరం సూత్ర రూపం అని చెప్పబడినది, పరమాత్మ బ్రహ్మాది స్థూల శరీరం అనబడుతుంది.**

## "పై ఉదహరించబడిన వాక్యముల సారము"

**స్పష్టం అయింది శ్రీ బ్రహ్మగారు రజోగుణులు, శ్రీ విష్ణుగారు సతగుణులు మరియు శ్రీ శివగారు తమోగుణులు అని. ముగ్గురు ప్రభువులు నాశనం కలవారు మరియు వీరి జన్మ మృత్యువు అవుతుంది. దుర్గాదేవిని ప్రకృతి అని కూడ అంటారు. ఈమె భర్త బ్రహ్మ అనగా కాల్. ఈమె అతడితో భార్య భర్తల వ్యవహారం (రతి/ విలాసం) చేస్తు ఉంటుంది. దుర్గా మరియు బ్రహ్మ ఇద్దరు స్థూల శరీరంలో ఆకారంలో ఉన్నారు.**

**ఈ ప్రమాణమే గీతా అధ్యాయం 14 శ్లోకం 3 నుండి 5 లో ఉంది. గీతా జ్ఞానదాతా ప్రభు బ్రహ్మ అంటున్నాడు ప్రకృతి నా భార్య. నేను ఆమె యోని (గర్భధాన స్థానం) యందు బీజాన్ని స్థాపన చేస్తాను. దాని వలన సర్వ ప్రాణుల యొక్క ఉత్పత్తి అవుతుంది. నేను సర్వులకి (21 బ్రహ్మండాల ప్రాణులకి) తండ్రిని. ప్రకృతి (దుర్గా/అష్టంగి) అందరికి**

తల్లి. ఈ దుర్గా దేవి ద్వారా ఉత్పన్న మూడు గుణాలు (రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు మరియు తమోగుణ- శివుడు) మిగతా ప్రాణులని కర్మల బంధాల యందు బందిస్తారు.

## "త్రిగుణ మాయ(రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు మరియు తమోగుణ-శివుడు)జీవుడిని ముక్తి కానివ్వదు"

పవిత్ర గీతా అధ్యాయం 7 శ్లోకం 1 మరియు 2లో బ్రహ్మ అంటున్నాడు అర్జున్ ! ఇపుడు నీకు ఆ జ్ఞానాన్ని వినిపిస్తాను దానిని తెలుసుకున్నాకా వేరే తెలుసుకోవల్సింది ఏమియు మిగిలి ఉండదు.

గీతా అధ్యాయం 7 శ్లోకం 12 లో గీతాజ్ఞానదాతా అంటున్నాడు మూడు గుణాల వలన ఏదైతే జరుగుచున్నదో అది నా వలనే జరుగుచున్నది అని తెలుసుకో. రజగుణం (బ్రహ్మ) ద్వారా ఉత్పత్తి, సతగుణ (విష్ణు) ద్వారా పాలన పోషణ మరియు తమోగుణం (శివుడు) వలన ప్రళయం (సంహారం) కు కారణం కాల్ భగవానుడే. పిదప అంటారు నేను వీరిలో లేను. ఎందుకంటే కాల్ చాలా దూరంలో (21 వ బ్రహ్మాండంలో నిజలోకంలో ఉంటాడు) ఉంటాడు. కానీ మనస్సు రూపంలో ఆనందాన్ని కాల్ యే పొందుతాడు. మరియు రిమోట్ ద్వారా సర్వ ప్రాణులని మరియు బ్రహ్మ, విష్ణు మరియు శివులని యంత్రాల మాదిరిగా నడపిస్తాడు. గీతా చెప్పు బ్రహ్మ అంటాడు నా ఇరవైఒక్క బ్రహ్మాండాల ప్రాణుల కోసం నా పూజ ద్వారానే శాస్త్ర అనుకూల సాధనా ప్రారంభం అవుతుంది. ఏదైతే వేదాలలో వర్ణించబడింది. నా లోపల ఎన్ని ప్రాణులు కలవో వారి బుద్ధి నా చేతులలోనే ఉంది. నేను కేవలం 21 బ్రహ్మాండాలకి యజమానిని మాత్రమే. అందువలన (గీతా అధ్యాయం 7 శ్లోకం 12 నుండి 15 వరకు) మూడు గుణాల ద్వారా (రజగుణం (బ్రహ్మ) ద్వారా ఉత్పత్తి, సతగుణ (విష్ణు) ద్వారా పాలన పోషణ మరియు తమోగుణం (శివుడు) వలన ప్రళయం (సంహారం) కు కారణం నేనే (కాల్) , ఎందుకంటే కాల్ కి శాపం ఉంది. ప్రతిరోజు లక్ష మానవ శరీర ధారి ప్రాణుల సూక్ష్మ శరీరం నుండి మురికిని తింటాడు మరియు ప్రతిరోజు కొత్త లక్షపావు జీవులని ఉత్పత్తి చేస్తాడు.) ఏ సాధకుడు నా బ్రహ్మ సాధన చేయక త్రిగుణ మాయ యొక్క సాధన చేసి క్షణిక లాభాన్ని పొందుతారు, దానితో చాలా కష్టాలని పడుతుంటారు. దానితో పాటు సంకేతం చేస్తున్నారు. వీటి కంటే ఎక్కువ లాభాన్ని నేను (కాల్) ఇవ్వగలను, కానీ ఈ మూర్ఖ సాధకులు తత్వజ్ఞాన లేమి వలన ఈ మూడు గుణాల (రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు మరియు తమోగుణ- శివుడు) వరకి కల సాధన యే సాధన చేస్తారు. వీరి బుద్ధి ఈ మూడు ప్రభువుల వరకె ఉంటుంది. అందువలన ఈ రాక్షస స్వభావాన్ని ధరించినవారై, మూర్ఖులు నన్ను (బ్రహ్మని) భజించరు (స్మరించరు). ఈ ప్రమాణమే గీతా అధ్యాయం 16 శ్లోకం 4 నుండి 20 మరియు 23, 24 వరకి గీతా అధ్యాయం 17 శ్లోకం 2 నుండి 14 మరియు 19 మరియు 20లో కూడ ఉంది.

విచారం చేయండి :-- రావణుడు భగవాన్ శివుడిని మృత్యుంజయ్, అజర్ అమరుడు, సర్వేశ్వరుడిగా భావించి భక్తి చేశాడు, పదిసార్లు శిరస్సుని ఖండించి సమర్పితం చేశాడు.

దానికి బదులుగా యుద్ధ సమయంలో పది తలలు రావణుడికి ప్రాప్తించాయి. కానీ ముక్తి కాలేదు. రాక్షసుడు అని అనబడ్డాడు. ఈ దోషం రావణుడి గురుదేవులదే, ఆ గురువులు (నిమ్ హకీమ్) వేదాలని సరియైన విధంగా అర్థం చేసుకోనక తన ఆలోచనతో తమోగుణ యుక్తమైన భగవాన్ శివుడినే పూర్ణ పరమాత్మా అని చెప్పినారు మరియు అమాయకపు ఆత్మ రావణుడు అబద్ధపు గురుదేవులపై విశ్వాసం చేసి జీవితాన్ని మరియు తన వంశాన్ని నాశనం చేసుకున్నాడు.

**1.** ఒక భస్మాగిరి పేరుకల సాధకుడు ఉండెవాడు, శివుడినే సర్వంగా భావించి శీర్షాసనం (పైకి కాళ్లు కిందికి తల) వేసి **12** సంవత్సరాలు వరకి సాధన చేస్తారు. భగవాన్ శివుడిని వచన బద్దుడిని చేసి భస్మకాండం తీసుకుంటాడు. భగవాన్ శివుడిని చంపాలని చూస్తాడు. ఉద్దేశ్యం ఏమిఉండెను అంటే భస్మకాండాన్ని పొంది భగవాన్ శివుడిని చంపి పార్వతిదేవిని పెళ్లాడాలని . భగవాన్ శివుడు భయంవలన పారిపోతారు, పిదప శ్రీ విష్ణువు ఆ భస్మాసురుడిని నాట్యం చేయించి అతడి భస్మకాండంతో అతడినే భస్మం చేస్తారు. ఆ శివుడి (తమోగుణ) సాధకుడు రాక్షసుడు అని అనబడ్డాడు. హిరణ్యకశపుడు భగవాన్ బ్రహ్మ (రజోగుణ) యొక్క సాధన చేశాడు చివరికి రాక్షసుడు అనబడ్డాడు.

**2.** ఒక సమయంలో నేటి (క్రీ. శ. **2006**) నుండి సుమారు **335** సం॥ల పూర్వం హరిద్వారంలో హరి మెట్ల పై (శాస్త్ర విధి రహిత సాధన చేయువారు) కుంభమేళా మొదలయినది. అక్కడ సర్వ (త్రిగుణ ఉపాసకులు) మహాత్మ జనులు స్నానం చేయడానికి గరి, పూరీ, నాథ్, నాగా, మొ॥ భగవాన్ శివుడి ఉపాసకులు మరియు వైష్ణవులు భగవాన్ విష్ణువు ఉపాసకులు వచ్చిరి. ప్రథమ స్నానం చేయడం వలన నాగా మరియు వైష్ణవ సాధకుల మధ్య ఘోర యుద్ధం జరిగింది. సుమారు **25,000**వేల త్రిగుణ ఉపాసకులు మరణించారు. ఒక వ్యక్తి చిన్న విషయంపై నర సంహారం చేస్తాడు. అతడు సాధువా లేక రాక్షసుడా స్వయం విచారం చేయండి. సామాన్య వ్యక్తి స్నానం చేస్తున్న సమయంలో వేరే వ్యక్తి వచ్చి నన్ను కూడ కొంచం స్నానం చేయడానికి స్థానం ఇవ్వండి అని అడిగితే మన తోటివారిగా భావించి రండి మీరు స్నానం చేయండి అని అంటాము. అటు ఇటు జరిగి వచ్చేవారికి అవకాశం ఇస్తాము. ఇందువలన పవిత్ర గీతా అధ్యాయం **7** శ్లోకం **12** నుండి **15** లో చెప్పబడినది నా త్రిగుణ మాయ పూజచేయడం వలన ఎవరి జ్ఞానం లోపించబడినదో, వారు కేవలం పరువు కోసం ప్రాకులాడే రాక్షస స్వభావాన్ని ధరించి, మనుషులలో నీచమై అనగా సామాన్యవ్యక్తి కంటే పతనమైన స్వభావం కలిగి, చెడుకర్మ చేయు ముర్ఖులు నా భక్తి కూడ చేయరు. గీతా అధ్యాయం **7** శ్లోకం **16** నుండి **18** వరకు గీతాదాతా బ్రహ్మ అంటున్నాడు – నా భక్తి (బ్రహ్మ సాధన) నాలుగు విధాలైన సాధకులు చేస్తారు. ఒకరు అర్థార్థిలు (ధన లాభం కోరుకునువారు) వారు వేద మంత్రాలతో జంత్ర-మంత్ర, హవనం మొ॥ చేస్తు ఉంటారు. రెండవవారు ఆర్తులు (సంకట నివారణ కోసం వేదాలలోని జంత్ర-మంత్ర, హవనం మొ॥ చేస్తు ఉంటారు). మూడవవారు జిజ్ఞాసులు వారు పరమాత్మ జ్ఞానాన్ని తెలుసుకునుటకు ఇష్ట పడేవారు. కేవలం జ్ఞానాన్ని సంగ్రహించి వక్తలుగా తయారౌతారు. మరియు ఇతరులలోని

జ్ఞాన శ్రేష్ఠతని ఆధారం చేసుకుని ఉత్తములుగా తయారై జ్ఞానవానులై అభిమానవశంతో భక్తిహీనులైపోతారు. నాలుగవవారు జ్ఞాని. మానవ శరీరం పదే పదే లభించదు. దీనిద్వారా ప్రభు సాధన జరగకపోతే జీవనం వ్యర్థం అయినట్టే అని తెలుసుకున్న సాధకులు వేదాలను చదివారు. దానివలన వారికి జ్ఞానం అవుతుంది మూడు గుణాలు, బ్రహ్మ మరియు పరబ్రహ్మ పైనకల పూర్ణ బ్రహ్మ భక్తి చేయాలి, మిగత దేవతలది కాదు. ఆ జ్ఞాని ఉదార ఆత్మలకి నేను మంచిగా అనిపిస్తాను మరియు నాకు వాళ్లు మంచిగా అనిపిస్తారు. ఎందుకంటే వారు మూడు గుణాల కంటే పైనకల నా (బ్రహ్మ) సాధన చేస్తారు. అది మిగతా దేవతల సాధన కంటే మంచిదే కానీ వేదాలలో " ఓం " నామ జపం ఏదైతే బ్రహ్మ యొక్క సాధన మంత్రం ఉందో దానిని వేదాలు చదివిన విద్వానులు తమలో తమె విచారం- విమర్శించుకుని పూర్ణ బ్రహ్మ యొక్క మంత్రంగా తెలుసుకున్నవారై సంవత్సరాల వరకి సాధన చేశారు. ప్రభు ప్రాప్తించలేదు. వేరు సిద్ధులు ప్రాప్తించాయి. ఎందుకంటే పవిత్ర గీతా అధ్యాయం. 4 శ్లోకం 34 మరియు పవిత్ర యజుర్వేదం అధ్యాయం. 40 మంత్రం 10లో చెప్పబడిన తత్వదర్శి సంత్ వారికి దొరకలేదు. అతను పూర్ణ బ్రహ్మ సాధనని మూడు మంత్రాల ద్వారా తెలుపుతారు, అందువలన జ్ఞాని కూడ బ్రహ్మ (కాల్) సాధన చేసి జన్మ మృత్యువు చక్రంలోనే ఉండి పోయారు.

ఒక జ్ఞాని, ఉదారాత్మ, మహర్షి చుణక్ వేదాలని చదివారు మరియు ఒక పూర్ణ ప్రభువు భక్తి యొక్క మంత్రం ఓం అని తెలుసుకుని ఈ నామ జపంతో కొన్ని సం॥లు వరకి సాధన చేశారు. ఒక మానధాతా చక్రవర్తి రాజు ఉండేవాడు. (చక్రవర్తి రాజా అనగా ఏవరి శాసనం పూర్తి భూమి పై ఉంటుంది) అతడు బయటి రాజులని యుద్ధంకోసం ఉసికోల్పాడు, ఒక గుర్రం యొక్క మేడలో శాసనాన్ని కట్టి రాజ్యమంతా తిరిగిపిస్తాడు. ఏ రాజు అయితే మానధాతా యొక్క ఆధీనంలో ఉండటానికి స్వీకరించరో వారు యుద్ధం చేయాలి అని షరతు పెడతాడు మరియు అలాంటి వారు ఈ గుర్రాన్ని పట్టుకుని బందించండి అని. ఎవరు కూడ గుర్రాన్ని పట్టుకోలేదు. మహర్షి చుణక్ గారికి ఈ విషయం తెలుస్తుంది. రాజు అహంకారం బాగా అయింది అనుకుంటాడు. గుర్రాన్ని బందిస్తాడు. యుద్ధాన్ని స్వీకరిస్తాడు. యుద్ధం ప్రారంభమవుతుంది. మానధాతా రాజు వద్ద 72కోట్ల సైన్యం ఉండింది.దానిని నాలుగు భాగాలు చేసి (18 కోట్ల) సైన్యంతో మహర్షి చుణక్ పై ఆక్రమణ గావిస్తాడు. రెండవ వైపు మహర్షి చుణక్ తన సాధన ద్వారా పొందిన సిద్ధితో నాలుగు పూతలీలు (బాంబులు లాంటివి) తయారు చేస్తారు మరియు వాటితో రాజు యొక్క నాలుగు భాగాల సైన్యాన్ని వినాశనం చేస్తారు.

విశేషం:- శ్రీ బ్రహ్మ, శ్రీ విష్ణు, శ్రీ శివ మరియు బ్రహ్మ మరియు పరబ్రహ్మ యొక్క భక్తి వలన పాపం మరియు పుణ్యం రెండింటి ఫలాన్ని అనుభవించాల్సి ఉంటుంది. పుణ్యం స్వర్గంలో మరియు పాపం నరకంలో మరియు 84 లక్షల జీవుల యోనిలయందు అనేక రకాల బాధలను అనుభవించాల్సి ఉంటుంది. జ్ఞానీ ఆత్మ శ్రీ చుణక్ గారు ఓం నామ జపం వలన సిద్దిని పొంది, దానిని (నాలుగు బాంబులు తయారుచేసి) యుద్ధంలో కోల్పోయినాడు

అందువలన మహర్షి అనబడినాడు. కొంత సాధనా ఫలాన్ని మహాస్వర్గంలో అనుభవించి పిదప నరకంలోకి వెళ్తాడు మరియు పిదప 84 లక్షల ప్రాణుల శరీరాన్ని ధారణ చేసి కష్టం పై కష్టం సహించాల్సి ఉంటుంది. 72 కోట్ల ప్రాణుల సంహారాన్ని వచనంతో చేశాడు, దాని ఫలాన్ని కూడ అనుభవించాల్సి ఉంటుంది. ఎవరైన ఆయుధంతో హత్యచేసిన, లేక మాటతో (వచన రూపి ఖడ్గంతో) హత్య చేసిన, రెండింటికి సమాన శిక్షని ప్రభువు ఇస్తాడు. ఏపుడైతే మహర్షి చుణక్‌గారి జీవం కుక్క శరీరంలో ఉంటే, అపుడు దాని తలలో పుండ్లు అవుతాయి. అందులో కీటకాలు తయరై ఆ సైనికుల యొక్క జీవాలు తన పగని తీర్చుకుంటాయి. ఎపుడైన నడ్డి విరుగుతుంది, ఎపుడైన వెనుక కాళ్లు చెడిపోయి కేవలం ముందరి కాళ్లు కలిగి పాకుతు నడుస్తాడు మరియు వేడి చలి యొక్క కష్టం అసహనీయంగా పీడా వివిధ రకాలుగా అనుభవించాల్సి ఉంటుంది.

అందువలనే పవిత్ర గీతా చెపునటువంటి బ్రహ్మ గీతా అధ్యాయం 7 శ్లోకం 18 లో స్వయంగా చెబుతున్నాడు ఈ సర్వ జ్ఞాని ఆత్మలు నిజాయితీకలవి. కానీ పూర్ణ పరమాత్ముడి మూడు మంత్రాల వాస్తవిక సాధన చెప్పు తత్వదర్శి సంత్ దొరకక పోవడం వలన వీరంతా నాయొక్క (అనుత్తమం) అతి అశ్రేష్టమైన ముక్తి (గతి) దగ్గరే ఉండిపోయారు. అనగా నా సాధన కూడ అశ్రేష్టమైనది. ఇందువలన పవిత్ర గీతా అధ్యాయం 18 శ్లోకం 62లో - అర్జున్ ! నీవు సర్వభావంతో ఆ పూర్ణ పరమాత్మ శరణులోకి వెళ్లు. ఆయన కృపతో నీవు పరమ శాంతిని మరియు సనాతన పరమ ధామంను పొందుతావు. పవిత్ర గీతని శ్రీ కృష్ణుడి శరీరంలో ప్రేతంలా ప్రవేశించి బ్రహ్మ (కాల్) చెప్పినాడు, దాని తరువాత కొన్ని సంవత్సరాలకి పవిత్ర గీతా మరియు పవిత్ర నాలుగు వేదాలని మహర్షి వ్యాసుడి శరీరంలో ప్రేతంలా ప్రవేశించి స్వయంగా కాల్ యే లిపిబద్ధం చేయించాడు. ఇందులో పరమాత్మ ఏలా ఉ ంటారు, ఏలా ఆయన భక్తి చేయాలి మరియు ఏం పొందుతాము, జ్ఞానం యొక్క పూర్తి వర్ణన ఉంది. కానీ పూజ యొక్క విధానం కేవలం బ్రహ్మ అనగా కాల్ వరకె ఉంది.

పూర్ణ బ్రహ్మ యొక్క భక్తి కోసం పవిత్ర గీతా అధ్యాయం 4 శ్లోకం 34లో చెప్పబడుచున్నది పూర్ణ పరమాత్మ యొక్క భక్తి మరియు ప్రాప్తి కోసం తత్వజ్ఞాని సంత్ కోసం వెదకాలి, పిదప ఏలాంటి విధిని (కార్యచరణ) చెబుతాడో అలా చేయండి. గీతాజ్ఞానదాతా ప్రభు కాల్ అంటున్నాడు పూర్ణ పరమాత్మ యొక్క పూర్ణ జ్ఞానం మరియు భక్తి విధి నాకు (బ్రహ్మ) తెలియదు. అతని సాధనా (పూజ) విషయంలో గీతా అధ్యాయం 8 శ్లోకం 13లో చెప్పినారు నా భక్తి యొక్క నామం " ఓం ". ఓం నామ జపం చేసి అంతిమ ఘడియల (దేహత్యాగం) వరకు స్మరించడం వలన నా పరమగతిని పొందుతావు. పిదప గీతా అధ్యాయం 7 శ్లోకం 18లో చెప్పబడినది ఏ ప్రభువును పొందాలి అను కాంక్ష కల ఆత్మలకి తత్వదర్శి సంత్, ఎవరైతే పూర్ణ బ్రహ్మ యొక్క సాధనా తెలిసినవాడు, లభించలేదు, ఇందువలన ఆ ఉదారఆత్మలు నాయొక్క (అనుత్తమం) అతి అనుత్తమ పరమగతిలో ఆశ్రితులుగా ఉన్నవి. (పవిత్ర గీతా చెప్పు ప్రభువు స్వయం అంటున్నాడు నా సాధన వలన అగు గతి అనగా ముక్తి కూడ అతి అశ్రేష్ఠమైనది)

## "అన్య దేవతల (రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు మరియు తమోగుణ-శివుడు)పూజ తెలియని వారే చేస్తారు"

గీతా అధ్యాయం 7 శ్లోకం 20 చెప్పపబడినది ఏవరి సంబంధం గీతా అధ్యాయం 7 శ్లోకం 15తో నిరంతరంగా ఉందో (శ్లోకం 15లో చెప్పపబడింది ఏమిటంటే త్రిగుణమాయ(రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు మరియు తమోగుణ- శివుడు పూజ వరకు ఉంది మరియు దీని ద్వారా ప్రాప్తించు క్షణిక సుఖాలు) ద్వారా ఏవరి జ్ఞానం ఐతే హరించి వేయబడిందో వారు అసుర స్వభావాన్ని ధరించినవారై నీచ వ్యక్తులు దుష్కర్మలు చేయు మూర్ఖులు నన్ను స్మరించరు) అటువంటి వారి జ్ఞానం చిన్న చిన్న క్షణిక భోగాల వలన హరించివేయబడి వుంది. వారు తమ స్వభావ వశంతో ప్రేరితులై అన్య దేవతలని పూజిస్తారు. గీతా అధ్యాయం 7 శ్లోకం 21 లో చెప్పబడినది ఏ ఏ భక్తుడు ఏ ఏ దేవతల స్వరూపాన్ని శ్రద్ధతో పూజ చేస్తాడో ఆ ఆ భక్తుడి శ్రద్ధని నేను ఆ ఆ దేవత యందు స్థిరంగా ఉండేట్టు చేస్తాను.

గీతా అధ్యాయం 7 శ్లోకం 22 లో చెప్పబడినది అతడు శ్రద్ధతో యుక్తమై దేవతా యొక్క పూజ చేస్తాడు, ఎందుకంటే ఆ దేవత నా ద్వారా విధానం చేయబడిన కొన్ని కోరికలను ప్రసాదిస్తాయి. ఎలా అంటే ముఖ్యమంత్రి అంటారు నా కింద అధికారులు నా యొక్క పనిమనుషులే. నేను వారికి కొన్ని అధికారాలని ఇచ్చాను అవి వారి ఆశ్రయంలోనే ఉన్నాయి. ఆ లాభం కూడ నా ద్వారానే ఇవ్వడం జరుగుతుంది. కానీ అది పూర్తి లాభం కాదు. గీతా అధ్యాయం 7 శ్లోకం 23లో వర్ణన ఉంది. కానీ ఆ మంద బుద్ధి వాళ్లకు కల ఆ ఫలం నాశనము కలది. దేవతలని పూజించేవారు దేవతలని పొందుతారు. (మంద భక్తులు) మతావలంభి ఏవరైతే వేదాలలో వర్ణిత భక్తి విని అనుసారంగా భక్తి చేయు భక్తులు కూడ నన్నే పొందుతారు అనగా కాల్ యొక్క చెర నుండి ఎవరు బయటపడరు.

విశేషం:- గీతా అధ్యాయం 7 శ్లోకం 20 నుండి 23లో చెప్పబడింది వారు సాధన అనేది పుత్రుడు, భూతం, దేవిదేవత మొ॥ వారి పూజ స్వభావ వశంతో చేస్తారో, నేను (కాల్) ఆ మంద బుద్ధి కల ప్రజలని (భక్తులని) ఆ దేవత యందే ఆసక్తుడిగా చేస్తారు. ఆ అమయకపు సాధకులు దేవతల వలన ఏ లాభం ఐతే పొందుతారు ఆ శక్తిని దేవతలకి నేనే (కాల్) ఇచ్చి యున్నాను. దాని ఆధారంపైనే (లాభంకై) దేవతలని పూజించెవారు దేవతలనే పొందుతారు. కానీ బుద్ధిహీన సాధకుల ఆ పూజ 84 లక్షల యోనిలయందు శీఘ్రంగా తీసుకెళ్తుంది మరియు ఏవరైతే నన్ను (కాల్) భజిస్తారో వారు తప్తశిలపై తరువాత నా మహాస్వర్గం (బ్రహ్మలోకంలో) లోకి వెళ్ళుతారు మరియు దాని తరువాత జన్మ మరణలోనే ఉంటారు. మోక్ష ప్రాప్తి జరగదు. భావార్థం ఏమిటంటే దేవి దేవతలు మరియు బ్రహ్మ, విష్ణు, శివ మరయు మాత కంటే భగవాన్ బ్రహ్మ యొక్క సాధన మిక్కిలి లాభదాయకం. సాధకుడికి మహాస్వర్గం లభించినా కూడ అతడు అక్కడ మహాకల్పం వరకి ఉండిన కూడ అనగా శుభ కర్మల సుఖాన్ని అనుభవించిన పిదప నరకం మరియు మిగతా ప్రాణుల శరీరంలో కష్టం అనుభవించాల్సిందే, పూర్ణ మోక్షం కాదు అనగా కాల్ చెర నుండి ముక్తి పొందదు.

పూర్ణ బ్రహ్మ కబీర్ సాహెబ్

**గీతా అధ్యాయం 15**

శ్లోకం 1 నుండి 4 ,
శ్లోకం 16-17 యొక్క
వివరణ (చిత్ర పటము)

మూలం వేరు

కబీర్, అక్షర పురుష్ ఎక్ పేడ్ హై,
నిరంజన్ వాకి డార్ ।
తీనో దేవా శాఖా హై,
పాత్ రూప సంసార్

అక్షర పురుషుడు
(పరబ్రహ్మ)
కాండము

కొమ్మ (శాఖా)
బ్రహ్మ (క్షర పురుషుడు)

విష్ణు
శివ
బ్రహ్మ

శాస్త్రవిరుద్ధ సాధనా

అనగా తలకిందులుగా నాటబడిన భక్తి రూపి మొక్క




**గీతా అధ్యాయం 15**

శ్లోకం 1 నుండి 4 ,
శ్లోకం 16-17 యొక్క
వివరణ (చిత్ర పటము)

కబీర్, అక్షర పురుష్ ఎక్ పేడ్ హై,
నిరంజన్ వాకి దార్ ।
తీనో దేవా శాఖా హై,
పాత్ రూప సంసార్

అనగా సరిగ్గా నాటబడిన భక్తి రూపి మొక్క

## "అన్య ప్రమాణం"

పవిత్ర గీతా మరియు పవిత్ర వేదాలలో మిగతా దేవతల పూజ మరియు పితరుల పూజ (శ్రాద్ధం) చేయుట మరియు భూత పూజ (అస్థికలని నీళ్లలో కలుపుట, పిండాలు పెట్టుట, హవనం చేయుట) చేయుటను నిరాకరించారు. (వద్దన్నారు)

## "పవిత్ర నాలుగు వేదాలను అనుసరించి చేయు సాధనా పరిణామం కేవలం స్వర్గ-మహాస్వర్గం ప్రాప్తి, ముక్తి కాదు"

పవిత్ర గీతా అధ్యాయం 9 శ్లోకం 20, 21లో చెప్పబడింది. మనోకామన (కోరికలు) సిద్ధి కోసం ఏవరైతే నా పూజ మూడు వేదాలలో వర్ణిత సాధనా శాస్త్ర అనుకూలంగా చేస్తారో వారు తమ కర్మల ఆధారంపై మహాస్వర్గంలో ఆనందాన్ని పొంది పిదప జనన మరణ చక్రంలోకి వస్తారు అనగా యజ్ఞం అనునది శాస్త్ర అనుకూలమైన కూడ దాని వలన కలిగే లాభం సాంసరిక భోగం, స్వర్గం అంతే, ఆ తరువాత నరకం మరియు 84 లక్షల జీవులుగా మారాల్సిందే. ఏప్పటివరకైతే మూడు మంత్రాలు (ఓం, తత్, సత్) పూర్ణ సంత్ ద్వారా ప్రాప్తించవో అప్పటివరకు ఇంతే. గీతా అధ్యాయం 9 శ్లోకం 22లో చెప్పబడినది ఏవరైతే నిష్కామ భావంతో నా శాస్త్రానుకూలమైన పూజ చేస్తారో వారి పూజ యొక్క సాధనని నేనే రక్షిస్తాను, ముక్తి ఇవ్వను.

## "శాస్త్ర విరుద్ధమైన సాధన పతనానికి కారణం"

పవిత్ర గీతా అధ్యాయం 9 శ్లోకం 23, 24లో చెప్పబడింది ఏ వ్యక్తి మిగతా దేవతలని పూజస్తుంటారో వారు కూడ నా (కాల్ వలయం యందు ఉండునటువంటి) పూజయే చేస్తున్నారు. కానీ వారి ఈ పూజ అవిధిపూర్వకమైనది (అనగా శాస్త్ర విరుద్ధమై భావార్థం ఏమటంటే మిగతా దేవతలని పూజంచకూడదు). ఎందుకంటే సంపూర్ణ యజ్ఞంలను భుజించువాడను మరియు స్వామిని నేనై ఉన్నాను. ఆ భక్తులు నన్ను తెలుసుకోలేరు. అందువలన పతనాన్ని పొందుతారు. నరకం మరియు 84 లక్షల యోనిలయందు జన్మించి పొందు కష్టంను పొందుతారు. గీతా అధ్యాయం 3 శ్లోకం 14-15లో చెప్పబడినది సర్వ యజ్ఞాలలో ప్రతిష్ఠితమైన అనగా సమ్మానిత, ఎవరికైతే యజ్ఞాన్ని సమర్పించడం జరుగుతుందో ఆ పరమాత్మ (సర్వ గతమ్ బ్రహ్మ) పూర్ణ బ్రహ్మయే. ఆయనే కర్మ ఆధారులుగా చేసి సర్వ ప్రాణులని ప్రసాదిస్తారు. కానీ పూర్ణ సంత్ లభించనంతవరకు సర్వ యజ్ఞల ఫలం (ఆనందం) కాల్ (మనసు రూపంలో) యే అనుభవిస్తారు, ఇందువలన అంటున్నాడు నేనే సర్వ యజ్ఞంల యొక్క భోక్తను మరియు స్వామిని.

(మనసు రూపంలో) యే అనుభవిస్తారు, ఇందువలన అంటున్నాడు నేనే సర్వ యజ్ఞంల యొక్క భోక్తను మరియు స్వామిని.

## "శ్రాద్ధం చేయువారు(పితరుల పూజ)పితరులు అవుతారు, ముక్తి పొందరు"

గీతా అధ్యాయం 9 శ్లోకం 25లో చెప్పబడినది దేవతలను పూజించెవారు దేవతలని పొందుతారు. పితరులని పూజించేవారు పితరులకి ప్రాప్తిస్తారు. భూతాలని (పిండాల ద్వారా) పూజించెవారు భూతాలకి ప్రాప్తిస్తారు అనగా భూతం అవుతారు. శాస్త్రానుకులంగా (పవిత్ర

వేదాలు మరియు గీతా అనుసారంగా) పూజ చేయునటువంటి వారు నన్నే పొందుతారు అనగా కాల్ ద్వారా నిర్మిత స్వర్గం మరియు మహాస్వర్గంలో కొంత ఎక్కువ కాలం ఆనందాన్ని పొందుతారు.

విశేషం : ఎవరైన తహసీల్దార్ యొక్క సేవ/ పూజ చేయడం వలన అతడు తహసీల్దార్ అవలేడు. కాకపోతే దానివలన (సేవ) ధనంతో దినసరి అవసరాలు తీర్చుకోగలడు అనగా అవి అతడి ఆధీనంలో ఉంటాయి. ఇదేవిధంగా ఏవరైతే ఏ దేవుడి (బ్రహ్మా, విష్ణువు, శివుడు) పూజ చేస్తారో వారు ఆ దేవుడి నుండి లభించు లాభాన్ని పొందుతారు. త్రిగుణ మాయ (రజోగుణ-బ్రహ్మా, సతగుణ-విష్ణు మరియు తమోగుణ- శివుడు) పూజ నిషేదం పవిత్ర గీతా అధ్యాయం **7** శ్లోకం **12** నుండి **15** మరియు **20** నుండి **23** వరకులో ఉ ంది. ఇదేవిధంగా ఏవరైనా పితరులని పూజిస్తారో వారు పితరుల వద్ద చిన్న (పితరం) అయి కష్టాన్ని అనుభవిస్తారు. ఇదే విధంగా భూతాలని (ప్రేతాలని/ దయ్యాలని) పూజ చేయువారు భూతం అవుతారు. ఎందుకంటే పూర్తి జీవన ఎందులోనైతే ఆసక్తి ఉంటుందో చివరిలో అందులోనే మన మనసు ఉండిపోతుంది. అందువలనే అక్కడికి (భూతాల) వెళ్లిపోతారు. ఒకరు ఈ విధంగా అన్నారు పితర్-భూత-దేవతల పూజలు కూడ చేస్తాము, దానితో పాటు మీ నుండి ఉపదేశాన్ని తీసుకుని సాధన కూడ చేస్తు ఉంటాము అని. కానీ ఇలా నడవదు. ఏ సాధన పవిత్ర గీతా అధ్యాయం **16** శ్లోకం **23-24**లో నిషేదించారు- ఎవరైతే శాస్త్రవిధిని త్యాగం చేసి మనసుకి నచ్చినట్టు ఆచరణ (పూజ) చేస్తారో వారు సుఖమును పొందరు పరమగతిని పొందరు మరియు ఏదైన కార్యాన్ని సిద్ధింపచేయు సిద్ధులని పొందరు అనగా జీవితాన్ని వ్యర్థం చేసుకుంటారు. అందువలన అర్జున్ నీకోసం కర్తవ్యంను మరియు అకర్తవ్యంను (అయోగ్యమైన సాధన కర్మలు) గుర్తించుటలో శాస్త్రంలే ప్రామాణికం అవుతాయి. మిగతా సాధనలు వ్యర్జితాలు.

ఈ ప్రమాణమే మార్కండేయ పురాణం (గీతా ప్రెస్ గోరఖపూర్ ద్వారా ప్రచురిత పేజి **237**పై, అందులో మార్కండేయ పురణం మరియు బ్రహ్మాపురాణంను కలిపినారు) లో కూడ కలదు. ఒక రుచి నామంకల సాధకుడు బ్రహ్మాచారిగా ఉండి వేదాల అనుసారంగా సాధన చేస్తుండెవాడు. అతడు **40** సం॥ల వయసువాడైనాకా అతడికి తన నలుగురు పూర్వీకులు ఏవరైతే శాస్త్ర విరుద్ధ సాధనా చేసి పితరులైనారో మరియు కష్టాన్ని అనుభవిస్తున్నారో, వారు కనిపించారు. పితరులు అంటారు కుమారా! రుచి పెళ్లి చేసుకుని మాకు శ్రాద్ధం పెట్టు, మేము దు:ఖితులం అగుచున్నాము.రుచి ఋషి అంటాడు పితృలారా వేదాలలో కర్మ కాండ మార్గములని మూర్ఖుల సాధన అని చెప్పబడినది. మీరు నన్ను ఎందుకు ఆ తప్పుడు (శాస్త్ర విరుద్ధ) సాధన చేయమంటున్నారు. పితరులు అంటారు కూమారా! ఈ మాట నీది నిజమే వేదాలలో పితరపూజ, భూత పూజ, దేవి-దేవతల పూజని అవిద్యా అని అన్నారు. ఇందులో కించిత్ కూడ అబద్ధం లేదు. ఈ మార్కండేయ పురాణంలో ఈ లేఖన యందే పితరులు అంటారు అయినకూడ పితరులు కొంచెం లాభాన్ని ఇస్తారు అని.

విశేషం :- ఈ తన సొంత విచారాలని పితరులు చెప్పారు, వాటిని మనం

పాటించకూడదు. ఎందుకంటే పురాణాలలో కల పితరుల పూజ, భూత లేదా వేరే దేవుళ్ల పూజ చేయాలి అను ఆదేశాలు ఏదో ఒక ఋషి ద్వారా ఇవ్వబడినవి. కానీ వేదాలలో ప్రమాణాలు ఉన్నవి, కానీ అవి ప్రభు ఆదేశాలు కావు. ఇందువలన ఏ సంత్ లేదా ఋషి యొక్క చెప్పడంపై ప్రభు యొక్క ఆజ్ఞని ఉల్లంఘించిన శిక్షయందు భాగస్థులు అగుదురు.

ఒక సమయంలో ఒక వ్యక్తి దోస్తి ఒక పోలీస్‌తో అయింది. ఆ వ్యక్తి తన మిత్రుడైన పోలీస్‌తో అంటాడు తన ఇంటి పక్కవాడు అతన్ని పరేశాన్ చేస్తున్నాడు అని. పోలీస్ అంటాడు నీవు వాడిని కోట్టు , నేను చూసుకుంటాను అని. ఆ వ్యక్తి (మిత్రుడి ఆజ్ఞనని పాలించడానికి) తన ఇంటి పక్కవాన్ని కొడుతు తలపై గాయం అవడం వలన అతడు చనిపోతాడు. ఆ ప్రాంత పోలీసు అగుటచే దోస్త్‌ని బందిస్తాడు. ఆ వ్యక్తికి మరణ శిక్ష పడుతుంది. అతని దోస్త్ పోలీసు ఏ సహాయం చేయలేకపోయాడు. ఎందుకంటే రాజా యొక్క సంవిధానంలో (రాజ్యాంగం) ఏదైన హత్య చేస్తేవారికి ఉరిశిక్ష విధించాలి అని ఉంది. ఆ అమాయకపు వ్యక్తి తన దోస్తు మాట విని రాజు యొక్క సంవిధానంను భంగపరిచినాడు (ఉల్లంఘించినాడు). దానివలన జీవనాన్ని కోల్పోయాడు. ఇదేవిధంగా పవిత్ర గీతా మరియు పవిత్ర వేదాలు ప్రభువు యొక్క సంవిధానం అవుతాయి. అందులో కేవలం ఒక పూర్ణ పరమాత్మా యొక్క పూజ విధానం ఉంది, మిగత దేవతల, పితరుల, భూతాల పూజ చేయడంపై నిషేదం ఉ ంది. పురాణాలలో ఋషుల (పోలీస్) యొక్క ఆదేశం ఉంది. వారి ఆజ్ఞ పాలన చేయడం వలన ప్రభు యొక్క సంవిధానంను ఉల్లంఘించిన వారమై కష్టంపై కష్టం పడవల్సి ఉ ంటుంది. అందువలన మిగత ఉపాసన పూర్ణ మోక్షంలో బాధదాయకమైనది.

## "సత్య కథ"

నా (సంత్‌రామపాల్‌దాస్‌గారి) పూజ్య గురుదేవులు స్వామిరామదేవానందజీ మహారాజ్‌గారికి పదహారవ ఏట ఒక మహాత్మగారి సత్సంగం వినడంవలన వైరాగ్యం అయింది. ఒక రోజు వారు పొలంకు పోయి ఉండిరి దగ్గరలోనే అడవి ఉండింది.వారు అడవిలోకి వెళ్ళి ఒక చనిపోయిన జంతువు/పశువు యొక్క ఎముకల దగ్గర తన బట్టలని చింపి పడేసిరి. స్వయంగా మహాత్మాతో పాటు వెళ్ళిపోతారు.

వారి గురించి వెదికినపుడు ఆయన కుటుంబీకులకు ఆ పశువు కలేబరం వద్ద చిరిగిన బట్టలు కనిపించాయి. ఎదో అడవి జంతువు ఆయన్ని తినేసినట్లు ఉందని భావించిరి. ఆ బట్టలని మరియు ఎముకలని ఎత్తుకుని ఇంటికి తీసుకువస్తారు మరియు అంతిమ సంస్కారం చేయిస్తారు. దాని తరువాత పదకొండు రోజులు మరియు ఆరు నెలలు చేస్తారు. తరువాత శ్రాద్ధం తీయుట ప్రారంభమవుతుంది.

ఏపుడైతే నా పూజ్య గురుదేవులు చాలా వృద్ధులైనారో అప్పుడు వారు ఒకసారి ఇంటికి వెళ్ళిరి. అప్పుడు కుటుంబికులందరికి తెలిసింది వీరు జీవించెయున్నారని మరియు ఇల్లు విడిచి వెళ్లినారని. కుటుంబికులు ఇలా చెప్పిరి ఏమనంటే ఎప్పుడైతే వారు ఇల్లు విడిచి వెళ్ళినారో అప్పుడు వీరికోసం వెదికిరి. వనంలో వీరి బట్టలు దొరికినాయి. వాటి వద్ద కొన్ని ఎముకలు పడి ఉండెను. మేము వాటిని మీవిగానే భావించితిమి. ఏదైన అడవి

మృగం మిమిల్ని తిని మీ బట్టలు మరియు ఎముకల్ని ఇక్కడ పడేసింది కావచ్చు అని. వాటిని తీసుకువచ్చి అంతిమ సంస్కారం చేయించాము.

పిదప నేను (సంత్ రామపాల్‌దాస్‌గారు) నా పూజ్యా గురుదేవుల చిన్న తమ్ముడి భార్యని అడిగాను ఎప్పుడైతే మా పూజ్య గురుదేవులు ఇల్లు విడిచి వెళ్ళినారో అప్పుడు మీరు ఏమి చేశారు? ఆమె చెప్పింది ఎప్పుడైతే నేను పెళ్ళి చేసుకుని వచ్చితినో ఆ సమయంలో నాకు వీరి శ్రాద్ధం పెట్టుట తెలుసు. నేను నా చేతులతో వీరి సుమారు 70 శ్రాద్ధంలు పెట్టితిని. ఆమె ఇంకా చెప్పింది ఎప్పుడైతే ఇంటిలో ఎద్దైన ఆటంకం ఏర్పడితే– బర్రె పాలు ఇవ్వకపోవడం, స్థనాలలో ఇబ్బందులు రావడం, ఇంకా వేరే నష్టములు జరిగినపుడు మేము దేవుళ్లు చెప్పువాళ్ల వద్దకి దేవున్ని అడగడానికి పోయేవాళ్లం అప్పుడు వాళ్లు మీ ఇంటిలో ఒక పెళ్లికానీ వాడు చనిపోయినాడు. మిముల్ని అతడే దు:ఖింపజేస్తున్నాడు. తరువాత మేము అతడికి బట్టలు మొదలగునవి ఇచ్చేవాళ్లము.

అప్పుడు నేను అన్నాను వీరైతే ప్రపంచాన్ని ఉద్దరిస్తున్నారు. వీరు ఎకరికి దు:ఖాన్ని ఇస్తారు. వీరైతే ఇప్పుడు సుఖ దాత. తరువాత నేను (సంత్‌రామపాల్‌దాస్‌గారు) ఆ వృద్దురాలిని అడిగాను ఇప్పుడు వీరు మీ ఎదుట ఉన్నారు. గీతా అధ్యాయం. 9 శ్లోకం 25 చెప్పితిని. వృద్దురాలు అంటుంది నేను కూడ గీతని చదువుతాను. దాసుడు (నేను) అంటాడు మీరు చదివారు కానీ అర్థం చేసుకోలేదు. ఇప్పటికైన ఈ వ్యర్థమైన సాధనలు శ్రాద్ధం తీయుటను ఆపివేయండి. అప్పుడు ఆమె అంది ఇది మన పాత ఆచారం, దీనిని ఏలా వదిలివేయను? అనగా మనం మన పాత ఆచారాలలో ఎంత లీనమైనామంటే ప్రత్యక్ష ప్రమాణం లభించిన కూడ ఆ తప్పు చేస్తునే ఉన్నాం, విడిచిపెట్టలేం. ఈ దోషం మూర్ఖ గురువులదే, ఎవరైతే తమ పవిత్ర శాస్త్రంలను అర్థంచేసుకోనకా మనసుకు నచ్చినట్లు ఆచరణ మార్గాన్ని చేప్పినారు. దీని వలన ఏ కార్యములు చేయుట వలన కార్యసిద్ది కాదు, పరమగతి లభించదు మరియు ఏ సుఖం ప్రాప్తించదు. దీని వలన ప్రమాణితం అవుతుంది శ్రాద్ధం పెట్టుట, పితరుల పూజ చేయుట మొదలగునవి వ్యర్థమైనవి అని. ప్రమాణం కోసం గీతా అధ్యాయం 16 శ్లోకం 23-24 చూడండి.

ఇపుడు ఈ దాసుడి ప్రార్థన ఏమిటంటే శిక్షితులైన వర్గం తప్పకుండా శ్రద్ధా వహించండి మరియు శాస్త్ర విధి అనుసారంగా సాధన చేసి పూర్ణ పరమాత్మా యొక్క సనాతన పరమధామం (శాశ్వతన స్థానం) అనగా సతలోకాన్ని పొందండి. దీని వలన పూర్ణ మోక్షం మరియు పరమ శాంతి లభిస్తుంది. (గీతా అధ్యాయం 18 శ్లోకం 62) దీని కోసం తత్వదర్శి సంత్ కోసం వెదకండి. గీతా అధ్యాయం 4 శ్లోకం 34.

ఒక శ్రద్దాలు అంటాడు నేను మీ నుండి ఉపదేశాన్ని తీసుకుని తమ ద్వారా తెలిపినట్టి సాధనా కూడ చేస్తు ఉండగలను మరియు శ్రాద్ధం కూడ పెడుతు ఉండగలను మరియు తన ఇంటి దేవి దేవతలని బాహ్యంగా పూజిస్తాను. ఇందులో ఏమి దోషం ఉంది?

దాసుడి ప్రార్థన :- సంవిధానం యొక్క నియమాన్ని ఉల్లఘించడం వలన శిక్ష తప్పక పడుతుంది. అందువలన పవిత్ర గీతా మరియు పవిత్ర వేదాలలో వర్ణిత మరియు

వర్జిత విధి (పూజ) కి వ్యతిరేక సాధన చేయడం వ్యర్థమైనది (ప్రమాణం గీతా అధ్యాయం **16** శ్లోకం **23-24**) ఒకవేళ ఎవరైన అంటే నేను కారు లో పంచర్ బయటి మనసుతో చేస్తాను. వద్దు, రామ నామం యొక్క బండిలో పంచర్ చేయుట నిషేదం. ఈ విధంగా శాస్త్ర విరుద్ధ సాధన హానికారకమైనది.

ఒక శ్రద్ధాలు అంటాడు నాకు ఏలాంటి వ్యసనాలు (మద్యం, మాంసం మొ॥ తినుట లేవు. కేవలం పొగాకు (బీడి, సిగరేట్, హుక్కా) తాగుతాను. మీ ద్వారా చెప్పబడిన పూజా మరియు జ్ఞానం ఉత్తమమైనవి. నాకు గురుదేవులు కలరు. కానీ నేటి వరకు ఈ జ్ఞానం ఏ సంత్ వద్ద లేదు. నేను **25** ఏళ్లుగా తిరుగుతున్నాను మరియు ముగ్గురు గురుదేవులని మార్చుకున్నాను. దయతో నాకు పొగాకు తాగడంను విడిచి మిగత అన్ని షరుతులు అంగీకరిస్తున్నాను. పొగాకు వలన భక్తి యందు ఏలాంటి బాధ కలుగుతుంది?

దాసుడి ప్రార్థన :- మన శరీరాలకి ఆక్సిజన్ అవసరం ఉంటుంది. పొగాకు పొగలో కార్బన్‌డైఆక్సైడ్ ఉంటుంది. అది ఊపిరితిత్తులని బలహీనంగా చేస్తుంది మరియు రక్తాన్ని కలుషితం చేస్తుంది. మానవ శరీరం ప్రభు ప్రాప్తి కోసం మరియు ఆత్మ కళ్యాణం కోసం ప్రాప్తించబడి ఉంది. ఇందులో పరమాత్ముని పొందు మార్గం సుషమ్న నాడీ నుండి ప్రారంభం అవుతుంది. ముక్కు యొక్క రెండు రంధ్రాలలో కుడి వైపున కల దానిని ఇడా అని మరియు ఎడమవైపు దానిని పింగుళ అంటారు. ఈ రెండింటి మధ్యలో సుష్మణ నాడీ ఉంది. అందులో ఒక చిన్న సూదిలో దారాన్ని చొప్పించెటంత రంధ్రంతో సమానమైన ద్వారం ఉంటుంది. అది పొగాకు తాగడం వలన వచ్చు పొగ వలన మూసిపోతుంది. అందువలన ప్రభు ప్రాప్తిని పొందు మార్గానికి అవరోధం ఏర్పడుతుంది. ప్రభువును పొందు మార్గమే మూసి పోయాకా మానవ శరీరం వ్యర్థమైనట్టే కదా. అందువలన ప్రభువు భక్తి చేయు సాధకులు ప్రత్యేక మత్తును కలిగించు మరియు తినకూడని పదార్థాలను సదా విసర్జించాలి.

మరో శ్రద్ధాలు అంటాడు పొగాకు సేవించను. మాంసం మరియు మద్యం సేవిస్తాను. ఇందువలన భక్తి యందు ఏం బాధ కలుగుతుంది? ఇది అయితే తినడానికి తయారుచేయబడినవి మరియు చెట్లు చేమల్లో కూడ జీవులు కలవు. వాటిని తినడం కూడ మాంసం తినడంతో సమానమే కదా అని.

దాసుడి ప్రార్థన :- ఒకవేళ ఏవరైన మన తల్లి తండ్రులని , సోదరి సోదరులను మరియు పిల్లలని చంపి తింటే ఏలా అనిపిస్తుంది? " జైసా దర్ద ఆపనే హెువై, వైసా జాన్ బిరానే। కహే కబీర్ వే జాయే నరకమే జో కాంటే శిశ్ ఖూరాంనే ". ఏ వ్యక్తి పశువులని చంపు సమయంలో తల మరియు మొండంను దయలేకుండా (కృరంగా) కోసి మాంసం తింటాడో అతడు నరకంలో భాగస్తుడవుతాడు. ఎలాంటి దు:ఖం మన పిల్లల మరియు సంబందికులని చంపగా అవుతుందో అలానే ఇతరులదిగా భావించండి. చెట్లు చేమలు తినడానికే ఉన్నవి. వీటిని తినడానికి ప్రభువు ఆదేశం కలదు మరియు ఇవి వేర్ల తో ఉ ంటాయి. కూరగాయలు, పండ్లు తింటాము కానీ పూర్తి చెట్టుని తినం. మిగత చేతన ప్రాణులని వధించడం ప్రభు ఆదేశానికి విరుద్ధం, ఇందువలనే అపరాధం అవుతుంది.

మద్యం సేవనం కూడా ప్రభు ఆదేశం కాదు, కానీ స్పష్టంగా నిషేధం కలదు మరియు మానవ జీవితాన్ని నాశనం చేస్తుంది. మద్యం సేవించిన వ్యక్తి ఏ తప్పు ఐనా చేయగలడు. మద్యం సేవనం ధనం, శరీరం మరియు కుటుంబం శాంతి మరియు సమాజ సభ్యతా యొక్క మహా శత్రువు. చిన్న పిల్లల భవిష్యత్తు పై చెడుప్రభావం పడుతుంది. మద్యం సేవించు వ్యక్తి ఎంత నిజాయితి కలవాడైనా అతనికి ఇజ్జత్ ఉండదు మరియు విశ్వాసం ఉండదు.

ఒక సమయంలో ఈ దాసుడు ఒక ఊరిలో సత్సంగం చేయడానికి పోయి ఉండిరి. ఆ రోజు మత్తు పదార్థాల నిషేదం పై సత్సంగం చేసిరి. సత్సంగం తరువాత ఒక పదకొండు సం॥ల ఆడపిల్ల వెక్కి వెక్కి ఏడవ సాగింది. అడిగితే చెప్పసాగింది మహారాజ్ నా తండ్రి పాలమ్ హవాయి పై చాలా మంచి ఉద్యోగం చేస్తారు. కానీ అన్ని పైసలతో మద్యం తాగుతారు. మా అమ్మ వద్దంటే చాలా కొడతారు శరీరంపై నల్లటి మచ్చలు వచ్చేట్లు. ఒక రోజు అమ్మని కొడుతుంటే అమ్మపై పడి కాపాడటానికి చూస్తే నన్ను కూడ కొట్టారు. నా పెదవులు పగిలాయి. పది రోజులు పట్టాయి మంచిగా అవటానికి.మా అమ్మ మా మావయ్య వాళ్ల ఇంటికి వెళ్లిపోయింది. ఆరు నెలలో మా నానమ్మ తీసుకుని వచ్చింది. అప్పటివరకి మా నానమ్మ వద్దనే ఉంటిమి. నాన్న ముందులు కూడ ఇప్పించలేదు. ఉదయమే త్వరగా లేచి పనికి వెళ్లిపోయాడు. సాయంత్రం మద్యం తాగి వచ్చేవాడు. మేము ముగ్గురం అక్కా చెల్లలం, ఇద్దరు నా కంటే చిన్నవారు. ఇపుడు ఏపుడైనా నాన్న వస్తే మేము మంచం కిందికి వెళ్లి దాక్కుంటాము.

విచారం చేయండి పుణ్యాత్మల్లారా, ఏ పిల్లలనైతే గుండెకు హత్తుకోవాలో, మరియు పిల్లలు నాన్న రాకకై ఎదురు చూస్తు ఉండాలి నాన్న వస్తారు ఏమైనా తినడానికి తేస్తారు అని. నేడు ఈ మానవ సమాజం యొక్క శత్రువు మద్యం ఏన్ని ఇల్లులని నాశనం చేసిందో. తాగుబోతు వ్యక్తి తనకుతానుగా హాని చేసుకుంటాడు మరియు తనతో పాటు చాలా వ్యక్తుల ఆత్మలని దు:ఖంపచేయు పాపాన్ని తలపై ఉంచుకుంటాడు. ఏలా అయితే భార్యను దు:ఖిస్తూ, ఆమె అమ్మ నాన్నలు, సోదరి సోదరులని దు:ఖిస్తాడు. తన తల్లి తండ్రిని, తోబుట్టువులని, పెద్దవారిని మొ॥ వారిని ఆందోళనకి గురిచేస్తారు. ఒక తాగుబోతు వ్యక్తి చుట్టుపక్కన కల మంచి వ్యక్తుల అశాంతికి కారణం అవుతాడు. ఎందుకంటే పక్క వాళ్లు వచ్చి కాపాడితే తాగుబోతు వారిపై పడతాడు, అలా చేయకుండా మంచి వ్యక్తిలకి నిద్ర రాదు. ఈ దాసుడి నుండి ఉపదేశం తీసుకుని తరువాత ప్రతిరోజు మద్యం తాగేవారు ఇంచుమించు ఒక లక్ష మనుషులు అన్ని మత్తునిచ్చే పదార్థాలు మరియు మాంసం తినుటను పూర్తిగా త్యాగం చేశారు. సాయంత్రం ఏ సమయంలో మద్యం అను ప్రేతం యొక్క నృత్యం అవుతుండెనో ఇపుడు ఆ పుణ్యాత్మలు తమ పిల్లలతో కూర్చుని సంధ్యాహారతి చేస్తారు. హరియాణ మరియు దగ్గరలోని మిగతా ప్రాంతంలలో సుమారు పదివేల ఊళ్లలో మరియు నగరాలలో నేటికికూడ ప్రత్యేకంగా నాలుగు ఐదు ఛాంపియన్ (ఒకటో నంబరు తాగుబోతులు) ఉదహరణలు కలవు. వారు అన్ని వికారలనుండి ముక్తులై తమ మానవ జీవనాన్ని సఫలం చేసుకుంటున్నారు. కొంత మంది అంటారు మేము అంతగా తినం తాగం అపుడపుడు తీసుకుంటాం అంతే

అని. విషం కొంచం అయిన కూడ చెడ్డదె. అది భక్తి మరియు ముక్తి యందు బాధను కలిగిస్తుంది.

అనుకోండి రెండు కిలోల నెయ్యితో హలావా తయారు చేశాం (సత్యభక్తి చేశాం). అందులో 250గ్రా. ఇసుకని (పొగాకు, మద్యం, మాంసం మరియు ఉపాసన చేశాం) కలిపినారు. ఏమైంది? చేసినదంతా వ్యర్థమైనది. అందువలన పూర్ణ పరమాత్మ యొక్క పూజ, పూర్ణ సంత్ నుండి పొంది జీవితాంతం మర్యాదలో ఉంటూ, చేస్తు ఉండడం వలన పూర్ణ మోక్షం లభిస్తుంది.

## "తత్వజ్ఞానంను పొందిన తరువాతనే భక్తి ప్రారంభమవుతుంది"

గీతా అధ్యాయం 9 శ్లోకం 26, 27, 28 యొక్క భావం ఏమిటంటే ఏ ఆధ్యాత్మిక లేదా సాంసారిక పనులు చేసినా, అన్ని నా యొక్క మతానుసారం వేదాలలో వర్ణిత పూజ విధి అనుసారంగానే కర్మ చేయండి, ఆ ఉపాసకుడు నా (కాల్) కంటే లాభవంతుడు అవుతాడు. దీని వర్ణనే ఈ అధ్యాయంలోని 20, 21లోను ఉంది. అధ్యాయం.9 శ్లోకం 29 లో భగవానుడు అంటున్నాడు నాకు ఏవరితోను ద్వేషం మరియు ప్రేమ లేదు. కానీ తక్షణమే ఇలా అంటున్నాడు ఏవరైతే నన్ను ప్రేమతో భజిస్తారో వారు నాకు ప్రియులు మరియ నేను వారికి ప్రియుడను అనగా నేను వారిలో మరియు వారు నాలో ఉంటారు. రాగం మరియు ద్వేషం యొక్క ప్రత్యక్ష ప్రమాణం – ప్రహ్లాదుడు విష్ణువును ఆశ్రయించి ఉండెను మరియు హిరణ్మకశపుడు ద్వేషించేవాడు. అపుడు నరసింహ అవతారాన్ని ధరించి భగవానుడు తన ప్రియ భక్తుడిని రక్షించాడు మరియు హిరణ్యకశపుడి ప్రేగులు తీసి చంపివేశాడు. ప్రహ్లాదుడులో ప్రేమ మరియు హిరణ్యకశ్యపుడితో ద్వేషం ప్రత్యక్ష సిద్దమై ఉంది.

అందువలన పవిత్ర గీతా అధ్యాయం 2 శ్లోకం 53లో చెప్పినారు తత్వజ్ఞానం అవడం వలన వివిధ రకాలుగా భ్రమింపచేయు వచనాల నుండి విచలితమైన నీ బుద్ధి ఒక పూర్ణ పరమాత్మ యందు దృడంగా స్థిరమైపోతుంది. అపుడు నీవు యోగివి అవుతావు అనగా అపుడు నీ అనన్య మనసుతో సంశయం లేకుండా ఒక్క పూర్ణ ప్రభువు యొక్క భక్తి ప్రారంభమవుతుంది.

పవిత్ర గీతా అధ్యాయం 2 శ్లోకం 46లో చెప్పబడినది ఎలాఅయితే చాలా పెద్ద జలాశయాన్ని పొందిన పిదప చిన్న జలాశయంతో ఏంత ప్రయోజనం ఉంటుంది. ఇదే విధంగా పూర్ణ పరమాత్మ యొక్క గుణాల యొక్క జ్ఞానం తత్వజ్ఞానం వలన అవగానే మీ యొక్క ఆస్థా (శ్రద్ధ) మిగత జ్ఞానాలలో , మిగతా భగవానుల యందు అలానే ఉండిపోతుంది. ఎలాఅయితే చిన్న జలాశయం చెడుగా అనిపించదు కానీ దాని క్షమత తెలిసిపోతుంది. ఇది కేవలం ఈ సమయంలో ఉపయోగపడుతుంది. జీవితాంతం కాదు అని. మరియు చాలా పెద్ద జలాశయం ప్రాప్తించిన పిదప తెలిసిపోతుంది ఒకవేళ కరువు వచ్చిన కూడ సమస్యరాదు మరియు తక్షణమే చిన్న జలాశయాన్ని త్యాగం చేసి పెద్ద జలాశయాన్ని ఆశ్రితులౌతారు.

ఇదే విధంగా తత్వదర్శి సంత్ ద్వారా పూర్ణ పరమాత్మా యొక్క తత్వజ్ఞానం ద్వారా పూర్ణ బ్రహ్మ యొక్క మహిమా పరిచయం అవగానే సాధకుడు పూర్ణ రూపంతో (అనన్య మనసుతో) ఆ పూర్ణ పరమాత్మ పై సర్వభావంతో ఆశ్రితుడై పోతాడు.

గీతా అధ్యాయం 18శ్లోకం 62లో చెప్పబడింది అర్జున్! నీవు సర్వభావంతో ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్ళు, ఆ పరమాత్మ కృపతో నీవు పరమశాంతిని పొందెదవు మరియు శాశ్వత స్థానంను అనగా సనాతన పరమధామం అనగా ఏప్పటికిని నాశనం కానీ సత్యలోకాన్ని పొందుతావు.

గీతా అధ్యాయం 18శ్లోకం 62లో చెప్పబడింది నేను (కాల్) నీతో ఈ రహస్యమైన అతి గోపనీయమైన జ్ఞానాన్ని చెప్పినాను. ఇక నీ మనసు ఎలా కోరుకుంటే అలా చేయ్. (ఎందుకంటే ఇవి గీతలో చివరి అధ్యాయం 18 యొక్క చివరి శ్లోకాలు చెప్పుచున్నాడు అందువలనే ఇలా అన్నాడు).

## "గీతా జ్ఞానధాతా బ్రహ్మ యొక్క ఇష్ట(పూజ్య)దైవం"

గీతా అధ్యాయం 18శ్లోకం 64 లో చెప్పబడింది ఒక అన్నింటికంటే రహస్యమైన జ్ఞానం మరల ఒకసారి విను. ఈ పూర్ణ పరమాత్మ (ఎవరి గురించి ఐతే గీతా అధ్యాయం 18శ్లోకం 62లో చెప్పబడిందో) యే నాయొక్క పూజ్యదైవం అనగా నేను (బ్రహ్మ - కాల్ - క్షరపురుషుడు) కూడ ఆయన పూజయే చేస్తాను. ఇది నీ హితం కోసమే చెప్పుచున్నాను. (ఎందుకంటే ఈ విషయాన్ని గీతా జ్ఞానదాతా ప్రభువు గీతా అధ్యాయం 15శ్లోకం 4లో కూడ చెప్పియున్నారు. అందులో చెప్పబడింది ఏమిటంటే నేను ఆ ఆదిపురుషుడి శరణులో ఉన్నాను. అందువలన ఇక్కడ చెప్పబడినది ఏమిటంటే ఇది రహస్యం కంటే కూడ అతి రహస్యమైన జ్ఞానం కావున మరల విను).

విశేషం : - అన్య గీతా అనువాదకులు తప్పుగా అనువదించారు. " ఇష్ట అసి మే దృడమ్ ఇతి " యొక్క అర్థం నీవు నాకు ప్రియుడవు వాస్తవంలో దాని అర్థం ఏమిటంటే .

గీతా అధ్యాయం 18 శ్లోకం 64

సర్వగుహ్యాతమమ్, భూయ:, శ్రుణు, మే, పరమమ్, వచ:, ఇష్ట, అసి, మే, దృడమ్, ఇతి, తత:, వక్ష్యామి, తే, హితమ్ ॥

అనువాదం :- (సర్వగుహ్యాతమమ్) సంపూర్ణ గోపనీయమైన దాని కంటే గోపనీయ (మే) నా (పరమమ్) పరమ రహస్యయుక్త (హితం) హితకరమైన (వచ:) వచనం (తే) నీకు (భూయ:) మరల (వక్ష్యామి) చెబుతాను (తత:) దీనిని (శ్రుణు) విను (ఇతి) ఈ పూర్ణ బ్రహ్మ (మే) నా (దృడమ్) ఖచ్చితమైన, నిశ్చితమైన (ఇష్ట:) పూజ్యదేవుడు (అసి) అవుతారు.

గీతా అధ్యాయం 18శ్లోకం 65 లో చెప్పబడింది ఒకవేళ నా శరణులో ఉండాలనుకుంటే నా పూజనీ అనన్య భావంతో చేయ్. మిగత దేవతల (బ్రహ్మా, విష్ణు, శివుడి) మరియు పితరులు మొ॥ వారి పూజనీ త్యాగం చేయ్. తరువాత నన్నే పొందుతావు అనగా బ్రహ్మలోకంలోకల మహాస్వర్గంలోకి వెళుతావు. నేను నీకు సత్ ప్రతిజ్ఞ చేస్తున్నాను. నీవు నాకు ప్రియుడవు.

**గీతా అధ్యాయం 18శ్లోకం 66లో చెప్పబడింది ఒకవేళ (ఏకమ్) ఆ అద్వితీయ అనగా ఏవరిని వేరే ఎవ్వరితోను పోల్చలేమో ఆ ఎకైక సర్వ శక్తిమంతుడు, అన్ని బ్రహ్మాండాలని రచించినారు, అందరి పాలన పోషణ చేయు పరమేశ్వరుడి శరణులోకి వెళ్లాలి అనుకుంటే నా స్థాయి సాధన, ఏదైతే ఓం నామ జప సంపాదన మరియు మిగత ధార్మిక శాస్త్ర అనుకూల యజ్ఞ సాధనలు నా యందు విడిచి పెట్టు. (దానివలన నీవు నా ఋణం నుండి ముక్తుడవుతావు) ఆ (ఏకమ్) అద్వితీయ అనగా ఏవరికైతే ఎవరు సాటిరారో, ఆయన శరణులోకి (వ్రజ) వెళ్లు. నేను నిన్ను అన్ని పాపాలనుండి (కాల్ యొక్క ఋణాల నుండి) ముక్తి చేయిస్తాను. నీవు చింతించకు.**

**విశేషం:- గీతా యొక్క మిగతా అనువాదకులు ఈ శ్లోకం 66 ని తప్పుగా అనువదించారు. వ్రజ యొక్క అర్థం రావడం చేశారు. వాస్తవానికి వ్రజ యొక్క అర్థం పోవడం అవుతుంది. కృపతో అనువాదంను చదవండి.**

గీతా అధ్యాయం 18 శ్లోకం 66

సర్వధర్మాన్, పరిత్యజ్య, మామ్, ఏకమ్, శరణమ్, వ్రజ

అహమ్, త్వా, సర్వపాపేభ్య:, మోక్షయిష్యామి, మా, శూచ: ॥

అనువాదం :-- (మామ్) నా యొక్క (సర్వధర్మాన్) సంపూర్ణ పూజలని (పరిత్యజ్య) త్యాగంచేసి నీవు కేవలం (ఏకమ్) ఎకైక ఆ పూర్ణ పరమాత్మ యొక్క (శరణమ్) శరణులోకి (వ్రజ) వెళ్లు. (అహం) నేను (త్వా) నిన్ను (సర్వపాపేభ్య:) సంపూర్ణ పాపాలనుండి (మోక్షయిష్యామి) విడిపిస్తాను. నీవు (మా, శూచ:) శోకం చేయకు (అనగా చింతించకు)

## “బ్రహ్మ యొక్క సాధకుడు బ్రహ్మని మరియు పూర్ణ బ్రహ్మ యొక్క సాధకుడు పూర్ణ బ్రహ్మనే పొందుతాడు”

**గీతా అధ్యాయం 8 శ్లోకం 5 నుండి 10 మరియు గీతా అధ్యాయం. 17 శ్లోకం 23లో నిర్ణాయకమైన జ్ఞానం ఉంది. గీతా అధ్యాయం. 8 మంత్రం 13లో చెప్పబడినది నేనైన బ్రహ్మ యొక్క సాధనకి కేవలం ఒక ఓం అక్షరం ఉంది. దానిని ఉచ్చరణ చేస్తు జపించాలి. ఏ సాధకుడు తన చివరి శ్వాస వరకు జపం చేస్తాడో అతడు నా పరమగతిని పొందుతాడు. (తన పరమగతి అతి అశ్రేష్టమైనదిగా గీతా.అధ్యాయం. 7 శ్లోకం 18లో చెప్పినారు).**

**గీతా అధ్యాయం 17శ్లోకం 23లో చెప్పబడింది పూర్ణ పరమాత్మా యొక్క ప్రాప్తి కేవలం మూడు మంత్రాలు ఓం తత్ సత్ అను జపం యొక్క నిర్దేశం ఉంది. (అందులో ఓం బ్రహ్మది, తత్ ఇది సాంకేతికం ఇది పరబ్రహ్మది. మరియు సత్ కూడ సాంకేతికమై పూర్ణ బ్రహ్మది) ఆ పూర్ణ పరమాత్మ యొక్క తత్వజ్ఞానం తత్వదర్శి సంతకే తెలుసు. ఆయనని పొందండి. నాకు (గీతాధాతా) తెలియదు.**

**గీతా అధ్యాయం 8 శ్లోకం 8 లో చెప్పబడింది ఈ విధానం కలదు ఏమనంటే చివరి సమయంలో సాధకుడు ఏ ప్రభువు యొక్క నామన్ని స్మరిస్తూ శరీరాన్ని త్యాగం చేస్తాడో అతడు ఆయననే పొందుతాడు.**

గీతా అధ్యాయం 8 శ్లోకం 5 నుండి 7లో చెప్పబడింది - ఏవరైతే చివరి సమయంలో నా స్మరణ చేస్తూ శరీరాన్ని త్యాగం చేస్తారో అతడు నా (బ్రహ్మ) భావంలో ప్రభావితుడై ఉంటాడు. మరల ఏపుడైన మనిషి జన్మ పొందగానే అతడు తన సాధనని బ్రహ్మ నుండియే ప్రారంభిస్తాడు. అతడి స్వభావం అలానే ఉండిపోతుంది. (ఈ ప్రమాణమే గీతా అధ్యాయం. 16-17లో కూడ ఉంది).

గీతా అధ్యాయం 8 శ్లోకం 7 లో చెప్పబడింది అన్ని సమయాలలో నా స్మరణ చేయ్ మరియు యుద్ధం చేయ్ నిస్సందేహంగా నన్నే పొందెదవు.

గీతా అధ్యాయం 8 శ్లోకం 8 నుండి 10 లో చెప్పబడింది ఏ సాధకుడు అనన్య మనసుతో పరమేశ్వరుడి నామ జపం చేస్తాడో అతడు ఎల్లపుడు ఆయనని స్మరించువాడై ఆ పరమదివ్య పురుషుడు అనగా పరమేశ్వర్ (పూర్ణ బ్రహ్మ) నే పొందుతారు. (గీతా అధ్యాయం.8 మ. 8)

ఏ సాధకుడు అనాది అందరిని నియమించిన, సూక్ష్మం కంటే అతి సూక్ష్మమైన అందరిని ధరించి పోషించువాడు, సూర్యుడిలాగా స్వప్రకాశితుడు అనగా తేజోమయ శరీర యుక్తుడు, అజ్ఞాన రూపి అంధకారాన్ని ప్రాలదోలు (కవిమ్) కవిర్దేవ్ సచ్చిదానంద పరమేశ్వరుడిని స్మరిస్తాడు. (గీ. అధ్యాయం. 8 మ.9)

ఆ భక్తి యుక్త సాధకుడు మూడు మంత్రాల జపం యొక్క సాధన వలన పొందిన శక్తి ద్వారా (నామ జప సంపాదన) చివరి సమయంలో శరీరాన్ని త్యాగం చేయు సమయంలో త్రికుటి పై చేరి అభ్యాసంతో సారనామాన్ని స్మరణ చేస్తు ఆ దివ్య రూపం అనగా తేజోమయ అనగా సాకారమైన (పరమ పురుషుడు) పరమేశ్వరుడిని పొందుతాడు. (గీతా అధ్యాయం. 8 మ. 10)

## "బ్రహ్మ(క్షర పురుషుడు)యొక్క సాధన అనుత్తమమైనది"

గీతా అధ్యాయం 2 శ్లోకం 12 మరియు అధ్యాయం 4 శ్లోకం 5 మరియు అధ్యాయం 7 శ్లోకం 18 లో చెప్పబడింది నేను (కాల్) నాశనం కలవాడను . జన్మ మృత్యువు నాది మరియు నీది (అర్జున్) ఎల్లపుడు అవుతుంటుంది. కేవలం చేసిన కర్మఫలం పొందుతావు, మోక్షాన్ని పొందలేవు. నా సాధన చేయువారు ఉద్ధరించు సాధకులే కావచ్చు కానీ వారు కూడ నా అతి చెడ్డ (అనుత్తమ) సాధన యందు నిమగ్నమై ఉన్నారు. అందువలన గీతా అధ్యాయం. 18 మ.62, 64, 66 లో చెప్పబడినది ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు మరియు నా పూజ్య దేవుడు కూడ ఆయనయే.

ప్రార్ధన: - పైన తెలిపిన మూడు మంత్రాల సాధన నా దాసులకి దాసుడైన (రామపాల్ దాస్) దగ్గర ఉంది. అది స్వయంగా పూర్ణ పరమాత్మ కబీర్ దేవులే తన ఆత్మలపై దయను ఉంచి ప్రసాదించినారు. ఎందుకంటే ఇపుడు మధ్యస్థాయి వంశం (పిడి) నడుస్తున్నది. ఎందుకంటే కలియుగం యొక్క ప్రారంభంలో మన పూర్వీకులు అశిక్షితులై ఉన్నారు. ఆ సమయంలో పరమేశ్వరుడి తత్వజ్ఞానంను నకిలి సంత్‌లు, గురువులు, మఠాధిపతులు మరియు ఆచార్యులు పైకి రానివ్వలేదు. కలియుగం అంతం సమయంలో సర్వ వ్యక్తులు భక్తిహీనులు మరియు మహావికారులై పోతారు. ఇపుడు ఈ వర్తమాన సమయంలో 20వ

శతాబ్దంలో శిక్షిత సమాజం ప్రారంభమై ఉంది. ఈ మధ్యస్థాయి పిడి (జనరేషన్) అనగా మనుష్య పిడి నడుస్తున్నది. వాస్తవిక జ్ఞానం మన సద్ గ్రంథాలలో విద్యామానమై ఉంది. దానిని నకలి సంత్‌లు, గురువులు, మతాధిపతులు మరియు ఆచార్యులు తెలుసుకోలేకపోయారు. ఆ కారణంచే సర్వ భక్త సమాజం శాస్త్రవిరుద్ధమైన జ్ఞానం యొక్క ఆధారంతో కల్పిత కథలపై (లోకవేదం) ఆధారితమై శాస్త్రవిధిని త్యాగం చేసి మనసుకు నచ్చినట్లు ఆచరణ (పూజ) చేసి అమూల్యమైన మానవ జీవనాన్ని వ్యర్థం చేసుకుంటున్నారు.

**శాస్త్రవిధి అనుసార సాధనా :-**

**1.** మొదటి మెట్టులో బ్రహ్మ గాయత్రి మంత్రం ఇవ్వబడుతుంది. అది కమలాలని విప్పదీస్తుంది. ఉపదేశాన్ని పొందునటువంటి భక్తాత్మలు ఆలోచిస్తాయి. గురుజీ అనేవారు మూడు గుణాల (రజగుణం-బ్రహ్మ, సతగుణం- విష్ణువు మరియు తమోగుణం- శివుడు) సాధన చేయకూడదని. మంత్ర జపం మాత్రం వారిదే ఇచ్చారు. వారి కోసం నా నివేదన ఏమిటంటే ఇది పూజ కాదు. మనము కాల్ యొక్క లోకంలో ఉంటున్నాం. ఇక్కడ మనకి ఏ సౌకర్యం కావాలో దానిని ఈ ముగ్గురు ప్రధానం చేస్తారు.

ఏలాఐతే మనం విద్యుతుని మీటర్ ద్వారా తీసుకుని ఉన్నాము. దాని యొక్క నెలసరి ఛార్జీలు కట్టాల్సి ఉంటుంది. మనము విద్యుత్తు సంబందిత మంత్రి లేదా ఆ విభాగం యొక్క పూజ చేస్తలేం. మనం వారి బిల్లు నింపడం వలన కరెంటు యొక్క లాభాన్ని పొందగలం. ఇదేవిధంగా టెలిఫోన్ యొక్క బిల్లు మరియు నీటి బిల్లు మొ॥. కడుతున్న కొద్ది మనకు ఆ సౌకర్యాలు దొరుకుతాయి. మీరు శాస్త్ర విరుద్ధ సాధన చేసి భక్తి హీనులైనారు అనగా మీరు పుణ్యహీనులైనారు. అందువలన మీకు ధన లాభం అవడం లేదు. ఈ దాసుడు (రామపాల్ దాస్) మీ యొక్క గ్యారెంటర్ (ఒప్పందికుడై) అయి ఈ కాల్ లోకం యొక్క ఒక బ్రహ్మాండం యొక్క శక్తులతో (రజగుణం-బ్రహ్మ, సతగుణం- విష్ణువు మరియు తమోగుణం- శివుడు) మీకు సర్వ సౌకర్యాలని పున:ప్రారంభింపజేస్తాడు మరియు మీరు ఈ మంత్రం యొక్క జపం చేస్తు వీరి బిల్లు నింపుతు ఉండాలి. ప్రథమంగా కల మంత్రం (సత్ సుకృత్ అవిగత్ కబీర్) ఉందో అది మీ యొక్క పూజ, ఇది పూర్ణ పరమాత్ముడే మరియు సతమ్ లాభం (ఫలం) పొందుతారు. సతమ్ యొక్క అర్థం అవినాశి అనగా మనం అవినాశి మార్గాన్ని పొందాలి. ఈ మంత్రం పొందిన నాలుగు నెలల తరువాత మీకు సతనామం (సచ్చానామం) దొరుకుతుంది. అది రెండు మంత్రాలతో కూడి ఉంటుంది. అందులో ఒక మంత్రం కాల్ యొక్క 21 బ్రహ్మాండాల ఋణాన్ని తీర్చుతుంది. దాని సంపాదన చేసి (జపం చేసి) మనం కాల్ యొక్క ఋణాన్ని తీర్చుకొవాలి. తరువాత ఈ కాల్ మనల్ని అన్ని పాపాలనుండి ముక్తుడిని చేస్తాడు.

గీతా అధ్యాయం 18 శ్లోకం 62లో వర్ణన ఉంది :-

తమ్, ఎవ, శరణమ్, గచ్ఛ, సర్వభావేన, భారత,
తత్ ప్రసాదాత్, పరామ్, శాంతిమ్, స్థానమ్, ప్రాప్స్యసి, శాశ్వతమ్ ॥

అనువాదం :- (భారత) హే భారత్ ! నీవు (సర్వభావేన) అన్ని విధాలుగా (తమ్) ఆ

అజ్ఞాన అంధకారంలో దాగిన పరమేశ్వరుడి (ఎవ) యొక్క (శరణమ్) శరణులోకి (గచ్ఛ) వెళ్లు (తత్ప్రసాదాత్) ఆ పరమాత్ముడి కృపతోనే నీవు (పరామ్) పరమ (శాంతిమ్) శాంతిని మరియు (శాశ్వతమ్) ఏల్లపుడు ఉండునటువంటి సత్ (స్థానమ్) స్థానం-ధామం-లోకంను (ప్రాప్స్యసి) పొందుతావు.

**భావం :- హే భారత్ ! నీవు అన్ని విధాలుగా ఆ అజ్ఞాన అంధకారంలో దాగినటువంటి పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు. ఆ పరమాత్ముడి కృపతోనే నీవు పరమశాంతిని మరియు ఎల్లపుడు ఉండునటువంటి సత్ స్థానం-ధామం-లోకాన్ని పొందుతావు.**

గీతా అధ్యాయం 18 శ్లోకం 66

సర్వధర్మాన్, పరిత్యజ్య, మామ్, ఏకమ్, శరణమ్, వ్రజ
అహమ్, త్వా, సర్వపాపేభ్య:, మోక్షయిష్యామి, మా, శూచ: ॥

అనువాదం :-- (మామ్) నా యొక్క (సర్వధర్మాన్) సంపూర్ణ పూజలని (పరిత్యజ్య) త్యాగంచేసి నీవు కేవలం (ఏకమ్) ఎకైక ఆ పూర్ణ పరమాత్మ యొక్క (శరణమ్) శరణులోకి (వ్రజ) వెళ్లు. (అహం) నేను (త్వా) నిన్ను (సర్వపాపేభ్య:) సంపూర్ణ పాపాలనుండి (మోక్షయిష్యామి) విడిపిస్తాను. నీవు (మా, శూచ:) శోకం చేయకు (అనగా చింతించకు)

**భావం:- నా సంపూర్ణ పూజలని త్యాగం చేసి నీవు కేవలం ఏకైక ఆ పూర్ణ పరమాత్మ యొక్క శరణులోకి వెళ్లు. నేను నిన్ను అన్ని పాపాలనుండి విడిపిస్తాను. నీవు దు:ఖం చెందకు.**

**పై శ్లోకాల యొక్క భావార్థం ఏమిటంటే కాల్ (బ్రహ్మ) అంటున్నాడు. అర్జున్ ! నీవు నా శరణులో ఉండదల్చుకుంటే జన్మ మరియు మృత్యువు జరుగుతుంటాయి. ఒకవేళ పరమశాంతి మరియు సతలోకానికి వెళ్లాలి అనుకుంటే ఆ పూర్ణ పరమాత్మ యొక్క శరణులోకి వెళ్లిపో. దానికోసం నా యొక్క అన్ని ధార్మిక పూజలు అనగా సతనామం యొక్క మొదటి మంత్రం యొక్క జపం సంపాదనని నా యందే విడిచి పెట్టి తరువాత సర్వభావంతో ఆ ఏకైక (సర్వశక్తిమంతుడైన అనగా ఏవరికి వేరేవ్వరు సాటిరారో ఆ అద్వితీయ పరమేశ్వర్) శరణులోకి వెళ్లు తరువాత నేను నిన్ను అన్ని పాపాలనుండి (ఋణంనుండి) ముక్తి చేస్తాను. నీవు చింతించకు మరియు సతనామం యొక్క రెండవ సూత్రం యొక్క సంపాదనని పరబ్రహ్మ యందు విడిచిపెట్టు, ఎందుకంటే మనం అక్షర పురుషుడి లోకం నుండియే సతలోకం వెళ్లాలి, ఆయన కిరాయి ఇవ్వాలి. తరువాత మూడవ మంత్రం సతశబ్దం అనగా సారనామం దొరుకుతుంది. అది సతలోకంలో స్థానంను ప్రాప్తింపచేస్తుంది.**

**ఉదహారణకి ఒక వ్యక్తి విదేశాలకి వెళ్లాదనుకుందాం అక్కడ అతడిపై ప్రభుత్వం యొక్క ఋణం ఉంటుంది. అతడు తిరిగి స్వదేశానికి రావాలి అనుకుంటే ముందుగా ఆ దేశం యొక్క ఋణం నుండి ముక్తి ప్రమాణ పత్రం పొందాల్సి ఉంటుంది. అపుడు అతడి పాస్‌పోర్ట్ తయారుఅవుతుంది. లేదంటే అతడిని తిరిగి రానివ్వరు.**

**ఇదేవిధంగా మీరు కాల్ లోకంలో శాస్త్ర విరుద్ధ సాధనా చేసి భక్తిహీనులై ఋణగ్రస్తులై ఉన్నారు. మొదట మిమ్మల్ని ధనవంతుడిగా తయారు చేయాలి. దానికోసం కవిర్దేవ్ (కబీర్ సాహెబ్) ఈ దాసుడిని (సంత్ రామపాల్ దాస్) తన ప్రతినిధిగా పంపిచాడు. ఆ పరమేశ్వరుడి**

వైపు నుండి ఈ దాసుడు మీ యొక్క గ్యారెంటియర్ (ఒప్పందికుడిగా) అవుతాడు. మరియు బ్రహ్మ , విష్ణువు మరియు శివ మొ॥లగు శక్తులతో మీ యొక్క పున: సంభందాన్ని ప్రారంభింపచేస్తాడు. మంత్ర జపం యొక్క సంపాదనతో మీకు వీరి వాయిదాలలో బిల్లు నింపాల్సి ఉంటుంది. ఎప్పటి వరకైతే మీరు ఇక్కడి నుండి ముక్తులు కారో అప్పటివరకు మీరు అన్ని భౌతిక సౌకర్యాలు సక్రమంగా దొరుకుతాయి మరియు మీరు పుణ్యదానం మొ॥ని చేసి అధిక ధనవంతులు కాగలరు. రెండవ శబ్దంలో మన శరీరంలో కమలాలు కలవు. ఎపుడైతే మనం శరీరాన్ని త్యాగం చేసి పరమాత్మ దగ్గరికి వెళ్లితే మనం ఈ కమలాల నుండి వెళ్లవలిసి ఉంటుంది. 1. మూల కమలంలో గణేషుడు. 2. స్వాద కమలంలో సావిత్రి-బ్రహ్మ , 3. నాభి కమలంలో లక్ష్మి- విష్ణువు, 4.హృదయ కమలం యందు పార్వతి-శివుడు, 5. కంఠ కమలం యందు దుర్గా (శేరావాలి) ఉంటారు. ఈ కమలాల నుండి మనం వెళ్లగలం దానికోసం వారి యొక్క ఋణాన్ని తీర్చాలి. మొదటి ఉపదేశంతో మీ యొక్క అన్ని కమలాలు వికసిస్తాయి. అనగా మీరు ఋణముక్తులౌతారు. ఎప్పుడైతే మీరు చివరి సమయంలో శరీరాన్ని విడిచిపెట్టి వెళ్లిపోతారో అపుడు మీకు మార్గం సక్రమంగా దొరుకుతుంది. అనగా మీ యొక్క అన్ని ఋణ ముక్త ప్రమాణ పత్రాలు తయ్యరై దొరుకుతాయి.

కానీ మనకి పూజ మన మూల (ముఖ్య) ప్రభువు కవిర్దేవ్ (కబీర్ సాహెబ్) గారిది చేయాలి. ఎలఅంటే పతివ్రత భార్య పూజ తన భర్తది చేస్తుంది, యథా పక్రారం ఆదరణ మాత్రం అందరిది చేస్తుంది. మరదిని తమ్ముడిలాగా మరియు పెద్ద బావని పెద్ద అన్నయ్యలాగా మరియు అత్తమామలని తల్లితండ్రులుగా ఆదరిస్తుంది కానీ ఏ భావం ఐతే తన భర్తయందు ఉంటుందో అది మిగతా ఎవ్వరియందు ఉండదు. ఈ విధంగానే కబీర్ పరమేశ్వర్ భక్తులు వారి భక్తిని సఫలం చేసుకోవాలి. దీని కోసం ఎవరో తెలియని వారు చెప్పు మాటలయందు పడకూడదు. పూర్ణ విశ్వాసంతో ఈ దాసుడి ద్వారా చెప్పబడిన భక్తి మార్గంపై ఉండాలి. ఈ భక్తి సర్వ శాస్త్రాలని ఆధారం చేసుకుని ఉంది.

2. రెండవ చరణం యందు సతనామం ప్రధానం చేస్తారు. అది రెండు మంత్రాలని కలిగి ఉంటుంది. ఒకటి ఓం+ రెండవది తత్. ఇది సాంకేతికమై, కేవలం సాధకుడికె చెప్పడం జరుగుతుంది.

3. మూడవ చరణంలో సారనామం ఇవ్వడం జరుగుతుంది. అది మూడు మంత్రాలతో ఉంటుంది. ఓం+తత్+సత్ . ఇందులో తత్ సత్ సాంకేతికమై, కేవలం సాధకుడికి మాత్రమే చెప్పడం జరుగుతుంది.

ఈ విధంగా సారనామం యొక్క స్మరణ సాధనంతో (అభ్యాసంతో) సాధకుడు పరమ దివ్య పురుషుడు అనగా పరమేశ్వర్ కవిర్దేవ్ ని పొందుతాడు మరియు సతలోకంలో పరమశాంతిని అనగా పూర్ణ మోక్షాన్ని పొందుతాడు.

విశేషం:- వర్తమానంలో ఈ వాస్తవిక సాధన ఈ దాసుడి దగ్గర కాకుండా వేరేవ్వరి వద్ద లేదు. ఒకవేళ ఏవరైన ఈ దాసుడి నుండి దొంగలించి స్వయం గురువుగా తయారై అబద్దపు శిష్యుడిగా ఉంటే ఆ మనిషి, జీవనం యొక్క శత్రువునుండి సావధానులై (జాగ్రత్తులై)

ఉండండి. అతడు అనియమిత అధికారి అవడం వలన తన జీవనాన్ని నష్టం చేసుకుంటాడు మరియు అమాయకపు అనుసరించే వారిని కూడ నరకం యందు భాగస్తులుగా చేస్తున్నారు. అతడిని కాల్ ద్వారా పంపించబడిన దూతగా తెలుసుకోండి.

## "శంఖా సమాధానం"

**1.** ప్రశ్న :- పై గీతాసారం ద్వారా సిద్దం అవుతుంది బ్రహ్మా, విష్ణువు మరియు శివుడిని పూజించడం వ్యర్థం అని. కానీ నేను ముప్పై ఏళ్లుగా శివుడిని పూజిస్తున్నాను మరియు భగవాన్ శ్రీ కృష్ణుడు నాకు మిక్కిలి ప్రియులు నేను ఈ ప్రభులని వదులుకోలేను, నాకు వీరితో అమితమైన బందం ఉంది. శ్రీ గీతా నిత్య పఠనం చేస్తాను. హరేరామ, హరేకృష్ణ, రాధేశ్యామ్, సీతారామ్, ఓం నమ: శివాయ, ఓం నమో భగవతే వాసుదేవాయ మొ॥ నామ జపం చేస్తాను. సోమవారం యొక్క వ్రతం ఉంచుతాను. సారే తీయడం (ఊరేగింపు) మరియు ధామల యందు దానం కూడ చేస్తాను. మందిరంలో మూర్తి పూజ చేయడానికి వెళతాను. స్వర్గ ప్రాప్తిని కోరుకుంటున్నాను మరియు పరంపరాగత్ పూజ వలన ఒక మతాధిపతి ద్వారా ఉపదేశం కూడ తీసుకుని ఉన్నాను.

సమాధానం :- దయచేసి మీరు మరల ఒకసారి గీతా సారాన్ని చదవండి, ఎప్పటివరకైతే తత్వజ్ఞానంతో పూర్ణ పరిచితులుగా మీరు అవరో, అప్పటివరకి ఈ శంకా రూపి ముల్లు గుచ్చుతునే ఉంటుంది. పైన ఉదహరణ ఉంది ఏమిటంటే తిరగబడిన (వ్యతిరేకంగా) వ్రేలాడదీయబడిన సంసార రూపి వృక్షం ఉంది. దాని మూలం (వేర్లు) పూర్ణ పరమాత్మ పరమేశ్వరుడే. మూడు గుణాలరూపి (రజోగుణం-బ్రహ్మా, సతగుణం-విష్ణువు, తమోగుణం-శివుడు) శాఖలు కలవు. మీరు ఒక మామిడి మొక్కని పెంచుతున్నారు. ఒకవేళ మీరు మొక్క యొక్క వేర్లని పోషణ (పూజ) చేసినట్లయితే అది వృక్షం అవుతుంది, పిదప దాని శాఖలకి ఫలాలు పడుతాయి. శాఖలని తెంచాలి అని ఎవరు అనరు కదా (పళ్లు మాత్రమే తెంచాలి). పటం చూడండి సరియైన విధంగా నాటబడిన భక్తిరూపి మొక్క అనగా శాస్త్రవిధి అనుసారమైన సాధనా.

ఈ విధంగా పూజ అయితే పూర్ణ పరమాత్మ అనగా మూలంనిది చేయాలి, పిదప కర్మఫలాలు మూడు గుణ (రజోగుణం-బ్రహ్మా, సతగుణం-విష్ణువు, తమోగుణం-శివుడు) రూపి శాఖలకి పడుతాయి. అందువలన ఏమియు విడిచిపెట్టాల్సినది లేదు, కేవలం మన భక్తి రూపి మొక్క సరియైన విధంగా నాటాలి అనగా శాస్త్రవిధి అనుసారంగా సాధన ప్రారంభించాలి.

వర్తమానంలో సర్వ పవిత్ర సమాజం శాస్త్రవిధిని త్యాగం చేసి మనసుకి నచ్చిన ఆచరణ చేస్తున్నారు. అనగా భక్తిరూపి మొక్కని వ్యతిరేకంగా నాటియున్నారు. ఒకవేళ ఏవరైన ఈ విధంగా మొక్కని నాటినట్లయితే అతడిని మూర్ఖుడు అని అంటారు. (కృపతో చూడండి తిరగబడి నాటిన భక్తిరూపి మొక్క యొక్క చిత్రంను)

అందువలన గీతా అధ్యాయం **7** శ్లోకం **12** నుండి **18** వరకు లో మూడు గుణాల (రజోగుణం-బ్రహ్మా, సతగుణం-విష్ణువు, తమోగుణం-శివుడు) పూజ వరకు మాత్రమే

బుద్ధి కల వారు వీరికి అతిరిక్తం అనగా వీరు ముగ్గురు కాకుండా వేరేవ్వరిని పూజించరు. వారు రాక్షస స్వభావాన్ని ధరించిన, మనుష్యులలో నీచులై, దుష్కర్మ చేయు మూర్ఖులు అని చెప్పబడినారు మరియు అట్టివారు నన్ను (కాల్) కూడ పూజించరు. తన యొక్క సాధనని కూడ గీతాజ్ఞాన ధాతా ప్రభువు అతి అనుత్తమైనదిగా అనగా వ్యర్థమైనదిగా చెప్పినాడు. అందువలన గీతా అధ్యాయం. 18 శ్లోకం 62,64, 66 మరియు అధ్యాయం. 15 శ్లోకం 1 నుండి 4లో చెప్పబడినది ఏమిటంటే ఆ పూర్ణ పరమాత్మ (తిరగబడి వ్రేలాడదీయబడిన చెట్టు యొక్క వేర్లు యొక్క పూజ చేయండి) యొక్క శరణులోకి వెళ్లు. ఆయన పూజ తత్వదర్శి సంత్ చెప్పిన మార్గం ద్వారా చేయ్. (గీతా అధ్యాయం.4 మ.34లో తత్వదర్శి సంత్ వైపు సంకేతం చేసినారు). ఆ పూర్ణ పరమాత్మా యొక్క శాస్త్రవిధి అనుసారంగా సాధనా చేయడంవలనే పరమశాంతిని మరియు సతలోకం ప్రాప్తించబడును అనగా పూర్ణ మోక్షాన్ని పొందుతారు. గీతా జ్ఞానదాతా ప్రభు అంటున్నారు నేను కూడ ఆయన శరణులోనే ఉంటాను అనగా నా యొక్క ఇష్టదైవం ఆ పూర్ణ పరమాత్ముడే, నేను కూడ ఆయన యొక్క పూజ చేస్తాను. మిగత వారందరు కూడ ఆయన పూజయే చేయాలి. మీరు గీతాని నిత్యం పఠిస్తారు మరియు సాధన గీతలో వర్ణిత విధికి విరుద్ధంగా చేస్తారు. ఏ మంత్రాల యొక్క (హరేరామ, హరేకృష్ణ, ఓం నమ: శివాయ, మొ॥ మంత్రాల యొక్క) జపం మీరు చేస్తారు మరియు మిగత సాధకులు వ్రతం చేయడం, సారే తీయడం, తీర్థాలు మరియు ధామల యందు దానం మరియు పూజలు చేయడానికి వెళ్లడం, గంగా స్నానం మరియు పుష్కరాల స్నానం పవిత్ర గీతాలో చెప్పబడక పోవడం వలన పైవన్ని శాస్త్రవిధిని త్యాగం చేసి మనసుకు నచ్చిన ఆచరణలు (పూజలు) అవుతాయి. వాటిని గీతాలోని అధ్యాయం. 16 శ్లోకం 23-24 లో వ్యర్థం అని చెప్పబడినది.

## "గద్దె మరియు మతాధిపతుల సంప్రదాయం యొక్క విషయాలు"

ఏదైన ఒక ఏకాంత స్థానంపై లేదా నగరం లేదా ఏదైన ఊరిలో ఒక మహాన్ ఆత్మ సంత్ లేదా సాధకుడు ఉండేవాడు. ఆయన శరీరం త్యాగం చేసిన తరువాత ఆయన జ్ఞాపకార్థం కోసం ఆయన శరీర అంతిమ సంస్కారం చేసిన స్థలంపై ఒక రాయి లేదా ఇటుకలతో ఒక జ్ఞాపక చిహ్నం చేయబడుతుంది. తరువాత ఆ పవిత్రాత్మ యొక్క అనుసరులు లేదా వంశస్థులు ఆయనది రాయితో చేసిన మూర్తిని ఉంచుతారు. కొంత సమయం (కొన్ని రోజులు) తరువాత శ్రద్ధాలులు అక్కడికి వెళుతారు. కొంత ధనాన్ని దానం చేయడం చేస్తారు. దానిని మందిరంలాగా తయారు చేస్తారు మరియు ఆ సంత్ లేదా ఋషి యొక్క వంశస్థులకి ధనాన్ని సంపాదించు చెడు అలవాటు అవుతుంది. వారు ప్రలోభించడం మొదలుపెడతారు. ఎలాఅంటే ఇక్కడ దర్శనం చేయడానికి ఎవరైతే వస్తారో వారు పూర్ణ మోక్షాన్ని పొందుతారు. అన్ని లాభాలు కలుగుతాయి. ఈ మహాపురుషుడు తన జీవన కాలం యందు శిష్యులకి అన్ని లభిస్తుండెవి. ఈ మూర్తిని సాక్షాత్తు ఆ మహాపురుషుడిగానే భావించండి. ఏవరైతే ఇక్కడికి రారో వారు మోక్షాన్ని పొందడం అనేది అసంభవం మొ॥-మొ॥నవి.

అటువంటి అమాయకులని ఏవరైన అడగండి ఎలా అంటే ఒక వైద్యుడు ఉండెవాడు. అతడు నాడీ చూసి వైద్యం చేసేవాడు, రోగి మంచిగా అయ్యేవాడు. ఆ వైద్యుడి మృత్యువు జరిగిన తరువాత ఆయన మూర్తిని చేసి, స్థాపించి ఎవరైన ఒక లోభి (డబ్బు వ్యామోహంకల) అంటాడు ఈ మూర్తి ఆ వైద్యుడు చేసే పని చేస్తుంది, ఏవరైతే దీని దర్శనం కోరకు వస్తారో అతడు ఆరోగ్యాన్ని పొందుతాడు లేదా తనే స్వయంగా నకిలి వైద్యుడిగా మారి తను కూడ మందు ఇవ్వడం ప్రారంభిస్తాడు. కానీ అన్ని ఉపయోగకరమైన ఔషదులని గ్రంథాలను అనుసరించి కాకుండా వ్యతిరేకంగా ఇస్తున్నాడు. అతడు మోసం చేస్తున్నాడు. ఎందుకంటే కేవలం ధనాన్ని సంపాదించడమే అతని ఉద్దేశ్యం. ఎవరైన సంత్ లేదా ప్రభువు యొక్క మూర్తి ఆదరించదగిన జ్ఞాపకార్థ చిహ్నాం అవుతుంది. కానీ పూజనీయం కాదు.

ఇలానే ఏవరైన సంత్ లేదా ప్రభువు యొక్క మూర్తిని తయారుచేసి ఆయన సన్నిదిలో ఏవరైన పూజారి లేదా మఠాధిపతి అంటాడు నేను కూడ నామదానం ఇస్తాను అని. ఆ మహానుభావుడు అన్ని సాధనలని పవిత్ర శాస్త్రాలకి వ్యతిరేకంగా ఇస్తున్నాడు. ఆ సాధనలు ఆ సంత్ తన స్వ అనుభవం ద్వారా రాసినవి అంతే. అందువలన ఆ నకిలి సంత్ లేదా మఠాధిపతి స్వయంగా దోషి అవుతు మరియు అనుసరించువారి జీవితాన్ని వ్యర్థం చేయు భారాన్ని తన శిరస్సుపై మోస్తున్నట్టు. సంత్ ఐతే ఒక సమయంలో ఒకడె వస్తాడు. ఆయన మార్గంలో కోట్లకొద్ది నకిలి సంత్, మఠాధిపతులు మరియు ఆచార్యులు అడ్డంకులని కలిగిస్తారు.

ఎవరైనా సంత్ యొక్క శరీరాన్ని త్యాగం చేసిన తరువాత సంత్ లేదా మఠాధిపతి సాంప్రదాయం ఆరంభమవుతుంది. పూర్వ సంత్ యొక్క స్థాన రక్షణార్థం ఒక వ్యక్తిని ఎన్నుకుంటారు. అతడిని మఠాధిపతి అంటారు. అతడు కేవలం ఆ పవిత్ర జ్ఞాపకచిహ్నాం యొక్క బాగోగుల కోసం నియమించబడుతాడు. తరువాత లోభ వశమై అతను స్వయంగా గురువుగా మారుతాడు. భక్తిని ఇష్టపడు ప్రియ ఆత్మలు అతడిపై ఆధారితమై తమ జీవితాన్ని వ్యర్థంచేసుకుంటాయి. మఠాధిపతి సాంప్రదాయం యొక్క నియమం ఉంది, ఏమిటంటే పూర్వ మఠాధిపతి యొక్క మొదటి పుత్రుడు ఆ మఠాధిపతి పదవి యొక్క అధికారి అవుతాడు. అతడు త్రాగుబోతైన, అజ్ఞాని అయిన పర్వాలేదు. భక్తి మార్గం, ఇందులో కేవలం పూర్ణ సంతయే జీవుడిని ఉద్ధరించగలడు. దాసుడు (రామపాల్‌జీ మహారాజ్) రెండు-మూడు మఠాల పరంపరా యొక్క పుస్తకం చదివినారు. అందులో గమనించారు.

1. ఒకటి రెండు సంవత్సరాల బాలుడు సింహాసనంపై కూర్చుండినాడు తరువాత అతడు పెద్ద అయినాకా నామదానం ఇవ్వడం ప్రారంభించాడు. రెండవ పుస్తకంలో చదివినారు. ఒక ఐదు సంవత్సరాల బాలుడు యొక్క తండ్రి ఎవరైతే మఠాధిపతి అకస్మాత్తుగా చనిపోతాడు. తరువాత అతడి తల్లి మరియు మిగత సన్నిహితులు అందరు కలిసి ఆ ఐదు సం॥రాల పిల్లవాడిని మఠాధిపతి పదవి పై నియమిస్తారు. కొన్ని సం॥ల తరువాత అతడు గురువు అయిపోయాడు.

2. ఒక మఠం సాంప్రదాయం యొక్క చరిత్రని చదివితే ఒక మఠాధిపతికి సంతానం

లేకుండెను. అతడి మృత్యువు అయినది. అతడి అన్నయ్య మృతి ముందుగానే జరిగి ఉండెను. సంతానం లేకుండెను. మఠం రక్షణకోసం ఒక సేవకుడిని ఆ వంశంలో సంతానం కలుగువరకు అస్థాయి మఠాధిపతిగా నియమించడం జరిగింది. కొన్ని రోజుల తరువాత మఠాధిపతి కులంలో ఒకరికి బాలుడు పుడుతాడు. అస్థాయి మఠాధిపతి సింహాసనాన్ని తీసుకుని పారిపోతాడు. వేరే నగరంలో స్వయంగా సింహాసనాన్ని స్థాపించి మఠాధిపతి అయి కొత్త దుకాణం తెరుస్తాడు మరియు పాత స్థానంలో ఒక రెండున్నర సం॥ల పిల్లవాడిని మఠాధిపతిగా చేస్తారు.

**3.** ఇంకొక మఠం సాంప్రదాయం యొక్క చరిత్రని చూస్తే పెద్ద కొడుకు ఇంటిని విడిచి వెళ్లిపోతాడు. అతడికంటే చిన్నవాడిని మఠాధిపతి పదవిపై నియమింప చేస్తారు. కొంత కాలం తరువాత అక్కడ మందిరం కడుతారు మరియు చాలా కానుకలు (హుండీలో ధనం) రావడం ఆరంభించాయి. ఆ పెద్దవాడి యొక్క సంతానం వచ్చి మందిరంపై వారికి కూడ అధికారం ఉంది అంటారు. దీనివలన వారి మధ్య గొడవ మొదలవుతుంది. సింహాసనంపై విరాజితులైన మఠాధిపతి హత్య చేయబడుతాడు. తరువాత అతడి పెద్ద కొడుకుని మఠాధిపతిగా అనగా సింహాసనం యొక్క అధికారిగా నియమింప చేస్తారు. అతడిని కూడ హతమార్చుతారు. తరువాత అతడి రెండవ సోదరుడు సింహాసనంపై కూర్చుండపెడతారు. రెండవవాళ్లు (పెద్దవారు) ఏవరైతే తమకి అధికారం కలదు అనేవారో వారు కొత్త స్థానంను ఏర్పాటు చేసుకుని కొత్త దుకాణం మొదలుపెడతారు. ఒకరి పై ఒకరు ఆరోపణలు చేసుకుని సుఖమయ జీవితాన్ని లంచగొండితనంతో నరకం చేసుకున్నారు. ఆ ధామం ఎక్కడ ఉంది? అది మహాభారతంలో కురుక్షేత్ర మైదానం అయిపోతుంది. కొంత మంది మఠాధిపతులు సంతులని తయారు చేసే పనిని తీసుకుని ఉన్నారు. ఎరపు బట్టలు ధరింపజేస్తారు. పాత పేరుకు బదులుగా కొత్త పేరుని ఇస్తారు తరువాత కృతిమ మఠాధిపతి యొక్క కృతిమ శిష్యుడు నకిలి సంత్‌గా మారి అమయకపు ఆత్మల జీవితాలతో ఆడుకుంటారు మరియు అమూల్యమైన మనుష్య జీవితాన్ని స్వయం వ్యర్థం చేసుకుంటాడు మరియు అమాయకపు ఆత్మల జీవితాలని కూడ నాశనం చేస్తున్నాడు మరియు మహాపాపంలో భాగస్తుడు అవుతున్నాడు.

ఏ సమయంలో ఐతే రాజా పరిక్షిత్తుడిని పాము కాటు వేయాల్సి ఉండెనో ఆ సమయంలో పూర్ణ గురువు యొక్క ఆవశ్యకత ఏర్పడింది. ఎందుకంటే పూర్ణ సంత్ లేకుండా జీవుడి కళ్యాణం అసంభవం. ఆ సమయంలో పృథ్వి యొక్క సర్వ ఋషులు రాజా పరిక్షిత్‌డిని దీక్ష ఇచ్చుట మరియు ఏడు రోజుల శ్రీ మద్ భగవత్ సుధాసాగర్ యొక్క కథని వినుపించుటను వద్దనుకున్నారు. ఎందుకంటే ఏడవ రోజున ముడి విప్పాల్సి (ఫలితం కనిపించాలి) ఉంటుంది. ఈ కారణంచేత ఎవరు ముందుకు రాలేదు. స్వయం శ్రీ మద్ భాగవతంను రచించిన మహర్షి వేదవ్యాస్ గారు కూడ అసమర్ధతతని వ్యక్తం చేశారు. ఎందుకంటే ఆ ఋషిజనులు ప్రభుకి భయపడేవారు. అందువలననే రాజా పరిక్షిత్ యొక్క జీవనంతో ఆటలు ఆడటం సరియైనదికాదు అని భావించారు.

రాజా పరీక్షిత్ గారి కళ్యాణం కోసం మహర్షి సుఖదేవగారిని పిలిపించిరి. ఆయన రాజుకి దీక్షని ఇచ్చిరి మరియు ఏడు రోజుల వరకు కథని వినిపించి రాజా పరీక్షిత్తుడిని ఏంత మంచి చేయగలరో చేసిరి. వర్తమానంలోని గురువులు, సంత్, మఠాధిపతిలు మరియు ఆచార్యులు స్వయంగా ప్రభువు సంవిధానంతో అపరిచుతులుగా ఉన్నారు. ఇందువలనే భయంకర దోషంలో భాగస్తులై దోషులు అవుతున్నారు.

ఔరో పంథ్ బతావహి, స్వయం న జానే రాహ్ ।

అనధికారి కథా-పాఠ్ కరే వ దీక్షా దేవై, బహుత కరత్ గునాహ్ ।

వర్తమానంలో కథలు మరియు గ్రంథాలని చెప్పువారి మరియు నామ దానం ఇచ్చువారి గుంపు వచ్చి ఉంది. ఎందుకంటే సర్వపవిత్ర ధర్మాల పవిత్రాత్మలు తత్వజ్ఞానంతో అపరిచితులుగా ఉండినారు. అందువలనే నకిలి సంత్, గురువులు మరియు మఠాధిపతిల సమయం నడుస్తు ఉంది. ఏ రోజుఅయితే పవిత్ర భక్త సమాజం ఆధ్మాత్మిక తత్వజ్ఞానంతో పరిచితులుగా అవుతారో ఆ సమయంలో ఈ నకిలి సంత్‌లు, గురువులు మరియు ఆచార్యులకి దాక్కొడానికి స్థానం దొరకదు, పారిపోయి ఏవరిని వారు విడిపించుకోవాలి.

## "పవిత్ర తీర్థాలు మరియు ధామంల గురించి విషయాలు"

ఏవరో ఒక సాధకుడు ఋషి గారు ఒక స్థానంలో లేదా జలాశయం సమీపంలో కూర్చోని సాధనా చేసిరి లేదా తన ఆధ్యాత్మిక శక్తి యొక్క ప్రదర్శన చేసిరి. అతడు తన భక్తిని సంపాదించుకుని తనతో పాటు తీసుకెళ్లాడు మరియు తన ఇష్ట లోకాన్ని పొందినాడు. ఆ సాధనా స్థలంకు తరువాత తీర్థ లేదా ధామం అను పేరు పడింది. ఇక్కడ ఒక సాధకుడు ఉండెవాడు, ఆయన చాలా మంది కళ్యాణం చేసినారు అని ఇపుడు ఏవరైనా ఆ స్థానాన్ని చూడటానికి వెళ్లితే అక్కడ ఆ సంత్ ఉండరు, ఏవరైతే ఉపదేశం ఇచ్చేవారు. ఆయనైతే తన సంపాదన చేసుకుని వెళ్లిపోయాడు.

విచారం చేయండి :- కృపతో ఈ తీర్థాలు మరియు ధామంలను రోలు మరియు రోకలిగా భావించండి. (ఎదైతే చిన్న చిన్న సామాను మరియు మందులు దంచుకోడానికి అక్కెరకు వస్తుంది). ఒక వ్యక్తి తన పక్కంటివారి నుండి రోలు-రోకలి అడిగి తెచ్చుకుంటాడు. అతను హవన సామగ్రిని దంచుకున్నాడు మరియు దానిని చక్కగా కడిగి తిరిగి ఇచ్చేస్తాడు. ఏ గదిలో అయితే రోలు-రోకలి ఉంచబడినదో ఆ గదిలో సుగంధిత వాసన రాసాగింది. ఇంటి సభ్యులు వాసన ఎక్కడినుండి వస్తోంది అని చూడగా రోలు-రోకలి నుండి అని తెలిసింది. పక్కంటివారు తీసుకపోయి ఉండేను, అతను ఏదో సుగంధిత వస్తువు దంచినాడు అని అనుకున్నారు. కొన్ని రోజుల తరువాత ఆ సుగంధం వచ్చుట ఆగిపోయింది.

ఈ విధంగానే తీర్థాలు మరియు ధామంలు ఒక రోలు రోకలి మాదిరిగా భావించండి. ఎలాఐతే సామగ్రి దంచుకునే వాడు తన సర్వ వస్తువులని దంచుకొని ఖాళీ రోలు రోకలి తిరిగి ఇచ్చివేసినట్టు. ఇపుడు ఎవరైన ఆ రోలు రోకలి సుగంధాన్నే పీల్చుకుని తృప్తి పడితే అది అతని మూర్ఖత్వం అవుతుంది. అతడు కూడ సామగ్రిని తీసుకు రావాలి, అప్పుడే పూర్తి లాభం అవుతుంది.

సరిగ్గా ఈ విధంగానే ఎర్రైన ధామం లేదా తీర్థస్థానంపై ఉండు పవిత్ర ఆత్మా రామ నామ సామగ్రిని దంచుకుని శుభ్రంగా కడుగుకొని తన పూర్తి సంపాదనని తనతో పాటే తీసుకెళ్లినాడు. తరువాత తెలియని శ్రద్దాలులు, ఆ స్థానంకు వెళ్లిన మాత్రముననే కళ్యాణం అని అనుకుంటే, అది వారికి మార్గదర్శకులు (గురువులు) శాస్త్రవిధి రహితంగా చెప్పిన సాధనా యొక్క పరిణామమే అవుతుంది. ఆ మహాన్ ఆత్మా సంత్ లాగే ప్రభు సాధనా చేస్తేనే కళ్యాణం సంభవం అవుతుంది. దానికోసం తత్వదర్శి సంత్‌ని వెదకి ఆయన నుండి ఉపదేశం తీసుకుని జీవితాంతం భక్తి చేసి మోక్షంను పొందాల్సి ఉంటుంది. శాస్త్ర విధి అనుకూలమైన సత సాధనా ఈ దాసుడి వద్ద ఉంది. కృపతో ఉచితంగా పొందండి.

## "శ్రీ అమరనాథ్ ధామం యొక్క స్థాపన ఏలా జరిగింది?"

భగవాన్ శంకరుడు పార్వతి దేవికి ఏకాంత స్థానంపై ఉపదేశం చేసిరి. దానివలన మాతా పార్వతి ఎంత ముక్తురాలు అయ్యిందంటే ఎప్పటివరకు శివుడి (తమోగుణం) మృత్యువు కాదో అప్పటివరకు పార్వతి దేవి మృత్యువు కూడ కాదు. ఏడు బ్రహ్మాల (రజోగుణం) మృత్యువు జరిగిన తరువాత భగవాన్ విష్ణువుల (సతగుణం) మృత్యువు అవుతుంది. ఏడు విష్ణువుల మృత్యువు జరిగన తరువాత శివుడి మృత్యువు అవుతుంది. అపుడు మాతా పార్వతి గారి మృత్యువు అవుతుంది, పూర్ణ మోక్షం కాలేదు. అయిన కూడ ఏంత లాభం అయితే పార్వతిదేవి కి జరిగిందో అది కూడ అధికారి నుండి ఉపదేశ మంత్రం తీసుకోవడం వలన జరిగింది. తరువాత శ్రద్దాలులు ఆ స్థానంను జ్ఞాపకంగా ఉంచడానికి దానిని సురక్షితంగా ఉంచిరి మరియు దర్శకులు చూడటానికి వెళ్లసాగిరి.

ఎలాఅయితే ఈ దాసుడు (సంత్ రామపాల్) వివిధ స్థానాలకి వెళ్లి సంత్సంగం చేస్తారు. అక్కడ ఖీర్ మరియు హలవా తయారు చేయబడుతుంది. ఏ భక్తాత్మా ఉపదేశాన్ని పొందుతాడు, అతడి కళ్యాణం అవుతుంది. సంత్సంగ సమాపనం అయిన తరువాత టెంట్ మొ॥నవి అన్ని విప్పి వేరోక స్థానంలోకి సత్సంగం చేయడానికి వెళ్లిపోయిరి, పూర్వపు స్థానంలో కేవలం మన్నుతో లేదా ఇటుకలతో తయారుచేసిన భట్టి మరియు పొయ్యిల శేషం విడిచిపెట్టిరి. తరువార ఒకరు ఆ నగరంలోని ఒక వ్యక్తితో ఇలా అంటాడు రండి నేను మీకు ఆ స్థానం చూపించి తీసుకు వస్తాను, ఎక్కడైతే రామపాల్ దాస్‌గారు సత్సంగం చేసినారు, ఖీర్ తయారు చేసి ఉండిరి. తరువాత ఆ భట్టిలను చూడటానికి వెళ్లినవారికి ఖీర్ దొరకదు, ఆ సత్సంగం యొక్క అమృత వచనాలు దొరకవు, కళ్యాణ కారి ఉపదేశం దొరకదు. దానికోసం సంత్ కోసమే వెదకాలి, ఎక్కడైతే సత్సంగం నడుస్తు ఉంటుందో, అక్కడ అన్ని కార్యములు సిద్దిస్తాయి.

సరిగ్గా ఈ ప్రకారంగా తీర్థాలకి మరియు ధామాలకి వెళ్లడం అనేది జ్ఞాపకార్థ స్థానం (భట్టిని) చూడడం మాత్రమే అవుతుంది. ఇది పవిత్ర గీతాయందు చెప్పబడటం వలన శాస్త్ర విరుద్ధ ం అయినది. దాని వలన ఏమియు లాభం అవదు. (ప్రమాణం పవిత్ర గీతా అధ్యాయం. 16 మంత్రం 23-24).

తత్వజ్ఞాన హీన సంత్‌లు, మఠాధిపతిలు మరియు ఆచార్యుల ద్వారా భ్రమిత శ్రద్ధాలులు తీర్థాలు మరియు ధామాలకి ఆత్మకళ్యాణార్థము పోతారు. శ్రీ అమరనాథ్ గారి యాత్రకి వెళ్లిన శ్రద్ధాలులు మూడు నాలుగు సార్లు మంచు తుఫానులో పడి మృత్యువుని పొందిరి. ప్రతిసారి చనిపోవువారి సంఖ్య వేలల్లో ఉండెది. విచారించతగిన విషయం ఏమిటంటే ఒకవేళ శ్రీ అమర్‌నాథ్ గారి దర్శనం మరియు పూజ లాభదాయకం అయితే భగవాన్ శివ ఆ శ్రద్ధాలులని రక్షించేవారు కాదా? అనగా శివుడు కూడ శాస్త్ర విరుద్ధ సాధన వలన అప్రసన్నులు అవుతారు.

## "వైష్ణో దేవి మందిరం యొక్క స్థాపన ఏలా జరిగింది?"

సతీ దేవి (ఉమా దేవి) ఏపుడైతే తన తండ్రి రాజా దక్షుడి హవన గుండంలో దూకడం వలన కాలిపోయి మృత్యువుని పొందుతుంది. భగవాన్ శివుడు ఆమె అస్థికల అస్థిపంజరాన్ని మోహవశంలో సతీ దేవి (పార్వతి దేవి) గా భావించి పది వేల సంవత్సరాలు తన భుజాలపై మోయుచు పిచ్చివాడిలా తిరుగుచు ఉండిరి. భగవాన్ విష్ణువు సుదర్శన చక్రంతో సతీ దేవి అస్థిపంజరాన్ని ముక్కలు ముక్కలుగా చేసిరి. ఎక్కడైతే మొండెము పడిందో దానిని అక్కడె భూమిలో పాతి పెట్టిరి. ఈ ధార్మిక సంఘటన గుర్తుండెలా దాని పైన ఒక మందిరంలాంటి జ్ఞాపకచిహ్నాంను నిర్మించడం జరిగింది, ఎందుకంటే రాబోవు సమయంలో ఎవరైన పురాణాలలో చెప్పింది తప్పు అని అనకుండా ఉండటానికి. ఆ మందిరంలో ఒక స్త్రీ యొక్క చిత్ర పటం ఉంచిరి ఆమెను వైష్ణో దేవి అనసాగిరి. దాని సుచి శుభ్రతకై మరియు వచ్చు శ్రద్ధాలులకి ఆ స్థాన మహిమని చెప్పడానికి ఒక మంచి వ్యక్తి నియమించిరి. అతనికి అన్య ధార్యిక వ్యక్తులు కొంత వేతనం ఇచ్చెవారు. తరువాత అతని వంశస్థులు దానం తీసుకొవడం మొదలుపెట్టిరి మరియు అనిరి ఒక వ్యక్తి యొక్క వ్యాపారం దివాలా తీసింది, అతను మాతాకి వంద రూపాయలు సంకల్పించాడు, ఒక కొబ్బరికాయ సమర్పించాడు. అతడు చాలా ధనవంతుడు అయ్యాడు. ఒక సంతానం లేని దంపతులు ఉండిరి, వారు మాతాకి రెండు వందల రూపాయలు, ఒక చీర, ఒక బంగారు మెడలోని హారం సమర్పించు సంకల్పం చేసిరి. వారికి కొడుకు ప్రాప్తించినాడు.

ఈ విధంగా అమాయకపు ఆత్మలు ఈ కల్పిత కథలపై ఆధారితమై తమ పవిత్ర గీతా మరియు పవిత్ర వేదాలని మరిచిపోయారు. అందులో ఈ అన్ని సాధనలు శాస్త్రవిధి రహితమైనవి అని రాసి ఉంది. దానివలన ఏ సుఖం లభించదు, ఏ కార్యం సిద్ధించదు, ఏ పరమగతి అనగా ముక్తి లభించదు. (గీతా అధ్యాయం. 16 శ్లోకం 23-24) ఈ విధంగా ఏక్కడైతే సతీ దేవి యొక్క కన్ను పడిందో అక్కడ నైనా దేవి మందిరం ఏర్పడింది. ఎక్కడైతే నాలుక పడిందో అక్కడ శ్రీ జ్వాలా దేవి మందిరం మరియు ఎక్కడైతే మొండెము పడిందో అక్కడ వైష్ణోదేవి మందిరం యొక్క స్థాపన జరిగింది.

## "పూరిలో శ్రీ జగ్గనాథ మందిరం అనగా ధామం ఏలా ఏర్పడింది?"

ఓడిశా ప్రాంతంలో ఒక ఇంద్రదమన్ అను పేరుకల రాజు ఉండెవాడు. ఆయన భగవాన్ శ్రీ కృష్ణుడి పరమ భక్తుడు. ఒక రాత్రి శ్రీ కృష్ణుడు రాజుకి కలలో కనిపించి జగ్గనాథ్ నామంతో నాకు ఒక గుడిని కట్టించు అని అంటాడు. శ్రీ కృష్ణుడు ఇంకయు అంటాడు– ఈ మందిరంలో మూర్తి పూజ చేయకూడదు. కేవలం ఒక సంత్‌ని నియమించాలి అతడు దర్శించువారికి గీతా అనుసారంగా జ్ఞానాన్ని ప్రచారం చేస్తాడు. సముద్రం ఒడ్డుపై, ఎక్కడైతే మందిరం నిర్మించాలో ఆ స్థానాన్ని కూడ చూపిస్తాడు. పొద్దున లేచి రాజా ఇంద్రదమన్ తన భార్యకు చెబుతాడు. కలలో భగవాన్ శ్రీ కృష్ణుడు కనిపించారు. గుడి కట్టాలి అని చెప్పినారు. రాణి అంటుంది శుభ కార్యంకు ఆలస్యం ఏందుకు? సర్వ సంపద ఆయన ద్వారానే ఇవ్వబడింది. ఆయనకి సమర్పించడానికి ఇంకా ఏం ఆలోచించాలి? రాజుగారు శ్రీ కృష్ణుడు సూచించిన స్థానంలోనే మందిరంను కట్టించిరి. మందిరం పూర్తి అయిన తరువాత సముద్రం నుండి తుఫాను లేచి, గుడిని కూల్చేస్తుంది. అక్కడ ఒక గుడి ఉండెను అను గుర్తు లేకుండా తూఫాను తుడిచిపెడ్తుంది. ఈ విధంగా రాజుగారు ఐదు సార్లు మందిరాన్ని కట్టిస్తారు. ఐదు సార్లు సముద్రుడు మందిరాన్ని తుడిచేస్తాడు.

రాజు ఇక మందిరాన్ని నిర్మించకూడదని నిర్ణయించుకుంటాడు. ఈ సముద్రం నాతో ఏ జన్మ వైరంను తీర్చుకుంటుందో అని ఆలోచిస్తాడు. భాండాగారం కూడ అయిపోతుంది, మందిరం కట్టబడలేదు. కొంత సమయం తరువాత పూర్ణ పరమేశ్వర్ (కవిర్దేవ్) జ్యోతినిరంజన్ (కాల్) కి ఇచ్చిన మాట ప్రకారం రాజా ఇంద్రదమన్ దగ్గరికి వస్తారు మరియు రాజుతో అంటారు రాజా! మీరు మందిరాన్ని నిర్మించండి. ఇప్పటినుండి సముద్రం మందిరాన్ని కూల్చివేయదు. రాజుగారు అంటారు సంత్ గారు! నాకు విశ్వాసం లేదు. నేను శ్రీ కృష్ణుడి ఆదేశంతో మందిరాన్ని నిర్మిస్తున్నాను. శ్రీ కృష్ణుడు సముద్రాన్ని ఆపలేకపోతున్నారు. భగవంతుడు ఏమైనా నన్ను పరీక్షిస్తునాడా అని భావించి , ఐదు సార్లు మందిరాన్ని కట్టించితిని. కానీ ఇపుడు పరీక్ష ఇవ్వడానికి కూడ యోగ్యత లేకుండా అయినాను ఎందుకంటే ద్రవ్యం కూడ అయిపోయింది. ఇక మందిరం నిర్మించడం నావలన కానీ విషయం. పరమేశ్వర్ అంటారు ఇంద్రదమన్! ఏ పరమేశ్వరుడైతే ఈ సర్వబ్రహ్మాండాలని రచించినారో , అతడే అన్ని కార్యములు చేయుటలో సిద్దుడు, వేరే ప్రభువులు కాదు. నేను ఆ పరమేశ్వరుడి వచన శక్తిని కలిగి ఉన్నాను. నేను సముద్రంను ఆపగలను. (వారిని వారే దాచుకుంటు సంత్‌గా చెప్పుచుండిరి). రాజు అంటాడు సంత్‌గారు! నేను అంగీకరిచలేను శ్రీ కృష్ణుడు కంటే కూడ ఎదో ప్రభల శక్తియుక్తమైన ప్రభువు ఇంకొకరు ఉన్నారని, వారే సముద్రుడిని ఆపలేకపోయారు. మీరు ఏ పొలంలో పండిన గింజ అవుతారు. నాకు విశ్వాసం లేదు మరియు నా విత్తియ స్థితి కూడ గుడి కట్టెవిధంగా లేదు.సంత్ రూపంలో వచ్చిన కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) అంటారు రాజన్! ఒకవేళ మీకు మందిరాన్ని నిర్మించాలి అని అనిపిస్తే నా వద్దకు రండి నేను ఫలానా స్థానంలో ఉంటాను. ఇక పై సముద్రం మందిరాన్ని కూల్చలేదు అని చెప్పి ప్రభు వెళ్ళిపోతారు.

అదే రాత్రి ప్రభువు శ్రీ కృష్ణుడు మరల రాజుకి దర్శనం ఇస్తారు మరియు అంటారు ఇంద్రదమన్! ఒకసారి మరల మందిరాన్ని నిర్మించండి. ఏ సంత్ ఐతే నీ దగ్గరికి వచ్చినారో ఆయనని సంప్రదించి సహాయాన్ని అర్థించు. అతడు అలాంటి-ఇలాంటి సంత్ కాదు. అతడి భక్తి శక్తికి అంతమే లేదు.

రాజా ఇంద్రదమన్ నిద్ర నుండి మేల్కొంటాడు, స్వప్నంలో జరిగిన పూర్తి వృత్తాంతాన్ని రాణికి చెబుతాడు. రాణి అంటుంది ప్రభువు చెబుతున్నారు కావున మీరు తప్పుకోకండి. మందిరాన్ని మరల నిర్మించండి. రాణి యొక్క సద్భావన యుక్త వాణిని విని రాజు అంటాడు మన భాండాగారం ఖాళీ అయ్యింది. ఒకవేళ మందిరాన్ని కట్టకపోతే ప్రభువు అప్రసన్నులౌతారు. నేను ధర్మ సంకటంలో ఇరికి పోయాను. రాణి అంటుంది నా వద్ద ఆభరణాలు కలవు. వాటితో సులువుగా మందిర నిర్మాణం అయిపోతుంది. మీరు ఈ ఆభరణాలు తీసుకోండి మరియు ప్రభువు యొక్క ఆదేశాన్ని పాలించండి అని అంటునే రాణి తన అన్ని నగలని, ఏవైతే ఇంట్లో కలవో మరియు తను ధరించినవి అన్ని తీసి ప్రభువు కోసం తన భర్త యొక్క చరణాలలో సమర్పిస్తుంది. రాజా ఇంద్రదమన్ పరమేశ్వరుడి (సంత్) దగ్గరికి వెళ్తారు. కబీర్ ప్రభువు అనగా అపరిచిత్ సంత్‌ని వెదికి సముద్రుడిని ఆపవలిసిందిగా ప్రార్థన చేస్తారు. ప్రభు కబీర్ అంటారు ఏ వైపు నుండి ఐతే సముద్రం లేచి వస్తుందో, అక్కడ సముద్రపు ఒడ్డున ఒక వేదిక (చబుతరా) ఏర్పాటు చేయండి. దానిపై కూర్చొని నేను ప్రభువు యొక్క భక్తి చేస్తాను మరియు సముద్రాన్ని ఆపుతాను. రాజు ఒక పెద్ద రాయిని కర్మచారులతో వేదికలాగా తయారుచేయిస్తాడు. పరమేశ్వర్ కబీర్ దానిపై కూర్చుంటారు. ఆరవ సారి మందిరం నిర్మించడం ప్రారంభమవుతుంది. ఆ సమయంలోనే ఒక నాథ్ సాంప్రదాయం యొక్క సిద్ధ మహాత్ముడు వస్తారు. నాథ్‌జీ అంటారు రాజా! చాలా మంచి మందిరాన్ని నిర్మిస్తున్నారు. ఇందులో మూర్తికూడ స్థాపించాలి.మూర్తి లేకుండా మందిరం ఏలా? ఇది నా ఆదేశం. రాజా ఇంద్రదమన్ చేతులు జోడించి అంటాడు నాథ్‌జీ ప్రభు శ్రీ కృష్ణుడు నాకు కలలో దర్శనం ఇచ్చి మందిరం నిర్మించు అని ఆదేశించారు మరియు ఈ మందిరంలో మూర్తిపూజ ఉండకూడదు, మరియు పాఖండ (కల్పిత) పూజ ఉండకూడదు అని చెప్పినారు. రాజు మాటలు విని నాథ్‌జీ అంటారు కల కూడ నిజమవుతుందా. నా ఆదేశం యొక్క పాలన చేయండి మరియు చందనం యొక్క కట్టెతో చేసిన మూర్తిలను తప్పక ప్రతిష్ఠింప చేయండి. ఇది చెప్పి నాథ్‌జీ నీళ్లు తాగకనే లేచి పోయిరి. రాజా భయంవలన చందనం యొక్క కట్టెను తెప్పిస్తారు మరియు కర్మచారులని మూర్తి తయారుచేయవల్సిందిగా ఆదేశిస్తారు. ఒక మూర్తి శ్రీ కృష్ణుడిది స్థాపించాల్సిందిగా నాథ్‌జీ ఆదేశం ఇచ్చి యుండిరి. మిగత గురువులు-సంత్‌లు రాజగారికి సలహా ఇస్తారు ఒంటరిగా ప్రభువు ఏలా ఉంటారు? వారు ఏల్లపుడు శ్రీ బలరాముడితో ఉండేవారు. ఒకరన్నారు సోదరి సుభద్ర కూడ భగవాన్ శ్రీ కృష్ణుడి ముద్దుల చెల్లెలు. ఆమె తన సోదరుడు లేకుండా ఏలా ఉంటుంది? మూడు మూర్తిలు తయారు చేయు నిర్ణయం తీసుకునిరి. ముగ్గురు పనివారిని నియమించిరి. మూర్తిలు తయారుకాగానే ముక్కలు ముక్కలు అయినాయి.



పరమేశ్వర్ కబీర్ గారు జగన్నాథ మందిరం మింగకుండా సముద్రం బారి నుండి రక్షించుట

ఈ విధంగ మూడు సార్లు మూర్తిలు ఖండితమయ్యాయి. రాజు చాలా చింతితులైరి. నా భాగ్యంలో ఈ యషస్సు మరియు పుణ్యకర్మం లేదు అని ఆలోచించిరి. మందిరం నిర్మిస్తే అది కూల్చబడుతుంది. ఇపుడు మూర్తిలు విరిగిపోతున్నవి. నాథ్‌జీ గారు అలిగి పోయినారు. ఒకవేళ మూర్తిలు విరిగిపోతున్నవి అని చెబితే, వారు నేను ఎక్కడ అబద్ధం చేబుతున్నానని భావించి, నాకు శాపం ఇవ్వరు కదా! చింతాగ్రస్తుడైన రాజు అన్నం తినలేకపోతుండెను, రాత్రి నిద్రించలేకుండెను. ఉదయం కంగారు పడుతు రాజదరబారుకి వస్తారు. అదే సమయంలో పూర్ణ పరమాత్మా కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) ఒక 80 ఏళ్ళ కర్మచారి (పనివాని) రూపం ధరించి రాజదరబారులో ఉపస్థితులైరి. నడుము పై ఒక సంచి వ్రేలాడి ఉండింది. అందులో పనిముట్లు బయటకు స్పష్టంగా కనిపిస్తున్నవి, భావించండి ఏవరు చెప్పకుండా ఆయన ఒక పనివాడని పరిచయం ఇస్తున్నట్లు. మరియు మిగత ఉలి మరియు బర్మా మొ॥నవి సంచిలో ఉండినవి. పనివాని వేషంలోకల ప్రభువు రాజుగారితో అంటారు నేను విని ఉన్నాను ప్రభువు మందిరం కోసం తయారుచేయు మూర్తులు పూర్తిగా తయారు అవడం లేదు అని. నేను 80 సం॥ల వృద్ధుడను మరియు నాకు 60 సం॥ల అనుభవం ఉంది. చందనం కట్టెతో మూర్తి ఒక ప్రత్యేకమైన కర్మచారియే చేయగలడు. ఒకవేళ మీరు ఆజ్ఞని ఇస్తే ఈ సేవకుడు చేయగలడు. రాజు అంటారు కర్మచారి! మీరు నా కోసమే దేవుడు పంపించిన పనివాడిగా అనిపిస్తున్నారు. నేను చాలా చింతితుడనై ఉంటిని. ఏవరైన అనుభవం కల కర్మచారి దొరికితే సమస్యకి సమాధానం దొరుకుతుంది అని ఆలోచించితిని. మీరు శీఘ్రంగా మూర్తిలను తయారు చేయండి. వృద్ధరూపంలో వచ్చిన కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) అంటారు రాజన్! నాకు ఒక గదిని ఇవ్వండి. అందులో కూర్చుండి ప్రభువు మూర్తి తయారు చేస్తాను. నేను లోపలినుండి తలుపును మూసి స్వచ్ఛతతో మూర్తిని తయారుచేస్తాను. ఈ మూర్తిలు ఏప్పుడైతే తయారు అవుతాయో అపుడు తలపు తెరుచుకుంటుంది. ఒకవేళ మధ్యలో ఏవరైన తెరిచితే ఏంతవరకైతే మూర్తిలు తయారు అవుతాయో అంతయే ఉండిపోతాయి. రాజు అంటారు మీరు ఏలా ఉచితంగా భావిస్తారో అలానే చేయండి.

పన్నెండు రోజులు మూర్తిలు తయారుచేస్తు అయినాకా నాథ్‌జీ వస్తారు. నాథ్‌జీ రాజా ఇంద్రమన్‌ని అడుగుతారు మూర్తులు తయారు అయినాయా అని? రాజు చేతులు జోడించి అంటారు మీ ఆజ్ఞని శిరసావహించితిమి మహాత్మ కానీ నా దుర్భాగ్యం ఏమిటో మూర్తిలు తయారు అయ్యేవి కావు. సగం తయారుకాగానే ముక్కలు అయ్యేవి. పనివాళ్లతో మూర్తిల యొక్క విరిగిన ముక్కలను తెప్పించి నాథ్‌జీ గారికి విశ్వాసం కలిగించడానికి చూపించిరి. నాథ్‌జీ అంటారు మూర్తి తప్పక తయారుచేయాలి. ఇపుడు తయారుచేయండి నేను చూస్తాను మూర్తి ఏలా విరుగుతుందో. రాజా అంటారు నాథ్‌జీ! మూర్తిలు చేయడానికి ప్రయత్నం జరుగుచున్నది. ప్రభు ద్వారా పంపబడిన ఒక అనుభవి 80 ఏళ్ల కర్మచారి మూసి ఉన్న గదిలో మూర్తిలు తయారు చేస్తున్నాడు. మూర్తిలు తయారు అవగానే తనకు తానుగా ద్వారాలు తెరచుకుంటాయి అని చెప్పినాడు. ఒకవేళ ఏవరైన మధ్యలోనే తెరుస్తే మూర్తిలు ఏంతవరకు తయారు అయినాయో అంతవరకె ఉంటాయి అని చెప్పినాడు. ఈ

రోజు వరకి మూర్తిలు చేస్తు పన్నెండు రోజులు అయ్యింది. ఇప్పటివరకు ఆయన బయటికి రాలేదు , నీళ్లు తాగలేదు మరియు ఆహారం తినలేదు. నాథ్‌జీ అంటారు మూర్తిలు చూడాల్సిందే. ఏలా తయారు చేస్తున్నాడో? తయారైన తరువాత చూడటం ఏమిటి? మంచిగా తయారుకానట్టయితే మంచిగా తయారు చేయిద్దాం. ఇలా అంటూ నాథ్‌జీ ఇంద్రదమన్‌ని తీసుకుని ఆ గది దగ్గరికి వెళ్తారు మరియు కర్మచారి తలుపు తెరవండి అని పిలుస్తారు. చాలా సార్లు పిలుస్తారు, కానీ ద్వారం తెరవబడదు మరియు టక్ టక్ అని వచ్చు శబ్దం కూడ ఆగిపోతుంది. నాథ్‌జీ అంటారు 80 ఏళ్ల ముసలాయన అని అంటున్నారు, పన్నెండు రోజులు అన్నం నీళ్లు తీసుకోనలేదు, ఇపుడు శబ్దం కూడా ఆగిపోయింది. ఒకవేళ ఆయన చనిపోయి ఉంటే, తలుపులు పగులకొడతారు. చూస్తే మూడు మూర్తిలు ఉన్నవి. మూడింటి కాళ్ల మరియు చేతుల పంజాలు (పాదం మరియు అరచేతి) తయారుకాలేదు. కర్మచారి అంతర్ధ్యానం అయిపోతారు (అదృశ్యమవుతారు).

మందిరం నిర్మించబడింది మరియు వేరే మార్గం ఏమి కనిపించనందున తన మొండి పట్టుదలతో నాథ్‌జీ అంటారు ఈ మూర్తిలనే ప్రతిష్టించండి, బహుశా ప్రభువుకి ఇవే స్వీకారమై ఉన్నవి, శ్రీ కృష్ణుడు స్వయం మూర్తిలు తయారుచేసి వెళ్లినారు అని అనిపిస్తుంది.

ఆస్థాన ముఖ్య పండితుడు శుభ మూహుర్తం సూచించి తరువత రోజునే మూర్తిలు ప్రతిష్టించుటకు నిర్ణయించిరి. అందరు పండితులు మరియు ముఖ్య పండితుడు మరియు రాజు మరియు సైనికులు మరియు శ్రద్ధాలులు మూర్తి ప్రాణ ప్రతిష్ట చేయదానికి బయలుదేరిరి. పూర్ణ పరమేశ్వర్ (కవిర్దేవ్) ఒక శుద్రుడి రూపాన్ని ధరించి మందిరం యొక్క ముఖ్య ద్వారంకి మధ్యన మందిరం వైపుగా ముఖం చేసి నిలబడిరి. ఎటువంటి లీలా చేస్తున్నారంటే అనుకోండి వారికి అసలు జ్ఞానమే లేదు వారి వెనుక వైపు నుండి ప్రభు ప్రాణ స్థాపన చేయు సేనా వస్తుంది అని. అందరికంటే ముందు ముఖ్య పండితుడు నడుస్తుండెను. పరమేశ్వరులు అయిన ద్వార మధ్యలోనే నిలబడి ఉండిరి. దగ్గరకు వచ్చినాకా ముఖ్య పండితుడు శుద్ర రూపంలో నిలబడిన పరమేశ్వరుడిని తోసివేస్తాడు. పరమేశ్వరులు దూరంగా పడిపోయిరి మరియు ఏకాంత స్థానంపై శుద్ర లీలా చేస్తు కూర్చుండిరి. రాజాతో పాటుగా సర్వ శ్రద్ధాలులు మందిరంలోకి వెళ్లి చూస్తే అన్ని మూర్తిలు ఆ ద్వారంపై నిలబడిన శుద్ర రూపి పరమేశ్వరుడి రూపాన్ని ధరించి ఉన్నవి. ఈ అద్భుతాన్ని చూసి ఉపస్థితులైన వ్యక్తులు ఆశ్చర్యచకితులైరి. ముఖ్య పండితుడు అంటున్నాడు ప్రభు అశుద్ధులైనారు, ఎందుకంటే ముఖ్యద్వారాన్ని శుద్రుడు అశుద్ధం చేసినాడు. అందువలనే మూర్తిలు అన్ని శుద్ర రూపాన్ని ధరించినవి. చాలా పెద్ద అరిష్టం జరిగింది. కొంత సమయం తరువాత మూర్తిలు వాస్తవిక రూపంలోకి మారాయి. గంగా జలంతో చాలా సార్లు స్వచ్ఛం చేసి ప్రాణ ప్రతిష్ట చేసిరి (కవిర్దేవులు అంటారు అజ్ఞానత వలన మరియు మోసపూరిత పండితుల వాదం యొక్క సరిహద్దుని చూడండి. కర్మచారి మూర్తిని తయారుచేస్తాడు. పిదప పూజారి లేదా అన్య సంత్ ఆ మూర్తిరూపి ప్రభువులో ప్రాణంను నింపుతాడు అనగా ప్రభువుకి జీవాన్ని ప్రసాదిస్తాడు. అపుడు ఆ మన్ను లేదా చెక్కతో చేసిన ప్రభువు కార్యసిద్ది చేస్తాడు. వారెవ్వా!

పండితులారా చాలా మూర్ఖులని చేశారు ప్రభువు ప్రేమి ఆత్మలని.

మూర్తి ప్రతిష్టితం చేసిన కొన్ని రోజుల తరువాత సుమారు 40 అడుగుల ఎత్తుతో సముద్ర జలం పైకి లేచింది దానిని సముద్రపు తుఫాను అంటారు మరియు చాలా వేగంగా మందిరం వైపుకు రాసాగింది. ఎదుట కబీర్ పరమేశ్వర్ (కవిర్దేవ్) వేదిక పై కూర్చొని ఉండిరి. తన ఒక చేతిని లేపుతారు ఆశీర్వాదం ఇస్తున్నట్లు, లేచిన సముద్రం లేచినట్టు ఉండిపోయింది మరియు పర్వతం లాగా ఉండిపోయింది. ముందుకు రాలేకపోయింది. విప్ర రూపాన్ని ధరించి సముద్రుడు వస్తాడు మరియు వేదిక పై కూర్చొనిన ప్రభువుతో అంటాడు భగవాన్! మీరు నాకు దారిని ఇవ్వండి, నేను మందిరాన్ని కూల్చడానికి వెళ్ళాలి. ప్రభు అంటారు ఇది మందిరం కాదు. ఇది ఒక ఆశ్రమం (మహల్). ఇందులో ఒక విద్వాన్ పురుష్ ఉంటాడు మరియు పవిత్ర గీతా యొక్క జ్ఞానాన్ని ఇస్తు ఉంటాడు. మీకు దీనిని కూల్చడం శోభనివ్వదు. సముద్రుడు అంటాడు నేను దీనిని తప్పకుండా కూల్చుతాను. ప్రభువు అంటారు వెళ్లు ఏవరు ఆపుతారు? సముద్రుడు అంటాడు నేను వివశుడనై (చేతకానీ) ఉన్నాను. మీ శక్తి అపారమై ఉంది. నాకు దారిని ఇవ్వండి ప్రభువు. పరమేశ్వర్ కబీర్ సాహెబ్ అడుగుతారు మీరు ఇలా ఎందుకు చేస్తున్నారు?అని. సముద్రుడు అంటాడు ఈ శ్రీ కృష్ణుడు త్రేతాయుగంలో శ్రీ రామచంద్రుడి రూపంలో వచ్చియుండిరి. అపుడు ఈయన నాకు అగ్ని బాణాన్ని చూపి చెడుగా మాట్లాడి అవమానితులుగా చేసి దారిని అడిగినారు. నేను ఆ వైరాన్ని (పగని) తీర్చుకోవడానికి వెళ్తున్నాను.

పరమేశ్వరుడు అంటారు మీరు పగని ముందుగా తీర్చుకుని ఉండినారు. మీరు ద్వారికని ముంచి ఉంచినారు. సముద్రుడు అంటాడు ఇప్పటికి పూర్తిగా ముంచలేకపోయాను, సగం ఉన్నది. అపుడు కూడ ఎదో బలమైన శక్తి యుక్త సంత్ ఎదుటకు వచ్చి యుండెను. అందువలనే పూర్ణ రూపంలో ద్వారికని మూంచలేక పోయాను. ఇప్పటికి ప్రయత్నం చేస్తాను కానీ వెళ్లలేక పోతున్నాను. అటు వైపు నన్ను కట్టి పడేసినారు.

అపుడు కబీర్ పరమేశ్వరుడు (కవిర్దేవ్) అంటారు అక్కడికి కూడ నేనే వచ్చియుంటిని. నేనే ఆ అవశేషాన్ని కాపాడి ఉంటిని. ఇపుడు వెళ్లు ఆ శేషంగా మిగిలిన ద్వారికని కూడ ముంచి వేయ్. కానీ ఆ జ్ఞాపక చిహ్నంను వదిలేయ్. ఎక్కడైతే శ్రీ కృష్ణుడి శరీరం యొక్క అంతిమ సంస్కారం జరిగి ఉండింది. (శ్రీ కృష్ణుడి అంతిమ సంస్కారం జరిగిన స్థలంపై చాలా పెద్ద మందిరం కట్టబడినది. ఈ జ్ఞాపక చిహ్నం ఒక ప్రమాణంగా వాస్తవంలో శ్రీ కృష్ణుడి మృత్యువు జరిగింది అని తెలుపుతుంది మరియు పంచ భౌతిక శరీరాన్ని విడిచి ఉండిరి, లేదంటే రాబోవు కాలంలో అంటారు శ్రీ కృష్ణుడు మరణించలేదు అని). ఆజ్ఞని పొంది శేష ద్వారికని కూడ సముద్రుడు మూంచేస్తాడు. పరమేశ్వర్ అంటారు ఇపుడు మరియు ఇంకెపుడు కూడ ఈ జగ్గనాథ్ మందిరాన్ని కూల్చడానికి ప్రయత్నం చేయకూడదు మరియు ఈ ఆశ్రమం నుండి దూరంగా వెళ్లిపో. ఈ ప్రభు ఆజ్ఞని అంగీకరించి ప్రమాణం (ప్రతిజ్ఞ) చేసి మందిరం నుండి దూరంగా రెండున్నర కిలోమీటర్లు వెళ్లిపోయాడు. ఈ విధంగా శ్రీ జగన్నాథ మందిరం అనగా ధామం స్థాపించబడినది.

## "శ్రీ జగన్నాథ మందిరంలో ముట్టుడు(అంటరానితనం)ప్రారంభం నుండి లేదు"

కొన్ని రోజుల తరువాత ఏ ముఖ్య పండితుడైతే కబీర్‌ని శుద్ర రూపంలో ఉన్నపుడు త్రోసివేస్తారో అతడికి కుష్టురోగం వస్తుంది. అన్ని ఔషదాలు వాడినా తరువాత కూడ ఆరోగ్యం పొందలేదు. కుష్టు రోగం యొక్క బాద ఎక్కువ అవుతునే ఉంటుంది. అన్ని ఉపాసనలు చేసిరి, శ్రీ జగన్నాథుడి వద్ద ఏడ్చి-ఏడ్చి సంకట నివారణకై ప్రార్థించిరి. కానీ అన్ని నిష్పలమైనవి. స్వప్నంలో శ్రీ కృష్ణుడు దర్శనం ఇచ్చి హే పాండే! ఆ సంత్ యొక్క చరణాలని కడిగి చరణామృతాన్ని పానం (త్రాగు) చేయ్, ఏవరినైతే నీవు మందిరంలో ముఖ్య ద్వారం వద్ద తోసినావు. ఆయన ఆశీర్వాదంతో నీ కుష్టు రోగం మంచిగా అవగలదు. ఒకవేళ ఆయన నిన్ను హృదయంతో క్షమిస్తే, లేదంటే కాదు. చావు మీదికి వచ్చాకా ఎందుకు చేయరు? ఆ ముఖ్య పండితుడు పొద్దునే లేచాడు. తన తోటి పండితులని తోడుగా తీసుకుని ఆ స్థానంకు వెళ్లినారు ఎక్కడైతే ప్రభు కబీర్ శుద్ర రూపంలో విరాజితులై ఉండినారు. పండితుడు ప్రభువుకి దగ్గరికి రాగానే ప్రభు కబీర్ లేచి నడవసాగిరి మరియు అనిరి పండితుడా! నేనైతే అంటరానివాడిని, నా నుండి దూరంగా ఉండండి, మీరు అపవిత్రులు అవుతారు. పండితుడు దగ్గరగా వస్తాడు, పరమేశ్వరుడు ఇంకా దూరం పోతారు. అపుడు పండితుడు వెక్కి వెక్కి ఏడవసాగాడు మరియు అంటాడు హే పరవర్‌దిగార్ ! నా దోషాన్ని క్షమించండి. అపుడు దయాళు ప్రభువు ఆగిరి. పండితుడు ఆదరణతో ఒక స్వచ్ఛమైన వస్త్రాన్ని నేలపై పరచి ప్రభువును కూర్చొమని ప్రార్థన చేసిరి. ప్రభువు ఆ వస్త్రంపై కూర్చోనిరి. అపుడు ఆ పండితుడు స్వయంగా చరణాలని కడిగిరి మరియు ఆ చరణామృతాన్ని ఒక పాత్రలో నింపుకునిరి. ప్రభువు కబీర్ అన్నారు పండితుడా నలభై రోజులు వరకు వీటిని తాగు మరియు స్నానం చేయు జలంలో కొంచం వేసి స్నానం చేస్తు ఉండు. నలభైవ రోజున నీ కుష్టు రోగం సమాప్తం అవుతుంది. భవిష్యత్తులో కూడ ఈ జగన్నాథ మందిరంలో ఏవరైన అంటరాని తనంను పాటిస్తే వారికి కూడ దండన దొరుకుతుంది. ఉపస్థితులైన అందరు వచనం చేసిరి నేటి నుండి ఈ పవిత్ర స్థానంపై ఏవరు కూడ ముట్టుడు (అంటరానితనం) పాటించరు అనగా అందరూ సమానులే.

విచారం చేయండి:- హిందూస్తానంలో ఒకే మందిరం ఉంది దేనిలోనైతే ప్రారంభంనుండి ముట్టుడు వంటి దురాచారం లేదు.

ఈ దాసుడికి కూడ ఆ స్థానాన్ని చూచు అవకాశం లభించింది. కొంత మంది సేవకులతో కలిసి ఆ స్థలంను చూడడానికి వెళ్తిని ఏమైన ప్రమాణాలు లభిస్తాయి అని. అక్కడ అన్ని ప్రమాణాలు నేటికి సాక్షంగా దొరికినవి. ఏ రాయి పై కూర్చుని కబీర్ పరమేశ్వర్ మందిరాన్ని కాపాడటానికి సముద్రాన్ని ఆపినారో అది నేటికి విరాజితమై ఉంది. దానిపైన జ్ఞాపకార్థ రూపంలో గోపురం తయారు చేయబడింది. అక్కడ చాలా పురాతన మహన్త (రక్షించు) సాంప్రదాయక ఆశ్రమం కూడ విద్యామానమై ఉంది. అక్కడ సుమారు 70

సం॥ల ముసలి (మహన్త) రక్షకుడి నుండి మందిరంను సముద్రం నుండి కాపాడు విషయం గురించి అడగగా ఆయన కూడ పై విషయమే చెప్పిరి మరియు వారి పూర్వీకులు చాలా తరాలనుండి ఇక్కడ రక్షకులుగా ఉండిరి. ఇక్కడనే శ్రీ ధర్మదాస్ సాహెబ్ మరియు ఆయన భార్య భక్తిమతి ఆమని దేవి శరీరాన్ని త్యాగం చేసిరి. ఇద్దరు సమాధులు పక్కపక్కనే కనిపించినవి.

తరువాత మేము జగన్నాథ మందిరంకు వెళ్లితిమి. అక్కడ మూర్తిపూజ ఇప్పటికి లేదు. కానీ దర్శనం చేయనిస్తారు.

మూడు మూర్తిలు భగవాన్ శ్రీ కృష్ణుడు మరియు శ్రీ బలరాం మరియు సోదరి సుభద్ర, ఏవైతే మందిరం లోపల స్థాపించినారో వాటి రెండు చేతులకి అరచేతిలు లేవు, రెండు చేతులు భౌతికంగా బాగాలేవు. ఆ మూర్తిల పూజ జరుగదు, కేవలం దర్శనార్థం ఉంచిరి. అక్కడ కల ఒక పండితుడిని (గాయిడ్) అడిగిరి మేము విని ఉన్నాం ఈ మందిరాన్ని ఐదు సార్లు సముద్రం కూల్చివేసింది అని, మరల కట్టబడినది, అసలు సముద్రం ఎందుకు కూల్చివేసంది? తరువాత సముద్రంను ఎవరు ఆపారు? పండితుడు అన్నాడు ఇంతయు నాకు తెలియదు ఈ దయఅంతా శ్రీ జగన్నాథుడిదే, వారె సముద్రాన్ని ఆపిరి, సముద్రం మూడు సార్లు మందిరాన్ని కూల్చివేసింది అని నేను విని యున్నాను. నేను మరల ప్రశ్నించాను మొదటి సారే ప్రభువు సముద్రంను ఎందుకు ఆపలేదు? పండితుడు అంతా లీల జనన్నాథుడిదే అని సమాధానం ఇచ్చినాడు.

నేను మరల అడిగాను ఈ మందిరంలో ముట్టుడు ఉందా లేదా అని. అతడు అన్నాడు ఏప్పటినుండి మందిరం నిర్మించబడినదో అప్పటినుండి ముట్టుడు లేదు. మందిరంలో శుద్ర మరియు పండితుడు ఒక పల్లెం లేదా పంక్తి లో భోజనం చేయగలరు. ఏవరు కాదనటానికి వీలు లేదు. నేను ప్రశ్నించాను పండితుడు గారు మిగత హిందూ మందిరాలలో మొదట చాలా ముట్టుడు ఉండింది. ఇందులో ఏందుకు లేదు? ప్రభువు ఐతే ఒక్కరే కదా! అంత జగన్నాథుడి లీలా అని సమాధానం ఇచ్చిరి పండితులు.

పుణ్యాత్ములారా విచారం చేయండి సత్ (వాస్తంను) ని ఎంతగా తొక్కెశారు. కేవలం లీలా అంతా జగన్నాథుడిది అంటూ. పవిత్ర జ్ఞాపక చిహ్నాలు ఆదరణీయాలే, కానీ ఆత్మకళ్యాణం కేవలం పవిత్ర గీతా మరియు పవిత్ర వేదాలలో వర్ణిత మరియు పరమేశ్వర్ కబీర్‌జీ ద్వారా ఇవ్వబడిన తత్వజ్ఞాన అనుసారంగా భక్తి సాధన చేయడం వలన సంభవం అవుతుంది. లేదంటే శాస్త్ర విరుద్ధమవడం వలన మానవ జీవనం వ్యర్థం అవుతుంది. ప్రమాణం గీతా అధ్యాయం **16** శ్లోకం **23-24.** శ్రీ జగన్నాథ మందిరంలో ప్రభువు ఆదేశానుసారం పవిత్ర గీతా జ్ఞానం యొక్క మహిమ యొక్క గుణగానం అవడం శ్రేయస్కరమైనది మరియు ఎలాఐతే శ్రీ మద్ భగవత్ గీతాలో భక్తి విధానం ఉందో ఆ విధంగా పార్థన చేయడం వలనే ఆత్మకళ్యాణం సంభవం, అంతేకానీ జగన్నాథుడి దర్శనంచే లేదా ప్రసాదం తినుటచే మాత్రం ఏమి లాభం కాదు. ఎందుకంటే ఈ క్రియలన్ని గీతాలో వివరించక పోవడం వలన శాస్త్ర విరుద్ధమైనవి. (ప్రమాణం గీతా అధ్యాయం **16** మ. **23-24**).

## "స్వర్గం యొక్క నిర్వచనం ఏమిటి?"

ఉదహరణ కోసం స్వర్గంను ఒక హోటల్ (రెస్టారెంట్) అనుకుందాం. ఒక ధనవంతుడు ఎండాకాలంలో సిమ్లా లేదా కులుమనాలి వంటి నగరాల చల్లని ప్రదేశాలకు వెళుతారు. అక్కడ ఏదో ఒక హోటల్ (రెస్టారెంట్) లో బస చేస్తారు. అక్కడ రూం కిరాయి మరియు తినడానికి అగు ఖర్చు చెల్లించాల్సి ఉంటుంది. రెండు లేదా మూడు నెలలో ఇరవై లేదా ముప్పై వేల రూపాయలు ఖర్చు చేసి తిరిగి తమ ఇంటికి రావల్సి ఉంటుంది. తరువాత పది నెలలు పని చేస్తారు మరల రెండు నెలలు తమ సంపాదనని ఖర్చు చేసి తిరిగి ఇంటికి వస్తారు. ఒకవేళ ఏదైన సంవత్సరంలో సంపాదన సరిగ్గా కాకుంటే ఆ రెండు నెలల సుఖం కోసం బాదపడడం జరుగుతుంది.

ఈ విధంగానే స్వర్గం అని భావించండి. ఈ పృథ్వి లోకంపై సాధన చేసి కొంత సమయం స్వర్గం రూపి హోటల్ (రెస్టారెంట్) కి వెళ్ళిపోతారు. పిదప తమ పుణ్యం యొక్క సంపాదన ఖర్చు చేసి తిరిగి నరకానికి లేదా **84** లక్షల జీవుల శరీరాల యందు కష్టం, చేసిన కర్మల ఆధారంపై అనుభవించాల్సి ఉంటుంది. ఏప్పటివరకైతే తత్త్వదర్శి సంత్ లభించదో అప్పటివరకి ఈ జన్మ మృత్యువు మరియు స్వర్గం నరకం మరియు **84** లక్షల యోనిల కష్టం అలానే ఉంటుంది. ఎందుకంటే కేవలం పూర్ణ పరమాత్మ యొక్క సతనామం మరియు సారనామమే పాపాలని నాశనం చేయగలదు. మిగతా ప్రభువుల పూజ ద్వారా పాపాలు నాశనం కావు. అన్ని కర్మల యొక్క యధార్థ ఫలం దొరుకుతుంది.

అందువలన గీతా అధ్యాయం **8** శ్లోకం **16** లో చెప్పబడినది బ్రహ్మోలోకం (మహాస్వర్గం) వరకు అన్ని లోకాలు నాశనం కలవి. ఎపుడైతే స్వర్గం - మహాస్వర్గంలే లేకపోతే అపుడు సాధకుడు ఎక్కడికి వెళ్లి ఉంటాడు, కృపతో ఆలోచించండి.

ప్రశ్న :-- గీతాని నిత్యం పఠనం చేయడం వలన ఏమి లాభం లేదా? దానాలు అనగా కుక్కలకి రోట్టెలు పెట్టుట, ఆకలిగా ఉన్నవాడికి అన్నం పెట్టుట, చీమలకి పిండి, తీర్థాలలో భోజనాలు పెట్టుట మొ॥ చేస్తారు, ఇవి కూడ వ్యర్థమైనవేనా?

సమాధానం :- ధార్మిక గ్రంథాలని పఠించడం వలన జ్ఞాన యజ్ఞ ఫలం దొరుకుతుంది. యజ్ఞం యొక్క ఫలం కొంత సమయం స్వర్గం లేదా ఏ ఉదేశ్యంతో చేశామో ఆ ఫలం లభిస్తుంది, కానీ మోక్షం లభించదు. నిత్య పఠనం యొక్క ముఖ్య కారణం ఏమిటంటే సద్గ్రంథాలలో ఏ సాధన చేయు నిర్దేశం కలదో మరియు ఏవైతే చేయకూడదని నిర్దేశం కలదో దానిని నిరంతరం గుర్తుంచుకోవడమే. ఎప్పుడైన ఏదైన తప్పు జరగకూడదని, దాని వలన మనం వాస్తవిక ఉద్దేశ్యాన్ని త్యాగం చేసి, తప్పు చేసి శాస్త్రవిధి త్యాగం చేసి మనసుకి నచ్చిన ఆచరణ మొదలు పెట్టకుండా ఉండటానికి మరియు మనుష్య జీవనం యొక్క ముఖ్య ఉద్దేశ్యం జ్ఞప్తికి ఉండటానికి. మనిషి జీవనం యొక్క మూల ఉద్దేశ్యం ఆత్మకళ్యాణమే. అది శాస్త్ర అనుకూల సాధన వలననే సంభవం. ఎలాఅంటే ఒక జమీందారుకి వృద్ధుడైనాకా పుత్రుడు కలిగినాడు. పుత్రుడు పెద్దవాడైనాకా తన పొలం పనులు చూడటానికి

యోగ్యుడవుతాడు. ఆ లోపు నేను చనిపోతే ఎలా అని ఆలోచిస్తాడు. ఇందుకోసం అతడు తన వ్యవసాయంలో తన అనుభవాన్ని రాసి పెడతారు మరియు తన కొడుకుకి చెబుతాడు. నీవు ఎపుడైతే పెద్దవాడివి అవుతావో, అపుడు పొలం పనులను అర్థం చేసుకోవడానికి నా ఈ అనుభవ లేఖని ప్రతిరోజు చదువుతు ఉండు మరియు వ్యవసాయం చేయ్. తండ్రిగారి మృత్యువు అనంతరం ఆ కొడుకు ప్రతిరోజు తండ్రి ద్వారా లిఖిత అనుభవాన్ని చదివేవాడు. కానీ ఎలాఅయితే లేఖలో రాసి ఉందో అలా చేసేవాడు కాదు. అలాఐతే ఆ వ్యవసాయదారుని కొడుకు ధనవంతుడు అవగలడా? ఎప్పటికి కాలేదు. ఎలాఐతే తన తండ్రి అనుభవాన్ని లేఖ యందు రాసినారో ఆ విధంగానే వ్యవసాయం చేయాలి.

ఈ విధంగానే పవిత్ర గీత యొక్క పఠనాన్ని శ్రద్దాలులు నిత్యం చేస్తున్నారు. కానీ సాధన సద్గ్రంథాలకు వ్యతిరేకంగా చేస్తున్నారు. ఇందువలన గీతా అధ్యాయం. **16** శ్లోకం **23-24** ప్రకారం ఈ సాధనలు వ్యర్థమైనవి.

ఎలాఐతే మూడు గుణాల (రజగుణం బ్రహ్మ, సతగుణం విష్ణు, తమోగుణం శివుడు) యొక్క పూజ గీతా అధ్యాయం. **7** శ్లోకం **12** నుంది **15** మరియు **20** నుండి **23**లో చేయకూడదు అని ఉంది. మరియు శ్రాద్ధం తీయుట అనగా పితరుల పూజ, పిండాలు పెట్టుట, పూలు (అస్థికలు) తీసుకుని గంగానదిలో కలుపుట, తోమ్మిది రోజులు, **11**దినాలు, నెల పెట్టుట, **6**నెలలు, యాదాదిమాసికం మొ॥వి. చేయట గీతా అధ్యాయం. **9** శ్లోకం **25**లో నిషేదం ఉంది. వ్రతాలు ఉండడం గీతా అధ్యాయం. **6** శ్లోకం **16**లో నిషేదం ఉంది. రాసి ఉంది హే అర్జున్ ! యోగం (భక్తి) కొంచెం కూడ తినని వారికి (వ్రతం ఉండెవారికి) సిద్ధం అవదు. అనగా వ్రతం ఉండకూడదు.

ఆకలిగోన్న వారికి అన్నం పెట్టుట, కుక్కలకి మొ॥లగు జీవజంతువులకి మరియు పశువులకి ఆహారం తినిపించుట చెడు పని కాదు, కానీ పూర్ణ సంత్ ద్వారా ఆయన ఆజ్ఞనుసారంగా దానం మరియు యజ్ఞం మొ॥లగు చేయుట పూర్ణ లాభదాయకం అవుతుంది.

ఎలాఅంటే ఒక కారులోపల యజమాని సీటులో కూర్చుని కుక్క ప్రయాణం చేస్తు ఉంటుంది. కుక్క యొక్క డ్రైవరు మనిషి ఉంటాడు. ఆ పశువుకి సామాన్య వ్యక్తి కంటే చాలా సౌకర్యాలు లభిస్తాయి. ప్రత్యేకమైన గది, ఫ్యాన్ మరియు కూలర్ మొ॥నవి.

ఏపుడైతే ఆ అమాయకపు ప్రాణి మనిషి శరీరంలో ఉండెను, దానం కూడ చేసినాడు కానీ మనసుకి నచ్చిన ఆచరణ (పూజ) ద్వారా చేయబడిన శాస్త్ర విధి నుంది విరుద్ధం అవడం వలన లాభదాయకం కాలేదు. ప్రభువు యొక్క విధానం ఉంది ఎలాంటి కర్మని ప్రాణి చేస్తాడో దాని ఫలం తప్పకుండా పొందుతాడు. ఈ విధానం ఎప్పటివరకు నడుస్తుంది అంటే ఎప్పటివరకైతే తత్వదర్శి సంత్ పూర్ణ పరమాత్మా యొక్క మార్గదర్శనం లభించదొ అప్పటివరకు.

ఎలాంటి కర్మ ప్రాణి చేస్తాడో అలాంటి ఫలమే పొందుతాడు. ఈ విధానం ప్రకారం అతడు తీర్థాలపై మరియు ధామలపై లేదా మిగతా వేరే స్థానాలపై అన్నదానం ద్వారా మరియు కుక్కలు మొ॥ వాటికి రొట్టె వేయడం అను కర్మాధారంగా అతడు కుక్క యోనిలోకి

వెళ్లిపోయాడు. అక్కడ కూడ చేసిన కర్మం దొరికింది. కుక్క యొక్క జీవితంలో తన పూర్వ జన్మలోని శుభ కర్మం యొక్క సంపాదనని సమాప్తం చేసి గాడిద యోనిలోకి వెళ్లిపోతాడు. ఆ గాడిద జీవనంలో అన్ని సౌకార్యాలు లాక్కొబడుతాయి. పూర్తి దినం మట్టి, ముక్కలు చెక్కలు ఐన ఇటుకలు మోయాలి. అటుతరువాత మిగత ప్రాణుల శరీరాలలో కష్టములను పడుతాడు మరియు నరకం కూడ అనుభవించాల్సి ఉంటుంది. 84 లక్షల యోనిల కష్టాలని అనుభవించినాకా పిదప మనుష్య శరీరం పొందుతాడు. తరువాత ఎవరికి తెలుసు భక్తి కుదురుతుందా కుదరదా అని. ధామం లేదా తీర్థాలకి వెళ్లు వారి కాళ్ల కింద లేదా ఎ బండి ద్వారా వెళ్లుతారో వాటి చక్రాల కింద ఏన్ని జీవ జంతువులు ఐతే చనిపోతాయో వాటి పాపం కూడ తీర్థాలు మరియు ధామంకు వెళ్లు యాత్రి అనుభవించాల్సి ఉంటుంది. ఎప్పటివరకైతే పూర్ణ సంత్, పూర్ణ పరమాత్మా యొక్క సత సాధనా చెప్పు, దొరకడో అప్పటివరకి పాపాలు నాశనం అవవు, ఎందుకంటే బ్రహ్మా, విష్ణు, మహేశ్, బ్రహ్మ మరియు పరబ్రహ్మ యొక్క సాధన వలన పాపాలు నాశనం (క్షమ) అవవు, పాపం మరియు పుణ్యం యొక్క ఫలం అనుభవించాల్సి ఉంటుంది. ఒకవేళ ఆ ప్రాణి గీతా జ్ఞానం అనుసారంగా పూర్ణ సంత్ యొక్క శరణుని పొంది పూర్ణ పరమాత్మా యొక్క సాధనా చేస్తే అతడు సతలోకంకు పోయేవాడు లేదా రెండవసారి మనుష్య శరీరాన్ని పొందేవాడు.పూర్వపు పుణ్య ఆధారంపై మరల ఒక సంత్ లభించేవారు. ఆ ప్రాణి మరల శుభ కర్మలు చేసి (భవసాగారాన్ని) దాటి ఉండెవాడు.

ఇందువలనే పైన తెలిపిన మనసుకి నచ్చిన ఆచరణలు లాభదాయకమైనవి కావు.

ప్రశ్న :- గీతా అధ్యాయం 3 శ్లోకం 35 మరియు గీతా అధ్యాయం 18 శ్లోకం 47లో చెప్పబడినది మంచి ప్రకారంగా ఆచరణలోకి తెచ్చిన ఇతర ధర్మాల కంటే గుణరహితమైన స్వ ధర్మమే అతి ఉత్తమమైనది. తన ధర్మంతో చనిపోవడం కూడ కళ్యాణకారకమైనది, ఇతరుల ధర్మం భయంను ఇచ్చునటువంటిది. దీనివలన స్పష్టం అవుతుంది ఎవరైతే ఏ పూజచేస్తారు దానిని త్యాగం చేయకుడదు. తన ధర్మంతో చనిపోవడం కూడ కళ్యాణకారకమైనది.

సమాధానం :- గీతా అధ్యాయం 3 శ్లోకం 35 మరియు గీతా అధ్యాయం 18 శ్లోకం 47 యొక్క అర్థం ఎవరైతే ఏ పూజ చేస్తారో, దానిని త్యాగం చేయకూడదు అని అయితే పవిత్ర గీతా జ్ఞానం యొక్క ఆవశ్యకతా ఏమి ఉండెను? ఒక శ్లోకం సరిపోయేది. గీతాలో ఈ శ్లోకాల భావార్థం సరియేనది, కానీ అనువాదం కర్తలు విపరితార్థములు చేసిరి. కృపతో చదవండి పై రెండు శ్లోకాల వాస్తవిక అర్థం-

గీతా అధ్యాయం 3 శ్లోకం 35

శ్రేయాన్, స్వధర్మ, విగుణ:, పరధర్మాత్, స్వనుష్ఠితాత్,
స్వధర్మే, నిధనమ్, శ్రేయ:, పరధర్మ: భయావహ: ॥

అనువాదం :- (విగుణ:) గుణరహిత అనగా శాస్త్ర విధి త్యాగం చేసి (స్వనుష్ఠితాత్) స్వయం మనసుకి నచ్చిన సరియైన విధంగా ఆచరణలోకి తీసుకువచ్చిన (పరధర్మాత్) ఇతరుల

ధార్మిక పూజ కంటే (స్వధర్మ:) మన శాస్త్ర విధి అనుసార పూజా (శ్రేయాన్) అతి ఉత్తమమైనది. శాస్త్రానుకూలమైన (స్వధర్మే) తమ పూజలో ఐతే (నిధనమ్) చనిపోవడం కూడ (శ్రేయ:) కళ్యాణకారకమైనది మరియు (పరధర్మ:) ఇతరుల పూజా (భయావహ:) భయమును ఇచ్చునది.

అధ్యాయం 18 శ్లోకం 47

శ్రేయాన్, స్వధర్మ, విగుణ:, పరధర్మాత్, స్వనుష్ఠితాత్,
స్వభావనియతమ్, కర్మ, కుర్వన్, న, ఆప్నోతి, కిల్బిషమ్ ॥

అనువాదం :- (విగుణ:) గుణరహిత అనగా శాస్త్ర విధి త్యాగం చేసి (స్వనుష్ఠితాత్) స్వయం మనసుకి నచ్చిన సరియైన విధంగా ఆచరణలోకి తీసుకువచ్చిన (పరధర్మాత్) పరుల ధర్మం అనగా ధార్మిక పూజ కంటే (స్వధర్మ:) మన శాస్త్ర విధి అనుసార పూజా (శ్రేయాన్) శ్రేష్టమైనది. (స్వభావనియతమ్) స్వయం తన స్వభావ అనుసారంగా తయారుచేసుకున్న మనసుకు నచ్చిన ఆచరణతో (కర్మ) భక్తి కర్మ (న) వద్దు (కూర్వన్) చేయకండి (కిల్బిషమ్) దేనివలన పాపాలని (ఆప్నోతి) పోందుతారు. విశేషం: ఈ ప్రమాణమే గీతా అధ్యాయం. 17 యొక్క శ్లోకం 1 నుండి 6 లో స్పష్టంగా ఉంది.

**పై శ్లోకాలు స్పష్టంగా తెలుపుచున్నాయి మన శాస్త్ర విధి అనుసారమైన సాధనా శ్రేష్ఠమైనది. ఇతరుల మీరుమీట్లు కోల్పు సాధనా ఎంత వినసొంపుగా ఉన్నా, అది హానికారకమైనది.**

**ఎలాఅంటే మాతా యొక్క జాగరణ చేయు వారు చాలా సుమధురమైన కంఠంతో పాటలు పాడుతు మాతా యొక్క స్తుతి మనసుకి హత్తుకును కవితల ద్వారా పూర్తి ఆర్కెస్ట్రాతో చేస్తారు. ఆ (స్వనుష్ఠితాత్) స్వయం నిర్మిత శాస్త్ర విధి రహిత సాధనా పై ఆకర్శితులై తమ శాస్త్ర అనుకుల సాధనని త్యాగం చేయకూడదు. ఎవరైన సాధకుడు సతసాధనపై ఉంటాడో అతడు పూర్వపూ అన్ని సాధనలని త్యాగం చేస్తాడు (పితరుల పూజ, మందిరానికి వెళ్లడం). అపుడు శాస్త్ర విరుద్ధ సాధనాచేయు వారు అంటారు మీరు అన్ని పూజల్ని త్యాగం చేసినారు. మీపై అన్ని దేవుళ్లు విముఖులు అవుతారు.ఒక వ్యక్తి ఇలానే చేసి ఉండెను, అతడి ఒక్కగానోక్క కొడుకు చనిపోయినాడు. ఈ విధంగా పరుల యొక్క శాస్త్ర విధి విరుద్ధ సాధనా భయంను ఉత్పత్తి చేస్తుంది, కానీ శాస్త్రానుకూల సాధనని చివరి శ్వాస వరకు చేస్తు ఉండటమే కళ్యాణకారకమైనది.**

**ప్రశ్న :-- నేను గీతా అధ్యాయం 6 శ్లోకం 10 నుండి 15లో వర్ణిత విధి అనుసారంగా ఒక ఆసనం పై కూర్చుని శిరస్సు మొ॥లగు అంగంలను ఒకటిచేసి ధ్యానం చేస్తాను, ఏకాదశి వ్రతం ఉంటాను ఈ విధంగా శాంతిని పొందగలనా.**

**సమాధానం :- కృపతో మీరు గీతా అధ్యాయం 6 శ్లోకం 16ని కూడ చదవండి అందులో రాసి ఉంది హే అర్జున్ ! ఈ యోగం (సాధనా) అధికంగా తినువారికి, ఏమియు తినని వారికి (వ్రతం ఉండువారికి) సిద్ధించదు. అధికంగా మేల్కొనువారికి, అధికంగా పడుకును వారికి సిద్ధించదు. ఒక స్థానంపై కూర్చుని సాధనా చేయువారికి సిద్ధించదు. గీతా అధ్యాయం 6 శ్లోకం 10 నుండి 15లో వర్ణిత విధి యొక్క ఖండన గీతా అధ్యాయం**

3 శ్లోకం 5 నుండి 9 లో చేయబడినది ఏ మూర్ఖ వ్యక్తి సమస్త కర్మఇంద్రియములను హఠపూర్వకంగా ఆపుతాడో అనగా ఒక స్థానంపై కూర్చుని చింతన చేస్తాడో అతడు మోసగాడు అనబడుతాడు. ఇందువలన కర్మయోగియే (పని చేస్తు చేస్తు సాధనా చేయు సాధకుడు) శ్రేష్టుడు అవుతాడు. వాస్తవిక భక్తి విధి కోసం గీతా జ్ఞాన దాతా ప్రభువు (బ్రహ్మ) తత్వదర్శి సంత్‌ని వెదకమని చెబుతాడు. (గీతా అధ్యాయం 4 శ్లోకం 34) దీనివలన సిద్ధిస్తుంది గీతాధాతా ద్వారా చెప్పబడిన భక్తి విధి పూర్ణంగా లేదు అని. ఇందువలనే గీతా అధ్యాయం 6 శ్లోకం10 నుండి 15 వరకు బ్రహ్మ ద్వారా తన సాధనా యొక్క వర్ణన ఉంది మరియు తన సాధన వలన అగు శాంతిని అతి అనుత్తమమైనదిగా గీతా అధ్యాయం 7 శ్లోకం 18 లో చెప్పినారు. పై గీతా అధ్యాయం 6 శ్లోకం 10 నుండి 15 లో చెప్పినారు మనసు మరియు ఇంద్రియములని వశంలో ఉంచుకును సాధకుడు ఒక విశేష ఆసనంను తయారు చేసుకోవాలి. అది ఎక్కువ ఎత్తు ఉండకూడదు, ఎక్కువ కిందికి ఉండకూడదు. ఆ ఆసనం పై కుర్చుని చిత్తం మరియు ఇంద్రియంలను వశంలో ఉంచుకుని మనసుని ఏకాగ్రతం చేసి అభ్యాసం చేయాలి. నిటారుగా కూర్చొని బ్రహ్మచర్యం ను పాలిస్తు మనసుని ఆపూతు ప్రయాణం చేయాలి. ఈ విధంగా సాధనలో ఉన్న సాధకుడు నాలో ఉండు (నిర్వాణపరమామ్) అతి జీవం లేని అనగా పూర్తిగా మరణించిన (నామ మాత్రంగా) శాంతిని పొందుతాడు . ఇందువలన గీతా అధ్యాయం 7 శ్లోకం 18 లో తన సాధన వలన అగు గతి (లాభం) ని అతి అనుత్తమమైనదిగా చెప్పినారు. ఈ గీతా అధ్యాయం 18 శ్లోకం 62 మరియు గీతా అధ్యాయం 15 శ్లోకం 4 లోను అనిరి హే అర్జున్ ! నీవు పరమ శాంతి మరియు సతలోకాన్ని పొందుతావు, మరల జన్మించవు, పూర్ణ మోక్షాన్ని పొందుతావు. నేను (గీతాదాతా) కూడ ఆ ఆది నారయణ పురుష పరమేశ్వరుడి శరణులోనే ఉంటిని, ఇందువలన దృడ నిశ్చయం చేసి ఆయన సాధనా మరియు పూజయే చేయాలి.

తన సాధనా యొక్క ఊహాత్మక జ్ఞానం ఆధారంపై చెప్పబడిన మార్గాన్ని అధ్యాయం 6 శ్లోకం 47లో స్వయంగా (యుక్తతమ: మత:) అనగా అజ్ఞాన అంధకారమైన విచారాలు అని చెప్పినాడు. మిగతా అనువాద కర్తలు 'మే యూక్తతమ: మత:' యొక్క అర్థం 'పరమ శ్రేష్ఠమైనది'గా చేసినారు. వాస్తవంలో దాని అర్థం నా ఊహాత్మక తగిలించిన అజ్ఞాన అంధకారంపై ఇవ్వబడినది. ఎందుకంటే యథార్థ జ్ఞాన విషయంలో ఎవరైన తత్వదర్శి సంత్‌ని అడిగి తెలుసుకోండి అని చెప్పినారు. (గీతా అధ్యాయం.4 శ్లోకం 34లో) వాస్తవిక అనువాద గీతా అధ్యాయం 6 శ్లోకం 47

యోగినామ్, అపి, సర్వేషామ్, మద్‌గతేన, అన్తరాత్మనా,
శ్రద్ధావాన్, భజతే, య:, మామ్, స:, మే, యూక్తతమ:, మత: ॥

అనువాదం:- నా ద్వారా ఇవ్వబడిన భక్తి విచార ఏదైతే ఊహాత్మకమై తగిలించి ఉన్న పై శ్లోకం 10 నుండి 15లో వర్ణిత పూజా విధానం ఏదైతే నేను సందేహంగా చెప్పినానో, అది పూర్ణ జ్ఞానం కాదు, ఎందుకంటే (సర్వేషామ్) సర్వ (యోగినామ్) సాధకులలో (య:) ఎవరైతే (శ్రద్ధావాన్) పూర్ణ ఆస్థాలో (అన్తరాత్మనా) అంతరాత్మతో (మద్‌గతేన్) నా ద్వారా ఇవ్వబడిన

భక్తి మతం అనుసారం (మామ్) నన్ను (భజతే) భజిస్తారు (స:) అది/ఆ (అపి) కూడ అజ్ఞా అంధకారంతో జనన-మరణ, స్వర్గ-నరకం అగు సాధనాలోనే లీనమైరి. ఇది (మే) నా (మత:) విచారం.

ఈ ప్రమాణమే పవిత్ర గీతా అధ్యాయం **7** శ్లోకం **18** లో మరియు గీతా అధ్యాయం **5** శ్లోకం **29** మరియు గీతా అధ్యాయం **6** శ్లోకం **15** లో స్పష్టంగా ఉంది. ఇందువలన గీతా అధ్యాయం **18** శ్లోకం **62**లో అనిరి హే భరత్ ! నీవు సర్వ భావంతో ఆ పరమాత్ముడి శరణులోకి వెళ్లు, ఆయన కృపతోనే నీవు పరమశాంతిని మరియు సనాతన పరమ ధామం అనగా సతలోకాన్ని పొందుతావు. గీతా అధ్యాయం **15** శ్లోకం **4** లో అనినారు ఎపుడైతే నీకు గీతా అధ్యాయం **4** శ్లోకం **34**లో వర్ణిత తత్వదర్శి సంత్ లభించిన తరువాత ఆ పరమపద పరమేశ్వరుడిని మిక్కిలి తపనతో వెదకాలి. ఆయనని పొందిన సాధకులు తిరిగి ఈ సంసారంలోకి రారు అనగా జన్మ మృత్యువు నుండి ఎల్లప్పటికి ముక్తులౌతారు. ఏ పరమేశ్వరుడుఐతై సంసారరూపి వృక్షంను రచించినారు, నేను కూడ ఆ ఆది పురుష పరమేశ్వరుడి శరణులోనే ఉన్నాను. ఆయన భక్తియే చేయాలి.

గీతా అధ్యాయం **3** శ్లోకం **5** నుండి **9** లో కూడ గీతా అధ్యాయం **6** శ్లోకం **10** నుండి **15** యొక్క జ్ఞానంను కూడ తప్పు అని సిద్ధం అయ్యింది. అర్జున్ అడిగాడు ప్రభు మనసుని ఆపడం చాలా కఠినమైనది. భగవానుడు సమాధానం ఇచ్చిరి మనసుని ఆపడం అన్నది వాయువుని ఆపడంతో సమానమైనది. ఇంకా ఇదియు అనినారు నిస్సందేహంగా ఏ వ్యక్తి కూడ క్షణిక సమయం కూడ పని చేయకుండా ఉండలేడు. ఏ మూర్ఖ మనిష్యుడు సమస్త కర్మ ఇంద్రియములను హఠపూర్వకంగా ఆపి మనసుతో ఎదో ఒకటి ఆలోచిస్తునే ఉంటారు. ఇందువలన ఒక చోట కూర్చుని హఠయోగం చేస్తు ఉండటం కంటే సంసారం చేస్తు చేస్తు (కర్మయోగం) సాధన చేయుటయే శ్రేష్ఠమైనది. ఒక స్థానం పై కూర్చుని సాధన చేయడం వలన నీ జీవన నిర్వాహం ఏలా జరుగుతుంది? శాస్త్ర విధిని త్యాగం చేసి సాధన (హఠయోగం ఒక ఆసనం పై కూర్చొవడం) చేయడంవలన కర్మబంధనకి కారణం అవుతుంది, రెండవది శాస్త్ర అనుకుల కర్మ చేస్తు చేస్తు సాధనయే శ్రేష్ఠమైనది. ఇందువలన సాంసారిక కార్యము చేస్తు సాధనా చేయ్. గీతా అధ్యాయం **8** శ్లోకం **7** లో చెప్పబడినది నీవు యుద్ధం కూడ చేయ్, నా స్మరణ కూడ చేయ్, ఇవిధంగా నన్నే పొందగలవు. గీతా అధ్యాయం **7** శ్లోకం **18**లో మరియు గీతా అధ్యాయం **18** శ్లోకం **62** లో చెప్పబడినది కానీ నా సాధన వలన అగు (గతి) లాభం అతి అనుత్తమమైనది. ఇందువలనా ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు ఆయన కృప వలన నీవు పరమగతిని మరియు పరమశాంతిని మరియు (శాశ్వతమ్ స్థానమ్) సతలోకాన్ని పొందుతావు. ఆ పరమేశ్వరుడి భక్తి విధి మరియు పూర్ణ జ్ఞానం తత్వదర్శి సంత్‌ని వెదికి ఆయన్ని అడుగు, నేను (గీతాజ్ఞానదాతా బ్రహ్మ) కూడ అపరిచితుడను.

ప్రశ్న : గీతా అధ్యాయం **15** శ్లోకం **18** లో చెప్పబడినది నేను లోకంలో, వేదంలో పురుషోత్తమ నామంతో సుప్రసిద్ధుడును. దీనివలన ఇదియే సిద్ధించింది గీతా జ్ఞానదాతా ప్రభుయే సర్వ శక్తిమంతుడు మరియు గీతా అధ్యాయం **12** పూర్తిగా గీతాజ్ఞానదాతా యొక్క

మహిమని చెప్పుచున్నది.

సమాధానం:- గీతాలో గీతా జ్ఞానదాతా ప్రభు తన సాధనా మరియు సమర్థతా కూడ చెప్పుచున్నాడు మరియు దానితో పాటు ఆ పూర్ణ పరమాత్మా యొక్క మహిమ కూడ చెప్పుచున్నాడు. ఇంకా ఆ పరమేశ్వరుడి సాధనా కోసం తత్వదర్శి సంత్ వైపు సంకేతం ఇస్తున్నారు. గీతా అధ్యాయం. 12 పూర్తిగా బ్రహ్మ యొక్క మహిమతో పరిపూర్ణమై ఉంది మరియు గీతా అధ్యాయం 13 మొత్తం ఆ పూర్ణ పరమాత్మా అనగా ఆది పురుష పరమేశ్వర్ యొక్క మహిమతో పరిపూర్ణమై ఉంది. గీతా అధ్యాయం 15 శ్లోకం 1 నుండి 4 మరియు 16 నుండి 17 లో పూర్ణ పరమాత్మ మరియు పరబ్రహ్మ, బ్రహ్మ మొ॥గు యొక్క నిర్ణయించు జ్ఞానం ఉంది.

శ్లోకం 16లో చెప్పబడినది పృథ్వి తత్వంతో నిర్మిత లోకం (బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాలు మరియు పరబ్రహ్మ యొక్క ఏడు సంఖ బ్రహ్మాండాలు పృథ్వి తత్వంతో తయారుచేయబడినవి అవడం వలన ఒక లోకంగా కూడ అంటారు) లో ఇద్దరు ప్రభువులు ఉన్నారు. ఒకరు క్షరపురుషుడు బ్రహ్మ, రెండవ అక్షరపురుషుడు అనగా పరబ్రహ్మ. ఈ ఇద్దరు ప్రభువుల అంతర్గతంగా ఏన్ని ప్రాణులైతే ఉన్నాయి అవి మరియు ఈ ఇద్దరు ప్రభుల స్థూల శరీరంలు ఐతే నాశనం కలవి మరియు జీవాత్మ అవినాశి అని చెప్పబడింది.

శ్లోకం 17 చెప్పబడినది వాస్తవంలో పురుషోత్తమ అనగా సర్వ శక్తిమంతుడు పరమేశ్వరుడు ఐతే పై ఇద్దరి కంటే వేరే ఉన్నారు, ఎవరైతే పరమాత్మా అనబడతారు. ఎవరైతే మూడు లోకాలోకి ప్రవేశించి అందరి పాలన పోషణ చేస్తారు. ఆయన వాస్తవంలో అవినాశి పరమేశ్వర్ అని అనబడతారు.

అధ్యాయం 15 యొక్క శ్లోకం 18లో గీతా జ్ఞాన దాతా (బ్రహ్మ) తన స్థితి చెప్పుచు అంటున్నారు నన్ను లోకవేదం (కల్పిత కథ) పై ఆధారంతో పురుషోత్తముడు అని అంటారు, ఎందుకంటే నేను 21బ్రహ్మాండాలలో ఎన్ని ప్రాణులు నా ఆధీనంలో ఉన్నవి, ఎవైతే స్థూల శరీరంలో నాశనం ఉన్నవి, ఆత్మ రూపంలో అవినాశిగా ఉన్నవి, నేను వాటికంటే ఉత్తముడును. ఇందువలన నేను లోకవేదం యొక్క ఆధారంపై పురుషోత్తుముడిగా ప్రసిద్దుడను. వాస్తవంలో పురుషోత్తమ పరమేశ్వరులు వేరే ఉన్నారు వారి గురించి గీత అధ్యాయం. 15 శ్లోకం 17లో చెప్పబడినది.

ప్రశ్న :- గీత అధ్యాయం 10 శ్లోకం 2 లో మరియు 3 లో చెప్పబడినది నా ఉత్పత్తి ఎవరు తెలుసుకోలేరు. ఎవరైతే నన్ను అనాది అజన్మించని తత్వంతో అని తెలుసుకుంటాడో అతడు సర్వ పాపాలనుండి ముక్తుడు అవుతాడు. ఇందువలన స్పష్టం అయింది బ్రహ్మ యొక్క జన్మ లేదు మరియు సర్వ పాపాన్ని నాశనం చేస్తాడు.

సమాధానం :- గీత అధ్యాయం 10 శ్లోకం 2 ని మరల చదవండి అందులో చెప్పబడినది నా ఉత్పత్తిని దేవతలు (బ్రహ్మ, విష్ణు, శివ మొ॥) మరియు మహర్షులకి తెలియదు, ఎందుకంటే వారు అంతా నా నుండి ఉత్పత్తి అయినారు.

ఈ శ్లోకం ద్వారా స్వతహాగా సిద్దం అయినది గీత జ్ఞాన దాతా ప్రభు యొక్క ఉత్పత్తి

**అనగా జన్మ అయితే అయ్యింది అని, కానీ కాల్ (బ్రహ్మ) ద్వారా ఉత్పన్న దేవతలు మరియు ఋషిజనులకు తెలియదు, ఎందుకంటే వారు కాల్ నుండి ఉత్పత్తి అయినారు. ఎలాఐతే తండ్రి జన్మ విషయంలో పిల్లలకు తెలియదు, కానీ పితా యొక్క తండ్రి అనగా తాతా చెబుతాడు. పూర్ణ పరమాత్మా స్వయం కాల లోకంలో ప్రకటితులై బ్రహ్మ యొక్క ఉత్పత్తి విషయంలో చెప్పినారు. కృపతో చదవండి సృష్టి రచనని ఈ పుస్తకంలోనే.**

**గీత అధ్యాయం 10 శ్లోకం 3 యొక్క అనువాదం తప్పుగా చేయబడినది. ఏలాఐతే గీతా అధ్యాయం 2 శ్లోకం 12 మరియు అధ్యాయం. 4 శ్లోకం 5 లో తనని తను నాశనం కల మరియు జన్మ-మృత్యువులని పదే పదే అగువానిగా చెప్పినారు. మరియు అధ్యాయం. 2 శ్లోకం 17 మరియు అధ్యాయం. 8 శ్లోకం 3, 8 నుండి 10 మరియు 20 మరియు అధ్యాయ 15 శ్లోకం 4, 16-17లో వేరే అన్య అవినాశి అనాది పరమాత్మా విషయంలో చెప్పినారు.**

**ఇందువలన గీత అధ్యాయం 10 శ్లోకం 3 లో చెప్పినారు ఏవరైతే మనుషులలో విధ్వానులు అనగా తత్వదర్శి సంత్ నన్ను మరియు ఆ అనాది, వాస్తవంలో జన్మ రహిత, సర్వ లోకాల మహేశ్వర్ అనగా పరమేశ్వరుడి తత్వంను తెలుసుకుంటాడు ఆ తత్వదర్శి సంత్ సత జ్ఞాన ఉచ్చారణ చేస్తాడు, దాని వలన సత సాధనా చేసి పాపం నుండి ముక్తుడు అవగలడు. ఈ ప్రమాణమే గీతా అధ్యాయం 4 శ్లోకం 34 లో కూడ ఉంది. కృపతో చదవండి గీత అధ్యాయం 10 శ్లోకం 3 యొక్క యథార్థ అనువాదం-**

**గీత అధ్యాయం 10 శ్లోకం 2**

న, మే, విదూ:, సూరగణా:, ప్రభవమ్, న, మహర్షయ:,
అహమ్, ఆది:, హి, దేవానామ్, మహర్షిణామ్, చ, సర్వశ: ॥

అనువాదం: - (మే) నా (ప్రభవమ్) ఉత్పత్తి (న) తెలియదు (సురగణా:) దేవతలకి మరియు (న) తెలియుదు (మహర్షయ:) మహర్షిజనులకి (విదూ:) (తెలయదు) కూడ, (హి) ఎందుకంటే (అహమ్) నేను (సర్వశ:) సర్వ ప్రకారంగా (దేవానామ్) దేవతల (చ) మరియు (మహర్షిణామ్) మహర్షిలయొక్క కూడ (ఆది:) అనగా ఉత్పత్తి యొక్క కారణంను.

**గీత అధ్యాయం 10 శ్లోకం 3**

య:, మామ్, అజమ్, అనాదిమ్, చ, వేత్తి, లోకమహేశ్వరమ్,
అసమ్మూఢ:, స:, మర్త్యేషు, సర్వపాపై:, ప్రమూచ్యతే ॥

అనువాదం :- (య:) ఎ విద్వాన్ వ్యక్తి (మామ్) నాకు (చ) మరియు (అనాదిమ్) ఎల్లపుడు ఉంటునటువంటి అనగా పూరాతన (అజమ) జన్మించని (లోక మహేశ్వరమ్) సర్వ లోకాల మహాన్ ఈశ్వరులు అనగా సర్వోచ్చ పరమేశ్వరుడిని (వేత్తి) తెలుసుకుంటాడు (స:) అతను (మర్త్యేషు) శాస్త్రాములని సరియైన విధంగా తెలిసినవాడు అనగా వేదాలఅనుసారంగా జ్ఞానం ఉంచువాడు (అసమ్మూఢ:) అనగా తత్వదర్శి విద్వాన్ (సర్వేపాపై:) సంపూర్ణ పాపాలని (ప్రమూచ్యతే) విస్తృత వర్ణనతో పాటు చెబుతాడు అనగా ఆయనే సృష్టి జ్ఞానం మరియు కర్మల సరియైన వర్ణన చేస్తాడు అనగా అజ్ఞానం నుండి పూర్ణ రూపకంగా ముక్తి కావిస్తాడు.

ఆ కారణంచే తత్వదర్శి సంత్ ద్వారా చెప్పబడిన వాస్తవిక సాధనా యొక్క ఆధారంపై భక్తి చేయు వారి సర్వ పాపాలు నాశనం అవుతాయి.

## "గీతా జ్ఞాన దాతా బ్రహ్మ(కాల్)యొక్క ఉత్పత్తి యొక్క సంకేతం"

అధ్యాయం 10 శ్లోకం 2 లో చెప్పబడినది అర్జున్ నా ఉత్పత్తి (జన్మ) ని దేవతలు (బ్రహ్మా, విష్ణు, శివ మొ॥) మరియు మహర్షులకి తెలియదు, ఎందుకంటే వారు అంతా నా నుండి ఉత్పత్తి అయినారు. శ్లోకం ద్వారా స్వతహాగా సిద్ధం అయినది గీత జ్ఞాన దాతా ప్రభు యొక్క ఉత్పత్తి అనగా జన్మ అయితే అయ్యింది అని, కానీ కాల్ (బ్రహ్మ) ద్వారా ఉత్పన్న దేవతలు మరియు ఋషిజనులకు తెలియదు, ఎందుకంటే వారు కాల్ నుండి ఉత్పత్తి అయినారు. ఎలాఐతే తండ్రి జన్మ విషయంలో పిల్లలకు తెలియదు, కానీ పితా యొక్క తండ్రి అనగా తాతా చెప్పగలుగుతాడు. ఈవిధంగ 21 బ్రహ్మాండాల సర్వ దేవిదేవతలు –ఋషులు మొ॥గు వారు కాల్ మరియు ప్రకృతి (దుర్గా) యొక్క సంయోగంతో ఉత్పన్నులైరి. ఇందువలనే అంటున్నాడు నా ఉత్పత్తిని 21 బ్రహ్మాండాలలోని ఏవరు తెలియదు, ఎందుకంటే సర్వుల ఉత్పత్తి నా నుండియే జరిగింది. కేవలం పూర్ణ బ్రహ్మ యే కాల్ యొక్క ఉత్పత్తి చెప్పగలడు. ఎందుకంటే బ్రహ్మ (కాల్) యొక్క ఉత్పత్తి పరమ అక్షర బ్రహ్మ (పూర్ణ బ్రహ్మ) ద్వారా జరిగింది. గీతా అధ్యాయం 3 శ్లోకం 14, 15 లో బ్రహ్మ యొక్క ఉత్పత్తి ప్రత్యక్ష ప్రమాణం ఉంది. అధ్యాయం 10 శ్లోకం 3 లో తత్వదర్శి అనగా విద్వాన్ వ్యక్తి నన్ను మరియు ఎన్నటికి జన్మించని సర్వ లోకాలకి మహేశ్వరుడు అనగా అవినాశి పరమాత్మ గురించి తెలిసినవాడు . ఆయన మూడు వేదాలని తెలిసినవాడు (ఋగ్వేద, సామవేదం, యజుర్వేదం). ఆయనే తత్వదర్శి సంత్. ఆయన ద్వారా చెప్పబడిన భక్తి మార్గంతో సాధనా చేయడంవలన సర్వ పాపంలు నాశనం అవుతాయి. గీతా అధ్యాయం 15 శ్లోకం 16, 17, 18 లో వర్ణన ఉంది పూర్ణ పరమాత్మా అవినాశి అయితే వేరే ఉన్నారు ఎవరైతే మూడు లోకాలో ప్రవేశించి అందరి పాలన పోషణ చేస్తారు. నన్ను లోకవేదం (కల్పిత కథ) పై ఆధారంతో పురుషోత్తముడు అని అంటారు, ఎందుకంటే నేను 21బ్రహ్మాండాలలో ఎన్ని ప్రాణులు నా ఆధీనంలో ఉన్నవి, ఎవైతే స్థూల శరీరంలో నాశనం ఉన్నవి, ఆత్మ రూపంలో అవినాశిగా ఉన్నవి, నేను వాటికంటే ఉత్తముడును. ఇందువలన నేను లోకవేదం యొక్క ఆధారంపై పురుషోత్తముడిగా ప్రసిద్దుడను. వాస్తవంలో అవినాశి లేదా పాలన కర్తని కాను. గీతా అధ్యాయం.3. శ్లోకం 14, 15 లో చెప్పబడినది సర్వ జీవులు అన్నం నుండి ఉత్పన్నం అవుతాయి, అన్నం వర్షం వలన అవుతుంది, వర్షం యజ్ఞం వలన అవుతుంది, యజ్ఞం శుభకర్మలతో, కర్మ బ్రహ్మ నుండి ఉత్పన్నం అవుతాయి. బ్రహ్మ అవినాశి పరమాత్మా నుండి ఉత్పన్నం అయినాడు. ఆ అవినాశి సర్వవ్యాపక పరమాత్మయే యజ్ఞంలలో ప్రతిష్ఠతులవుతారు, యజ్ఞంలో పూజ్యులు, ఆయన యజ్ఞం యొక్క ఫలంను ఇస్తారు అనగా వాస్తవంలో అధియజ్ఞి కూడా వారే.

గీతా అధ్యాయం 10 శ్లోకం 2 లో చెప్పిరి నా ఉత్పత్తి (ప్రభవమ్) ఎవరికి తెలియదు.

**దీనివలన సిద్ధమైనది కాల్ కూడ ఉత్పన్నం అయినాడు అని. ఇందువలన ఇది అనినారు కానీ ఆకారంలో కూడ ఉంటారు. లేదంటే శ్రీ కృష్ణుడు అర్జునుడి ఎదుట ఉండి నేను అనాది (అజమ) అజన్మితుడను అని అనేవారు కాదు. ఇది అంత కాల్ యే శ్రీ కృష్ణుడి శరీరంలో జీవస్థ రూపం (ప్రేతం లా) లో ప్రవేశించి మాట్లాడి (చెప్పి) తన ప్రతిష్ఠాని (స్థితిని) యొక్క సరియైన చిరునామాని గీతా రూపంలో ఇచ్చిరి.**

**పై వివరిత వివరణ వలన గీత యందు సిద్ధం అయింది బ్రహ్మ యొక్క ఉత్పత్తి పూర్ణ బ్రహ్మ ద్వారా జరిగింది. ఈ ప్రమాణమే అథర్వణవేదం కాండం 4 అనువాకం 1 మంత్రం 3 లో కూడ ఉంది, కృపతో చదవండి.**

ఖాండ నం. 4 అనువాకం సం. 1 మంత్రం సం.3 :-

ప్ర యో జజ్ఞే విద్వానస్య బన్ధుర్విశ్వా దేవానాం జనిమా వివక్తి ।

బ్రహ్మ బ్రహ్మణ ఉజ్జభార్ మధ్యాన్నిచైరుచ్చై: స్వధా అభి ప్ర తస్థౌ ॥3॥

ప్ర- య:-జజ్ఞే-విద్వానస్య-బన్ధు-విశ్వా-దేవానామ్-జనిమా-వివక్తి-బ్రహ్మ:-బ్రహ్మణ:-ఉజ్జభార్ -మధ్యాత్-నిచై:-ఉచ్చై:- అభి:-ప్రతస్థౌ

అనువాదం:- (ప్ర) సర్వ ప్రథమ (దేవానామ్) దేవతల మరియు బ్రహ్మాండాల (జజ్ఞే) ఉత్పత్తి జ్ఞానంను (విధ్వానస్య) జిజ్ఞాస గల భక్తుడి (య:) ఎవరైతే (బన్ధు:) వాస్తవిక స్నేహితుడు అనగా పూర్ణ పరమాత్మయే తన నిజసేవకుడికి (జనిమా) తన ద్వారా సృష్టించబడిన దానిని (వివక్తి) స్వయంగా ఉన్నది ఉన్నట్లు చెబుతాడు ఏమనంటే (బ్రహ్మణ:) పూర్ణ పరమాత్మా (మధ్యాత్) తన మధ్యనుండి అనగా శబ్ద శక్తితో (బ్రహ్మ:) బ్రహ్మ క్షర పురుషుడు అనగా కాల్ని (ఉజ్జభార్) ఉత్పన్నం చేసి (విశ్వా) పూర్ణ సంసారాన్ని అనగా అన్ని లోకాలని (ఉచ్చై:) పైన సతలోకాన్ని మరియు (నిచై:) కింద పరబ్రహ్మ మరియు బ్రహ్మ యొక్క అన్ని బ్రహ్మాండాలని (స్వధా) తన ధారణ చేయునటువంటి (అభి:) ఆకర్షణ శక్తితో (ప్ర తస్థౌ) రెండింటిని సరియైన విధంగా స్థాపింపచేసినారు.

**భావార్థం :- పూర్ణ పరమాత్మా తన ద్వారా రచింపబడిన సృష్టి జ్ఞానాన్ని మరియు అన్ని ఆత్మల యొక్క ఉత్పత్తి జ్ఞానంను తన నిజమైన దాసుడికి స్వయంగా చెబుతాడు.ఏమనంటే పూర్ణ పరమాత్మ తన మధ్యనుండి అనగా తన శరీరంతో తన శబ్ద శక్తి ద్వారా బ్రహ్మ (క్షర పురుషుడు) ని ఉత్పత్తి చేసినారు మరియు సర్వ బ్రహ్మాండాలు పైన సతలోకం, అలఖ లోకం, అగమలోకం, అనామి లోకం మొదలగు మరియు కిందగల పరబ్రహ్మ ఏడు సంఖ బ్రహ్మాండాలు మరియు బ్రహ్మ యొక్క 21 బ్రహ్మాండాల్ని తనని ధారణ చేయు ఆకర్షణ శక్తితో ఆగబట్టి ఉంచినాడు.**

**కాండం సం. 4 అనువాకం సం. 1 మంత్రం 7**

యో2థర్వాణ్ పిత్తరం దేవబన్ధుం బృహస్పతిం నమసావ చ గచ్ఛాత్ ।

త్వం విశ్వేషాం జనీతా యథాస: కవిర్దేవో న దభాయత్ స్వధావాన్ ॥7॥

య:-అథర్వాణమ్-పిత్తరమ్-దేవబన్ధుం- బృహస్పతిమ్-నమసా-అవ-చ-గచ్ఛాత్-త్వమ్ -విశ్వేషామ్-జనితా-యథా-స:-కవిర్దేవ:-న-దభాయత్-స్వధవాన్.

అనువాదం:- (య:) ఏ (అథర్వాణమ్) అచల అనగా అవినాశి (పితరమ్) జగతపితా (దేవబన్ధుమ్) భక్తుల యొక్క వాస్తవిక తోడు అనగా ఆత్మ యొక్క ఆధారం (బృహస్పతిమ్) జగత్‌గురు (చ) మరియు (నమసా) వినమ్రుడైన పూజారి అనగా విధానం తెలిసిన సాధకుడికి (అవ) సురక్షణతో పాటు (గఛ్చాత్) సతలోకంకు వెళ్లినవారిని సతలోకం తీసుకెల్లువాడు (విశ్వేషామ్) అన్ని బ్రహ్మండాల (జనితా) రచనా చేసేవాడు జగదంబ అనగా తల్లి గుణాలతో యుక్తమైన (న దభాయత్) కాల్ లాగా మోసం చేయని (స్వధావాన్) స్వభావం అనగా గుణం కలవాడు (యథా) ఉన్నది ఉన్నట్టు అనగా అలానే (స:) ఆ (త్వమ్) మీరు (కవిర్దేవ్:) కవిర్దేవులే. భాషాభేదం వలన వీరిని కబీర్ పరమేశ్వర్ అని అంటారు.

**భావార్థం:- ఈ మంత్రం ద్వారా స్పష్టంగా తెలుస్తుంది ఆ పరమేశ్వరుడి నామం కవిర్‌దేవ్ అనగా కబీర్ పరమేశ్వరుడే, ఎవరైతే సర్వ రచన చేశారు. ఏ పరమేశ్వరుడు అచల అనగా వాస్తవంలో అవినాశి (గీతా అధ్యాయం 15 శ్లోకం 16-17లో ప్రమాణం) జగతగురు, ఆత్మాధారం, ఎవరైతే పూర్ణ ముక్తి పొంది సత్యలోకం వెళ్లారో వారిని సత్యలోకం తీసుకుపోయినవాడు, అన్ని బ్రహ్మండాలని రచించినవాడు. కాల్ (బ్రహ్మ) లాగా మోసం చేయనివాడు.ఉన్నది ఉన్నట్లు ఆయన స్వయం కబీర్‌దేవులే అనగా కబీర్ ప్రభువే. ఈ పరమేశ్వరుడే సకల బ్రహ్మండాలని మరియు ప్రాణుల్ని తన శబ్ద శక్తి ద్వారా ఉత్పన్నం చేయడం వలన తల్లి కూడ అనబడుతాడు మరియు (పితరమ్) పితా మరియు (బన్ధు) అన్నయ్య కూడ వాస్తవంలో వీరే అవుతారు మరియు (దేవ) పరమేశ్వరుడు కూడ వీరే. ఇందువలననే ఈ కవిర్దేవ (కబీర్ పరమేశ్వర్) ని స్తుతి చేస్తు ఉంటారు. త్వమేవ మాతా చ పితా త్వమేవ బన్ధు చ సఖా త్వమేవ, త్వమేవ విధ్యా ద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమ దేవ దేవ. ఈ పరమేశ్వరుడి మహిమ యొక్క పవిత్ర ఋగ్వేద మండల్ సం. 1 సూక్తం సం.24 లో విస్తృత వివరణ ఉంది.**

ప్రశ్న :- వేదాలలో కవిర్ అనగా కబీర్ నామం యొక్క వివరణ ఎలా వచ్చింది? **వేదాలు అయితే సృష్టి యొక్క ప్రారంభం లో ప్రాప్తించినవి. కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) లు అయితే క్రీ.శ. 1398లో ఉత్పన్నులైరి.**

సమాధానం :- **పూర్ణ పరమాత్మా యొక్క వాస్తవిక నామం కవిర్దేవ్ మరియు ఉపమాత్మక (పదవి) నామం సతపూరుష, పరమ అక్షర బ్రహ్మ, పూర్ణ బ్రహ్మ మొ॥గు. ఎలాఐతే దేశ ప్రధాన మంత్రి యొక్క శరీరం యొక్క నామం వేరే ఉంటుంది మరియు పి.యమ్., ప్రాయిం మీనిష్టర్ మొ॥ పదవి పేర్లుగా ఉంటాయి. ఈ పూర్ణ పరమాత్ములే కవిర్దేవ్ నామాలని మార్చుకుని నాలుగు వేదాలలో వచ్చిరి మరియు సృష్టి మరియు వేదాల రచన కంటే పూర్వము కూడ అనామి (అనామయ) లోకంలో మానవ సదృశ శరీరంలో కవిర్దేవ్ నామంతో విద్యామానులై ఉండిరి. ఆ కవిర్దేవులే మరల సతలోకంను రచించి సతలోకంలో విరాజితులైరి. అటు తరువాత పరబ్రహ్మ మరియు బ్రహ్మ యొక్క లోకాల మరియు వేదాల రచన చేసిరి. ఇందువలనే వేదాలలో కవిర్దేవ్ యొక్క వివరణ ఉంది.**

## "కబీర్ సాహెబ్ ద్వారా విభీషణుడిని మరియు మండోదరిని శరణులోకి తీసుకునుట"

పరమేశ్వరులు మునీంద్రులు అనిల్ (నీల్) మరియు అనల్ (నల్) శరణులోకి తీసుకున్న పిదప శ్రీలంక వెళ్లిరి. అక్కడ ఒక పరమభక్తుడు చంద్రవిజయ్ యొక్క 16 సభ్యుల కుటుంబం నివసిస్తు ఉండింది. వారు భాట జాతిలో పుట్టిన పుణ్యకర్మి ప్రాణులు. పరమేశ్వరులైన మునీంద్రుల (కవిర్దేవ్) ఉపదేశం విని తన పూర్తి పరివారం నామ దానం పొందింది. పరమభక్త చంద్రవిజయుడి భార్య భక్త శిరోమణి కర్మానుసారంగా రాజా రావణుడి రాణి మండోదరి దగ్గర పని (సేవా, ఉద్యోగం) చేస్తు ఉండింది. రాణి మండోదరికి తన చలాకీ మాటలని వినిపించి రాణి మనసుని సంతోషింప చేసేది. భక్త చంద్రవిజయుడు రాజా రావణుడి దరబారులో పని చేస్తుండెవాడు. రాజుగారి గొప్పతనాన్ని, ఔనత్యాన్ని పొగుడుతు సంతోష పెట్టెవాడు.

భక్త చంద్రవిజయుడు భార్య భక్తిమతి కర్మవతి పరమేశ్వరుడి నుండి ఉపదేశం పొందిన తరువాత మండోదరికి ప్రభు చర్చ ఎదైతే సృష్టి రచన తన గురుదేవులు మునీంద్రులు వినిపించిరో ప్రతి రోజు వినిపించసాగింది.

రాణి మండోదరికి ఆనందం వేయసాగింది. చాలాచాలా గంటలతరబడి ప్రభువు యొక్క సత కథలని వినిపించుతు ఉండెది మరియు మండోదరి కన్నుల నుండి కనీళ్లు వస్తుండెవి. ఒక రోజు రాణి మండోదరి కర్మవతిని అడుగుతుంది నీవు జ్ఞానం ఏవరినుండి వినితివి?అని. నీవు చాలా చలాకీ మాటలు మాట్లాడెదానివి, ఇంత మార్పు పరమాత్మ తుల్య సంత్ వలనే అవుతుంది. కర్మవతి అంటుంది మేము ఒక పరమ సంత్ నుండి ఇపుడిపుడే ఉ పదేశం తీసుకుని ఉన్నాం. రాణి మండోదరి సంత్‌ని దర్శించాలి అను కోరికను తెలుపుతు అనింది, ఈసారి మీ గురుదేవులు వచ్చినట్లయితే మా ఇంటికి కూడ తీసుకుని రా. తన యజమాని ఆదేశాన్ని పొంది శిరసుని వంచుకుని సత్కర పూర్వకంగా అంటుంది ఎదైతే మీ కోరికయో, అదే మీ సేవకురాలు చేస్తుంది. నేను ఒక వినతి చేస్తున్నాను సంతులని ఆదేశపూర్వకంగా పిలవకూడదు. స్వయంగా వెళ్లి దర్శించుకోవడం శ్రేయస్కరమైనది మరియు మీ ఆజ్ఞ ఏలా అయితే అలానే జరుగుతుంది. మండోదరి అంటుంది సరే ఈ సారి వచ్చినపుడు చెప్పు నేనే వచ్చి దర్శనం చేసుకుంటాను. పరమేశ్వరులు మరల శ్రీ లంకలో కృప చేసిరి. మండోదరి కూడ ఉపదేశం పొందింది. కొంత సమయం తరువాత భక్త విభీషణుడుకి ఉ పదేశం ఇప్పించింది. భక్తమతి మండోదరి ఉపదేశం పొంది అహర్నిశలు ప్రభు స్మరణలో లీనమయ్యింది. తన పతి రావణుడిని కూడ మునీంద్రగారి నుండి ఉపదేశం పొందండి అని చాలా సార్లు ప్రార్థన చేసింది కానీ రావణుడు ఒప్పుకోలేదు మరియు అనేవాడు నేను పరమ శక్తి పరమేశ్వర్ మహేశ్వర్ మృత్యుంజయ శివుడి భక్తి చేసితిని. దీనికి మించి వేరే ఏ శక్తి లేదు. నిన్ను ఎవరో తప్పుతోవ పట్టించినారు.

కొంత సమయం తరువాత వనవాసం పొందిన శ్రీ సీతాదేవి ని రావణుడు అపహరణ చేసి తన నౌ లఖా బృందావనంలో బందించినాడు. భక్తిమతి మండోదరి పదే పదే ప్రార్థన చేసిన కూడ రావణుడు మాతా సీతని తిరిగి విడిచిపెట్టడానికి స్వీకరించలేదు. అపుడు భక్తమతి మండోదరి తన గురుదేవులు మునీంద్రులని అడిగింది మహారాజ్ నా భర్త ఒక స్త్రీని

అపహరించినారు. నేను సహించలేక పోతున్నాను. ఆయన ఆమె వదిలిపెట్టడానికి అంగీకరించడం లేదు. మీరు దయ ఉంచండి ప్రభువు. నేటి వరకు నేను నా జీవితంలో ఇలాంటి దు:ఖంను చూడలేదు.

పరమేశ్వర్ మునీంద్రగారు అనిరి కుమారి మండోదరి! ఈ స్త్రీ సామాన్య స్త్రీ కాదు. శ్రీ విష్ణువుగారికి శాపం వలన భూమిపై రావలిసి వచ్చింది, వారు శ్రీ రాజా దశరథ్ గారి పుత్రులు శ్రీ రామచంద్ర అయోధ్యవాసులు అవుతారు. ఈయనికి 14 సంవత్సరాల వనవాసం ఉంది మరియు లక్ష్మీగారు స్వయం సీతా దేవియై వీరి భార్య రూపంలో వనవాసంలో ఉండింది. ఆమెను రావణుడు ఒక సాధు వేషం ధరించి మోసం చేసి తీసుకు వచ్చినాడు. ఆమె స్వయం లక్ష్మీ యే సీతాదేవియే. ఈమె శీఘ్రంగా తిరిగి పంపించి యాచనా చేసి తమ జీవనం యొక్క యాచనని రావణుడు చేయడంలోనే ఆయన శుభం ఉంది.

భక్తి మండోదరి చాలా సార్లు ప్రార్థన చేసిన కూడ రావణుడు వినలేదు అనేవాడు ఆ ఇద్దరు అడివిలో తిరుగువారు నన్ను ఏమి చేయగలరు? నా దగ్గర లెక్కించవీలుకానీ సేనా ఉంది. నా లక్షమంది పుత్రులు ఉన్నారు మరియు లక్షపావు బందువులు ఉన్నారు. నా పుత్రుడు మేఘానందుడు స్వర్గ యొక్క రాజు ఇంద్రుడని ఒడించి అతని కుమార్తెను వివాహం చేసుకున్నాడు. ముప్పై కోట్ల దేవతలని మేము బందించి ఉన్నాము. నీవు నన్ను ఆ ఇద్దరు వనవాసులని భగవానులు అని చెప్పి భయపెట్టించాలని చూస్తున్నావు. ఈ స్త్రీని తిరిగి అప్పగించను.

మండోదరి భక్తి మార్గంను ఏదైతే తన గురుదేవులు ద్వారా వినిందో, రావణాసురుడికి చాలా చెప్పింది. విభీషణుడు కూడ తన పెద్దఅన్నయ్యకి నచ్చచెప్పినాడు. రావణుడు విభీషణుడిని దంచుతాడు మరియు అంటాడు నీవు ఎక్కువగా శ్రీ రామచంద్రుడి పక్షంగా మాట్లాడుతున్నావు నీవు వాడి వద్దకె వెళ్లు.

ఒకరోజు భక్తిమతి మండోదరి తన పూజ్య గురుదేవులతో ప్రార్థన చేసింది హే గురుదేవ్! నా మాంగళ్యం తుడిచిపెట్టుక పోతుంది. ఒకసారి మీరు కూడ నా భర్త కి తెలియచేయండి. ఒకవేళ అతను మీ మాట కూడ వినకపోతే ఇక విధవా అగుటలో నాకు దు:ఖం ఏమి లేదు.

తన కుమారి మండోదరి ప్రార్థనని స్వీకరించి రాజా రావణుడి దరబారు ముందు ఉండు ద్వారపాలకులతో రాజు ను కలవాలి అని ప్రార్థన చేసిరి. ద్వారపాలకులు అనిరి ఈ సమయంలో మా రాజు దరబారులో ఉన్నారు. లోపలి విషయం బయటకు వస్తుంది కానీ బయటి విషయం లోపలికి వెళ్లలేదు. మేము నిస్సాహాయులం అవుతున్నాం అని. అపుడు పూర్ణ ప్రభు అంతర్ధాన్యం అయిరి మరియు రాజ దరబారులో ప్రకటితులైరి. రావణుడి దృష్టి ఋషిపై పడింది బిగ్గరగా అడిగారు ఈ ఋషిని నా ఆజ్ఞ లేకుండా ఎవరు లోనికి రానిచ్చారు అని. అతన్ని తీసుకువచ్చి నా ముందు నరకండి. అపుడు పరమేశ్వర్ అంటారు రాజన్ మీ ద్వారపాలకులు పంపించలేదు. వారికి తెలియదు నేను ఏలా లోనికి వచ్చినానో. రావణుడు అడిగాడు నీవు లోనికి ఎలా వచ్చావు అని? అపుడు పూర్ణ ప్రభువు మునీంద్ర వేషంలో అదృష్యమై తిరిగి ప్రకటితులైరి మరియు అనిరి ఇలా వచ్చితిని అని. రావణుడు అడిగాడు మీ రాకకు కారణం ఏమిటి? అపుడు ప్రభు అంటారు మీరు ఒక యోద్ధ అయి ఒక అబల యొక్క

అపహరణ చేసి తీసుకువచ్చినారు. ఇది మీ శూరత్వానికి మీ పేరుప్రఖ్యాతికి వ్యతిరేకంగా ఉంది. ఈమె సామాన్య ఆడది కాదు. ఈమె స్వయం లక్ష్మీ అవతారమే. శ్రీ రామచంద్రుడు, ఎవరైతే ఈమె భర్తయో, ఆయన స్వయం విష్ణువే. ఆమె తిరిగి పంపించి మీ జీవనం యొక్క భిక్షని అడగండి. ఇందులోనే మీ శ్రేయం కలదు. ఇంత వినగానే తమోగుణి ఉపాసకుడు రావణుడు క్రోధితుడై లేచి ఖడ్గం తీసుకుని సింహాసనం నుండి దుమికి, ఖడ్గంతో డెభై సార్లు ఋషిపై ప్రయోగించిరి చంపడానికి. పరమేశ్వర్ మునీంద్రగారు చేతిలో ఒక చీపురు పుల్లని చేతిలో పట్టుకుని ఉండిరి దానిని లోహపు పలక లాగా ముందుకు ఉంచిరి. రావణుడి డెభై దెబ్బలు ఆ నాజుకైన రెమ్మ పై తగులాయి. ఎలాంటి శబ్దం అయింది అంటే ఎలాఐతే లోహపు ఫిల్లరు పై ఖడ్గం తగిలినట్టు. కానీ అది ఇంచు కూడ కదలలేదు. రావణుడికి చెమటలు వచ్చాయి. అయిన కూడ తన అహంకారంను వదలుకోలేదు. అతడికి అర్థం అయింది ఇతను సామాన్య ఋషి కాదు అని. అన్నాడు నేను మీ యొక్క ఒక్క మాటని కూడ వినను, మీరు వెళ్లవచ్చు. పరమేశ్వరులు అంతర్ధానం అయిరి. మరియు మండోదరికి జరిగిన సర్వ వృతాంతమును వినిపించి ప్రస్థానమయిరి. రాణి మండోదరి అంది గురుదేవ్ ఇక నాకు విధవా అగుటలో ఏ కష్టం లేదు.

శ్రీ రామచంద్రుడి మరియ రావణుడి యుద్ధం జరిగింది. రావణుడు వధించబడ్డాడు. ఎ లంకనైతే రావణ్ తమోగుణ భగవాన్ శివుడి కఠిన సాధనా చేసి, పదిసార్లు శిరస్సుని త్యాగంచేసి పొందినాడు మరియు ఆ క్షణిక సుఖం కూడ రావణుడిది వెళ్లిపోయింది మరియు నరకంలో భాగస్తుడయ్యాడు. దీనికి వ్యతిరేకంగా పూర్ణ పరమాత్మా యొక్క సతనామ సాధకుడు విభీషణుడు ఎలాంటి కఠిన సాధనా చేయకుండానే పూర్ణ ప్రభువు యొక్క కృపతో లంకారాజ్యం కూడ ప్రాప్తింపచింది. వేల సంవత్సరాలు విభీషణుడు లంకా రాజ్యం యొక్క సుఖంను అనుభవించాడు మరియు ప్రభు కృపతో రాజ్యం పూర్ణ శాంతి ఉండింది. రాక్షస స్వభావంకల వారందరూ వినాశం అయి ఉండిరి. భక్తిమతి మండోదరి మరియు భక్త విభీషణ్ మరియు పరమ భక్త చంద్రవిజయ్ కుటుంబం యొక్క సభ్యులు మరియు మిగత ఎవరైతే పూర్ణ పరమేశ్వరుడి నుండి ఉంపదేశంను పొంది ఆజీవనం మర్యాదలో ఉంటు సతభక్తి చేస్తు సర్వ సాధకులు ఇక్కడ భూమి పై సుఖంగా ఉండిరి మరియు అంత సమయంలో పరమేశ్వర్ మండోదరిని విమానంలో కూర్చొబెట్టి సతలోకం (శాశ్వత స్థానం) కు తీసుకెళ్లిరి. ఇందువలనే పవిత్ర గీతా అధ్యాయం 7 మంత్ర 12 నుండి 15 చెప్పబడినది మూడు గుణాల (రజగుణం బ్రహ్మా, సతగుణం విష్ణు, తమోగుణం శివుడు) యొక్క సాధనా వలన లభించు క్షణిక సౌకర్యాల ద్వారా ఎవరి జ్ఞానం హరించి ఉంది, ఆ రాక్షస స్వభావి, మనుషలలో నీచ, దుష్కర్మ చేయు మూర్ఖులు నన్ను (కాల్) కూడ భజించరు.

గీతా అధ్యాయం 7 మంత్రం 18 లో గీతా చెప్పు ప్రభువు (కాల్) అంటున్నాడు ఎవరో ఒక ఉదార ఆత్మ నా (కాల్) యొక్క సాధనా చేస్తుంది ఎందుకంటే వారికి తత్వదర్శి సంత్ లభించలేదు. ఆ నిజాయితీ కల ఆత్మలు నా (అనుత్తమ) అతి వ్యర్థమైన ముక్తి స్థితిలో ఆశ్రితులైరి. వారు కూడ పూర్ణ ముక్తి అవలేకపోయారు. ఇందువలనే పవిత్ర గీతా అధ్యాయం. 18 మంత్రం

62 లో చెప్పబడినది అర్జున్! నీవు సర్వభావంతో ఆ పరమేశ్వర్ (పూర్ణ పరమాత్మా తత్ బ్రహ్మ) యొక్క శరణులోకి వెళ్లు ఆయన కృపతోనే నీవు పరమ శాంతిని మరియు సతలోకం అనగా సనాతన పరమ ధామంను పొందుతావు.

## 'ద్వాపర యుగంలో ఇంద్రమతిని శరణులోకి తీసుకునుట"

ద్వాపర యుగంలో చంద్రవిజయ నామంగల ఒక రాజు ఉండెవాడు. ఆయన భార్య ఇంద్రమతి చాలా ధార్మిక (ఆధ్యాత్మిక) స్వభావంకలది. సంత్ మహాత్ములను చాలా ఆదరించెది. తనకి ఒక గురువు కూడ ఉండెవాడు. గురుదేవులు ఆమెకు చెప్పినారు సాధు-సంత్‌ల సేవా చేయాలి అని మరియు సంత్‌లకి భోజనం తినిపించడం వలన చాలా లాభం (పుణ్యం) దొరుకుతుంది అని. ఏకాదశి వ్రతం, మంత్ర జపం మొదలగు సాధనలు ఎవైతే గురుదేవులు చెప్పినారో చేసేది. ఆమె భగవత్ భక్తిలో చాలా దృడమైన శ్రద్దని కలిగి ఉండెది. గురుదేవులు ఆమెకు చెప్పినారు సంత్‌లకి భోజనం చేయిస్తే నీవు మునుముందు కూడ రాణివి అవుతావు మరియు నీకు స్వర్గం ప్రాప్తిస్తుంది. రాణి అందువలన ప్రతిరోజు ఒక సంత్‌కి భోజనం తప్పక తినిపించాలి అని మనసులో ప్రతిజ్ఞ చేసుకుని ముందు సంత్‌లకి భోజనం తినిపించిన తరువాతనే తను తినాలి అని నియమం పెట్టుకుంది. ఆమె చేయాల్సిన పని ప్రతిరోజు గుర్తుంచుకునెలు ఈ నియమం పెట్టుకుంది. రాణి ప్రతిదినం మొదట ఒక సంత్‌కి భోజనం తినిపించెది. తరువాత తను తినెది. కొన్ని సంవత్సరాలు ఈ క్రమం కొనసాగినది.

ఒక సమయంలో హరిద్వారంలో కుంభమేళా యొక్క సంయోగం జరిగింది. ఎంతమంది ఐతే త్రిగుణ మాయ ఉపాసక సంత్‌లు ఉండినారో వారంతా గంగానదిలో స్నానం చేయడానికి (పరభి తీసుకోడానికి) వెళ్లినారు. అందువలన రాణికి భోజనం పెట్టడానికి సంత్‌లు దొరకలేదు. రాణి ఇంద్రమతికూడ ప్రతిజ్ఞ చేసుకోవడం వలన తను కూడ తినడం లేదు. నాలుగవ రోజున రాణి తన సేవకురాలికి ఎవరైన సంత్ దొరుకితే చూడు, లేదంటే ఈ రోజు నీ రాణికి చివరి రోజు అయ్యేట్లు ఉందని చెబుతుంది. ఈ రోజు నా ప్రాణాలు వెళ్లిపోతాయి. కానీ నేను అన్నం తినను. ఆ దయాళు కబీర్ పరమేశ్వర్ తన పూర్వపు భక్తులని శరణు తీసుకొనుటకు ఏ కారణం చేసుకుంటారో వారికే తెలియాలి? సేవకురాలు పైన మేడపై ఎక్కి చూడగానే ఒక సంత్ ఎదురుగా వస్తున్నాడు. తెలుపు బట్టలతో ఉన్నాడు. ద్వాపరయుగంలో పరమేశ్వర్ కబీర్ కరుణామయ నామంతో వచ్చియుండిరి. సేవకురాలు కిందకు రాణితో ఒక వ్యక్తి ఉన్నాడు తను సాధువు లాగా కనిపిస్తున్నాడు అని అంటుంది. రాణి త్వరగా వెళ్లి పిలుచుకురా అంటుంది. సేవకురాలు రాజమందిరం నుండి బయటకు వస్తుంది మరియు ప్రార్థన చేస్తుంది హే మహాత్మా! మిముల్ని మా రాణిగారు రమ్మంటున్నారు. కరుణామయ సాహెబ్ గారు అంటారు మీ రాణిగారు నన్ను ఎందుకు రమ్మన్నారు, నాకు మరియు రాణి ఎమి సంబంధం? సేవకురాలు అంతయు చెబుతుంది. కరుణామయ (కబీర్) సాహెబ్ అంటారు రాణికి అంత ఆవశ్యకత ఉంటే ఇక్కడికి రమ్మనండి. నేను ఇక్కడే నిలబడి ఉంటాను. నీవు సేవకురాలివి మరియు ఆమె రాణి. నేను అక్కడికి వస్తాను మరియు ఒకవేళ ఆమె నిన్ను ఏవరు ఇక్కడికి

పిలిచారు అని అంటే మరియు ఆమె రాజా ఇంకా ఏమైనా అంటే ఎలా? కుమారి సంత్‌లని ఆదరించకపోవడం వలన చాలా పాపం కలుగుతుంది. సేవకులు తిరిగి వచ్చి రాణిగారికి జరిగినదంతయు చెబుతుంది. అప్పుడు రాణి సేవకురాలిని తనను చెయి పట్టుకుని అక్కడికి తీసుకెళ్లమంటుంది. వెళ్లగానే రాణి సాష్టాంగ నమస్కారం చేసి ప్రార్థిస్తుంది. హే పరవరదిగార్/ హే ప్రభువు! మిముల్ని భుజాలపై ఎత్తుకుని తీసుకెళ్లాలి అని కోరికగా ఉంది. కరుణామయ సాహెబ్ అంటారు కుమారి! నేను ఇదియే చూడాలి అనుకున్నా. నీ యందు శ్రద్ధ ఉందా లేక ఆకలితో అంటున్నావా అని. రాణి తన చేతులతో భోజనాన్ని తయారుచేస్తుంది. కరుణామయ రూపంలో వచ్చిన కవిర్దేవ సాహెబ్ అంటారు నేను అన్నం తినను. నా శరీరం తిండి తినేది కాదు. అప్పుడు రాణి అంటుంది అయితే నేను కూడ అన్నం తినను. కరుణామయ సాహెబ్ అంటారు సరే తల్లి తీసుకురా తింటాను, ఎందుకంటే సమర్థుడు అని వారిని అంటారు ఏవరైతే దేనినైతే అనుకుంటారో, దానినే చేస్తారు. కరుణామయ సాహెబ్ భోజనం చేస్తారు. పిదప రాణిని అడుగుతారు ఈ సాధనని నీవు చేస్తున్నావు కదా దీనిని నీకు ఏవరు చెప్పారు? రాణి అంటుంది నా గురుదేవుల ఆదేశానుసారంగా చేస్తున్నాను అని. కరుణామయ సాహెబ్ అడుగుతారు ఏం ఆదేశం ఇచ్చారు నీ గురుదేవులు? ఇంద్రమతి అంటుంది బ్రహ్మ-విష్ణు-మహేషుల పూజా, ఏకాదశి వ్రతం, తీర్థయాత్రలు, దేవిపూజ, శ్రాద్ధం తీయుట, మందిరాలకి వెళ్లుట, సంత్‌ల సేవ చేయడం. కరుణామయ సాహెబ్ అంటారు ఏ సాధన ఐతే నీ గురుదేవులు ఇచ్చారో అది నిన్ను జన్మ-మృత్యువు మరియు స్వర్గం-నరకం అను చక్రం యందు బందించి ఉంచుతుంది మరియు ఎనభైనాలుగు లక్షల యోనిలయందు జన్మల కష్టం నుండి విముక్తిని ఇవ్వదు. రాణి అంటుంది మహారాజ్‌గారు! ఎంతమంది సంత్ లు ఉన్న, వారి-వారి అనుభవాన్ని (ప్రభువు) వారి గొప్పతనంగా చెబుతారు. నా గురుదేవుల గురించి ఏమియు అనకండి. నేను ముక్తిరాలుని అయిన కాకపోయిన పర్వాలేదు.

అప్పుడు కరుణామయ సాహెబ్ ఆలోచిస్తారు ఈ అమాయకపు ప్రాణికిఏలా తెలియచేయను? వీరు పట్టుకున్న తోకను విడిచిపెట్టలేరు, కానీ చనిపోగలరు. కరుణామయ సాహెబ్ అంటారు కుమారి! అలా అయితే నీ ఇష్టం, నేను నిందించడం లేదు. నేను మీ గురుదేవులను ఏమైనా తిట్టానా లేదా చెడ్డది అని చెప్పానా? నేను భక్తిమార్గాన్ని చెబుతున్నాను. ఈ భక్తి శాస్త్ర విరుద్ధంగా ఉంది. నిన్ను ఇది భవసాగరాన్ని దాటించలేదు. నీ రాబోయే కర్మఫలాన్ని నశింపచేయదు మరియు నిన్ను ఈ రోజు నుండి మూడవ రోజున నీ మృత్యువు అవుతుంది. నీ గురువు కానీ నీ యొక్క ఈ నకలి సాధనా నిన్ను కాపాడలేదు. (ఏప్పుడైతే చనిపోవు సమయం వస్తుందో అప్పుడు జీవుడికి భయం వేస్తుంది. లేకపోతే వినరుకదా) రాణి ఆలోచిస్తుంది సంత్ లు అబద్ధం చెప్పరు. ఒకవేళ నేను ఎల్లుండే చనిపోతే, ఈ భయంతో కరుణామయ సాహెబ్‌ని అడుగుతుంది సాహెబ్! నా ప్రాణం కాపాడబడుతుందా? కరుణామయ సాహెబ్ అంటారు అవును, కాపాడబడుతుంది. ఒకవేళ నీవు నానుండి ఉపదేశం తీసుకుంటే, నా శిష్యురాలువు అయితే, పూర్వపు పూజలని విడిచిపెడితే, అప్పుడు నీ ప్రాణం నిలబడుతుంది. ఇంద్రమతి అంటుంది నేను విన్నాను, ఏమనంటే గురుదేవులని మార్చకూడదని, పాపం

తగులుతుందని. కరుణామయ సాహెబ్ అంటారు లేదు కుమారి ఇది నీ భ్రమ మాత్రమే. ఒక వైద్యుడి మందు పని చేయనపుడు వేరొక వైద్యుడి మందుని తీసుకోమా? ఒక ఐదవ తరగతి ఉపాధ్యాయుడు ఉంటాడు. ఇంకా పై తరుగతులకి ఉపాధ్యాయుడు ఉంటాడు. కుమారి తర్వాతి తరగతిలోకి వెళ్లాలి కదా. పూర్తి జీవితం ఐదవ తరగతిలోనే ఉంటావా? దీనిని వదిలివేయాల్సిందే. నీవు ముందు ఉన్న చదువుని చదువు, నేను అది చదివించడానికే వచ్చాను. ఉరికే అంగీకరించెది కాదు కానీ మృత్యువు కనబడుతుంది, సంత్ చెబుతున్నాడు కదా ఒకవేళ మాట నిజం అయితే ఎలా?అని ఆలోచన చేస్తు ఇంద్రమతి అంటుంది మీరు ఏలు అంటున్నారో అలానే చేస్తాను. కరుణామయ సాహెబ్ గారు ఉపదేశం ఇస్తారు. తద్వారా ఇలా చెబుతారు మూడవ రోజున నా రూపంలో కాల్ వస్తాడు. నీవు అతనితో మాట్లాడవద్దు. ఏ నామాన్ని ఐతే నీకు ఇచ్చినానో దానిని రెండు నిమిషాలు జపించు. రెండు నిమిషాల తరువాత అతనిని చూడు, తరువాత సత్కారం చేయి. వాస్తవానికి గురువులు వస్తే అతి శీఘ్రుంగా పాదాలపై పడిపోవాలి. కానీ ఇది ఈ ఒకసారి నా ఆదేశం మాత్రమే. రాణి అంటుంది చాలా మంచిది మీరు చెప్పినట్లు చేస్తాను.

ఇప్పుడు రాణికి చింత లోపల ఉండసాగింది. శ్రద్ధతో జపం చేస్తు ఉండింది. కరుణామయ సాహెబ్ రూపాన్ని ధరించి గురుదేవుని రూపంలో కాల్ వస్తాడు, పిలుస్తాడు ఇంద్రమతి, ఇంద్రమతి అని, ముందుగానే భయం ఉండింది, నామ స్మరణ చేసింది.కాల్ వైపు చూడలేదు.రెండు నిమిషాల తరువాత చూసింది కాల్ రూపం మారిపోయింది. కాల్ నిజ స్వరూపం కనబడసాగింది. కరుణామయ సాహెబ్ స్వరూపం లేదు. అప్పుడు కాల్ చూసుకున్నాడు తన మారిన స్వరూపాన్ని. కాల్ తెలుసుకుంటాడు ఈమె దగ్గర ఎదో శక్తి మంత్రం ఉంది అని. నీన్ను తర్వాత చూస్తాను అని వెళ్లిపోతాడు. ఇప్పుడైతే బతికిపోయాను. రాణి చాలా సంతోషించింది. సంతోషాన్ని ఆపుకోలేకపోయింది తన సేవకురాలితో అంటుంది నా మృత్యువు జరిగెది ఉండేను, కానీ నా గురుదేవులు నన్ను కాపాడారు. రాజు దగ్గరికి వెళ్తుంది మరియు చెబుతుంది. ఈ రోజు నా ప్రాణాలు పోయి ఉండెవి నాగురుదేవులు నన్ను రక్షించారు. నన్ను చంపడానికి కాల్ వచ్చియుండెను. రాజా అంటాడు నీవు ఇలాంటి కథలు చెబుతునే ఉంటావు. కాల్ వచ్చెదుంటే నిన్ను విడిచిపెడతాడా? ఈ సంత్ లు అలనే భయపెట్టిస్తుంటారు. రాజుగారి మాటని రాణి ఎలా అంగీకరిస్తుంది? సంతోషంతో రాణి తన గదిలోకి వెళ్ళి పడుకుంటుంది. కొంత సమయం తరువాత పాము వేషం ధరించి కాల్ వస్తాడు మరియు రాణిని కరుస్తాడు. పాము కాటు వేయగానే రాణికి తెలుస్తుంది. రాణి బిగ్గరగా అరుస్తుంది. నన్ను పాము కాటు వేసింది అని. సేవకులు పరుగెడుతారు. చూసిచూడగానే ఒక మోరి (నీరు పోవు చిన్న రంధ్రం) నుండి ఆ పాము వెళ్ళిపోతుంది. తన గురుదేవులని పిలిచి రాణి స్పృహ కోల్పోతుంది. కరుణామయ (కబీర్) సాహెబ్ అక్కడ ప్రకటితులౌతారు. జనులకు చూపుటకు ఎదో మంత్రం అంటారు (వారు వాస్తవానికి మంత్రం చెప్పకుండా కూడ ప్రాణం పోయగలరు, ఏ మంత్ర తంత్రం అవసరం లేదు) ఇంద్రమతిని జీవితులుగా చేస్తారు. రాణి చాలా ధన్యవాదాలు తెలుపుతు హే బంది ఛోడ్ ఒకవేళ నేను ఈరోజు నేను మీ శరణులో

లేనిచో నా మృత్యువు అవుతుండెను.కరుణామయ (కబీర్) సాహెబ్ అన్నారు ఇంద్రమతి! నేను కాల్‌ని నీ ఇంటికి కూడ రానిచ్చేవాడిని కాదు. నీపై పాము కాటుకూడ వేసేది కాదు. కానీ నీకు విశ్వాసం కాదు. నీవు ఆలోచించె దానివి నా పై ఎలాంటి ఆపద వచ్చేది రాకుండె గురువుగారు నన్ను అనవసరంగా భయపెట్టి నామదానం ఇచ్చారుఅని. అందువలన నీకు కొంచం ఈ విధంగా చూపించాల్సి వచ్చింది. లేదంటే కుమారి నీకు విశ్వాసం అయ్యేది కాదు.

ధర్మదాస్ యహా ఘనా అంధేరా, బిన్ పరచయ్ జీవ జమ కా చేరా ।

కబీర్ సాహెబ్ అంటారు ఇక నేను ఎప్పుడు అనుకుంటే అప్పుడు నీ మృత్యువు అవుతుంది. గరీబదాస్ అంటారు :-

గరీబ, కాల్  డరై కరతార్ సే, జయ జయ జయ జగదిశ్ ।
జౌరా జౌరి ఝూడతి, పగ్ రజ్ డారే శిశ్ ॥

ఈ కాల్, కబీర్ భగవాన్ (కబీర్ పరమేశ్వర్) కి భయపడుతాడు మరియు ఈ మృత్యువు కబీర్ సాహెబ్ గారి బూట్లు తుడుస్తుంది. అనగా పనిమనిషి లాంటిది. ఆ ధూళిని తన నుదుటిపై రాసుకుని మీ భక్తుల దగ్గరికి వెళ్లను అని అంటుంది.

గరీబ్, కాల్ జో పిసై పిసనా, జౌరా హై పనిహార్ ।
యే దో అసల్ మజుర్ హై, మేరే సాహెబ్ కే దరబార్ ॥

ఈ కాల్ ఎవరైతే 21 బ్రహ్మాండాలకి భగవానుడో మరియు బ్రహ్మా, విష్ణు మరియు మహేశ్ యొక్క తండ్రియో, ఆయన నా కబీర్ పరమేశ్వర్‌గారి వద్ద పిండి పిసుకుతాడు అనగా పనిమనిషి మరియు మృత్యువు నా కబీర్ పరమేశ్వరుడి నీళ్లు నింపుతుంది అనగా ఒక విశేషమైన పనిమనిషి. ఈ రెండు పని మనుషులు కబీర్ పరమేశ్వరుడి దరబారులో ఉన్నారు. కొన్ని రోజుల తరువాత కబీర్ పరమేశ్వర్ మరల వచ్చి రాణి ఇంద్రమతికి సతనామాన్ని ప్రసాదిస్తారు.

తరువాత కొన్ని రోజులు అయినాకా కరుణామయ సాహెబ్ ఇంద్రమతి యొక్క అతి శ్రద్ధని చూసి సారనామాన్ని కూడ ప్రసాదిస్తారు. అనగా శబ్దాన్ని ప్రసాదిస్తారు.కరుణామయ సాహెబ్ (కబీర్) రాణి ఇంద్రమతికి సమయ-సమయంపై దర్శనం ఇవ్వడానికి వెళ్లెవారు. అప్పుడు ఇంద్రమతి ప్రార్థన చేసేది. తన భర్తని కూడ నచ్చచెప్పి, అంగీకరించునట్లు చేయ్యండి అని. మీ చరణాలలో వారు కూడ వస్తే నా జీవితం సఫలం అవుతుంది.కరుణామయ సాహెబ్ చంద్రవిజమ రాజుతో చంద్రవిజయ్‌గారు! మీరు కూడ ఈ నామాన్ని తీసుకోండి, ఇది రెండు రోజుల రాజ్యం మరియు రాజహాసం మాత్రమే. తరువాత 84లక్షల యోనిల యందు ప్రాణి వెళ్లిపోతాడు. చంద్రవిజయ్ అంటారు భగవాన్ నేను నామాన్ని తీసుకోలేను మరియు మీ శిష్యరికాన్ని వద్దనుకోవడం లేదు. కావాలంటే భాండాగారంలోని సంపదని దానం ఇవ్వండి, కావాలంటే ఎలాంటి సత్సంగాన్ని చెయించండి, నేను కాదనను. కరుణామయ సాహెబ్ అడిగారు మీరు నామాన్ని ఎందుకు తీసుకోరు? రాజు అనినారు నేను పెద్ద పెద్ద రాజుల యొక్క విందులకి వెళ్లాల్సి ఉంటుంది. కరుణామయ సాహెబ్ అడిగారు విందులకి వెళ్లుటకు నామం ఏలా అడ్డంకి అవుతుంది? సభకు వెళ్లండి, అక్కడ కాజు తినండి, పాలు

తాగండి, శరబత్ తాగండి, మద్యంను మాత్రము ముట్టకండి. మద్యం సేవించడం మహాపాపమైనది. కానీ రాజు వినలేదు.

రాణి యొక్క ప్రార్థనపై కరుణామయ సాహెబ్‌గారు రాజుకి మరల నచ్చచెప్పారు. నామం లేకుండా ఈ జీవితం వ్యర్థం అవుతుంది. మీరు నామాన్ని తీసుకుండి. రాజా మరల అంటారు గురుజీ! నన్ను నామం తీసుకోమని అనకండి. నేను మీ శిష్యరికంను కాదనడం లేదు. కావాలంటే ఎంతైన దానం చేయండి, ఎంతైన సత్సంగం చేయండి. కరుణామయ సాహెబ్‌గారు ఇంద్రమతితో కుమారి! ఈ రెండు రోజుల సుఖాన్ని చూసి ఇతని బుద్ధి భ్రష్టుపట్టి ఉంది. నీవు ప్రభు చరణాలయందు నిల్చి ఉండు. నీ ఆత్మకళ్యాణం చేసుకో. ఇక్కడ ఏవరు ఎవరికి భర్త కారు, ఏవరు ఎవరికి భార్య కాదు. పూర్వ జన్మ సంస్కాలములవలన కలుగు రెండు రోజుల సంబంధం ఇది. నీ కర్మని నీవు తయారు చేసుకో. ఇంద్రమతి 80 సం॥ల ముదుసలి అయింది. ఎక్కడో 40 సం॥లకి చనిపోవాల్సిన ఆమె శరీరం ఊగుచుండెను, అప్పుడు కరుణామయ సాహెబ్ అంటారు చెప్పు ఇంద్రమతి ఏం కోరుకుంటున్నావు? సతలోకానికి వెళ్దామా? ఇంద్రమతి అంటుంది పరమేశ్వర్ నేను తయారై ఉన్నాను. పూర్తిగా తయారై ఉన్నాను దాతా తీసుకెళ్లండి. కరుణామయ సాహెబ్ అంటారు మనుమడు , మనువరాల్ల యందు ఎమైన మమత ఇంకా మిగిలి ఉందా? రాణి అంటుంది లేదు ప్రభు కించిత్ మాత్రం కూడా లేదు. మీరు జ్ఞానమే నిర్మలంగా ఇచ్చేశారు. ఇక ఈ చెడు లోకం గురించి ఏం ఇష్టాన్ని చూపను? కరుణామయ సాహెబ్ అంటారు పద కుమారి అని. రాణి ప్రాణ త్యాగం అయింది. పరమేశ్వర్ కబీర్ (కరుణామయ) బంధ విముక్తి కలిగించువారు రాణి ఇంద్రమతి ఆత్మని పైకి తీసుకెళ్తారు. ఈ బ్రహ్మాండంలోనే ఒక మానసరోవరం ఉంది. ఆ మానసరోవరంపైకి వెళ్లి ఈ ఆత్మకి స్నానం చేయించాల్సి ఉంటుంది. ఈ ప్రాణిని కబీర్ పరమేశ్వర్ పూర్తి గురు రూపంలో ప్రకటితులై కొంత సమయం వరకు మానసరోవరంపై ఉంచుతారు. కబీర్ పరమేశ్వర్ మరల ఇంద్రమతిని అడుగుతారు ఈ సంసారంలో నీకు ఏదైనా ఇష్టం ఉంటే మరల జన్మించాల్సి ఉంటుంది. మనసులో ఏదైనా కోరిక ఉంటే సతలోకానికి వెళ్లలేవు. ఇంద్రమతి అంటుంది సాహెబ్ మీరు అంతర్యామి, ఏ కోరిక లేదు. మీ చరణాల కోరికయే ఉంది. కానీ మనసులో ఒక శంఖా ఉన్నట్లు ఉంది. నా భర్త నన్ను ఏప్పుడు ధార్మిక పనులు చేయవద్దని చెప్పలేదు. లేదంటే ఈ రోజుల్లో భర్తలు భార్యల మాటలు వినరు కదా. ఒకవేళ ఆయన నన్ను వద్దనంటే నేను మీ పాదాల యందు ఉండెదానిని కాదు. నా ఆత్మకళ్యాణం జరిగెది కాదు. అతనికి ఈ శుభ కార్యంయందు సహాయం చేసినందుకు ఏమైనా లాభం లభిస్తే ఏప్పుడైన ఆయనపై దయని కురిపించండి దాతా. కబీర్ పరమేశ్వర్ చూశారు ఈ అమాయకురాలు అతని వెంట మరల పడిపోయింది. సాహెబ్ అన్నారు, సరే కుమారి, ఇక రెండు, మూడు సంవత్సరాలు ఇక్కడె ఉండు.

రెండు సంవత్సరాల తరువాత రాజు కూడ చనిపోవుచుండెను. ఎందుకంటే నామాన్ని తీసుకోలేదు. యమదూతలు వచ్చినారు. రాజు దరబారమందు కళ్లు తిరిగి పడిపోయాడు. యమ దూతలు అతని మెడని ఒత్తుతారు. రాజుకి మల మూత్రం బయటకు వస్తాయి.

కరుణామయ కబీర్ పరమేశ్వర్ రాణితో అంటారు చూడు నీ రాజు యొక్క పరిస్థితి ఏమౌతుందో? అక్కడ మానసరోవరం నుండి పరమేశ్వరులు చూపించారు. ఇదంతా చూసి రాణి అంటుంది చూడండి దాతా ఒకవేళ అతడి భక్తి యందు సహాయం చేయుట యందు ఏమైన ఫలం లభిస్తే అతనిపై దయ చూపండి. రాణికి అయినాకూడ కొంచెం మమత ఉండింది. కబీర్ పరమేశ్వర్ ఆలోచించారు. ఈమే మరల కాల్ వలలోకి పడుతుంది. ఇలా ఆలోచించి మానసరోవరం నుండి ఎక్కడైతే రాజా చంద్రవిజయ్ తన దర్బారులో అచేతనంగా పడిఉన్నాడో అక్కడికి వెళ్లారు. యమదూతలు ఆయన ప్రాణాన్ని తీస్తున్నారు. కబీర్ పరమేశ్వర్ రావడంతోనే యమదూతలు ఆకాశంలోకి ఎగిరిపోయారు. ఎలైఐతే గద్దలు శవంనుండి ఎగిరిపోతాయో అలా. చంద్రవిజయ్ చేతనం వస్తుంది. ఎదుట కరుణామయ సాహెబ్ నిలబడి ఉన్నారు. కేవలం చంద్రవిజయ్ కి మాత్రమే కనిపిస్తున్నారు. వేరేవాళ్లకి కనిపించడం లేదు. చంద్రవిజయ్ చరణాలయందు పడిపోయారు. నన్ను క్షమించండి, నన్ను కాపాడండి అని యాచించారు. ఎందుకంటే రాజాకి అర్థం అయింది ఇక నా ప్రాణాలు పోతున్నాయి అని. (ఎప్పుడైతే ప్రాణాంపైకి వస్తుందో అప్పుడు కళ్లు తెరుస్తాయి కదా) అందుకే క్షమించండి ధాతా, నా ప్రాణాన్ని కాపాడండి ప్రభు అని ప్రార్థిస్తున్నాడు. కబీర్ పరమేశ్వర్ అంటారు రాజా నేడు కూడ అదే మాట , ఆ రోజు కూడ అదే మాట అన్నాను, నామం తీసుకోవాల్సిందే. రాజా అంటారు నేను నామం తీసుకుంటాను, ఇప్పుడే తీసుకుంటాను. కబీర్ పరమేశ్వర్ గారు నామ ఉపదేశాన్ని ఇస్తారు మరియు అంటారు నేను నీకు రెండు సం॥ల ఆయువుని ఇస్తున్నాను, ఒకవేళ ఇందులో ఒక శ్వాస కూడ వ్యర్థంగా పోయిందో నీ కర్మదండన ఉండిపోతుంది.

కబీర్, జీవన తో థోడా భలా, జై సత సుమరణ హెూ । లాఖ వర్ష కా జీవనా, లేఖే ధరే నా కో ॥

శుభకర్మ యందు సహాయం చేయడంవలన పొందిన పూర్వపు కర్మ మరియు శ్రద్ధతో రెండు సంవత్సరాల స్మరణ మరియు మూడు నామాలని ప్రసాదింపచేసి కబీర్ పరమేశ్వర్ చంద్రవిజయ్‌ని కూడ భవసాగరం నుండి దాటిస్తారు. అనండి (కబీర్ పరమేశ్వర్) “ కవిర్దేవ్ కీ జయ్ ”. “ జయ్ బంది ఛోడ్ ”

కబీర్ పరమేశ్వర్ నిజమైన శ్రద్ధాలు యొక్క ఆయువుని పెంచుతారు మరియు అతని కుటుంబాన్ని రక్షిస్తారు. అని పై వివరణ ద్వారా తెలుస్తుంది. ఈ ప్రమాణములు చాలా పూర్వపువి. వర్తమానంలో పూజ్య కబీర్ పరమేశ్వర్ గారి శక్తితో సతగురు రామపాల్‌దాస్ గారి ద్వారా అయిన కష్టనివారణ మరియు ఆయుస్సు వృద్ధి యొక్క చాలా ప్రమాణాలని చదవండి ఈ పుస్తకంలోని ‘దారి తప్పిన వారికి మార్గ విషయాలు’ అను అధ్యాయంలో.

## “పవిత్ర పురాణముల రహస్యములు”

పురాణములని అర్థం చేసుకోడానికి కృపతో గుర్తుంచుకోండి శ్రీ బ్రహ్మ పురాణం, శ్రీ విష్ణు పురాణం మరియు శ్రీ శివ పురాణం బ్రహ్మ (కాల్) యొక్క లీల నుండి ప్రారంభమవుతాయి, దేనిలో అయితే ప్రథమ అవ్యక్త గీతా అధ్యాయం **7** శ్లోకం **25** లో చెప్పబడినది. ఎవరైతే గీతా అధ్యాయం. **11** శ్లోకం **32** లో చెప్పినారు “ నేను కాల్‌ని” అని. ఇతనినే క్షర పురుషుడు

మరియు జ్యోతినిరంజన్ అని కూడ అంటారు. ఇంకయు సదాశివ, కాలరూపి బ్రహ్మ అని కూడ అనబడతాడు. ఈయనే బ్రహ్మండంలోని ఒక బ్రహ్మలోకంను రచించి దానికి పైన కల భాగంలో ఉంటారు.

ఈయనే మహావిష్ణువు, మహాబ్రహ్మ మరియు మహాశివుడిగా అనబడుతారు మరియు ఆ క్షేత్రమును కాశీ కూడ అంటారు. అందులోనే రజగుణ ప్రధాన, సతగుణ ప్రధాన, తమోగుణ ప్రధాన మూడు స్థానంలను తయారుచేసుకుని తన భార్య దుర్గా (మహాలక్ష్మి) ని తోడుగా ఉంచుకుని ముగ్గురు కుమారులని రజగుణ శ్రీ బ్రహ్మ, సతగుణ శ్రీ విష్ణు, తమోగుణ శ్రీ శివ గారి ఉత్పత్తి చేసి అచేతులని  చేస్తారు. అచేతన స్థితిలోనే వారి పోషణ చేస్తుఉంటాడు. వయస్కులైన పిదప శ్రీ బ్రహ్మ గారిని కమలం పువ్వుపై, శ్రీ విష్ణుగారిని శేషనాగుపై, శ్రీ శివుడిని కైలాస పర్వతంపై సచేతులని చేస్తాడు. ఈ ముగ్గురు  ప్రభువులకి స్వయం జ్ఞానం లేదు మా ఉత్పత్తి కర్తా ఎవరు అని? ఈ కాల రూపి బ్రహ్మయే విష్ణు రూపం ధరించి తన నాభి నుండి కమలం ను ఉత్పత్తి చేసి దానిపై శ్రీ బ్రహ్మగారిని ఉంచి సచేతనంగా చేస్తాడు. ఇతడే ఎపుడు అనుకుంటే అపుడు శ్రీ బ్రహ్మ, శ్రీ విష్ణు, శ్రీ శివ రూపంను ధరించి కనిపిస్తారు.  ఈ కాల్ తన వాస్తవిక రూపంలో ఎప్పటికి ప్రకటింపబడదు. ఎదైతే కాల్ శ్రీ గీతా యొక్క జ్ఞానం ఇస్తున్న సమయంలో చూపించినారు. గీతా అధ్యాయం **10** మరియు **11** లో ప్రమాణం ఉంది. గీతా అధ్యాయం **11** శ్లోకం **47-48** లో చెప్పుచున్నాడు అర్జున్! ఇది నా వాస్తవిక కాల రూపం నీవు కాకుండా అంతకుముందు ఎవరు చూడలేదు మరియు చూడనులేరు. ఇది నేను నీపై అనుగ్రహించి చూపించితిని. ఈ వేయ్యి భుజాలు మరియు నేత్రములు మొ॥గు కాల రూపం వేదాలలో వర్ణిత విధి ద్వారా అనగా యజ్ఞం, ఓం నామ జపం మొ॥గు వాటి ద్వారా ఏన్నటికి చూపించబడదు. భావార్థం ఏమిటంటే వేదాలలో వర్ణిత విధి అనుసారంగా ప్రభువు ప్రాప్తించదు. ఇందువలనే ఋషులు మునులు  వేదాలలో 'ఓం' నామం ప్రభుని పొందడానికి అని తెలుసుకుని ప్రభు ప్రాప్తి కోసం యజ్ఞం మరియు ఓం నామ జపం యొక్క ఘోర సాధనలు చేసిరి, కానీ ' బ్రహ్మ' దర్శనం అవలేదు. ఒకరు కమలంల ప్రకాశంను చూసినారు. ఒకరు శరీరంలో జ్యోతిని చూసిరి మరియు ధ్వనిని వినిరి, అవి కాల్ యొక్క మాయలు. ఒకరు ఒకరు సహస్ర కమలంల యొక్క వేయ్యి జ్యోతిల నుండి వెలువడు ప్రకాశంను చూసి ప్రభు ప్రాప్తించినారు అని అనుకునిరి. ఎలాఐతే ఎదైన స్థానం పై ఒక్క రంగువి వెయ్యి బల్బులు ఒకదానితో ఒకటి జత చేసి గుండ్రంగా వెలుగించినారు. దూరం నుండి చూసేవారికి ఒక ప్రకాశ సమూహంగా కనపడుతుంది. దగ్గరికి వెళ్లితే తెలుస్తుంది ఇది అయితే బల్బుల ప్రకాశం అని.

ఈ విధంగా కొంత మంది సాధకులు హఠయోగం చేసి శరీరంలో అనంతర్ముఖం అయి, కొన్ని అతిశయాలని చూసి ప్రభువు యొక్క ప్రాప్తి అనుకుంటారు. ఆ కాల్ జాలంను (మాయని) ఆనందంగా భావించి తమ అమూల్యమైన జీవనాన్ని నష్టం చేసుకుంటారు. వేదాలలో స్పష్టంగా రాసి ఉంది పరమేశ్వరులు సశరీరంగా ఉన్నారు. యజుర్వేద అధ్యాయం **1** మంత్రం **15** మరియు అధ్యాయం **5** మంత్రం **1** లో ప్రమాణం ఉంది-

అగ్నే తనుర్ అసి । విష్ణవే త్వా సోమస్య తనుర్ అసి ॥

భావార్థం ఏమిటంటే పరమేశ్వరులు సశరీరంగా ఉన్నారు. ఆ సర్వ పాలన కర్తా అమర్ పురుష్ (సతపురుష్) యొక్క శరీరం ఉంది అనగా పరమేశ్వరులు ఆకారంలో ఉన్నారు. ఇందువలనే ఋషులు ప్రభు దర్శనం కోసం ఘోర సాధనలు చేసిరి. కానీ వేదాలలో వర్ణిత విధి ద్వారా ప్రభు ప్రాప్తి అవదు. ఇందువలనే నేటి వరకు సర్వ సాధకులు, ఋషులు తమ అనుభవం యొక్క పుస్తకములని రచించిరి ఎవైతే వేద జ్ఞానంకు విరుద్ధంగా ఉన్నవి. ఇపుడు సర్వ భక్త సమాజం పవిత్ర వేదాల స్థానంలో అన్య మహర్షిలు లేదా సంత్‌లు అనుభవంతో తయారైన పుస్తకాల జ్ఞానం పై ఆధారితమై ఉన్నది.

పవిత్ర వేదాలు మరియు శ్రీ మద్ భగవత్ గీతా యొక్క జ్ఞానదాతా బ్రహ్మ అంటున్నాడు మూడు గుణాలు (రజగుణ శ్రీ బ్రహ్మా, సతగుణ శ్రీ విష్ణు, తమోగుణ శ్రీ శివ) ఇష్ట రూపంతో పూజ యోగ్యులు కారు, ఎందుకంటే వీరు నాశనం కలవారు మరియు కర్మ ఫలంను ఉన్నది ఉన్నట్లు ఇస్తారు. పాపంను (క్షమ) పోగొట్టలేరు. వీరిని పూజించు భక్తులకి ప్రారబ్ధంలో రాసిన కష్టములు అనుభవించాల్సి ఉంటుంది. ఈ ముగ్గురు ప్రభుల సాధనా వలన క్షణిక సుఖములు ప్రాప్తిస్తాయి కావచ్చు కానీ మోక్షం అవదు మరియు ముగ్గురు ప్రభువులనుండి (రజగుణ శ్రీ బ్రహ్మా, సతగుణ శ్రీ విష్ణు, తమోగుణ శ్రీ శివ) లభించు క్షణిక సుఖములపై ఎవరి ఆస్థా ఉంటుందో, వారు రాక్షస స్వభావంను ధరించినవారై, మనుషులలో నీచ, దుష్కర్మ చేయు, మూర్ఖులు నన్ను (కాల్) కూడ భజించరు (ప్రమాణం కోసం శ్రీ మద్ భగవత్ గీతా అధ్యాయ 7 శ్లోకం 12 నుండి 15 వరకు). ఎందుకంటే బ్రహ్మ సాధకులు చాలా సమయం వరకు బ్రహ్మలోకంలో కల మహాస్వర్గంలో తన నామ మరియు పుణ్య సంపాదన వలన ఉంటాడు. ఇందువలనే కాల్ అంటాడు ముగ్గురు దేవతలకంటే నేను కొంత ఎక్కువ సుఖంను ఇవ్వగలను. కానీ ఈ బ్రహ్మ లోకం మరియు కాల్ కూడ నాశనం కలవారు. గీతా అధ్యాయం 8 శ్లోకం 16 లో చెప్పబడినది బ్రహ్మలోకం వరకు అన్ని లోకాలు నాశనం కలవి మరియు గీతా అధ్యాయం 2 శ్లోకం 12 మరియు అధ్యాయం 4 మంత్రం 5 లో బ్రహ్మ అంటున్నాడు నాది కూడ జన్మ మృత్యువు అవుతుంటుంది అనగా నాశనం కలవాడను. ఇందువలనే గీతా అధ్యాయం 7 శ్లోకం 18లో అనినారు ఎ నాలుగు విధాలైన నా (బ్రహ్మ) సాధకులు ఎవరైతే జ్ఞానులు, వారు వేదాల జ్ఞాన ఆధారంపై తెలుసుకున్నారు కేవలం ఒక పూర్ణ పరమాత్మయే ఇష్ట రూపంలో పూజ్యులు. వారు వేదాలనుండి స్వయంగా గ్రహించిన విషయం ఏమిటంటే 'ఓం' అను మంత్రం ఒక్కటే ప్రభు ప్రాప్తిని ఇవ్వగలదు. ఈ ఓం మంత్రం యొక్క జపంతో వేల సంవత్సరాలు సాధన చేసి తమ శరీరాన్ని త్యాగం చేసిరి. కానీ ప్రభు దర్శనం అవలేదు, మిగతా లాభంలు పొందినారు. కొన్ని సిద్ధులు ప్రాప్తించాయి మరియు స్వర్గ మహాస్వర్గం మొ॥ ఉన్నత పదవులు ప్రాప్తించాయి. తరువాత భజన సంపాదన మరియు పుణ్యంల సంపాదన సమాప్తం అయినాకా మరల జన్మ మృత్యువు మరియు 84 లక్షల ప్రాణుల శరీరాలలో ఘోర కష్టం మరియు నరకంలో పాప కర్మ యొక్క ఫలం అనుభవించడం అలానే ఉండింది.

పవిత్ర యజుర్వేద అధ్యాయం 40 మంత్రం 10 మరియు గీతా అధ్యాయం 4 మంత్రం

34లో కాల్ అంటున్నాడు ఆ పరమేశ్వరుడి గురించి పూర్తి విషయం నాకు (కాల్) తెలియదు. ఆ పరమేశ్వరుడి విషయంలో పూర్ణ సమాచారం అనగా తత్వజ్ఞానం మరియు ఆ పరమాత్ముడిని పొందు విధి అనగా పూర్ణ మోక్షం యొక్క మార్గ సమాచారం కోసం తత్వదర్శి సంత్ కోసం వెదకాలి. తరువాత వారు ఏలా చెబుతారో అలా చేయ్యండి. దాని తరువాత ఆ పరమపద పరమేశ్వరుడిని వెదకాలి, ఎందులోకి వెళ్లిన సాధకులు తిరిగి సంసారంలోకి రారు అనగా పూర్ణ మోక్షం పొంది ఎల్లప్పటికి జన్మ మృత్యువు మరియు 84 లక్షల యోనిల కష్టం మరియు నరకం యొక్క పీడా కష్టం నుండి విముక్తులు అవుతారు మరియు పూర్ణ శాంతిని పొంది అవినాశి లోకం అనగా సతలోకంను పొందుతారు (ప్రమాణం గీతా అధ్యాయం. 15 మంత్రం 1 నుండి 4 మరియు అధ్యాయం. 18 శ్లోకం 62 మరియు ఋగ్వేద మండల 1 సూక్తం 24 మంత్రం 1-2).

తత్వదర్శి సంత్ లభించకపోవడం వలన సర్వ ఋషిజనులు వేదాల అనుసారంగా సాధనా చేసి మహాకష్టంలోనే ఉండిపోయిరి. ఇందువలనే గీతా అధ్యాయం. 7 శ్లోకం 18లో చెప్పబడింది ఎ జ్ఞాని ఆత్మా ఉందో, వారు ఉదారులు, ఎందుకంటే ప్రభు ప్రాప్తి కోసం తనవు మనసు ధనం తో వేదాల అనుసారంగా సాధన చేస్తారు, కానీ వారు కూడ నా (కాల్) యొక్క అతి అనుత్తమ గతి అనగా సాధనా వలన లభించు లాభంపైనే ఆశ్రితులుగా ఉండిరి, దానివలన వీరి పూర్ణ మోక్షం కాజాలదు. జన్మ మృత్యువు మరియు వివిధ ప్రాణుల శరీరాలలో మరియు నరకంలో కర్మాధారం పై కష్టం ఏన్నటికి సమాప్తం అవదు.

జ్యోతి నిరంజన్ ప్రతిజ్ఞ చేసియున్నాడు నేను ఏప్పటికి, ఎవరికి, ఏ సాధనా ఫలితంగా తన వాస్తవిక కాల్ రూపంలో దర్శనం ఇవ్వను అని. ఇందువలనే కాల్ తన కొడుకుల (బ్రహ్మా, విష్ణు, శివ) రూపంలో కనిపించి నానా చరిత్రలు చేస్తాడు. ఇందువలనే మిగతా జనులు అనుకుంటారు ఈ లీల భగవాన్ విష్ణు చేసినారు, ఎపుడైన అంటారు ఈ లీల శ్రీ బ్రహ్మా చేసినారు అని, ఒకసారి అంటారు ఈ లీల శ్రీ శివుడు చేసినారు అని. సామాన్య వ్యక్తి అంటాడు శ్రీ బ్రహ్మాగారి ఉత్పత్తి శ్రీ విష్ణుగారి నాభి నుండి కమలంపై అయ్యింది అని. ఆ సమయంలో శ్రీ విష్ణువు రూపంలో కాల్ తన నాభి నుండి కమలంను ప్రకటింప చేసి ఉండెను.

బ్రహ్మా పురాణం (సృష్టి యొక్క వర్ణన కల అధ్యాయం) లో శ్రీ లోమహర్షణ ఋషి (ఆయనని సూతజీ అని కూడ అంటారు) గారు తన గురుదేవులు శ్రీ వ్యాస ఋషి నుండి వినిన జ్ఞానం చెప్పినారు. శ్రీ వ్యాసుడు శ్రీ నారదుడి నుండి వినిరి మరియు శ్రీ నారదులు తన తండ్రి శ్రీ బ్రహ్మా గారి ద్వారా సమాచారంను పొంది ఉండిరి. శ్రీ బ్రహ్మాగారికి స్వయం జ్ఞానం లేదు నేను ఎక్కడినుండి ఉత్పన్నం అయినాడు (శ్రీ దేవిమహాపురాణం మూడవ స్కందం). దీని భావార్థం పురణాలలో కల జ్ఞానం తప్పు అని కాదు. ఏ జ్ఞానం శ్రీ బ్రహ్మా గారు సచేతులు అయిన పిదప చెప్పిరి అది అక్కడి వరకు సరియైనది. కానీ చేతనం కాక ముందు కల జ్ఞానం కల్పిత కథ (లోకవేదం). ఏదైతే పూర్ణ పరమేశ్వర్ ప్రథమ సతయుగ లో సత సూకృత్ నామంతో ప్రకటితులై తత్వదర్శి సంత్ రూపంతో తత్వజ్ఞానం మరియు వాస్తవిక సృష్టి రచనా యొక్క జ్ఞానం శ్రీ బ్రహ్మా మరియు శ్రీ మను మొ॥వారికి ఇచ్చియుండిరి. వారు విని కూడ విననట్టు ఉండినారు. అటు తరువాత ఎపుడైతే ఆయన వంశమే అడిగినపుడు ఆ విని వినని జ్ఞాన ఆధారంపై కొంత

జోడించి పూర్వపు జ్ఞానం చెప్పినారు. అందువలనే ఏ పురాణం నిర్ణాయక జ్ఞాన యుక్తంగా లేదు. ఎద్దైన పురాణం యొక్క ఆధారంగా సిద్దిస్తుంది శ్రీ విష్ణుగారి ఉత్పత్తి శ్రీ బ్రహ్మాగారి నుండి అయింది, ఇంకో పురాణం నుండి తెలుస్తుంది శ్రీ బ్రహ్మా గారి ఉత్పత్తి శ్రీ విష్ణు నుండి అయింది మొ॥-మొ॥. ఇందువలన అందరు ఋషులు మరియు శ్రీ బ్రహ్మా, విష్ణు మరియు శివుడు కూడ సంశయంలోనే ఉన్నారు.

## "శ్రీ బ్రహ్మా మరియు శ్రీ విష్ణువుల యుద్ధం"

శ్రీ శివ పురాణం (విధ్యేశ్వర సంహిత అధ్యాయం 6 అనువాద కర్తా దిన దయాల శర్మా, ప్రకాశకులు రామాయణ ప్రెస్ ముంబయి, పేజి. 67 మరియు సంపాదకులు పండిత రామలగ్న పాండెయ్ " విశారద్" ప్రకాశకులు సావిత్ర ఠాకూర్, ప్రకాశన్ రథయాత్రా వారాణసి, బ్రాంచ్ -నాటి ఇమలి వారాణసి యొక్క విధ్యేశ్వర సంహిత అధ్యాయం 6, పేజి 54 మరియు టీకాకార్ డా. బ్రహ్మానంద త్రిపాఠి సాహిత్య ఆయుర్వేద జ్యోతిష ఆచార్య, ఎమ్.ఎ, పి.హెచ్.డి., డి. ఎస్., సి.ఎ..ప్రకాశక్ చౌఖమ్బా సంస్కృత ప్రతిష్ఠాన్, 38 యు.ఎ., జవాహర్ నగర్, బంగలో రోడ్, ఢిల్లీ, సంస్కృత సహిత శివ పురాణం యొక్క విధ్యేశ్వర సంహిత అధ్యాయం 6 పేజి 45 పైన)

శ్రీ బ్రహ్మా, శ్రీ విష్ణువు గారికి దగ్గరికి వచ్చినాడు. ఆ సమయంలో శ్రీ విష్ణువు లక్ష్మీ సహితంగా శేష శయ్యపై పడుకుని ఉండిరి. తోడుగా అనుచరులు కూడ కూర్చుని ఉండిరి. శ్రీ బ్రహ్మాజీ అంటారు విష్ణువుతో కుమారా, లే నీ తండ్రిని వచ్చితిని. నేను నీ ప్రభువుని. దీని పై విష్ణు గారు అంటారు రండి, కూర్చొండి నేను మీ తండ్రిని. నీ ముఖం వంకరగా ఎందుకు అయ్యింది. బ్రహ్మా అంటాడు హే కుమారా నీకు అభిమానం ఎక్కుల అయింది, నేను నీ సంరక్షుడిని కాను. కానీ సమస్త జగత్తు యొక్క తండ్రిని. శ్రీ విష్ణువు అంటారు రే దొంగ! నీవు నీ పెద్దరికం ఏం చూపెడతావు? సర్వ జగత్తు నాలోనే నివాసం ఉంటుంది. నీవు నా నాభి కమలం నుండి ఉత్పన్నం అయినావు మరియు నాతోనే ఇలా మాట్లాడుతున్నావు. ఇంతయు అనుకుని ఇద్దరు ప్రభువులు ఆయుధాలతో కోట్లాడుకోన సాగిరి. ఒకరినోకరు వక్షస్థలంపై గాయపర్చుకున్నారు. ఇది చూసి సదాశివ (కాల్ రూపి బ్రహ్మ) ఒక తేజోమయ లింగమును వారిద్దరి మధ్యన నిలబెట్టినాడు, అపుడు వారి యుద్ధం సమాప్తం అయింది. (ఈ వివరణ గీతా ప్రెస్ గోరఖపూర్ వారి శివపురాణం నుండి ఉంది. కానీ మూల సంస్కృత సంహిత ఎదైతే పైన రాసి ఉందో మరియు మిగతా ఇద్దరు సంపాదకులు మరియు ప్రకాశకుల శివపురాణంలో సరిగా ఉంది).

విచారం చేయండి- శ్రీ శివ పురాణం, శ్రీ విష్ణు పురాణం మరియు శ్రీ బ్రహ్మా పురాణం మరియు శ్రీ దేవి మహాపురాణంలో ముగ్గురు ప్రభువులు మరియు సదాశివ (కాల్ రూపి బ్రహ్మ) మరియు దేవి (శివా- ప్రకృతి) యొక్క జీవన లీలలు కలవు. వీటి ఆధారంగానే సర్వ ఋషిజనులు మరియు గురుజనులు జ్ఞానంను వినిపించేవారు. ఒకవేళ ఎవరైన పవిత్ర పురాణాల కంటే భిన్నంగా చెబుతాడో, అది పాఠ్యక్రమంకు విరుద్ధ జ్ఞానం అవడం వలన వ్యర్థమైనది.

పై యుద్ధం యొక్క వివరణ శివ పురాణం నుండి ఉంది, అందులో ఇద్దరు ప్రభువులు ఐదు సంవత్సరాల పిల్లవాడిలా కోట్లాడుకొనుచున్నారు. వారు అంటారు నీవు నా కొడుకువి, రెండవవాడు అంటాడు నీవు నా కొడుకువి, నేను నీ తండ్రిని. తరువాత ఒకరినోకరు గల్లలు

పట్టుకుని పిడి గుద్దులు మరియు కాళ్లతో తన్నుకుంటు కోట్లాట చేస్తారు. ఇదే త్రిలోక నాథుల చరిత్ర.

పై మూడు పురాణాల (శ్రీ శివ పురాణం, శ్రీ విష్ణు పురాణం మరియు శ్రీ బ్రహ్మ పురాణం) ప్రారంభం అయితే కాల్ రూపి బ్రహ్మ అనగా జ్యోతినిరంజన్ నుండియే అవుతుంది, ఎవరైతే బ్రహ్మలోకంలో మహాబ్రహ్మ, మహావిష్ణువు మరియు మహాశివ రూపంను ధరించి ఉంటాడు మరియు తన లీల కూడ పై రూపాలలోనే చేస్తాడు. తన వాస్తవిక కాల్ రూపంను దాచి ఉంచుతాడు మరియు తరువాత వివరణ రజగుణ బ్రహ్మ, సతగుణ విష్ణువు మరియు తమోగుణ శివుడి యొక్క లీలది ఉంది. ఉదహరించిన జ్ఞాన ఆధారంగా పవిత్ర పురాణంలను అర్థం చేసుకొవడం అతి సులభం అవుతుంది.

## "శ్రీ విష్ణు పురాణం"

(అనువాద కర్తా శ్రీ మూనిలాల్ గుప్త, ప్రకాశక్– గోవింద భవన్ కార్యాలయం, గీతా ప్రెస్ గోరఖపూర్)

శ్రీ విష్ణుపురాణం యొక్క జ్ఞానం శ్రీ పారాసర్ ఋషి తన శిష్యుడు శ్రీ మైత్రేయ ఋషిగారికి చెప్పినారు.

శ్రీ పారాసర్ ఋషిగారు వివాహం కాగానే గృహస్థ జీవనాన్ని త్యాగం చేసి అడవులలో సాధనా చేయాలి అను దృడ సంకల్పం చేసిరి. ఆయన ధర్మపత్ని అంది ఇప్పుడే వివాహం అయింది, ఇపుడే మీరు ఇల్లు విడిచి వెళ్లుచున్నారు. సంతానం ఉత్పత్తి చేసిన తరువాత మీరు సాధనా కోసం వెళ్లండి. అపుడు శ్రీ పారసర్ ఋషి అంటారు సాధనా చేసిన తరువాత సంతానంను ఉత్పత్తి చేసితే మంచి సంస్కారం కల సంతానం ఉత్పత్తి అవుతుంది. నేను కొంత కాలం తరువాత మీ కోసం నా శక్తి (వీర్యం) ఎదైన పక్షి ద్వారా పంపిస్తాను, నీవు దానిని గ్రహించుకో. అని చెప్పి ఇంటి త్యాగం చేసి వానప్రస్థులైరి. ఒక సంవత్సరం సాధన తరువాత తన వీర్యంను తీసి ఒక వృక్షం యొక్క పత్రంలో బందించి తన మంత్ర శక్తితో శుక్రాణువునికి రక్షణ ఏర్పరిచి ఒక కాకితో అంటాడు ఈ పత్రం నా భార్యకు ఇచ్చి రమ్మని. కాకి దానిని తీసుకుని నదిపై నుండి ఎగురుతు పోతుండెను. దాని మూతినుండి ఆ పత్రం నదిలో పడిపోతుంది. దానిని ఒక చేప తింటుంది. కొన్ని నెలల తరువాత ఆ చేపని ఒక నావికుడు దొరకపట్టి కోస్తాడు, అందులోంచి ఒక బాలిక వస్తుంది. ఆమె పేరు సత్యవతి అని పెడుతాడు. ఆ అమ్మాయి (మత్స్యం యొక్క ఉదరం నుండి పుట్టింది కావున) మఛోదరి నామంతో కూడ పిలుస్తారు. నావికుడు సత్యవతిని తన కూతురిలా పెంచుతాడు.

కాకి తిరిగి వెళ్లి శ్రీ పారాసర్ గారికి జరిగిన వృత్తాంతం అంతయు చెబుతుంది. సాధనా సమాప్తం చేసుకుని శ్రీ పారాసర్గారు పదహారు సంవత్సరాల తరువాత తిరగి వచ్చుచుండిరి, నదిని దాటడానికి నావికుడిని పిలిచి తనని అవతలి ఒడ్డుకి చేర్చమని అంటాడు. నా భార్య నా కోసం చూస్తు ఉంటుంది. ఆ సమయంలో నావికుడు అన్నం తింటు వుండెను సత్యవతి పద్నాలుగు సం॥లు కన్య తన తండ్రి అన్నం తీసుకుని అక్కడే ఉండింది. నావికుడికి తెలుసు సాధన తపస్సు చేసి వచ్చు ఋషులు సిద్ద యుక్తమై ఉంటారు మరియు ఆజ్ఞని త్వరగా

పాలించకుంటే శాపం ఇస్తారు అని. నావికుడు అంటాడు ఋషివర్! నేను అన్నం తింటున్నాను, మధ్యలో అన్నం వదిలేసి రావడం అన్నదేవుడిని అపమానం చేసినట్లు అవుతుంది, నాకు పాపం తగులుతుంది. కానీ శ్రీ పారాసర్‌గారు వినలేదు. ఋషిని మొండివాడుగా తెలుసుకుని తన యూవ కూతురిని ఋషిగారిని దాటించమని చెప్పి పంపించిరి. తండ్రి ఆదేశంను తీసుకుని కుమార్తె నావలో ఋషిని తీసుకుని బయలుదేరింది. నది మధ్యలోకి వెళ్లిన తరువాత తన బీజ శక్తితో చేప నుండి ఉత్పన్నం అయిన అమ్మాయి అనగా తన కూతురు యెడల చెడు కర్మ చేయు ఇచ్చాని వ్యక్తం చేసిరి. బాలిక తనని పెంచు తండ్రి ద్వారా క్రోధిత ఋషుల శాపం వలన దు:ఖిత వ్యక్తుల కథలను విని ఉండింది. శాప భయంతో కంపిస్తు ఆ కన్య అంది ఋషిగారు మీరు బ్రహ్మణులు, నేను ఒక శుద్రుడి పుత్రికని. ఋషి పారాసర్ అన్నాడు ఏమి చింత లేదు. బాలిక తన రక్షణ కోసం మరల అంది హే ఋషివర్ ! నా శరీరం నుండి చేపల దుర్గందం వస్తుంది. ఋషి తన సిద్ది శక్తితో దుర్గంధంను సమాప్తం చేసిరి. మరల బాలిక అంది రెండు వైపుల ఒడ్డులపై ఉన్న మనుషులు చూస్తున్నారు అని. ఋషి గంగా యొక్క జలంను చేతితో ఎత్తుకుని ఆకాశంలోకి పడెసినాడు మరియు తన సిద్ది శక్తితో పొగ మంచుని ఉత్పన్నం చేసినాడు. తన కోరికను తీర్చుకుంటాడు. బాలిక తనని పెంచు తండ్రికి మరియు తల్లికి సర్వ సంగతిని చెప్పింది మరియు అన్నది ఋషి తన పేరుని పారాసర్ అని చెప్పినారు మరియు ఋషి వశిష్ఠ గారి మనమడు అని చెప్పినారు. సమయం వచ్చిన తరువాత ఆ పెళ్లికానీ అమ్మాయి గర్భం నుండి శ్రీ వ్యాస ఋషి ఉత్పన్న అయిరి.

ఆ శ్రీ పారాసర్ ద్వారా శ్రీ విష్ణు పురాణం రచించబడినది. శ్రీ పారాసర్‌గారు చెప్పినారు మైత్రేయ ఎ జ్ఞానం అయితే నీకు వినపించబోతున్నానో, దానిని ప్రసంగంను దక్షాది మునులు నర్మదా తటంపై రాజా పురుకుత్సకు వినిపించి ఉండిరి. పురుకుత్సగారు సారస్వతకి మరియు సారస్వత నాకు చెప్పియుండెను. శ్రీ పారాసర్ గారు శ్రీ విష్ణుపురాణంలోని ప్రథమ అధ్యాయం శ్లోకం సంఖ్య 31, పేజి సంఖ్య 3 లో చెప్పినారు ఈ జగత్తు అంతయు విష్ణువునుండియే ఉత్పన్నం అయింది మరియు ఆయన ద్వారానే స్థిరంగా ఉంది. వారే దీని స్థితి మరియు లయ కర్తా. అధ్యాయం 2 శ్లోకం 15-16 పేజి 4 లో చెప్పబడినది హే ద్విజ్! పరబ్రహ్మా యొక్క ప్రథమ రూపం పురుష్ అనగా భగవాన్‌లాగా అనిపిస్తుంది, కానీ వ్యక్త (మహావిష్ణు రూపంలో ప్రకటితమవడం) మరియు అవ్యక్త (అదృశ రూపంలో వాస్తవిక కాల్ రూపంలో 21 బ్రహ్మాండాలలో ఉండడం) కంటే అన్య రూపంలో మరియు 'కాల్' ఆయన పరమ రూపం. భగవాన్ విష్ణు ఎవరైతే కాల్ రూపంలో మరియు వ్యక్త మరియు అవ్యక్త రూపంతో స్థితిలో ఉంటారు, ఇది వారి బాలవత లీలాయే.

అధ్యాయం 2 శ్లోకం 27 పేజి 5 లో చెప్పబడినది - హే మైత్రేయ ! ప్రళయ కాలంలో ప్రధాన అనగా ప్రకృతి యొక్క సామ్య రూపంలో (అవస్థా) స్థితులైనకా అనగా పురుషుడు ప్రకృతితో వేరుపడినాకా విష్ణు భగవాన్ యొక్క కాల్ రూపంలోకి మారిపోతాడు.

అధ్యాయం 2 శ్లోకం 28 నుండి 30 పేజి - దాని తరువాత (సర్గ కాలం ఉపస్థితం అయినాకా) ఆ పరబ్రహ్మా పరమాత్మా విశ్వ రూపి సర్వవ్యాపి సర్వభూతేశ్వర్ సర్వాత్మా పరమేశ్వర్

తన ఇచ్చాతో వికార ప్రధానమైన మరియు అవికారి పురుషుడిలో ప్రవేశించి వారిని కదిలించిరి.
**28-29.** ఎలాఐతే సుగంధం క్రియశీలం కాకపోయిన తన సమీపంలోని వారి మనసులని కదిలిస్తుంది అలానే ప్రధాన (=ప్రకృతి మరియు పురుషలని ప్రేరిపితం చేస్తారు.

విశేషం- శ్లోక సంఖ్య **28** నుండి **30** లో స్పష్టం చేసినారు ప్రకృతి మరియు పురుష (కాల్) కాకుండా వేరే పరమేశ్వరులు ఉన్నారు ఎవరైతే వీరిద్దరిని మరల సృష్టి రచన చేయడానికి ప్రేరితులని చేస్తారు.

అధ్యాయం **2** పేజి **8** పై శ్లోకం **66** లో రాసి ఉంది ఆ ప్రభువే సృష్టికర్త (బ్రహ్మ) అయి తన సృష్టి చేసుకుంటారు. శ్లోకం సంఖ్యా **70** లో రాసి ఉంది. భగవాన్ విష్ణువులే వ్యవస్థలని మొ॥లగు బ్రహ్మ ద్వారా రచించిరి. ఆయనే రచిస్తారు, ఆయనే స్వయం చనిపోతారు. అధ్యాయం **4** శ్లోకం **4** పేజి **11** పై రాసి ఉంది వేరే అన్య పరమేశ్వరులు ఉన్నారు ఎవరైతే బ్రహ్మ, విష్ణు, శివుడు మొ॥ ఈశ్వరులకి ఈశ్వరుడు. అధ్యాయం **4** శ్లోకం **14-15, 17, 22** పేజి **11, 12** పై రాసి ఉంది పృథ్వి అంటుంది- హే కాల్ స్వరూప! మీకు నమస్కారం. హే ప్రభో! మీరే జగత్తు యొక్క సృష్టి కోసం బ్రహ్మ, విష్ణు మరియు రుద్ర రూపం ధరించుతారు. మీ ఎ రూపం అవతార రూపంలో ప్రకటితం అవుతుందో దానినే దేవగణం పూజిస్తుంది. మీరే ఓంకారం. అధ్యాయం **4** శ్లోకం **50** పేజి **14** పై రాసి ఉంది - తరువాత ఆ భగవాన్ హరి రజోగుణ యుక్తులై చతుర్ముఖధారి బ్రహ్మ రూపంను ధరించి సృష్టి రచనా చేసిరి.

పై వివరణ వలన సిద్దిస్తుంది ఏమిటంటే ఋషి పారాసర్ గారు విన్నది విన్నట్లు అనగా లోకవేదం ఆధారంపై శ్రీ విష్ణు పురాణం యొక్క రచనా చేసిరి. ఎందుకంటే వాస్తవిక జ్ఞానం పూర్ణ పరమాత్మా మొదటగా సతయుగంలో స్వయం ప్రకటితులై శ్రీ బ్రహ్మ గారికి ఇచ్చి యుండిరి. శ్రీ బ్రహ్మగారు కొంత జ్ఞానంను మరియు కొంత స్వయం కాల్పనిక జ్ఞానంను కలిపి తన వంశస్థులకి చెప్పినారు. ఒకరి నుండి ఒకరు విని-వినపిస్తు వచ్చిన లోకవేదం శ్రీ పారాసర్ గారికి ప్రాప్తించింది. శ్రీ పారాసర్ గారు విష్ణువుని కాల్ అని కూడ సంబోధించారు మరియు పరబ్రహ్మ అని కూడ అన్నారు. పై వివరణ వలన ఇది కూడ సిద్దించింది ఏమిటంటే విష్ణువు అనగా బ్రహ్మ స్వరూప కాల్ తన ఉత్పత్తి బ్రహ్మ , విష్ణు మరియు శివ రూపంతో చేసుకుని సృష్టిని ఉత్పన్నం చేస్తారు. బ్రహ్మ (కాల్) యే బ్రహ్మలోకంలో మూడు రూపాలలో ప్రకటితమై లీలా చేసి మోసం చేస్తారు. అతను స్వయంగా కూడ చనిపోతాడు. (విశేష సమాచారం కోసం కృపతో చదవండి 'ప్రళయం యొక్క సమాచారం' లో పుస్తకం ' గహరి నజర్ గీతా మే'లో అధ్యాయం **8** శ్లోకం **17** యొక్క వాఖ్యాలో) ఆ బ్రహ్మలోకంలోనే మూడు స్థానంలను రచించిరి. ఒకటి రజగుణ ప్రధానంగా, అందులో ఈ కాలరూపి బ్రహ్మ తన బ్రహ్మ రూపంను ధరించి ఉంటాడు మరియు తన భార్య దుర్గాదేవితో కలిసి రజోగుణ ప్రధాన పుత్రుడిని ఉత్పన్నం చేస్తాడు. అతడి పేరు బ్రహ్మ అని పెడుతాడు. ఆయనతోనే ఒక బ్రహ్మండంలో ఉత్పత్తి చేయిస్తాడు. ఈ విధంగా ఆ బ్రహ్మలోకంలో సతగుణ ప్రధాన స్థానంను ఏర్పర్చుకుని స్వయం తన విష్ణు రూపంను ధరించి ఉంటాడు మరియు తన భార్య దుర్గాతో కలిసి సతగుణ యుక్త పుత్రుడిని ఉత్పత్తి చేస్తాడు. అతని పేరు విష్ణువు ఉంచుతాడు. ఆ

పుత్రుడి ద్వారా మూడు లోకాలని (పృథ్వి, పాతాల, స్వర్గం) స్థితిలో ఉంచు కార్యము చేయిస్తాడు. (ప్రమాణం కోసం శివపురాణం గీతా ప్రెస్ గోరఖపూర్ నుండి ప్రచురిత అనువాద కర్తా హనుమాన్ ప్రసాద పొద్దార్ చిమన్ లాల్ గోస్వామి రుద్ర సంహిత అధ్యాయం **6, 7** పేజి **102-103**).

బ్రహ్మలోకంలోనే మూడవ స్థానం తమోగుణ ప్రధానంగా రచించి అందులో స్వయం శివ రూపంను ధరించి ఉంటాడు మరియు తన భార్య దుర్గాతో కలిసి తమోగుణ యుక్త పుత్రుడిని ఉత్పత్తి చేస్తారు. అతడి పేరు శంకరుడు పెడుతాడు. ఈ పుత్రుడి ద్వారా మూడు లోకాలలో ప్రాణుల సంహారం చేయిస్తాడు.

విష్ణు పురాణంలో అధ్యాయం **4** వరకు ఎ జ్ఞానం ఉందో అది కాల్ రూపి బ్రహ్మ గారు ఇచ్చింది. అధ్యాయం **5** నుండి ముందుకి కల కలిపి-జోడించిన జ్ఞానం కాల్ పుత్రుడు సతగుణ విష్ణువు యొక్క లీలలది మరియు ఆయన అవతారములు శ్రీ రామ్, శ్రీ కృష్ణుడి మొ॥ వారి జ్ఞానం ఉంది.

విశేష విచారం చేయాలిసిన విషయం ఏమిటంటే విష్ణుపురాణం రచయిత శ్రీ పారాసర్ ఋషిగారు. ఈ జ్ఞానం దక్షాది ఋషుల ద్వారా పురుకుత్స విన్నాడు, పురుకుత్స నుండి సారస్వత్ విన్నాడు మరియు సారస్వత్ ఋషి నుండి శ్రీ పారాసర్ గారు విన్నారు. ఆ జ్ఞానంనే పారాసర్ ఋషి లిపిబద్ధం చేసినారు అదియే మనకు నేడు అందుబాటులో ఉంది. ఇందులో ఒక బ్రహ్మాండం యొక్క జ్ఞానం కూడ పూర్తిగా లేదు. శ్రీ దేవిపురాణం, శ్రీ శివపురుణం యొక్క జ్ఞానం కూడ బ్రహ్మాగారే ఇచ్చారు. శ్రీ పారాసర్ ద్వారా ఇవ్వబడిన జ్ఞానం శ్రీ బ్రహ్మాగారు ఇచ్చిన జ్ఞానంతో సమానం కాదు. దీనికోసం శ్రీ విష్ణు పురాణంను అర్థం చేసుకోడానికి శ్రీ దేవి పురాణంను మరియు శ్రీ శివ పురాణంను సహాయం తీసుకోవాలి. ఎందుకంటే ఈ జ్ఞానం స్వయం భగవాన్ కాల్ రూపి బ్రహ్మ ద్వారా ఇవ్వబడింది, ఎవరైతే బ్రహ్మా, విష్ణు మరియు శివలకి తండ్రి. పవిత్ర వేదాలు మరియు పవిత్ర గీతా జ్ఞానంను అర్థం చేసుకోడానికి స్వసమ్ వేదం అనగా సూక్ష్మ వేదం యొక్క సహయోగం తీసుకోవాలి, ఎదైతే కాల్ రూపి బ్రహ్మ యొక్క ఉత్పత్తి కర్తా అనగా తండ్రి పరమ అక్షర బ్రహ్మ (కవిర్దేవ్) ద్వారా ఇవ్వబడినది. ఎదైతే (కవిర్గిర్భి:) కవిర్వాణి ద్వారా స్వయం సతపురుష ప్రకటితులై చెప్పియుండిరి. (ఋగ్వేద మండల **9** సూక్తం **96** మంత్రం **16** నుండి **20** వరకు ప్రమాణం ఉంది).

## "శ్రీ బ్రహ్మ పురాణం"

ఈ పురాణం యొక్క రచయిత శ్రీ లోమహర్షణ ఋషిగారు. వారు శ్రీ వ్యాస ఋషి యొక్క శిష్యులు. వారిన సుతుడు అని కూడ అంటారు. శ్రీ లోమహర్షణగారు (సుతజీ) చెబుతారు ఈ జ్ఞానం ముందుగా శ్రీ బ్రహ్మాగారు దక్షాది శ్రేష్ట మునులకి వినిపించి యుండిరి. అదియే నేను వినిపిస్తున్నాను. ఈ పురాణంలో సృష్టి యొక్క వర్ణన నామం కల అధ్యాయంలో (పేజి **277** నుండి **279** వరకు) చెప్పబడినది శ్రీ విష్ణుగారు సర్వ విశ్వానికి ఆధారమై ఉన్నారు, ఎవరైతే బ్రహ్మా, విష్ణు మరియు శివ రూపంతో జగత్తు యొక్క ఉత్పత్తి మరియు పాలన మరియు సంహారం చేస్తారు. ఆ భగవాన్ విష్ణువుగారికి నా నమస్కారములు.

ఎద్దైతే నిత్య సద్‌సత్ స్వరూప మరియు కారణభూత అవ్యక్త ప్రకృతి ఉందో దానిని ప్రధానం అంటారు. దాని నుండియే పురుషుడు ఈ విశ్వం యొక్క నిర్మాణం చేసిరి. అమిత తేజస్వీ బ్రహ్మా గారినే పురుషుడిగా భావించండి. వారు సమస్త ప్రాణులని సృష్టించువారు మరియు భగవాన్ నారాయణ యొక్క ఆశ్రితులు.

స్వయంభూ నారాయణుడు జలంను ఉత్పత్తి చేసినారు. నారయణుడి నుండి ఉత్పన్నం అవడం వలన జలంను నార్ అని అనినారు. భగవానులు సర్వ ప్రథమంగా జలంపై విశ్రాంతి తీసుకున్నారు. ఇందువలనే భగవాన్ నారాయణ అని అంటారు. భగవానుడు జలంలోకి తన శక్తిని విడిచి పెట్టిరి దాని వలన ఒక సువర్ణమయ అండము ప్రకటితమైనది. అందులోనే స్వయంభూ బ్రహ్మాగారి ఉత్పత్తి జరిగిందని వింటాము. ఒక సంవత్సరం వరకి అండములో నివాసం ఉండి శ్రీ బ్రహ్మాగారు దానిని రెండు ముక్కలుగా చేసిరి. ఒకదానితో ధ్యూలోకం మరియు రెండవదానితో భూలోక ం ఏర్పడింది.

అటు తరువాత బ్రహ్మాగారు తన కోపం నుండి రుద్రుడిని ప్రకటిస్తారు. పై జ్ఞానం ఋషి లోమహర్షణ (సుత్) ద్వారా చెప్పబడినది ఎద్దైతే విని వినిపించడం జరిగింది. అది పూర్ణ జ్ఞానం కాదు. ఎందుకంటే వక్తా అంటున్నాడు తను ఇలా విన్నాను అని. ఇందువలన పూర్తి సమాచారం కోసం దేవిపురాణం, శ్రీ శివమహాపురాణం, శ్రీమద్ భగవత్ గీతా మరియు నాలుగు వేదాలు మరియు పూర్ణ పరమాత్మా ద్వారా తత్వ జ్ఞానం ఎద్దైతే స్వసమ్ వేదం అనగా కవిర్వాణి అనబడుతుంది చదవండి. దానికోసం చదవండి 'గహరి నజర్ గీతా మే', 'పరమేశ్వరుడి సార సందేశం', పరిభాషా ప్రభువుది మరియు పుస్తకం 'యథార్థ జ్ఞాన ప్రకాశ్ మే'.

(వాస్తవిక జ్ఞానంను స్వయం కలియుగంలో ప్రకటితమై కవిర్దేవ్ (కబీర్ పరమేశ్వర్) గారు తన మంచి సేవకుడు శ్రీ ధర్మదాస్ సాహెబ్ గారికి (బాంధవగడ్) మరల సరియైన విధంగా చెప్పిరి. అది ఈ పుస్తకంలోని సృష్టి రచనా అధ్యాయంలో ఉంది.

శ్రీ పారాసర్‌గారు కాల్ బ్రహ్మని పరబ్రహ్మ అని అనినారు మరియు బ్రహ్మ కూడ అనినారు మరియు విష్ణువు కూడ అనినారు మరియు ఈయననే అనాది అనగా అమరుడు అని కూడ అన్నారు. ఈ బ్రహ్మ యొక్క జన్మ మృత్యువు అవదు. దీనివలన ఋషి యొక్క పిల్ల బుద్ధి సిద్ధి అవుతుంది.

విచారించండి:- విష్ణుపురాణం యొక్క జ్ఞానం ఒక ఋషి ద్వారా చెప్పబడినది, ఎద్దైతే లోకవేదం (కల్పిత కథల) పై ఆధారంగా చెప్పినారు మరియు బ్రహ్మాపురాణం యొక్క జ్ఞానం శ్రీ లోమహర్షణ ఋషి దక్షాది మునులద్వారా వినియుండిరి, అదే రాసిరి. ఇందువలన పై రెండు పురాణంలను అర్థంచేసుకోడానికి శ్రీ దేవిపురాణం మరియు శ్రీ శివపురాణం యొక్క సహయోగం తీసుకోవాలి, ఎద్దైతే స్వయంగా శ్రీ బ్రహ్మాగారు తన పుత్రుడు నారదుడికి వినిపించిరి మరియు వ్యాస ఋషిద్వారా గ్రహించబడి రాయబడినది. మిగతా పురాణాల జ్ఞానం శ్రీ

బ్రహ్మ గారి జ్ఞానంతో సమానం అవలేదు. ఇందువలన మిగతా పురాణంల అర్థం చేసుకోడానికి శ్రీ దేవిపురాణం మరియు శ్రీ శివపురాణం యొక్క సహయోగం తీసుకోవాలి, ఎదైతే స్వయంగా శ్రీ బ్రహ్మగారు దక్షాది శ్రేష్ఠ మునులకి వినిపించి యుండిరి. శ్రీ దేవిపురాణం మరియు శ్రీ శివపురాణం అర్థంచేసుకోడానికి శ్రీమద్ భగవత్ గీతా మరియు నాలుగు వేదాల సహయోగం తీసుకోవాలి. ఎదైతే కాల్ ద్వారా చెప్పబడినది. పవిత్ర వేదాలు మరియు పవిత్ర గీతా జ్ఞానంను అర్థం చేసుకోడానికి స్వసమ్ వేదం అనగా సూక్ష్మ వేదం యొక్క సహయోగం తీసుకోవాలి, ఎదైతే కాల్ రూపి బ్రహ్మ యొక్క ఉత్పత్తి కర్తా అనగా తండ్రి పరమ అక్షర బ్రహ్మ (కవిర్దేవ్) ద్వారా ఇవ్వబడినది. ఎదైతే (కవిర్గిర్భి:) కవిర్వాణి ద్వారా స్వయం సతపురుష ప్రకటితులై చెప్పియుండిరి. (ఋగ్వేద మండల **9** సూక్తం **96** మంత్రం **16** నుండి **20** వరకు ప్రమాణం ఉంది). మరియు గీతలో భగవాన్ కాల్ తన స్థితి గురించి స్వయంగా చెప్పినారు అది సత్యము.

గీతా అధ్యాయం **15** శ్లోకం **18**లో చెప్పబడినది నేను (కాల్) తన ఇరవైఒక్క బ్రహ్మాండంలలోని అన్ని జీవులకంటే శ్రేష్ఠమైనవాడిని. వారు స్థూల రూపంలో నాశనం కలవారైనా, ఆత్మ రూపంలో అవినాశి అయినా కూడ. ఇందువలన లోకవేదం యొక్క ఆధారంతో నన్ను పురుషోత్తముడిగా భావిస్తారు. వాస్తవంలో పురుషోత్తములు నా కంటే మరియు పరబ్రహ్మ కంటే వేరుగా ఉన్నారు.వారే వాస్తవంలో ఉత్తమ ప్రభువు అనగా పురుషోత్తముడు బ్రహ్మ మరియు పరబ్రహ్మ కంటే వేరుగా ఉన్నారు. ఆయనే పూర్ణ బ్రహ్మ (పరమ అక్షర పురుషుడు). ఆయనే వాస్తవంలో అవినాశి ప్రభువు. ఆయన అందరి పాలన పోషణ చేస్తారు, వారే వాస్తవంలో అవినాశి పరమేశ్వరులు. (గీతా అధ్యాయం. **15** శ్లోకం **16-17**). గీతా జ్ఞానదాతా బ్రహ్మ స్వయంగా అంటున్నాడు హే అర్జున్! నీవి మరియు నావి చాలా జన్మలు అయినవి. నీకు తెలియదు, నాకు తెలుసు. గీతా అధ్యాయం **4** శ్లోకం **5**, అధ్యాయం **2** శ్లోకం **12** లో ప్రమాణం ఉంది మరియు అధ్యాయం **7** శ్లోకం **18**లో తన సాధనని కూడ అతి అనుత్తమమైనదిగా చెప్పినాడు. ఇందుకోసం గీతా అధ్యాయం **18** శ్లోకం **62** లో చెప్పబడినది హే అర్జున్! సర్వ భావంతో ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు ఆయన కృపవలన నీవు పరమశాంతిని పొందుతావు మరియు ఎప్పటికి నశించని సతలోకంను పొందుతావు. అధ్యాయం **15** శ్లోకం **4** లో అనబడినది ఎపుడైతే నీకు తత్వదర్శి సంత్ దొరికిన (గీతా అధ్యాయం. **4** మ. **34**లో మరియు అధ్యాయం. **15** మ.**1** లో వర్ణిత) పిదప ఆ పరమేశ్వరుడి శరణులోకి వెళ్లు ఆయన కృపతో నీవు పరమశాంతిని మరియు సతలోకంను పొందుతావు. అక్కడికి వెళ్లిన తరువాత సాధకుడి పున:జన్మ అవదు. అనగా ఆది మోక్షం ప్రాప్తిస్తుంది. గీతా జ్ఞానదాతా ప్రభువు అంటున్నాడు నేను కూడ ఆ ఆదిపురుషుడు పరమేశ్వర్ శరణులోనే ఉన్నాను. పూర్ణ విశ్వాసంతో ఆయన భక్తి అనగా పూజ చేయాలి.

# "శ్రీ దేవి మహాపురాణం నుండి జ్ఞానంను గ్రహించండి"

"శ్రీ దేవి మహాపురాణం నుండి అంశిక లేఖనం మరియు సార విచారం"
(సంక్షిప్త శ్రీ మద్‌దేవి భాగవత్, సచిత్ర, పెద్దది, కేవలం హింది, సంపాదకులు హనుమాన్ ప్రసాద్ పొద్దార్, చిమ్మనలాల్ గోస్వామి,
ప్రకాశకులు - గోబిన్దభవన్-కార్యాలయం, గీతాప్రెస్, గోరఖపూర్)

॥ శ్రీ జగదమ్బికాయై నమః ॥

శ్రీమద్ దేవిభాగవత్ మూడవ స్కందం

రాజా పరిక్షిత్తు శ్రీ వ్యాసుడిని బ్రహ్మాండం యొక్క రచన విషయంలో అడిగిరి. వ్యాసుడు అనినాడు రాజణ్! నేను ఇదే ప్రశ్నని నారదుడిని అడిగితిని, ఆ వర్ణన చెపుతాను వినండి.నేను అడిగాను నారదులని ఒక బ్రహ్మాండం యొక్క రచన ఎవరు చేసిరి? ఒకరు శంకరుడు అంటారు, మరొకరు విష్ణువు అంటారు మరియు కొందరు బ్రహ్మాగారని అంటారు మరియు చాలా ఆచార్యులు భవానిని మనోరథంలను పూర్ణం చేయునదిగా చెబుతారు. ఆమె ఆది మాయ మహాశక్తి మరియు పరమపురుషుడితో ఉంటు కార్య సంపాదన చేయు ప్రకృతి. బ్రహ్మాతో ఆమె అభేదమైన సంబంధం ఉంది. (పేజి 114)

నారదులు అనిరి- వ్యాస్ గారు! ప్రాచీన కాలం నాటి విషయం - ఈ సందేహమే నా హృదయంలోను ఉత్పన్నం అయ్యి ఉండెను. అపుడు నేను నా తండ్రి బ్రహ్మాని ఇదే విషయం గురించి అడిగితిని సత్యమును తెపండి అని.

బ్రహ్మాగారు అనినారు- (పేజి 115 నుండి 120 మరియు 123, 125, 128, 129) కుమారా! ఈ ప్రశ్నకి నేను ఏం సమాధానం ఇవ్వను? ఈ ప్రశ్న చాలా కఠినమైనది. పూర్వ కాలంలో అంతట జలమే ఉండింది. అపుడు కమలం నుండి నా ఉత్పత్తి అయింది. నేను కమలంపై కూర్చోని విచారం చేయసాగితిని నేను ఈ అగాధ జలంలో ఎలా ఉత్పన్నం అయ్యాను?అని. నా రక్షకులు ఏవరు?అని. కమలం యొక్క కాండమును జలంలోకి దిగితిని నాకు శేష శయ్యపై భగవాన్ విష్ణువు కనిపించారు. వారు యోగనిద్రలో వశిభూతులే గాఢ నిద్రలో పడుకుని ఉండిరి. ఇంతలో భగవతి యోగనిద్రా గుర్తుకు వచ్చింది. నేను ఆమెను ప్రార్థిస్తిని. అపుడు ఆ కళ్యాణమయి భగవతి శ్రీ విష్ణువు శరీరం నుండి బయటకు వచ్చి అచిన్త్య రూపం ధరించి ఆకాశంలో విరాజమానమై అయిపోయింది. దివ్య ఆభుషణాలు ఆమె అందంను పెంచుతుండెను. ఎపుడైతే యోగనిద్ర భగవాన్ విష్ణువు శరీరం నుండి వేరు పడి విరాజితులు అవగానే, అపుడు తోందరగా శ్రీహరి లేచినారు. అక్కడ విష్ణువు నేను ఉంటిమి. ఇంతలో అక్కడ రుద్ర ప్రకటితులైరి. మా ముగ్గురిని దేవి అన్నది- బ్రహ్మా, విష్ణువు మరియు మహేశ్వర్! మీరు మిక్కిలి సావధానులై మీమీ కార్యములలో నిమగ్నం అవండి. సృష్టి, స్థితి మరియు లయ ఇవి మీ కార్యములు. ఇంతలో ఆకాశంలో ఒక విమానం కిందికి కిందకు దిగింది. అపుడు దేవి అంది- "దేవతలారా! నిర్భయంగా ఇచ్ఛాపూర్వకంగా విమానంలోకి ఎక్కండి, నేను మీకు ఒక అద్భుత దృశ్యమును చూపిస్తాను ".

మేము ముగ్గురం అందులో కూర్చున్నాం దేవి తన సామర్థ్యంతో విమానంను ఆకాశంలో ఎగురవేసింది.

ఇంతలో మా విమానం వేగంగా బయలుదేరింది మరియు అది దివ్యధామం బ్రహ్మలోకంలోకి చేరుకుంది. అక్కడ ఇంకో బ్రహ్మ విరాజితులై ఉండిరి. వారిని చూడగానే శివ, విష్ణువులకి చాలా ఆశ్చర్యం వేసింది. వారు నన్ను అడిగిరి 'హే చతురవాన్ ! ఈ అవినాశి బ్రహ్మ ఎవరు? నేను అన్నాను నాకు కూడ తెలియదు,సృష్టి యొక్క అధిస్టిత ఇంకేవరు? భగవాన్ ! నేను ఎవరిని మరియు మా ఉద్దేశ్యం ఏమిటి? ఈ చిక్కుతోనే నా మనసు తిరుగుచుండెను.

ఇంతలో మనసుతో సమాన వేగంకల విమానం తోందరగా అక్కడి నుండి బయలుదేరింది మరియు కైలాసం కు చేరుకుంది. అక్కడ త్రినేత్రధారి శంకర భగవానులు కనిపించిరి. వారు నంది పై కుర్చోని ఉండిరి.

క్షణంలోనే మరల ఆ విమనం గాలితో సమాన వేగంతో ఎగిరింది మరియు వైకుంఠంకు చేరుకుంది, అక్కడ భగవతి లక్ష్మీదేవి యొక్క విశాల భవనం ఉండింది. కుమారా నారద! అక్కడ నేను ఏ సంపత్తి నైతే చూశానో దానిని వర్ణించలేను. ఆ ఉత్తమ పూరిని చూసి విష్ణువు మనసు ఆశ్చర్య సముద్రంలో మునిగిపోయింది. అక్కడ కమలలోచన శ్రీ హరి విరాజమానులై ఉండిరి. నాలుగు భూజాలు ఉండినవి.

ఇంతలో పవనంతో మాట్లాడుతు ఆ విమానం వెంటనే ఎగిరింది. ముందు అమృత జలంతో సమానమైన తియ్యని జలంకల సముద్రం కనిపించింది. అది ఒక మనోహర ద్వీపం అయి ఉంది.ఆ ద్వీపంలోనే ఒక మంగళమయ మనోహర పడక ఉండింది. ఆ ఉత్తమ పడకపై ఒక దివ్య రమైణి కూర్చుని ఉండింది. మాలో మేం అనుకున్నాం- ' ఈ సుందరి ఎవరు మరియు ఈమె పేరు ఏమి ఉంటుంది, మేము ఆమె విషయంలో పూర్తిగా తెలియనివారిగా ఉంటిమి.

నారదు! సందేహగ్రస్థమై మేము అక్కడే ఆగిపోతిమి. అపుడు భగవాన్ విష్ణు ఆ చారుహాసిని భగవతిని చూసి వివేకపూర్వక నిశ్చయించుకున్నారు ఆమె జగదాంబికా అని. అపుడు ఆయన అనినాడు ఈ భగవతి మనందరికి కారణం అయి ఉంది. మహావిధ్యా మరియు మహామాయ ఈమెకు కల పేర్లు. ఈమె పూర్ణ ప్రకృతి. ఈమె విశ్వేశ్వరి, వేదగర్భా మరియు శివా అనబడుతుంది.

ఆమె దివ్యాంగనా, వారి దర్శనం ప్రలయార్ణవంలో నాకు దర్శనం అయి ఉండిది. ఆ సమయంలో నేను బాలకుడిగా ఉంటిని. నన్ను ఊయ్యాలలో ఊపుతుండెను. వటవృక్ష పత్రంపై దృడమైన శయ్యపై ఉండింది. దానిపై పడుకుని నేను కాలి వేళ్లని కమలం లాంటి ముఖంలో తీసుకుని నాకు చుంటిని మరియు ఆడుకును చుంటిని. ఈ దేవి నన్ను పాటపాడి జోకోట్టెది. ఆమె ఈ దేవతా. ఇందులో ఏ సందేహం లేదు. వీరిని చూడగానే నాకు మొదటి విషయం గుర్తుకు వచ్చింది. ఈమె మనందరికి తల్లి.

శ్రీ విష్ణువు సమయానుసారంగా ఆ భగవతి భూవనేశ్వరిని స్తుతి ఆరంభించిరి. భగవాన్ విష్ణువు అనిరి - ప్రకృతి దేవికి నమస్కారములు. మీరు శుద్ధ స్వరూపురాలు, ఈ సకల సంసారం మీ నుండె ఉద్భవించింది. నేను (విష్ణు) , బ్రహ్మ మరియు శంకర్ మేమంత మీ

యొక్క కృపతోనే విద్యామానమై ఉన్నాం. మా ఆవిర్భావం (జననం) మరియు తిరోభావం (మరణం) అవుతుంటుంది. అనగా మేము ముగ్గురం నాశనం కలవారము. మీరు మాత్రమే నిత్యం (అవినాశి) , జగత్ జనని, ప్రకృతిదేవి అయి ఉన్నారు.

భగవాన్ శంకరుడు అంటాడు– దేవి! ఒకవేళ మహాభాగం విష్ణువు మీ నుండే ప్రకటితం (ఉత్పన్నం) అయినారు అనగా దీని తరువాత ఉత్పన్నం అయిన బ్రహ్మ కూడ మీ బాలుడు అయినాడు. మరి ఇక తమోగుణి లీలాచేయు శంకరుడు మీ సంతానమే (కదా) అవుతాను. అనగా నన్ను కూడ ఉత్పన్నం చేసినవారు మీరే. ఈ సంసారం యొక్క సృష్టి–స్థితి–సంహారంలో నీ గుణములు ఎల్లవేళ ఉంటాయి. ఈ మూడు గుణాలతో జన్మించిన మేము, బ్రహ్మ–విష్ణు–శంకరుడు నియమానుసారంగా కార్యముచేయట యందు తత్పరులై ఉంటాము. విష్ణు, బ్రహ్మ మరియు శివ విమానంపై కూర్చుని వెళ్లుచుంటిమి. మాకు మార్గంలో కొత్త కొత్త జగాలు కనిపించినవి. భవాని! భలా, చెప్పండి వాటిని ఏవరు తయారు చేసినారు?

ఇందువలన ఈ ప్రమాణమే చూడండి శ్రీ మద్దేవిభాగవత్ మహాపురాణం సభాషటికం సమహాత్యం, ఖేమరాజ్ శ్రీ కృష్ణదాస్ ప్రకాశన్ ముంబయి, ఇందులో సంస్కృత సహితంగా హిందిలో అనువాదం చేయబడింది. మూడవ స్కందం అధ్యాయం. **4.** పేజి **10,** శ్లోకం **42 :-**

బ్రహ్మ–అహమ్ ఈశ్వర: పిలతే ప్రభావాత్సర్వే వయం జని యూతా న యదా తు నిత్యా:, కే అన్యే సురా: శతమఖ్ ప్రమూఖా: చ నిత్యా నిత్యా త్వమేవ జనని ప్రకృతి: పురాణా।**42**

అనువాదం:– హే మాతా! బ్రహ్మ, నేను మరియు శివ నీ ప్రభావంచే జన్మితులము, నిత్యులముకామ అనగా మేము అవినాశులము, ఇక మిగతా ఇంద్రాది దేవతలు ఎటుల నిత్యులు అవగలరు. నీవే అవినాశివి, ప్రకృతి మరియు సనాతన దేవివి. **(42)**

పేజి **11–12,** అధ్యాయం **5,** శ్లోకం **8 :-**

యది దయార్ధమనా న సందా2బికే కథమహం విహిత: చ తమోగుణ: కమలజశ్చ రజోగుణసంభవ: సూవిహిత: కిమూ సత్యగుణో హరి:।

అనువాదం:– భగవాన్ శంకర్ ఇలా అంటారు:– హే మాతా! మాపై నీవు దయాయుక్తురాలువైతే నన్ను తమోగుణుడిగా ఎందుకు చేశావు? కమలం నుండి ఉత్పన్నమైన బ్రహ్మని రజోగుణుడిగా ఎందుకు చేశావు?మరియు విష్ణువుని సతగుణుడిగా ఎందుకు చేశావు? అనగా జీవుల జన్మ–మృత్యువు రూపి చెడు కార్యములయందు మముల్ని ఎందుకు నియమించావు?

శ్లోకం **12 :-**

రమయసే స్వపంతి పురుషం సదా తవ గతిం న హి విహ్ విద్మ శివే **(12)**

అనువాదం:– తన పతి అనగా కాల్ భగవానుడితో ఎల్లపుడు భోగ విలాసం చేస్తూంటావు. మీ గతి ఎవరికి తెలియదు.

బ్రహ్మగారు అంటారు – నేను కూడ మహామాయా జగదాంబిక చరణాలపై పడితిని మరియు నేను ఆమెతో అమ్మా! వేదాలు అంటాయి " ఎకమేవాద్వీతీయం బ్రహ్మ" అని. ఆ

ఆత్మరూప మీరేనా లేదా వేరేవరైన పురుషులు ఉన్నారా?

దేవి అంది- నేను బ్రహ్మ ఒక్కరిమె. ఆయనలో నాలో కించిత్ మాత్రము భేదం లేదు. గౌరి, బ్రహ్మి, రౌద్రి, వారాహి, వైష్ణవి, శివా, వారుణి, కౌబేరి, నారసింహి మరియు వాసవి- అన్ని నా రూపములే. బ్రహ్మాగారు! ఈ శక్తిలని మీరు మీ స్త్రీగా చేసుకోండి. 'మహాసరస్వతీ' నామం కల విఖ్యాత సుందరి ఇక మీ స్త్రీ అయి ఉంటుంది. భగవాన్ విష్ణువుతో జగదాంబ అంది- " విష్ణు! మనసుని ముగ్దంచేయు ఈ 'మహాలక్ష్మి'ని తీసుకుని మీరు దయచేయండి. ఈమె ఎల్లపుడు మీ వక్షస్థలంపై నివాసం ఉంటుంది.

దేవి అంది - శంకర్! మనసుని ముగ్దపరుచు ఈ ' మహాకాలి' గౌరి నామంతో విఖ్యాతురాలు. నీవు ఈమెను పత్నిరూపంగా స్వీకరించు.

ఇక మీరు నా కార్యమును సిద్దం చేయుటకు విమానంపై కూర్చుని త్వరగా వెళ్లండి. ఏదేన కఠినకార్యము ఎదురైతే నన్ను స్మరించండి, నేను మీ ఎదుటకు వస్తాను. దేవతలారా! నా మరియు సనాతన పరమాత్మా యొక్క ధ్యానం మీకు సదా ఉండాలి. మా ఇద్దరిని స్మరిస్తు ఉంటే మీ కార్యసిద్ధి అవుతుండటంలో కించిత్ సందేహం ఉండదు.

బ్రహ్మాగారు అంటారు - ఈ విధంగా చెప్పి భగవతి జగదాంబికా మాకు వీడ్కోలు ఇచ్చింది. ఆమె శుద్ధ ఆచారవాలి అగు శక్తుల నుండి భగవాన్ విష్ణు కోసం మహాలక్ష్మిని, శంకరుడి కోసం మహాకాలిని మరియు నా కోసం మహాసరస్వతీని భార్యగా చేసుకోవాలి అను ఆజ్ఞను ఇచ్చింది. మేము మా స్థానాలకి బయలుదేరితిమి.

సారంశం విచారం :-- ఒక బ్రహ్మాండం యొక్క వాస్తవిక సిత్థి నుండి మహర్షి వ్యాసుడు, మహర్షి నారదుడు మరియు శ్రీ బ్రహ్మాగారు, శ్రీ విష్ణుగారు మరియు శ్రీ శంకర్‌గారు కూడ అజ్ఞానులుగా ఉండిరి. ఇది కూడ స్పష్టం అయింది శ్రీ దుర్గాని ప్రకృతి అని అంటారు మరియు దుర్గా మరియు బ్రహ్మ ది భార్యభర్తల సంబంధం అని. ఇందువలనే రాసి ఉంది బ్రహ్మాగారితో ప్రకృతి యొక్క వీడదీయని సంబంధం ఉంది అని, ఎలాఐతే భార్యని అర్ధాంగి అని కూడ అంటారు. శ్రీ బ్రహ్మాగారికి స్వయం తెలియదు తను ఎక్కడినుండి పుట్టినారు అని. వేల సంవత్సరాల వరకు జలంలో పృథ్వి కోసం వెదికిరి, కానీ దొరకలేదు. అపుడు ఆకాశవాణి ఆధారంగా వేల సంవత్సరాలు తపస్సు చేసినారు . కమలం యొక్క కాండము పట్టుకుని కిందకు దిగితే భగవాన్ విష్ణువు శేష శయ్యపై అచేతనులుగా ఉండిరి. విష్ణుగారి శరీరం నుండి ఒక దేవి వెలువడింది (ప్రేతని లాగా) , సుందరమైన ఆభరణాలు ధరించి ఆకాశంలో విరాజితులైనది. అపుడు విష్ణువుగారు సచేతలైరి. ఇంతలో శంకరుడు అక్కడికి వచ్చినారు.

పై వివరణ వలన తెలుస్తుంది ముగ్గురు భగవానులు అచేతనులుగా ఉంచబడినారు. తరువాత సచేతులని చేశారు. ఆకాశంలో విమానం వచ్చింది. దేవి ముగ్గురుని విమానంలో కూర్చును ఆదేశం ఇచ్చింది. విమానం ఎగిరింది. పైన ఒక బ్రహ్మా, ఒక శివ మరియు ఒక విష్ణు మరొకరిని చూసినారు వారు బ్రహ్మలోకంలో ఉండిరి.

విచారం చేయండి:-- బ్రహ్మలోకంలో మరొక బ్రహ్మా, విష్ణు మరియు శివులని

కనిపించిరి, ఇది జ్యోతినిరంజనుడి మాయ, అతడే అన్య మూడు రూపాలని ధరించి బ్రహ్మలోకంలో మూడు రహస్య స్థానములను తయారుచేసుకుని మరియు ప్రకృతిని తన భార్య రూపంలో ఉంచుతాడు. ఎపుడైతే వీరిద్దరు రజోగుణ ప్రధాన స్థానంలో ఉంటారు, అపుడు వీరు మహాసావిత్రి మరియు మహాబ్రహ్మ అనబడుతారు. వీరిద్దరి సంయోగం వలన కలుగు పుత్రుడు రజోగుణ ప్రధానమై ఉంటాడు, అతడి పేరు బ్రహ్మ అని పెడతారు. యుక్తవయస్కుడు అయ్యేవరకి అచేతులుగా ఉంచి పోషణ చేస్తారు. తరువాత కమలం పువ్వుపై ఉంచి సచేతులుగా చేస్తారు. ఎపుడైతే వీరిద్దరు మహావిష్ణు మరియు మహాలక్ష్మి రూపంలో సతగుణ ప్రధాన క్షేత్రంలో ఉంటారు, అపుడు భార్యభర్తల వ్యవహారంతో కలుగు పుత్రుడు సతగుణ ప్రధానమై ఉంటాడు, అతడి పేరు విష్ణువు పెడతారు.యుక్తవయస్కుడు అయ్యేవరకి అచేతులుగా ఉంచి పోషణ చేస్తారు. తరువాత శేష శయ్యపై పడుకోబెడతారు. తర్వాత సచేతులుగా చేస్తారు. ఈ విధంగా వీరిద్దరు తమోగుణ ప్రధాన స్థానంలో ఉన్నపుడు మహాశివ మరియు మహాకాలి అనబడుతారు. వీరిద్దరి భార్యభర్తల వ్యవహారంతో కలుగు పుత్రుడికి శివ అని పేరు పెడతారు, అతను తమోగుణ ప్రధానంగా ఉంటాడు. ఇతన్ని కూడ యుక్తవయస్కుడు అయ్యేవరకి అచేతులుగా ఉంచి పోషణ చేస్తారు. తరువాత సచేతనంగా చేస్తారు. తరువాత ఈ ముగ్గురిని కలిసేలా చేసి, విమానంపై కూర్చోబెట్టి పై లోకాల దృశ్యములని చూపిస్తారు. ఎందుకంటే వీరికి వీరే సర్వం అని అనుకోకుండా ఉండటానికి. గుణ ప్రధాన క్షేత్రంలను అర్థం చేసుకోడానికి ఉదహరణకి- ఒక భవనంలో మూడు గదులు కలవు అనుకుందాం. ఒక గదిలో అశ్లీల చిత్రములు కలవు. ఆ గదిలోకి వెళ్లగానే మనసులో అలాంటి మలిన ఆలోచనలు ఉత్పన్నం అవుతాయి.రెండవ గదిలో సాధు-సంత్‌ల, భక్తుల చిత్రములు తగిలించి ఉంటే మనసులోను మంచి విచారంలు, ప్రభు చింతన ఉంటుంది. మూడవ గదిలో దేశ భక్తుల మరియు అమరుల చిత్రములు ఉంటే మనసులో అలాంటి ఉద్వేదిత విచారములు ఉత్పన్నం అవుతాయి. సరిగ్గా ఈ విధంగానే బ్రహ్మ (కాల్) తన అవసరత-ఆవశ్యకతతో పైన తెల్పిన మూడు గుణ ప్రధాన స్థానముల రచనా చేసియున్నారు. ఇదేవిధంగా ముగ్గురు ప్రభువులు వారి వారి గుణ ప్రభావంను ఏలా చూపిస్తారో అర్థం చేసుకోడానికి ఉదహరణ - వంటగదిలో మిరపకాయలని పోపు వేశారు. మిర్చి గుణంతో అన్ని గదులలోని వ్యక్తులు కొంత దగ్గడమో, తుమ్మడమో చేస్తారు. సాకార వస్తువు మిర్చి వంటగదిలో ఉండింది, కానీ దాని నిరాకార శక్తి అనగా గుణం దూరంగా కుర్చున్న మనుషులని ప్రభావితం చేసింది. అలానే ముగ్గురు ప్రభువులు (శ్రీ బ్రహ్మజీ రజోగుణం, శ్రీ విష్ణు సతగుణం మరియు శ్రీ శివజీ తమోగుణ) తమ తమ లోకంలో ఉంటారు మరియు మూడు లోకాల (పృథ్వి, పాతాళ, మరియు స్వర్గలోకాలు) లోని ప్రాణులని ప్రభావితం చేస్తారు. ఎలాఐతే మోబైల్ ఫోన్ నేట్‌వర్క (రేంజ్) తో పని చేస్తుంది. ఈ విధంగా అదృశ్య శక్తి రూపి గుణాలతో ముగ్గురు దేవతలు తన తండ్రి కాల యొక్క సృష్టి చేసి ఆయన ఆహారం కోసం నడిపిస్తున్నారు. దుర్గాకు తన స్వంత లోకం కూడ ఉంది, అందులో తన వాస్తవిక రూపంలో దర్శనం ఇస్తుంది. తరువాత వీరి విమానం దుర్గా ద్వీపంలోకి

చేరుకుంటుంది. అపుడు కాల్ విష్ణువుకి చిన్ననాటి జ్ఞాపకంను ప్రధానం చేస్తాడు. శ్రీ విష్ణుగారు చెప్పిరి ఈ దుర్గా మన ముగ్గురికి మాతా అవుతుంది. నేను బాలుడిగా ఉన్నపుడు ఊయ్యాలలో ఉంటిని, నన్ను జోకొట్టేది. ఇంకా అనినారు దుర్గా! మీరుయే మాకు తల్లి. నేను, బ్రహ్మా మరియు శివ జన్మించువారము. మా అవిర్భావం అనగా జన్మ మరియు తిరోభావం అనగా మరణం అవుతుంది, మేము అవినాశి కాము. మీరు ప్రకృతి దేవి. ఈ విషయంను శంకరుడు కూడ అంగీకరిస్తాడు మరియు అంటాడు తమోగుణి లీలా చేయు శంకరుడు కూడ మీ పుత్రుడె. శ్రీ బ్రహ్మా మరియు శ్రీ విష్ణుగారు కూడ మీ నుండియే ఉత్పన్నం అయినారు.

తరువాత ముగ్గురు దేవతల పెళ్లి దుర్గా చేస్తుంది. ప్రకృతి దేవి తన శబ్ద శక్తితో తనయే మూడు రూపాలని తయారుచేసింది. శ్రీ బ్రహ్మాగారి వివాహం సావిత్రితో, శ్రీ విష్ణుగారి వివాహం లక్ష్మితో మరియు శ్రీ శివుడి వివాహం ఉమా అనగా కాలితో చేయించి వారిని విమానంలో కుర్చుపెట్టి వేరు వేరు ద్వీపంలోకి (లోకం) పంపించింది.

కాల్ తన శ్వాసల ద్వారా సముద్రంలో నాలుగు వేదాలను దాచిపెడతాడు. తరువాత మొదటిసారి సాగరమధనం చేసినపుడు ప్రకటింపజేస్తాడు. కాల్ యొక్క ఆదేశంతో దుర్గా నాలుగు వేదాలని బ్రహ్మాకి ఇస్తుంది. బ్రహ్మా తన మాతా దుర్గాని అంటాడు వేదాలలో ఏ బ్రహ్మా (కాల్) ఐతే ఉన్నాడో అది మీరేనా లేక వేరే పురుషులు ఎవరైనా ఉన్నారా?

దుర్గా కాల్ యొక్క భయంతో వాస్తవాన్ని దాచడానికి ప్రయత్నంచేస్తు అంది నేను మరియు బ్రహ్మా ఒక్కరిమే, ఏ భేదం లేదు. అయిన వాస్తవికతా దాగలేదు. దుర్గా తరువాత అంటుంది మీరు ముగ్గురు నా యొక్క మరియు బ్రహ్మా ని సదా స్మరణ చేయండి. మా ఇద్దరి స్మరణ చేస్తు ఉండటం వలన ఒకవేళ మీకు ఏదైనా కఠిన కార్యము ఏర్పడితే నేను వెంటనే మీ ఎదుటకు వస్తాను.

విశేషం :-- ఎందుకంటే కాల్ దుర్గాకి చెప్పి ఉన్నాడు తన భేదం ఏవరికి ఇవ్వవద్దని. ఈ భయంతోనే దుర్గా సర్వ జగత్తును వాస్తవికత నుంచి అపరిచితులుగా ఉంచుతుంది. ఈమె తన కుమారులని కూడ మాయలో ఉంచుతుంది. దీనికి కారణం కాల్ కి శాపం తగిలి ఉంది ఒక లక్ష మానవ శరీరధారి ప్రాణులని నిత్యం తినాలి అని. ఇందువలనే తన కొడుకులతో తన ఆహారాన్ని తయారు చేయించుకుంటాడు. శ్రీ బ్రహ్మాగారి రజోగుణంతో ప్రభావితం చేసి సర్వ ప్రాణులలో సంతానం ఉత్పన్నం చేయిస్తాడు. శ్రీ విష్ణుగారి సత్వగుణంతో ఒకరికి ఒకరి ఎడల మోహంను ఉత్పన్నం చేసి స్థితిని అనగా కాల జాలంలో ఆపి ఉంచుతాడు మరియు శ్రీ శంకరుడి తమోగుణంతో సంహారం చేయించి తన ఆహారంను తయారు చేయించుతాడు.

తరువాత ముగ్గురు ప్రభువులని కూడ చంపి తింటాడు మరియు కొత్త పుణ్య కర్మి ప్రాణుల నుండి ముగ్గురు పుత్రులని ఉత్పన్నం చేసి తన కార్యమును కొనసాగిస్తాడు మరియు పూర్వపు ముగ్గురు బ్రహ్మా, విష్ణువు, మరియు శివని **84** లక్షల యోనిలయందు మరియు స్వర్గ-నరకంలో కర్మ ఆధారంగా కల చక్రంలో తిరుగుతునే ఉంటారు. ఈ ప్రమాణమే శివ పురాణం, రుద్ర సంహితా, ప్రథమ (సృష్టి) ఖండ, అధ్యాయం **6, 7** మరియు **8,9**లో కూడ ఉంది.

# "శ్రీ శివ పురాణం నుండి విచారములు"

## "శివ పురాణం"

" శ్రీ శివ పురాణం (అనువాదకులు: శ్రీ హనుమాన్ ప్రసాద్ పొద్దార్, ప్రకాశకులు: గోవింద్ భవన్ కార్యాలయం, గీతా ప్రెస్ గోరఖపూర్) మోటా టాయిప్, అధ్యాయం 6, రుద్రసంహితా, ప్రథమ ఖండ (సృష్టి) నుండి ఫలితం.

తన పుత్రుడు శ్రీ నారదుడు శ్రీ శివ మరియు శ్రీ శివా విషయంలో అడిగినపుడు శ్రీ బ్రహ్మాగారు అంటారు (పేజి 100 నుండి 102) ఏ పరబ్రహ్మ విషయంలో జ్ఞాన మరియు అజ్ఞానంతో పూర్ణ యుక్తులద్వారా ఈవిధంగా వికల్పాలు చేయడం జరుగుతుంది, ఏ నిరాకార పరబ్రహ్మ ఉన్నారో ఆయనే సాకార రూపంలో సదాశివ రూపం ధరించి మనుష్య రూపంలో ప్రకటితులైరి. సదాశివుడు తన శరీరం నుండి ఒక స్త్రీని ఉత్పన్నం చేసిరి ఆమెను ప్రధాన, ప్రకృతి, అంబికా, త్రిదేవజనని (బ్రహ్మ, విష్ణు మరియు శివులు) అనబడుతుంది. ఆమెకు ఏనిమిది భూజాలు కలవు.

## "శ్రీ విష్ణుగారి ఉత్పత్తి"

సదాశివుడిని పరమ పురుష్, ఈశ్వర్, శివ, శంభు మరియు మహేశ్వర్ అని అంటారు. వారు తన అన్ని అంగములకి భస్మం రాసుకుని ఉంటారు. ఆ కాల్ రూపి బ్రహ్మ ఒక శివలోకం పేరుకల (బ్రహ్మలోకంలో తమోగుణ ప్రధాన క్షేత్రం) ధామం తయారు చేశాడు. దానిని కాశి అంటారు. శివ మరియు శివా పతి-పత్ని రూపంలో ఉంటు ఒక పుత్రుడి ఉత్పత్తి చేసినారు, అతని పేరు విష్ణు పెట్టినారు. అధ్యాయం 7, రుద్ర సంహితా, శివ మహాపురాణం (పేజి 103, 104).

## "శ్రీ బ్రహ్మ మరియు శివుని ఉత్పత్తి"

అధ్యాయం 7,8,9 (పేజి 105-110) శ్రీ బ్రహ్మ గారు చెప్పిరి శ్రీ శివ మరియు శ్రీ శివా (దుర్గా మరియు కాల్) భార్యభర్తల వ్యవహారం చేసి నా ఉత్పత్తి కూడ చేసినారు మరియు తరువాత నన్ను అచేతనుడిగా చేసి కమలంపై పడివేశినారు. ఈ కాల్‌యే మహావిష్ణు రూపం ధరించి తన నాభి నుండి ఒక కమలం ఉత్పన్నం చేసుకుంటాడు. బ్రహ్మ ఇంకా చెబుతాడు తరువాత సచేతుడనయితిని. కమలం యొక్క మూలంను వెదకాలి అనుకున్నా, కానీ అసఫలుడనైతిని. తరువాత తపస్సు చేయమని ఆకాశవాణి అయ్యింది. తపం చేసితిని. తరువాత నాకు మరియు విష్ణుకు మధ్యన గొడవ జరిగింది. (వివరణ ఇదే పుస్తకంలోని 'బ్రహ్మ విష్ణుల మధ్యన యుద్ధం'లో) అపుడు మా మధ్యన ఒక తేజోమయ లింగం ప్రకటితమైంది మరియు ఓం ఓం యొక్క నాదం ప్రకటితమైనది మరియు ఆ లింగం పై అ-ఉ-మ మూడు అక్షరాలు రాసి ఉండెను. తరువాత రుద్ర రూపంను ధరించి సదాశివ ఐదు ముఖంలు కల వారు మానవ రూపంలో ప్రకటితులైరి, వారితో పాటు శివా కూడా (దుర్గా) ఉండింది.

తరువాత శంకరుడి అకస్మాత్తుగా ప్రకటించారు (ఎందుకంటే ముందుగా అచేతనుడిగా ఉండెను, తరువాత సచేతనం చేసి ఒకటిగా చేసినారు) మరియు అన్నారు మీరు ముగ్గురు సృష్టి స్థితి మరియు సంహారం యొక్క కార్యమును చూసుకోండి అని.

రజోగుణ ప్రధాన బ్రహ్మా, సతగుణ ప్రధాన విష్ణు మరియు తమోగుణ శివుడు అవుతారు ఈవిధంగా ముగ్గురు దేవతలలో గుణాలు కలవు, కానీ శివ గుణాతీతుడిగా భావిస్తారు (పేజి 110పై)

సారాంశ విచారం :- పై వివరణ వలన స్పష్టం అవుతుంది కాల్ రూపి బ్రహ్మ అనగా సదాశివ మరియు ప్రకృతి బ్రహ్మా, విష్ణు మరియు శివుడుకి మాతా పితలు అవుతారు. దుర్గాని ప్రకృతి మరియు ప్రధాన అని కూడ అంటారు, ఈమెకి ఏనిమిది భూజములు కలవు. ఈమె సదాశివ అనగా జ్యోతినిరంజన్ యొక్క శరీరం అనగా కడుపు నుండి బయటకు వచ్చినది. బ్రహ్మ మరియు దుర్గా అన్ని ప్రాణులని భ్రమితులుగా ఉంచుతారు. తమ కొడుకులకి కూడ వాస్తవికతని చెప్పరు. ఎందుకంటే కాల్ ఇరవైఒక్క బ్రహ్మాండంలోని ప్రాణులని తప్తశిలాపై వేడిచేసి తింటాడు అని. దీనికోసమే జన్మ మృత్యువు మరియు అన్య దు:ఖదాయి యోనిలయందు పీడించుతాడు మరియు తన ముగ్గురు పుత్రులతో రజోగుణ ప్రధాన బ్రహ్మా, సతగుణ ప్రధాన విష్ణు మరియు తమోగుణ శివుడితో ఉత్పత్తి, స్థితి మరియు సంహారం చేయించి తన ఆహారంను తయారు చేసుకుంటాడు. ఎందుకంటే కాల్‌కి ప్రతిరోజా ఒక లక్ష మానవ శరీరధారి ప్రాణులని తిను శాపం తగిలి ఉంది, కృపతో శ్రీ గీతాలో కూడ చూడండి 'కాల్ మరియు ప్రకృతి యొక్క పతి-పత్ని యొక్క వ్యవహారంతో రజోగుణ బ్రహ్మా, సతగుణ విష్ణు, తమోగుణ శివుడి ఉత్పత్తి.

## "మూడు గుణాలు ఏమిటి? ప్రమాణ సహితంగా"

" మూడు గుణాలలో రజగుణం బ్రహ్మాజీ, సతగుణం విష్ణుజీ, తమగుణం శివుడు. ముగ్గురును బ్రహ్మ (కాల్) మరియు ప్రకృతి (దుర్గా) ద్వారా ఉత్పన్నులైరి మరియు ముగ్గురును నాశనం కలవారు".

ప్రమాణం:- గీతా ప్రెస్ గోరఖ్‌పూర్ నుండి ప్రచురిత శ్రీ శివమహాపురాణం ,సంపాదకులు శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ పేజి సం.24 నుండి 26, విధ్యవేశ్వర్ సంహిత మరియు పేజి 110 అధ్యాయం 9, రుద్ర సంహిత" ఈ విధంగా బ్రహ్మా-విష్ణు మరియు శివ ముగ్గురు దేవతలలో గుణంలు కలవు, కానీ శివ (బ్రహ్మా-కాల్) ని గుణాతీతుడు అని అనినారు.

రెండవ ప్రమాణం:- గీతా ప్రెస్ గోరఖ్‌పూర్ నుండి ప్రచురిత శ్రీమద్ దేవిభాగవత్ పురాణం , శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్ చిమన్ లాల్ గోస్వామి, మూడవ స్కందం, అధ్యాయం5 పేజి 123:- భగవాన్ విష్ణు దుర్గాదేవిని స్తూతిస్తారు ఇలా:- నేను (విష్ణు) , బ్రహ్మ మరియు శంకర్ మీ కృపతోనే విధ్యామానులై ఉంటిమి. మా ఆవిర్భావం (జన్మ) మరియు తిరొభావం (మృత్యువు) అవుతుంది. మేము నిత్యులము (అవినాశి) కాము. నీవే నిత్యం, జగత్‌జననివి, ప్రకృతి మరియు సనాతన దేవివి.

భగవాన్ శంకర్ అంటారు:- భగవాన్ బ్రహ్మ మరియు భగవాన్ విష్ణు మీ నుండి ఉత్పన్నం అయినపుడు వాళ్ల పిదప ఉత్పన్నమగు నేను తమగుణ లీలా చేయు శంకరుడను నీ సంతానం కానా? అనగా నన్ను కూడ ఉత్పన్నం చేయువారు మీరే. ఈ సంసారం యొక్క

సృష్టి-స్థితి-సంహారంలో నీ గుణములు ఎల్లవేళ ఉంటాయి. ఈ మూడు గుణాలతో జన్మించిన మేము, బ్రహ్మ-విష్ణు-శంకరుడు నియమానుసారంగా కార్యముచేయట యందు తత్పరులై ఉంటాము.

పై వివరణ కేవలం హిందిలోకి అనువదించబడిన శ్రీదేవి మహాపురణంలోనిది, అందులో కొన్ని విషయాలు దాచడం జరిగింది. ఇందువలన ఈ ప్రమాణమే చూడండి శ్రీ మద్దేవిభాగవత్ మహాపురాణం సభాషటికం సమహాత్యం, ఖేమరాజ్ శ్రీ కృష్ణదాస్ ప్రకాశన్ ముంబయి, ఇందులో సంస్కృత సహితంగా హిందిలో అనువాదం చేయబడింది. మూడవ స్కందం అధ్యాయం. 4. పేజి 10, శ్లోకం 42 :-

బ్రహ్మ-అహమ్ ఈశ్వర: పిలతే ప్రభావాత్సర్వే వయం జని యూతా న యదా తు నిత్యా:, కే అన్యే సురా: శతమఖ్ ప్రమూఖా: చ నిత్యా నిత్యా త్వమేవ జనని ప్రకృతి: పురాణా। 42.

అనువాదం:- హే మాతా! బ్రహ్మ, నేను మరియు శివ నీ ప్రభావంచే జన్మితులము, నిత్యులముకాము అనగా మేము అవినాశులము, ఇక మిగతా ఇంద్రాది దేవతలు ఎటుల నిత్యులు అవగలరు. నీవే అవినాశివి, ప్రకృతి మరియు సనాతన దేవివి. (42)

పేజి 11-12, అధ్యాయం 5, శ్లోకం 8 :-

యది దయార్ధమనా న సదాం2బికే కథమహం విహిత: చ తమోగుణ: కమలజశ్చ రజోగుణసంభవ: సూవిహిత: కిమూ సత్యగుణో హరి:।

అనువాదం:- భగవాన్ శంకర్ ఇలా అంటారు:- హే మాతా! మాపై నీవు దయాయుక్తురాలువైతే నన్ను తమోగుణుడిగా ఎందుకు చేశావు? కమలం నుండి ఉత్పన్నమైన బ్రహ్మని రజోగుణుడిగా ఎందుకు చేశావు?మరియు విష్ణువుని సతగుణుడిగా ఎందుకు చేశావు? అనగా జీవుల జన్మ-మృత్యువు రూపి చెడు కార్యములయందు మముల్ని ఎందుకు నియమించావు?

శ్లోకం 12 :-

రమయసే స్వపతిం పురుషం సదా తవ గతిం న హి విహ్ విద్మ శివే (12)

అనువాదం:- తన పతి అనగా కాల్ భగవానుడితో ఎల్లపుడు భోగ విలాసం చేస్తూంటావు. మీ గతి ఎవరికి తెలియదు.

## " ఫలితం "

శ్రీమద్ భగవత్ గీతా యొక్క జ్ఞానం కూడ ఈ కాల్ రూపి బ్రహ్మయే శ్రీ కృష్ణుడి శరీరంలో ప్రేతంలా ప్రవేశించి చెప్పినాడు. పై పవిత్ర పురాణంలు ప్రమాణితం చేసినవి, ప్రకృతిని దుర్గా అంటారు అని.'కాల్ మరియు ప్రకృతి యొక్క పతి-పత్ని యొక్క వ్యవహారంతో రజోగుణ బ్రహ్మ, సతగుణ విష్ణు, తమోగుణ శివుడి ఉత్పత్తి జరిగింది అని. దీని సాక్ష్యంగా గీతా కూడ ఉంది. శ్రీ గీతా అన్ని శాస్త్రాల సారం, ఇందువలనే ఇందులో సంక్షిప్త వివరణ సాంకేతిక శబ్దాలలో ఉంది. వాటిని తత్వదర్శి సంతయే అర్థం చేయించకలడు. ఇపుడు కృపతో ప్రవేశం చేయండి 'పవిత్ర శ్రీమద్ భగవత్ గీతా' యందు.

గీతా అధ్యాయం 14 శ్లోకం 3 నుండి 5 లో ఉంది. గీతా జ్ఞానదాతా ప్రభు బ్రహ్మ అంటున్నాడు ప్రకృతి నా భార్య. నేను ఆమె యోని (గర్భధాన స్థానం) యందు బీజాన్ని స్థాపన చేస్తాను. దాని వలన సర్వ ప్రాణుల యొక్క ఉత్పత్తి అవుతుంది. నేను సర్వులకి (21 బ్రహ్మండాల ప్రాణులకి) తండ్రిని. ప్రకృతి (దుర్గా/అష్టంగి) అందరికి తల్లి. ఈ దుర్గా దేవి ద్వారా ఉత్పన్న మూడు గుణాలు (రజోగుణ-బ్రహ్మ, సతగుణ-విష్ణు మరియు తమోగుణ-శివుడు) మిగతా ప్రాణులని కర్మల బంధాల యందు బందిస్తాయి.

అధ్యాయం 11 శ్లోకం 32లో పవిత్ర గీతాని చెప్పునటువంటి ప్రభువు అంటున్నారు. "అర్జున్! నేను పెద్దవాడైన కాల్‌ని ఇపుడు అన్ని లోకాలని తినుటకు ప్రకటితమైనాను". అధ్యాయం 11 శ్లోకం 21 మరియు 46లో అర్జునుడు అంటున్నాడు భగవాన్ ! మీరైతే ఋషులని, దేవతలని మరియు సిద్ధ పురుషులని కూడ తినుచున్నారు, వారైతే మీ యొక్క గుణగానం పవిత్ర వేదాలలోని మంత్రాల ద్వారా ఉచ్చరణ చేయుచున్నారు. మరియు తమ జీవనాన్ని రక్షించండి అని మంగళ కామన చేస్తున్నారు. కొంత మంది మీ గడ్డానికి వ్రేలాడుతున్నారు, కొంత మంది మీ ముఖంలో ప్రవేశిస్తున్నారు.

## "రజగుణం శ్రీ బ్రహ్మజీ, సతగుణం శ్రీ విష్ణుజీ మరియు తమగుణం శ్రీ శివుడు. త్రిదేవుల పూజ వ్యర్థమైనదిగా చెప్పినారు "

ఈ గీతా జ్ఞానదాతా ప్రభువు (శ్రీ గీతా అధ్యాయం 7 శ్లోకం 12 నుండి 15 వరకు) అంటున్నాడు మూడు గుణాలు (రజగుణం బ్రహ్మజీ, సతగుణం విష్ణుజీ, తమగుణం శివుడు) పూజచేయు వారి జ్ఞానం హరింబడి, వీరు దీని కంటే పైన కల నా భక్తి పూజ కూడ చేయరు. ముగ్గురు ప్రభువుల వరకు సాధనా చేయు వారు రాక్షస స్వభావంను ధరించినవారై, మనుషులలో నీచ, దుష్కర్మ చేయు మూర్ఖులు ఈ ముగ్గురిపైన కల నన్ను బ్రహ్మ పూజ కూడ చేయరు.

గీతా అధ్యాయం 7 శ్లోకం 18లో గీతా జ్ఞానదాతా ప్రభు అంటున్నాడు తన భక్తి కూడ అతి అనుత్తమమైనది అని.

ఇందువలనే గీతా అధ్యాయం. 15 శ్లోకం 4 మరియు 18 శ్లోకం 62 మరియు 66 లో వేరోక అన్య పరమేశ్వరుడి శరణులోకి వెళ్లమని చెబుచున్నాడు.

ఏ సమయంలో నైతే గీతా జ్ఞానం చెప్పబడుచున్నదో, దాని కంటే ముందు పద్దెనిమిది పురాణాలు మరియు పదకోండు ఉపనిషత్తులు మరియు ఆరు శాస్త్రంలు లేవు. అవన్ని ఋషులు వారి వారి అనుభవాలని పుస్తకాలుగా రచించిరి. ఆ సమయంలో కేవలం నాలుగు వేదాలు మాత్రమే శాస్త్ర ప్రమాణితంగా ఉండినవి మరియు పవిత్ర నాలుగు వేదాల సారాంశమే పవిత్ర గీతాయందు వర్ణించబడి ఉంది.

